శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రాయనమః.

# మోక్షగుండ రామాయణము

## యక్షగానము.

సవరణకూర్పు

శ్రీ తాళ్ళూర, నారాయణ సత్కవివిరచితము.

ప బ్లి ష ర్సు.

రామా అండ్ కో.,

హెడ్డాఫీసు:ఏలూరు, కృష్ణాజిల్లా.

బ్రాంచి: తర్లపాడు, నెల్లూరుజిల్లా.

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలయందు ముద్రితము.

నా ల్గ వ కూ ర్పు.

1917—సంవత్సరము జనవరి.



అట్టబైండు వెల రు 1-8-0    కాలికోబైండు వెల రు 2-0-0

పోస్టుఖర్చులువేరు.

గాంచిబుద్ధిస్థైర్య ♦ కలనవిద్యను నేర్చి
తలలోనినాల్కగాఁ ♦ దనరిహితుల
సాయంబునను గ్రంథ ♦ శాలనిర్మించి
"రామాకంపెనీ" యన్న ♦ మహితనామ

తే॥ గీ॥ మొసఁగివిక్రియమునఁ లాభ ♦ మొనరఁగూర్చి
పిదపఁదల్లిని దమ్ముల ♦ బిలిచివారి
నుచితరీతినిఁబోషించి ♦ యోర్మితోడఁ
బ్రబలగతినందె శ్రీరామ ♦ భక్తికతన.

క. శ్రీరాములు కులదైవము
గారామయమంత్రి మొదలు ♦ కయిఁగొల్చుటచే
వీరలపేరులలోపల
నారామపదంబుచేరి ♦ యలరుచునుండుర్.

తే॥ గీ॥ అందుచేతనె తనపుస్త ♦ కాలయమున
కితఁడు "రామశబ్దముచేర్చి ♦ యిడియెఁబేరు
భక్తవత్సలుఁడారామ ♦ వరుఁడు నితని
కాయురారోగ్యధనవృద్ధి ♦ సేయుఁగడఁగె.

ఉ. రామకృపార్జితంబయిన ♦ ద్రవ్యములోనొకకొంతయిచ్చె శ్రీ
రామునియాలయంబునకు ♦ రామునిపేరిటిముద్రణాలయం
బీమహితుండు పెట్టెఁ దన ♦ యిష్టమువచ్చిన యట్టులెల్ల ధ
ర్మామితకీర్తిసంపదల ♦ నర్మిలిమై గణియించుచుండఁగాన్.

క. ఈకథనంతయు వినఁగా
నాకొక సంకల్పమొదవె ♦ నావిరచితమా
శ్రీకరపదపద్యాంత
మాకృతి రామాయణంబు ♦ నచ్చొత్తుటకున్.

మో క్ష  రికథ.

శా. శ్రీమద్భూమిజ వామభాగమునఁ బ్రో ♦ చిం గేసరీపుత్రుఁడుం

సామోదంబునఁ బార్శ్వయుగ్మమున నా ♦ శత్రుఘ్న కైకాత్మజుల్

ప్రేమం బక్షమ ముందు లక్ష్మణుఁడు నా ♦ వేష్టింపఁ జెల్వొందు శ్రీ

రామబ్రహ్మ పదారవిందముల నా ♦ రాధింతు నశ్రాంతముం.

మ. మఖముంగాచి విరాధవ ...వైరిపులన్ ♦ మర్దించి సుగ్రీవునిన్

...వాలి దశాస్యుఁ ద్రుంచి యవనీ ♦ జం గూడి సాకేతముం

...చేరె స్వరాజ్యభోగములచే ♦ శోభిల్లు శ్రీరాఘవుం

...ంబులమర్చి భక్తులకు ని ♦ త్యానందముం గూర్చుతన్.

రామస్తుతి, కీర్తనము, రాగము బేహాగ్, ఆదితాళము.

...మహీజావరా! పరం, ధామా! సుగుణాకరా॥

...! త్రిలోకాభి, రామా! దనుజవి, రామా! వినుతసు, త్రామా!

... రా ॥ సంగరశూర! వి, హంగతురంగ! ఘు, నాంగ! కలుషవి,

... కజ॥ రా॥ ఖండేందుమౌళికో, దండవిఖండన! పండితనుత! మో

... తపురరఘు ॥ రా ॥ వారదుఃఖని - వారణ! త్రిలోక - కారణ!

... - నారాయణార్చిత ॥ రా ॥

గురుస్తుతి, కీర్తన, మలయమారుతము, ఆటతాళము.

శ్రీగురువర్య చిదఖండరూపభో ॥ శ్రీగు ॥ బాగుగ నీపాద। భజ

... భవ, సాగరము దాట - గాఁగల్గెధన్యుఁడ ॥శ్రీగు॥ చతురగ్రిమున

...పమున। మోక్షగుండమందు - సాక్షిగ నెలకొన్న। యక్షయతేజ

...మణశర్మ హా, ల్లక్షిత! పూర్ణవి, లాస! వేంకటశివ ॥శ్రీగు॥

సరస్వతీస్తుతి, కీర్తన, ఆదితాళము, (రవికులతిలక-వలె)

ననుదయ! గనవేపరమేష్ఠిరాణి॥ను॥ననుగై, కొనవేఘనవాణి! వని వే! ననుదయ॥ ఆపదల్-మాపగన్-బాపముల్-వాపగన్-నీపాటివారలు! రూపింపగాలేరు! నీపదయుగళము, ప్రాపగు॥ ననుదయ॥ భావంబునన్-సేవించెదన్, నావాక్కునన్, నీవెప్పుడున్, ఠీవిగనిలిచెను-భావవహాను గు నటు, గావింపుజగ, త్పావని॥ ననుదయ॥ మోక్షగుండమం, దనయ ము నీవురంజిల్లి-యాక్షితినారాయణకవినేలెదు తల్లి! యక్షయక, టాక్ష మునన్! దీక్షమీఱ వీ, క్షింపుము ॥ననుదయ॥

గణపతిస్తుతి, కీర్తన, శంకరాభరణము, రూపకతాళము.

శ్రీయుమాకుమారా! పాహిశ్రీ॥ డాయరా, దాయఘాళి! ద్రోయ బాళి ॥శ్రీ॥ పాయకనీ! పదాబ్జములు! సదాగొలుతు ॥శ్రీయు॥ కాయేం ద్రియపరిహారా! కాయజారిసుకుమారా! తోయజాతభవవందిత! శ్రేయ ములిడరాదా! శ్రీయుతినారాయణకవి-రాయవినుత! మోక్షగుండ-నాయ క! నిర్విఘ్నంబుగ! నాయభీష్ట మొనగూర్పుము॥ శ్రీయుమా॥

ఆ. ప్రస్తుతముననాకు ♦ వాసార్హమైయొప్పు
మోక్షగుండనామ ♦ పురమునందు
భవ్యరాఘవోత్స ♦ వమును విళంబవ
త్సరమునందుఁ దనరు ♦ చైత్రమందు.

వ. యథావిధిగ నాచరింపసమకట్టి ప్రవాళరజిత నీల స్ఫటిక తేజో రాజితంబగు నొక్క దివ్యమందిరంబున సప్తదళవిరాజిత భద్రపీఠం బుపయి భరతశత్రుఘ్న లక్ష్మణసీతాసమేతంబుగఁ గోటి సూర్యప్రభా భాసమానుండయి వేంచేసియున్న శ్రీరామచంద్ర మహా ప్రభువుగారి కొలువు సేయంగోరి సర్వేంద్రియవ్యాపారంబుతోఁ గలియకుండ మనం బును మారుతసుతతో జతపఱచిపంపఁగ నవిరెండేకీభవించి పెద్ద మా ర్గంబులు రెండింటినివిడిచి నడిమిసన్నబాటనుజని తన్మందిరంబునకుఁ గల ద్వారపాలకుల నాశ్రయించి మొదటివానికి నాఱునూఱులు, రెండవ

వానికి నాలుగువేలు, మూడవవానికి నాలుగువేలు, నాలవ వానికి నాలు వేలు, నైదవవానికొకవేయి, యాఱవవానికొక్కవేయి, కడపటివాని కొక్కవేయిగ నీపరికారము లంచమిచ్చి వచ్చుచుఁబోవుచుండుటకు నిరాతంకముగా స్వతంత్రమేర్పఱచుకొని చేరి యర్ఘ్యపాద్యస్నానంబులు గంగాదినదీజలంబులుగా, పట్టుమలంబులు పూజా ద్రవ్యంబుగా, సూర్యచంద్రులే హారతులుగ, నిజానందంబే నైవేద్యంబుగ, భావించి యాత్మారాముని సేవించుచుఁ దన్మయంబై యున్న సమయంబున.

ఉ. తంబురుఁ గాలిగజ్జెలును ♦ దాళమృదంగముఖాతిభవ్య నా
దంబులు పొల్పుమీఱ వారి ♦ దాసచయం బరుదెంచి నృత్తగీ
తంబుల రామమూర్తి చరి ♦ తంబును బాడుచు నుత్సవంబు సాం
తంబగునంతదాఁక భజ ♦ నంబు లొనర్చిరి సంతసంబునన్.

వ. ఇట్టిసత్కాలక్షేపంబు సర్వజననేత్రశ్రోత్ర మానసానంద కరంబగుచున్న కాలంబున.

శ్రీగణనీయమవే ♦ మూర్తిసదన్వయ క్షీరాంబునిధిపూర్ణ ♦ శీతకరుఁడు
దయసత్ప్రభా ♦ మండలరంజిత సంగీతవిద్యావి ♦ శారదుండు
హిందేవ ♦ దేశికసజ్జ నాదులయెడ సద్భక్తి ♦ నిలుపువాఁడు
ర్యవర్యుండు♦పరగ శేషాంబిక యందుగన్నట్టినెయ్యంపుకొడుకు
సుబ్బయార్యునికూరిమి ♦ సోదరుండు
నలరునరసింహశర్మకు ♦ నగ్రజుండు
శ్రీమ్మఖశుభ రామనామైక ♦ చింతనుండు
యజ్ఞనారాయణుండను స ♦ త్యవ్రతుండు.

వ. ఉత్సవారంభదివస సాయంతనంబునఁ బూజాసమయంబున సన్నిధిరుండువేంచేసియున్న సాకారరామమూర్తి నివీక్షించి.

కీర్తన, ఏకతాళము, దిలలగాహా.

గెనారు శ్రీరాఘవుని గొలువ ॥గలి॥ ఘల్లుఘల్లున జిను, గజ్జెల లినాథునికడ నాట్యము జేయ ॥గలి॥ తాళమృదంగసి, కేళితం

బురులు। బాళిని మోఁగ్రియు। భజనఁ జేయ ॥గలి॥ భూమిజయుతుఁడై । పాద

లెదురాముని। వేమరుఁ గన్నుల। వీక్షింపఁగను ॥గలి॥ అక్రూరుఁడయి నా, రా

యణ నేలెదు। మోక్షగుండపతి। మోఁగ్రిలనిలువ॥గలిగె॥

వ. ఇట్లత్యానందంబునొందుచు హరిదాసబృందంబులం గలిసి భ

జనమొనర్చి యవభృథానంతరము మదంతికంబున నిలిచిన మ్రిభావంబున.

సీ. శ్రీవత్ససాఖ్యరా♦జితగోత్రభవుఁడవా ర్వేలకులాంబుధి♦ ద్విజవిభుఁడవు

తాహ్నారికృష్ణప్రి♦భానిజ్ఞారాంబయందాదరంబున గన్న♦యాత్మజుఁడవు

ఘనమైలవరపు వేం♦కటశివాచారకృ పాలబ్ధవిజ్ఞాన♦భాసితుఁడవు

మూర్తిత్రయాతీత♦ముఖ్యసచ్చిత్సుఖమయవస్తుతత్త్వవి♦మర్శకుఁడవు

గీ. కేవలాఖండమోక్షల ♦ క్ష్మీయుతుఁడవు

భక్తి శ్రీరామచంద్రోత్స ♦ వప్రితుఁడవు

సరసపదపద్యనిర్మాణ ♦ శక్తిమతివి

హతదురితకర్మనారాయ ♦ ణాఖ్యశర్మ.

వ. అని సంబోధనచేసి యిట్లనియె.

క. రామాయణంబుహరికథ

గా మీరురచించియిందు ♦ కారుణ్యమునన్

నేమమున నేఁబఠించెద

భూమిని నాకొదవు భుక్తి ♦ ముక్తులు రెండున్.

వ. ఈమహోపకారంబుఁ గట్టుకొండని ప్రార్థించిన సమ్మతించి

వారిని సమర్యాదగాఁ బంపి పిమ్మట నుక్కునాఁడు నామనంబున.

సీ. ఛందోవిచారంబు ♦ సలుపగానైతిని వ్యాకరణంబునే ♦ ర్వంగలేదు

కావ్యంబులనుమాటఁ♦గలలో నెరుంగను-నైఘంటికంబుల♦ వంగవినను

నవరసాలంకార♦నైపుణిలేదయ్యె భరతశాస్త్రంబుపో ♦ ప్పరయులేదు

రాగతాళములమా♦ర్గముగోచరముగాదు స్వరవిభేదంబుల♦ జాడలెఱుగ

గీ. నీమహాకావ్యరత్నమిం ♦ కేవిధమున

హరికథగొనరుశక్తిలే ♦ దనకనేను

సమ్మతించితినిది యెట్లు ♦ చక్కపఱను!
యెందుశరణంబులేదు రా ♦ ముందుదక్క.

వ. అనియోజించి రాముని బ్రార్థించి యారాత్రి నిద్రించు సమయంబున నాపాలిప్రత్యక్షదైవంబగు శ్రీరామమూర్తి మదీయ కారణాచార్యులగు వేంకటశివార్యవర్య రూపంబున స్వప్నంబునఁ గనఁబడి దయారసంబొలుక యిట్లనియె.

తే. వత్స! వాల్మీకిముఖమును ♦ వరులు నితర
వరులుమునుసంస్కృతాదినా ♦ నావిధస్వ
భాషలనుశక్తి కొలదిని ♦ భక్తిచేత
నెన్నిరీతులనో! రచియుం ♦ చలేదె.

క. అందఱిలో నీవొకఁడవు
సందేహము నీకిఁకేల ♦ సద్గురుకరుణా
నందంబున రామాయణ
ముం దగహరికథరచింపు ♦ ముదముదలిర్పన్.

పుహేయమెవ్వరెటు ♦ సొమ్ములుసేసిన నన్నెవచ్చిన
వరాముభక్తికథ ♦ నెవ్వరుసెప్పిన నొప్పిదంబగున్
[illegible]దత్కథారచన ♦ సాంగముగానెరవేర్చిభక్తితో
[illegible] మోక్షగుండపుర ♦ రాముని కర్పణసేయుపుత్రికా!

[illegible] దీనికి మోక్షగుండ రామాయణమను నామంబొసంగుము. [illegible]మ్యమును సెలవిచ్చివారు కనుమొఱఁగిన నేను మేలుకాంచి [illegible]మద్యారి యజ్ఞనారాయణాఖ్య హరిదాస ప్రోత్సాహంబున కను [illegible] సద్గురుకటాక్షంబు గలిగెఁగదా! యింకలోపంబేమియని యానందించి యిట్లనుకొంటి.

[illegible]వనింగవీశ్వరుల ♦ నేకులు నేర్పరులుండియుండ రా
మాయణముఁ రచింప నను ♦ మన్ననఁ బ్రేరణచేసె యజ్ఞనా
[illegible]ణపాటిమిత్రులుధ ♦ రంగలరే! యికనాదుభాగ్య మెం

# శ్రీమోక్షగుండరామాయణము-హరికథ.

శ్లో॥ యధికంబటంచు ధృతి ♦ తోఁదలపోసి యనంతరంబునన్.

వ. ఒక్కశుభదినంబున నుపక్రమించి యిష్టదేవతాసద్గురుసత్కవీశ్వరులఁ బ్రార్థించి.

షష్ఠ్యంతములు, కీర్తన. ఆటతాళము. (కలియుఁగదవే)

1. రాముఁనకుజితభృగు-రామునకుజగదభి-రామునకుదానవ వి। రామునకు మోక్షగుండ॥రా॥

2. ధీరునకు నిగమసం-చారునకు రణరంగ। శూరునకుశరధి గం। భీరునకు మోక్షగుండ॥రా॥

3. ఖండశశిమౌళిఘనో-ద్దండకోదండవర । ఖండీకృతబాహుబలా । ఖండునకు మోక్షగుండ॥రా॥

4. దివ్యునకు సుజనసం । భావ్యునకు మరుత్సుత-సేవ్యునకు మానిమం । తవ్యునకు మోక్షగుండ॥రా॥

5. ప్రీతునకు భువనవి । ఖ్యాతునకు రవివంశ । జాతునకు సీతాస । మేతునకు మోక్షగుండ॥రా॥

6. నారాయణశర్మ హృద్వి । హారునకు ననంతావ । తారునకు భక్తమం । దారునకు మోక్షగుండ॥రా॥

వ సమర్పితంబుగా నానేర్చుకొలఁది నొనర్పంబూనిన శ్రీ మోక్షగుండ రామాయణ హరికథావిధానం బెట్టులనిన.

క. శ్రీమత్కైలాసాచల
ధామంబుననున్న చంద్ర ♦ ధరునింగని త
ద్వామార్ధశరీరిణి యగు
హైమవతీ రమణిమ్రొక్కి ♦ యడిగెఁ బ్రియమునన్.

క. మంత్రములలోన నుత్తమ
మంత్రంబననెద్ది దాని ♦ మహిమంబును ద
న్మంత్రాధి దైవమును ద
న్మంత్రానుష్ఠానవిధము ♦ మమతఁ దెలుపవే.

వ. అని మహావినయంబునఁ బ్రార్థించినఁ నానంద భరితాంతః కరణుండయి కాంతామణీ! ఋష్యాదులకు నగోచరంబగు గూఢవిచారంబు నన్నడిగితివిపైన నీయందలి దయచేత సద్దానిని వచించెదవినుము.

శివునికీర్తనము-ఏకతాళము.

రామమంత్రము, కడు రమ్యమంత్రము। భూమిలోన లేదు దాని, బోలుమంత్రము ॥ మంచిమంత్రము। విబుధు, లెంచుమంత్రము, మించి జన్మవార్ధిని దా, టించుమంత్రము॥ రా॥ సత్యమంత్రము। విమల సత్యమంత్రము। ప్రత్యగభిన్నాత్మతానై । పరగుమంత్రము॥ రా ॥ దీక్షమంత్రము। కడు। దివ్యమంత్రము। మోక్షగుండమందు వెలయు। ముఖ్యమంత్రము॥ రా॥ పరమమంత్రము, యిదే, చరమమంత్రము, ధరనునారాయణ మనోజ్ఞ। స్ఫురితమంత్రము॥ రా॥

గీ. రమణి! వినుమిది శ్రీరామ ♦ రామరామ
యనుచు బ్రహ్మాదివిబుధులు ♦ మనములందు
గని రమింపుచు నుండిన ♦ కారణమున
రాముఁడను పేరువచ్చెఁ బ ♦ రాత్పరునకు.

వ. కాబట్టి యమ్మంత్రరాజంబు నీవనుష్ఠింపఁ దగినది. దీనియనుసంధానంబునఁ బునరావృత్తిరహిత శాశ్వతబ్రహ్మానందపదవి ననుభవింపవచ్చునట్టి రామమూర్తికిని నాకును భేదంబులేదు సుమీయని యమ్మంత్రం బుపదేశించిన నానందించి యోపరమేశ్వరా! రాముండు పరమాత్ముండయినను మాయతోఁగలసి కొన్ని యవతారంబులెత్తినట్లు పురాణవచనంబుగల దందువలన నతనికేమి ప్రయోజనంబు సెలవిమ్ము మహాత్మా! యని వేడిన నానందించి శంకరుండిట్లనియె.

క. ప్రకృతి విలక్షణుఁడగు నా
త్మకు సృష్ట్యాదులు వికల్పి ♦ తంబులు లేమా!
యొకటిని నంటక యాతఁడు
సకలంబును జేయుచుండు ♦ సర్వాధికుఁడై.

వ. ఇట్లుగావున జగత్సృష్టిస్థితిలయ కారణకర్తయైన పరమాత్మ దుష్టనిగ్రహ శిష్టపరిపాలనంబు కొఱకును ధర్మసంస్థాపనంబు కొఱకును బ్రితియుగమునందు మాయాసహితుండై యనంతావతారంబు లెత్తు చుండునందొక్కటియగు రామావతారచరిత్రము లోకత్రయ పవిత్రం బై శ్రోత్రానందకరంబయి యలరారునది దెలిపెద సావధానచిత్తవయి.

పల్లవి, తోహర. రామరామయనవే! శ్రీ రామాయణకథవినవే! రామారఘుకుల, రామా! సీతారామా! రామా!యనవే రామామణిరో! రమ్యంబగు శ్రీరామాయణకథవినవే॥ రామా॥

వ. ఓపార్వతీ! యీప్రపంచంబున నార్యావర్తంబునఁ గోసల దేశంబున మాంధాతృసగర దిలీపేక్ష్వాకువులు మొదలగు సూర్యవంశ రాజులకు ముఖ్యపట్టణమయి యయోధ్యయను నొక్కనగరంబు వెల యు. అదినవరత్న స్థాపితమయిన దివ్యభవనంబులచేతను, విశాలముల యిన రాజవీధులచేతను, రమ్యంబులగు విపణిమార్గంబులచేతను, నగా ధములగు నగడ్తలచేతను, మోదప్రదంబులగు శశికాంతవేదులచేతను, బచ్చలతోరణములచేతను, ముత్యాలముగ్గులచేతను, దనరారి వర్ణాశ్ర మాచార నియతులయిన చాతుర్వర్ణములవారికి నివాసయోగ్యంబయి యలకాపురంబునకన్న మిన్నయై వన్నెఁగన్న యన్నగరంబున.

తోహర. దశరథుఁడనునొక। ధరణీనాథుఁడు। తరణివంశసంభవుఁడు। దశ దిశలందును। విశదంబుగఁదన। యశమునిండఁగా నెగడు॥రామా॥

వ. మున్నూట యేఁబదిమంది భార్యలలో ముఖ్యులయిన కౌస ల్య, కైక, సుమిత్రలను ముగ్గురు భార్యలతోఁగూడి సమస్త సుఖంబు లనుభవింపుచుఁ బెద్దకాలంబు రాజ్యంబుజేయుచుండి తనకు సంతానం బులేని కొఱంతచేఁ జింతించి సుమంత్రుండులోనగు నెనమండ్రుమంత్రు లను రావించి సభచేయించి వసిష్ఠాదిమునులను బిలిపించి పూజించి ముకుళితహస్తుండయి దశరథుండిట్లనియె.

# బా ల కాం డ ము.

## దశ-కీర్తన, ఆదితాళము.

మునులారా! నామొరవినరే। మోహాహాహితులారా!। ధారుణిబుతులు। లేరిఁకనాకునే। తీరునఁగోరిక। తీరునోసూరివరు॥ లారా॥ సంతతి లేకను।సద్గతి లేదఁట। మెంతనివంతన । చింతు సేవింతుబుధు॥ లారా॥ మోక్షగుండకమ । లాక్షులిక్కృపాక । టాక్షముగలుగునె । యక్షయముగ బుధులారా॥

వ. "అపుత్రిస్యగతిర్నాస్తి" సుతులు లేనివారికి గతులు లేవని శ్రుతిస్మృతులు వలుకుచున్నవి. పెక్కుకాలంబయ్యె నొక్కతనయుండయినఁ గలుగండు. కాఁబట్టి సంతానంబుగలుగు తెఱంగెఱింగింపుఁడు.

సంధితోహార.

అనియిటుదశరథుఁ। డాడినపలుకులు । వినిరిమునులుమోదమున। దనరఁగసూతుఁడు। దానువిన్నదం। తయును దెలిపె వేగమున॥ రామా ॥

సూతు, కీర్తన, కమాచ్, ఆది.

వినుధరణినాయకా। వినుధర, సురుచిరతనుజిత।సుమసాయకవిను। ధర॥ ఎలమిఁబుత్రికా । మేష్టి జేసినను । వెలయఁగఁదనయులు । గలుగు దురిలవిను॥ ధర॥ అవనిమోక్షగుం। డాధిపుకృపచే । వివిధసుఖంబుల । నీ గఁగలవువిను॥ధర॥

వ. ఓదశరథమహారాజా! పూర్వంబున నంగమహీపాలుం డగు రోమపాదుండను రాజు తనరాజ్యంబున ననావృష్టి దోషం బాపాదించి జనక్షోభముఁగలిగిన నదినివారించుటకయి ప్రాజ్ఞులవలన వర్షహోమాదిక్రియలు చేయించియు వానలు లేకున్నం జింతించుచుండఁగా నప్పుడు కొందఱు పెద్దలు విభాండకునితనయుఁడు ఋశ్యశృంగుఁ డను నతఁడు జన్మించినది మొదలు తపస్సంపన్నుఁడయి యున్నవాఁ డమ్మహనీయుం డున్న దేశంబున దుర్భిక్షభయంబులు దొలఁగుఁగాన నతని నిందుఁదెప్పింపుఁడని పలుకఁగవిని రోమపాదుండు చాతుర్యనిపుణలగు గణికాంగనలఁబిలిపించి యమ్మునితపోవిఘ్నంబునలిపి తోడితెండని పంచినపంచిదని.

## శ్రీమోక్షగుండరామాయణము-హరికథ.

కీర్తన, రూపకతాళము, రామలోనలుగుఃవలె.

వారల్ చనిరిమోదమున। నో, యారముబిరిరి ॥వారల్॥సారె కుబుళ్ళశృంగుల। ధీరుల వలపింపఁగఁ । గోరితదాశ్రిమవనికిని । జేరి॥

వా॥ మాటల్ చెఱకురసముపలె। మాధుర్యముగారఁ। మాటికిసయ్యాటలతోఁ । బాటలువాడుచుగను । గీటులఁదగచిఱునగవుల । తోటి॥

వారల్ ॥ మానిని మరపించిధరా । జానిపురముఁజేర్పఁ । బూనిసదా మోక్షపుర । శ్రీనాధుని పదములు । ధ్యానించెడుమునివర్యుని । గాన॥ వారల్॥

సీ. విరహిణీమృగములఁ♦వేటాడగమకించిమరుఁడు వైచినపుష్ప♦శరములనఁగ
గడువేడ్కతోఁబాల♦కడలిజన్మించి జగతికివచ్చు న♦చ్చరలనంగ
ధారాధరవినిర్గ♦తంబులై దెసలకుబఱతెంచు క్రొక్కాఱు♦మెఱపులనఁగ
శృంగారరసములఁ♦జేరిక్రీడింపఁగఁగడఁగివచ్చెడురాజ♦కన్యలనఁగ

గీ. నించుకై ననుమదిసంశ ♦ యించకపుడు
మించుబోణులుమిగులఁ గా ♦ మించి సంత
సించి మునియాశ్రిమముఁ బ్రవే ♦ శించి యతని
గాంచి వలపించికొనిపోవ ♦ నెంచిరంత.

ఉ. వీనులవిందుఁగొల్పఁదగు ♦ వీణలమీటుచు నాట్యయుక్తమై
గానముసేయుచుఁ మఱియుఁ ♦ గాంతలుసుంతయు భీతిలేక య
మ్మౌనినిదాఁకుచుఁ గడఁగి ♦ మాటలనీటు చెలంగఁబల్కుచున్
బూనివిచిత్రమార్గముల ♦ మోహితుఁజేయఁగఁ గొల్చిరాతనిన్.

వ. ఇట్లు గొన్నిదినంబులతని నాశ్రయించి తమ స్వాభావికచేష్టలగనబఱచుచుండిన నతఁడు పూర్ణసమాధిని జాలించి.

హర. కన్నులువిచ్చియ । ఖండతేజములఁ। గనఁబడు వారలఁ గాంచి। ఎన్నడుజూడని। యీనరరూపము।లేమిటివో యనిమెంచి రాము॥

వ. స్త్రీపురుషభేదాభేదంబు లెఱుంగనియతఁడు వారలఁ దనవంటి ఋషులనుగాభావించి యిట్లనియె.

ఋశ్య, కీర్తన, ఏకతాళము, కవలిపం. నలె.

ప్రమదమునఁగ। మిముఁజూడఁగలిగెను । తనయూత్రిమములెం త। దవ్వుఁను దెల్పుఁడంత। సముచిత। సభాష। ణములాడఁగఁ। గల్గెను॥ ప్రమ॥ మాకుగోమ్ముండు । మత్రితలమంను । మీకు రొమ్మునరెంను । మేలైనకొమ్మ్ముయుండె। మాకంటె। మహాపీయు। లేకదాతలఁపను॥ ప్రమ॥ మీరెన్నడిటకు। రాకిదివరకు। సాకెమోక్షగుండ। శౌరిసత్కృపకోడ। జేరిన। కారణముఁ। జెప్పఁగఁ। దగును॥ ప్రమదను॥

ఉ. అక్షయమైనతక్కలహా ♦ హాదెసలన్ వెలిగించుచున్న రు
ద్రాక్షలుకంఠమందు వెల ♦ యన్ ధరియించితి రాక్షలార! యీ
వృక్షము లెచ్చటన్ గలవి ♦ నేట్లులభించెను మీకుఁదెల్పనే
నాక్షణమేగి తెచ్చుకొని ♦ హారముగూర్చి ధరింతుఁగుతుకన్.

క. పరిమళముగల్గు భస్మము
ధరియించితిరంగములను ♦ దగనిదిగనులన్
దొరకినదో! చేసినదో!
కరముగురుతుఁ దెలుపరయ్య ♦ కవివరులారా.

గీ. హంసదండంబు లెచ్చట ♦ నలవడెనివి
చేతముట్టిన నాదంబు ♦ చేయుచుండు
నిట్టి చిత్రాసనంబు లే ♦ తట్టుకలవో!
మావనంబున దొరకవు ♦ మానులార.

వ. ఇట్లు వారియందు బద్ధానురాగుండై తపస్సమాధిఁజాలించి వారింగలసి యిచ్ఛావిహారంబుగాఁ జరింపుచు గాలంబు బుచ్చుచుండ నొక్కనాఁడు వారాంగన లిట్లనిరి.

క. మాయునికిపట్లుసేరఁగఁ
బోయెదమో మానివర్య! ♦ పొందుగ నెవ్వా
ళ్ళాశనిటునచ్చి యిక్కఁసేల
పీయుము మాకన్ననాతఁ ♦ డింతులకనిరొన్.

# శ్రీమోక్షగుండరామాయణము-హరికథ.

ఋషి, కీర్తన, ఏకతాళము, హంసధ్వని రవికుల.

విడువగ । దగునా! మహనీయులారా! తగునా । వగఁద్రో । యఁగఁమే । లగునా ॥విడువ॥ ఈడుగన్ । జోడుగన్ । దోడుగన్ । గూడియున్ । వేడుకతోడుత । విహరించియువిడ । నాడఁగఁదలఁచుట, పాడియె॥ విడువఁగ ॥దగునా॥ నేవచ్చెదన్ । మీవెంబడిన్। వేవేలుగన్। భావింపగన్ । బావనులార! కృ । పావహులై కొని । పోవుదునమ్మితిఁ । గావున॥ విడువగ । దగునా॥ ఒంటిన్ । ఈ వనమున నే । నుంటిన్ । మిము వేడుకగాఁగంటిన్ । గలసిమెలసియుం । దుంటిన్ । ఇఁకనను ॥విడువఁగదగునా ॥ మోక్షగుండవిభుదలచుచుమీ యాశ్రమముల్ । వీక్షింపఁగమా కిచ్చవొడమెనిదిమేలు ! ఈక్షితిమి-మ్మొడబాయన్-ఈక్షణమున రానీయుఁడు॥ విడువఁగ దగునా॥

వ. అని యిట్లు వెంబడించిన వారకాంతలు దమ యిష్టార్థంబు సిద్ధించెనని సంతసింపుచు నాఘునుని యంగదేశంబునకుం జేర్చిరంత నా దేశంబున వర్షంబుగురిసి కాలంబు సుభిక్షంబయ్యె. అంతనారాజు తన సుతయగుశాంతను ఋష్యశృంగునకిచ్చి పెండ్లిచేసిననతఁడు గృహస్థుఁడయి యారాజునింట భార్యాయుక్తంబుగనున్న వాఁడమ్మునిని దోడితెచ్చి ముందశ్వమేధయాగంబుసేసి పిమ్మటఁ బుత్రకామేష్టిసేసిన సుకుమారులయిన నలుగురుకుమారులను బడసెదవు. నిశ్చయమ్ము. సత్కుమారునివలన నీవార్త మునునేవిని యున్నవాఁడఁగానఁ జెప్పితి నాప్రకారమాచరింపుఁడు.

తోహర. అనిసూతుఁడు తెల్పిన దశరథుఁడతి, హర్షాంబుధిలోఁబొదలి, చనియెరోమపా। దునినగరమునకు, మునినిఁబిలుచుటకుఁ గదలి ॥ రా ॥ శాంతతోడఋ-ష్యశృంగునిదా, సాకేతమునకుఁదెచ్చెన్, సంతానమునకు, జన్నముఁజేయించఁగఁదగ వినుతియొనర్చెన్ ॥రా॥ అతనిసమ్మతిని, నశ్వమేధమున। కపుడుప్రయత్నముచేసెన్, అతివేగవసి, ష్ఠాదిమునులఁ జ, య్యనఋత్విక్కులఁజేసెన్ ॥రామ॥

• కీర్తన, జంఝూటి, రూపకము.

అశ్వమేధమఖముసేసె, నవనిపాలుఁడు, శాశ్వతముగఁగీర్తివెల
యు, సత్యశీలుఁడు॥అశ్వ॥ గురులువసిష్ఠాదిమౌని, వరులుజెల్వుగ। సరగ
వేదమంత్రములను, జదివివేల్వఁగ॥నశ్వ॥ స్పష్టముగ ననర్వ్యజనులు, దుష్టి
నొందఁగ। నిష్టమయినభోజనంబు, లిచ్చిపొందుగ॥నశ్వ॥ కోరినట్లు ధన
చయంబు, గోట్లకొలఁదిని। ధారుణీసురాములకును। దాన మొసఁగుచు॥
అశ్వ॥ ఈక్షితినారాయణకవిరక్షకుండగు, మోక్షగుండదేవుని క, టాక్ష
మొందుచు॥నశ్వ॥

సంధితోహర. ఇటుజన్నముసే, ఋంవిపుత్రికా, మేష్టిమొనర్పిం
పఁగను,దిటముగయాగహ,విస్సులుపొందిన,దేవతలందఱుఁదగను॥రాము॥

వ. సత్యలోకంబునకరిగి బ్రహ్మకుఁబ్రణమిల్లి తండ్రీ! మీరిచ్చినవ
రగర్వవశమున రావణాసురుండు విజృంభించి సాధువులకు బాధ చేయుచు
న్నవాఁడు. వానిధాకకులోకంబులు తేఁకువచెడి చీకాకుపడియున్నవి. కా
వున నతనిపొంగడంగు తెఱంగెఱింగింపవే! యని వేఁడినఁ దత్క్షణంబున.

సంధితోహరం. వనజభవుఁడుదే, వతలనుదోడ్కొని, వైకుంఠము
నకుఁజేరి,యనువుగనారా,యణమూర్తికి వం,దనములొసఁగిమదిగోరి॥రా॥

బ్రహ్మకీర్తన, ఆదితాళము, హరిచరణాస్మరణా,వలె.

పరమపురుషహరి! పాహిజనార్దన! సరసిజలోచన! సురవినుతా!
శరణాగతులమముఁ, జల్లనిచూపుల, నరసిబ్రోవవే! హతదురితా!॥పరమ॥
నీవఖిలమునకు, నేతవుదాతవు, నీవెఱుఁగనిది, లేవుచూడు। దేవమునుల
బా, ధింపుచురావణుఁ, డీవిశ్వమును జ, యించినాఁడు॥పరమ॥ దురమున
నాతని। దునిమిమాబాధలు, సరగునబాపుము, శశివదనా! ధరనునారా
యణదాసవినుత! కరి, వరద! మోక్షగుండ, పురసదనా॥ పరమ॥

వ. శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! మహానుభావా! వి
శ్రవసుబ్రహ్మకుమారుఁడగు రావణబ్రహ్మలంకయందు నివసించి లోకకం
టకులకు పెక్కండ్రురక్కసులఁ గూర్చుకొని భీకరంబుగ లోకంబులఁ బీ

డింపుచున్నాఁడు. దేవతలు తమయునికిపట్టుల నిలుచుటకు వెరవులేదు. కాఁబట్టి పుత్రులకొఱకయి యశ్వమేధయాగంబొనర్చి శుచియైయున్న దశరథునిభార్యలయిన కౌసల్య, కైక, సుమిత్రలయందు నీవు నాలుగురూపంబుల నవతరించి దశకంఠుని రూపుమాపి మమ్ము రక్షింపవే !

సంధితోహర. అనివేడిన బ్రహ్మాదులపలుకులు, వినిహరిదయతోఁగనియెన్, జను! డీఁకమీఱు, స్థానసారముగ, నలిపెదనేననియనియెన్॥రామ॥ అంతటసురలకు, నజుఁడు తెలిపెమీ, యంశంబులవానరుల, వింతమీఱఁగల్పించి శోకముపడు, డెంతయుమ్రొంచుమనసుకుల॥ రామ॥

సంధి॥వ॥ అనివిరించియెంచి వివరించినఖంచిదని దేవతలు స్వస్థానంబులకుఁజని తమతమయంశంబుల డెబ్బదిరెండు వెల్లువలవనచరులఁ బుట్టించిరి. వార లతిబలశౌర్యధైర్యసాహసంబులు మెఱయఁ గొందఱింద్రనందనుండగువాలిని గొందఱు సూర్యతనయుఁడగు సుగ్రీవుని గొందఱు వాయుసుతుండగు హనుమంతుని గొందఱువహ్న్యంశభవుఁడగు నీలుని నిట్లొక్కొక్క మొనగాండ్రతోఁ గొంతకొంతబలగము చేరికొలుచు దుర్గమంబులగు విపినమార్గంబుల సంచరింపుచుండిరక్కడ నయోధ్యయందు.

కీర్తన, ఆటతాళము.

ఒకదివ్యపురుషుఁడు,దయించెనంతఁ । బ్రకటహోమాగ్నిలో, పలనుండివింత॥యొక॥ హరినీలనీలాంగుఁ । డరుణతేజుండు, నరుణాంబరుండు సాహసవిక్రముండు॥యొక॥ పాయసపాత్రిను, బాణితలమునఁ, బాయక ధరించి పరమహర్షమున॥యొక॥ గురుతరముగమోక్ష, గుండ శ్రీహరిని, స్థిర భక్తితో నుతి, సేయుచుధృతి॥యొక॥

ఆ. తననుజూచియద్భు ♦ తంబందుచును లేచి
వినుతుఁడైన విభుని ♦ వెలయఁగాంచి
భూమినాథయజ్ఞ ♦ పురుషుండ సుతులనీ
యంగవచ్చితిని బ్రి ♦ యంబుమీఱ.

యజ్ఞపురుషుని తోహర.

అనువుగనీపర, మాన్నమ్మనునీ, యంగనలకుఁబంచిమ్ము, ఇనకుల వర ! నీ-యిష్టార్థంబును, ఇఁకనుబొందెదవుసుమ్ము॥రా॥

వ. అనియిట్లు యజ్ఞపురుషుండు పాయసమహిమంబుసెప్పితత్పాత్రనుదశరథునకిచ్చి యదృశ్యుండయిన ధరణీవిభుఁ డక్కలశంబులోని పరమాన్నంబును గౌసల్యకుసగము, కైకకుసగమునిచ్చిన వారిద్దఱుఁ దమయంశంబులో సగముసుమిత్రకునిచ్చిన నంతట వారది పుచ్చుకొనిరి. పిమ్మట భూవిభుండు ఋశ్యశృంగాది ఋత్విక్కులస్వదేశంబులకు వీడ్కొలిపి తాను గాంతాయుతంబుగ స్వకీయసౌధంబుఁజేరి సుఖలీల నుండె. అప్పాయసమహిమ వలనఁ గౌసల్యాదికాంతలు గర్భవతులయిరంత.

ఉ. మన్నురుచించెనెన్నడలు ♦ మందములై తగె మోముదమ్ములున్
గన్నులుఁదెల్లవారెఁ బొసఁ ♦ గెన్ నలుపెక్కెను జూచుకంబులున్
అన్నమసహ్యమయ్యె బహు ♦ ళాభరణాంబరపంజ్క్తి భారమ
య్యెన్నెలలంతకంతకును ♦ హెచ్చఁగఁగాంతల కబ్బురంబుగన్.

వ. ఇట్లు గ్రమక్రమంబునఁ బంద్రెండునెలలు నిండిన.

శ్రీరామాది పుత్రజననము.

కీర్తన, కమాసు, రూపకము.

పుత్రోదయముమాయెనపుడు, మిత్రకులప, విత్రుండగు, ధాత్రీపతి-చిత్రమొందఁ॥బు॥ చైత్రశుద్ధనవమిపగలు, సౌమ్యవాసరాదితిన, కుతత్రికటకలగ్నయుతప, విత్రంబగువేళనుశుభ, గాత్రియైన, కౌసల్యకు॥బు॥ ప్రాకటముఁబుష్యతారఁ, బదిరెండవలగ్నమందు, గేకయరాజపుత్రియైన, శ్రీకరకుచ, జితమంగళ, కోకకునా, కైకకునొక॥పు॥ పాత్రంబగు కటకంబున, ఫణితారనుగ్రహములునతి, మైత్రిమెలఁగంగను శశి, పత్రాయత, నేత్రకుశుభ, గాత్రకును, మిత్రకుబహు, పుత్రో॥ రక్షకుఁడయి తాన్పూరినా, రాయణకవినేలుచుండు, మోక్షకుండనిలయక్ష్మపా, వీక్షణా మునఁ, దాక్షిణ్యమున నక్షయశుభ, లక్షణులగు॥ పుత్రోదయ॥

క. తనయులుగలిగిన దశరథుఁ
డనుపమసంతోషపులకిత •ాంగుండగుచున్
దనరవసిష్ఠునిబిలిపిం
చిననాతండరుగుదెంచి • చిత్తంబలరన్.

సంధితోహర. నానుకరణపు, స్వ్యాహావాచనము, లామునివర్యుఁ డొనర్చెన్-రామభరతల, క్ష్మణశత్రుఘ్నును,నామములపుడేర్పఱచెన్॥రా

వ. ఇట్లు వసిష్ఠమహర్షి స్వస్తివాచనమైనపిదప భార్యాత్రయ శిశుచతుష్కయుతంబుగా దశరథుని పీఠంబులపయి నాసీనుఁజేసి సభా సదులసమక్షంబునఁ గౌసల్యాసుతునకు రాముండనియుఁ గైకేయికొడు కునకు భరతుండనియు సుమిత్రానందనులకు లక్ష్మణశత్రుఘ్నులనియుఁ బేరులుపెట్టి రాజువలన బహుమతులువడసి చనియె. అంత సంకల్పసిద్ధి యైనందునకు భూకాంతుండు సంతసింపుచుఁ గాంతలతోఁగూడి సుఖం బుండె. పిమ్మట శ్రీరాలక్ష్మణభరతశత్రుఘ్నులు తల్లులవలనను దాదుల వలనను సాకఁబడుచు బాలసూర్యులవలె దినదినప్రవర్ధమానులయి చిన్నవయస్సునందే! యాటలాడ నాసక్తులై.

కీర్తన, ఏకతాళము, ఈశరాసనంబుబాయ-వలె.

వారలాటలాడిరీడు, వారిఁగూడుచున్, కోరి-చీరి చేరుచున్ బా లుచున్ పౌరుషంబులున్, సారెకునెగడన్, బారులువోగడన్॥ వారలా ట॥ నెువ్వన్, నవ్వన్, జివ్వరున్, గవ్వచున్, సవ్వడిగనిన్ । బువ్వల చెందున్-రువ్వచుమెంతున్॥ వారలాట॥ డాగి-మూగి, లోగకన్, వాగ కన్, యోగిఁబులున్, బాగుగఁదినకన్, వేగమెచనకన్॥ వారలాట॥ దీకున్, గకున్, దక్షులై, తలఁగకన్, మోక్షపురపతి, నుకుయ కరు ణా, వీకుణగలుగన్॥వారలాట॥

వ. ఈలీలబాలక్రీడాలోలురై కాలంబుపుచ్చుచున్న సమయంబున.

సంధితోహర. కైకదాసియొు, కృతెమందరవే, ళాకోళంబనిమెంచి, చే కొని చేతులఁ-జెండుదట్టుటయు, శ్రీరాముఁడుగోపించి॥ కట్టువేసికొని

కొట్టినంతనొక-కాలువిరుగ నత్తరుణి, యట్టెమదినిజర-కొట్టుచు, నొ।
ణుగుచు, సవతలజనెనత్తరిసి॥రామ॥

క. ఈలీలబాలురాటల
పాలయిక్రీడింపుచుండఁ ♦ బరికించిమహీ
పాలుఁడు వసిష్ఠమౌనిని
మేలుగఁ బిలిపించిపలికె ♦ మృదువాక్ఫణితిన్.

దశ, కీర్తన, దర్బారు, అటతాళము-రమ్మని పిల-వలె.

మొక్కెదనార్య, మునికులవర్యా, అక్కటబాలకు, లాటలమ
రిగిరి॥మొక్కెద॥ చదువులుసాములు, చదివించిపేరల, ముదమునసీతికో,
విదులనుజేయవే॥మొక్కెద॥ మోక్షగుండాధిపు సాక్షిగబిడ్డల, నక్షయ
విద్యా, దక్షులజేయవె॥మ్రొక్కెద॥

క. బాలురను బుద్ధికౌశల
శీలురగావింపుఁడని ♦ వసిష్ఠునితో భూ
పాలుఁడు పలుకఁగవిద్యా
శాలకుఁగొనిపోయిచెప్పెఁ ♦ జదువులు సాముల్.

వ. ఇట్లుదశరథునినియోగంబున రామలక్ష్మణభరతశత్రుఘ్నుల విద్యాశాలకుఁ గొనిపోయి వసిష్ఠమహాముని స్వల్పకాలంబుననే చౌషష్టి విద్యాపారంగతులఁజేసి తోడితెచ్చి యొప్పగించిన భూపాలుండు సంతసించి వారివలననే యుపనయనంబులు సేయించి వివాహంబునకు యత్నింపుచున్న సమయంబున.

సంధితోహర. దండకమండల, ధారుడగుచుమో, దంబునగాధేయుండు,
కుండలశయనుని-గొనియాడుచుగ్ర, క్కననువచ్చెధీసంఘ॥రాము॥

కీర్తన, ఆటతాళము.

రామకృపాకరః రఘుకులశేఖర! స్వామినిశాచర, సంహారః శ్రీకర!॥
రామ॥ పటురఘుపకూర్మ, కిటినరసింహా, వటురూపకభృగు, వంశజరా
ఘవ!॥ రామ॥ సాక్షిస్వరూపక! మోక్షగుండపురా, ధ్యక్ష! నారాయణ,

దాసనుతా! జయ॥రామ॥

తో॥ వచ్చినమునివరు, వార్తతెలిసిభూ, వల్లభుడెదురుగసరిగి, చెచ్చెరఁదోడ్కొని, వచ్చిసుఖాసన, మిచ్చిపలికెదానెరిగి॥ రా॥ ఏమిపనికి మీరిటకువచ్చితిరో, యెఱిగింపుడుదయతోను, స్వామినేను-నిశ్చయముగ నాపని-సలిపెదనిపుడన ననెను॥ రామ॥

విశ్వా, కీర్తన, నాదనామక్రియ-చాపుతాళము.

ఓహో రాజా! నామనవి విను॥మోహో॥ ఆహహా నేనొక్క యాగము జేయఁను। బాహుమారీచులు। బహువిఘ్నములుసేతు॥రోహో॥ భూమిపయివారిని, బొలియుంచుటకుమన- రామలక్ష్మణులను, బ్రేమతోఁబంపించు।మోహో॥ అక్షయముగనునా, రాయణకవినేలు, మోతుగుండేశుడు, రక్షించుమిమ్మునో॥ హోహో॥

వ. నేనుయాగంబుసలుప సమకట్టిన ద్రిలోకకంటకుండగు దశకంఠునిచే ననుజ్ఞాతులై మారీచసుబాహువులువచ్చి విఘ్నంబులు చేయుచున్నవారు. కాఁబట్టి వారినిజంపి జన్నంబు పరిసమాప్తినొందింప నీకుమారులలో రామలక్ష్మణులనావెంట బంపుమని విశ్వామిత్రుం డడిగిన దశరథుండు.

దశరథుని కీర్తన, దర్బారు, రూపకము.

వీరినంపఁజాలమాని। వీరిసీదు। వెనువెంటను। జనుఁడంచును। క్రూరరాక్షసులతోఁబోరి। నేరరు నాకు, మారులునుకు, మారులుగద॥ వీరి॥ తల్లులనెడ, బాయలేరు, విల్లమ్ములుపట్టనెఱుఁగ, రల్లయుద్ధభూములలో, నుల్లంబుల, నల్లనభీ, తిల్లరెయిక॥ వీరినంప॥ మోతుగుండ పురనివాను, సాక్షిగ వినుడిదియజ్ఞ, దీక్షబూనుడేనువచ్చి, యాక్షణమున, రాక్షసులను, శిక్షింతును॥ వీరినంప॥

సం॥ తో॥ దశరథు, డిటువలెఁ, దనతోఁబలికిన - తాత్పర్యము నాలించి, విశదంబుగనా, విశ్వామిత్రుఁడు వినకయనిమొఁగోపించి॥ రా ॥

• విశ్వా, కీర్తన, బేహాగ్, ఏకతాళము. వెగరు

బలే, బాగునీమాటమహారాజా! బలే॥ బాగాయెగా-యాగాశా బాస్‌బలే॥ బాగు॥ నేఁగావించెద। నీపనులనుచును। వేగముతో। బాగి తివి, మేలుశబాస్‌బలే॥బా॥ భానువంశజులు। పలుకరబద్ధము। నీనాడుఁ గానఁబడె।మేలుశబాస్‌బలే॥బా॥ మోకుగుండవిభు। సాక్షిగసభలో, నీకు ణమే! యేమంటి-మేలుశబాస్‌బలే॥బా॥

సం॥తో॥ విశ్వామిత్రుఁడు, వీరావేశము-వెల్లివిరియఁబలుకఁగను, విశ్వంభరపతి వెరచుచుగురునకు వినతుఁడగుచు నిట్లనెను॥రా॥

దశ, కీర్తన, ఆదితాళము.

వినవే! మునివర! వినవే-తెలిపెద, వినవే! నామొర, వినవే! కడు వశి॥ విన॥ వినువసిష్ఠవర-మునిచంద్రమ! మొర॥ వినవే॥ రామలక్ష్మణుల। వేముఖరక్షణ। కై మునిబిల్వఁగఁ। గదిలివచ్చెనిది॥విన॥ తాపసవరునివ్యథా గనుబంపినఁ, గోపముతోడను, శాపమువెట్టును॥ విన॥ లేకలేకకల్గిరి, వీర లునా, కీకాలమునకు, నెటులబంపుదును॥ విన॥ మోకుగుండకమ, లేకు ముకృపతో, దీక్షగనాసం, దియముఁబాపవే॥ విన॥

క. అనితనతో నాలోచిం
చినభూపతి వాక్యములను • జిత్తంబలరన్,
వినయువ్వసిష్ఠమునిపతి
యనుపమ్ముదు వాక్యసరణి • నప్పుడిట్లనియెన్.

వసిష్ఠునికీర్తన, హిం, కాఫీ, అటతాళం.

రామునంపినభయ।మేమో! తెల్పుభూమీపాల! ॥రా॥రాముఁడన సామాన్యుఁడె। శ్రీమహావిష్ణువగు॥ రాము ॥ ఉరగపతిలక్ష్మణుఁడు। దర సుదర్శనములు। భరతశత్రుఘ్నులల। పరాశక్తియెసీత॥ రాము॥ రాక్ష సులశిక్షింపఁగ। నిక్షితినారాయణాఖ్య! రక్షకుఁడు మోకుగుండా। ధ్యక్షు డయికలిగెను॥ రాము॥

వ. ఈగాధేయునకు మొదటనేమికోరిన నది యిచ్చెదనని చెప్పి

యిప్పుడు బొంకవచ్చునా ! సూర్యవంశరాజులు సత్యవంతులని యెన్నిక(గన్నకీర్తి యేలపోనాడెదవు! రామలక్ష్మణులకు రాక్షసులవలన( గీడు మూడుననుసంశయమును మానుము. దీనివలన నీకుదప్పక మేలుకలుగును కా(బట్టి నీకుమారులను యజ్ఞ సంరక్షణకొరకు గాధి పుత్రునివెంట(బంపుము.

సంధితోహర. అనివసిష్ఠుడి, ట్లనుటవలనవె-మ్మనమున నానందించి, జననాథుడు రా, ముని సౌమిత్రిని దనచెంతకురావించి॥ నా॥

దశ, కీర్తన-అటతాళం

నాయనయీమునిని, నాయకువెంబడి-నీయనుజునిగూడి। పోయిరావోయి॥ నా॥ ఈయనయజ్ఞము, చేయు(గదానవు, లాయెడ(గొనసాగ,నీయరటూదాన॥నా॥ యాగవిఘాతకు। లగుమారీచాదుల। వేగమెతుత్రింపుము। సాగునామీద॥ నా॥ ఈక్షితిలోపల, మోక్షగుండేశ్వరు( । డక్షయశుభములు। నాక్షణమిచ్చును॥నాయన॥

ఉ. మాటికిబుద్ధిదెల్పెద( గు ♦ మారకులార పరస్థలంబునందాటలపాటలన్ దిరిగి ♦ యారడినొందక యాగమేచు నాతాటకలోనుగాగలుగు ♦ దస్యుసమూహము మించినొంచి యిమ్మేటికి(బ్రీతి( జేయుడ(ట ♦ మీద యశంబలరారుమీకిలన్.

వ. అని కుమారులకు బోధించి విశ్వామిత్రమునినిగాంచి దశరథుండు గరకమలంబులు ముకుళించి.

దశ - కీర్తన-అటతాళము - హిం, తోడి.

తల్లిదండ్రులచాటువారలు,తాపసోత్తమ! వీరలు।మెల్లననుగొనిపోయివేగమె। యిల్లుసేర్చుమిమీరలు॥ తల్లి॥ ఆకటికిదప్పికినిసెకతుణ, మైననోర్వ(గ(జాలరు। మీకృపారసమెట్లుజూపెదో ! మీకుదాసులు బాలురు॥ తల్లి॥ మోక్షగుండపురీసుకృపతో। ముదముతోనే తెంతురు। ఆక్షణంబునవచ్చిమఖమం, రక్షణముగావింతురు॥తల్లి॥

సంధితోహర. అనిగాధేయున-కప్పగించితన, తనయులనటుదీవిం

చి, చనుడనిపంపి, చిననరుదెంచి - మునివెంబడి మోదించి॥ రామ॥

వ. ఇట్లు శ్రీరామలక్ష్మణులు మునివల్లభునితోఁ గూడి యారాత్రికి నర్థయోజనమునడచి సరయూనదీతీరమునకుఁ జేరి మహాశ్రమ నొందుమనస్సుగ గణించి విశ్వామిత్రుండు నాయుమున్న బ్రహ్మవంశుఁ దపోమహిమచే నార్జించిన బలాతిబలములను దివ్యమంత్రముల నుపదేశించిన నామంత్రముగ ప్రభావమ్ముచే రాజపుత్రులు క్షుత్పిపాసలు మొదలగు బాధలనొందక దృఢగాత్రులయిరి. అంతనారాత్రి యక్కడ నివసించి మరుదినము ప్రయాణమైపోవుచు నాచెంగటనొక మహాధ్వనివిని యిది యేమి యని రాముఁడడిగిన మునీంద్రుఁడిట్లనియె.

విశ్వా, కీర్తన, బ్యాండుస్వరము, ఆదితాళము.

రామ రామ వినుమది। రాజితగంగానది। యీమహానదినము। నీశునితలనుండి। పేరుభగీరథుఁ, డీమహికిని దెచ్చె॥ రామరామ॥ పట్టుగాన యోధ్యను। జుట్టివచ్చియిచటను। దిట్టముగానీన। దీసంగముబగు। నట్టులగానము। హాధ్వనిగలైను॥ రామ॥ అక్షయఫలమిచ్చును। నఘములఁ బోకార్చును। మోక్షకుండపురా। ధ్యక్షనారాయణ। రక్షమిాపదముల- రహింబుట్టెమున్ను॥ రామ॥

వ. ఇట్లు గంగానదీప్రభావంబు గాధేయునివలనవిని యానందింపుచు నాస్థానంబువదలి యంగాశ్రమము మొదలగు ప్రదేశములుచూచుచుఁ బోవుచున్నయెడ.

సంధితోహార॥ కన్నులనిప్పుల। కణములురులది। క్రూరులుమడిసి బెదరఁగను। దన్నుగెలుచువారు। ధరలేరనుచును। దాటకవచ్చెనుదగను॥ రా॥

వ. అప్పుడు శ్రీరాముండు లక్ష్మణునిఁజూచి.

రాముఁడు, కీర్తన, ఆదితాళము, భజియింపవేమనసః—వలె.

కనుఁగొంటివా! లక్ష్మణ! కనుఁగొంటివా! దనుజవచ్చెడితీరుఁ। గనుగొం॥ మిడిగుడ్లు కోఁలులుదెఱచి। మిన్నువగులఁగఁ। బెడబొబ్బలిడుచు బుడమియదరఁగఁ॥ గను॥ మోక్షకుండని భుజినన్ను, ముట్టడించిన। నడి

చ. రాక్షసి సోవఁగఁ గలదే। ప్రాణముతోడ॥ గనుగొంటివా ॥

వ. అని తెలుపుచుండ.

సంధితోహార॥ అంతట రాక్షసు। రాలు పైకిఁ దా। గంతులు వైచుచు రాఁగ। మంత్రమున దాని। మర్దింపుండని। మౌనివర్యుఁడనవేగ ॥రామ॥ మంచిదనుచు నొక-మహితశరముసం। ధించి రాముఁడటు వేయ। మించి యురముభే। దించి ప్రాణముల। ద్రుంచిన నది పడిపోయె ॥రా॥

క. తాటక మడిసిన రాముని
గాటముగాఁ గౌఁగిలించి ♦ గాధిసుతుండ
మ్మేటికి సమంత్రకంబుగ
సూటిగ శస్త్రాస్త్రములను ♦ సొంపుగనిచ్చెన్.

వ. ఇట్లొసంగి ప్రియంబున నా రాజసుతులఁ దన యాగస్థానంబగు వామనాశ్రమభూమికిఁ గొనిపోయిన రాముండు.

రామునికీర్తన, బేగడరాగము, ఏకతాళము.

మఖము జేయుఁడు, మౌనితిలక మీరు॥మఖము॥ అఖిల ఋషులఁ గూడి, యమితమోదమున॥మఖము॥ అసుర పీడలు నే, డది చెరుపఁగను, గుసుమశరారిని, గూడి రావిడువ॥మఖము॥ భూమి మోక్షగుండ। పురమున వెలసిన, స్వామి కృపచేత, సమ్మనిచంద్రము॥మఖము॥

వ. ఇట్లు చెప్పిన.

ఉ. అంతట గాధిసూనుఁడు మ ♦ హాముద మొందుచు రాము నాజ్ఞచే
నంత యదీక్షఁ బూని సము ♦ నీశ్వరుఁడై మఖమాచరింపఁగా
మంత్రము లుచ్చరించుచును ♦ మౌనులు హోమము చేయుచుండ భూ
కాంతసుతుల్ ప్రియంబునను ♦ గాచుచునుండిరి పంచరాత్రముల్.

సంధితోహార॥ వరమారీచసు, బాహులు గడపట। వచ్చి మాయలను జొచ్చి, ప్రేమల మూత్రం, బులు హోమాగ్నుల। గురిపించగ గను హెచ్చి ॥రా॥ రాముఁ డొక్క శర - రాజము వైచిన। నామారీచు నివడిగ, దామసించి త-త్తరపడి వై చెఘు। నా మహాబ్ధిలో బడగ ॥రా॥ పదపడిమరి

యొక| బాణము వైవను, బాహుండు నీలిగెనంత, ముదమున శ్రీరా, ముని దీవింపుచు| మునులు వొగడి రాచెంత|| రామ||

మునులకీర్తనము, యదుకులకాంభోజి-ఆదితాళము.

శ్రీరామరామరామ| సునా | శిరాదివినుతనామా ! సారె, కునీ, మాయ, దాటనేరము భక్తకామ||శ్రీరామ|| నీకంటెనెందేమియు| లేక| నిండియున్నావనియు| బ్రాక, టముగ, శృతులు, పలుకు, లోకేశనిక్కమనియు||శ్రీరామ|| యాగముగాచినావు| తాటకాదులమనిమినావు| రాగ, రహిత, యోగు, లకు బాగుగావించినావు ||శ్రీరామ|| సాక్షిస్వరూపుడవు| శ్రీమోక్షగుండేశుడవు సాక్షా, న్నారా, యణ, కవిని-రక్షింతువెపుడునీవు||శ్రీరా||

వ. అని కొనియాడి మునులిట్లని యాలోచించిరి.

తోహర|| జనకుడు శంకర| చాపము సారిం | చినవరరాజసుతునకు దనకూతురు సీ, తనునిచ్చెదనే| నని చాటించెనునటకు ||రా|| మనరాముని గొని- చనిన శుభంబగు-నని మునులాలోచించి, దీనకరకులజా-తుని రాముని గను | గొని పలికిరి మోదించి|| రామ||

మునుల కీర్తన-కమాస్-ఆదితాళము

పోదము రా ! రాఘవ|| పో|| సముచితసంభా, షణములతో | బోదము; అనిమిషాదులకు - నలవిగానియొక - ధనువుగలదు జన, కునిపురిలో | మనము దానిగను - గొనివత్తము || పోదము రా || నయముగదా ఘ్వారి | నారాయణకవి| ప్రియమున గొలువంగ| దయగనుము| రయమున మోక్షగుండ - రమణ ! రామ|| పోదము రా||

క. అని రామలక్ష్మణులఁ దో
డ్కొని గంగాతీరమునకుఁ ♦ గూరిమితో సం
జనునెడ నిర్జన మగునొక
వనమగపడఁ గాంచిమౌని ♦ వడునకుననియెఁగా.

రామునికీర్తన, కమాస్, ఆదితాళము.

ఈవన మెవరిది! సుధీవర! తెల్పు॥మీ॥ ఈవనము-పావనము-గేవలము, బావులు, దీవులు, తావులుగలిగిన॥దీవన॥ శ్రీకరమై-శేఖరమై-ప్రాకటమై! కేకుల మూకల కేకలుగలిగిన॥ దీవన॥ జనులెవరు! గనబడరు! మునుపిచట! మునులుం-డిన తా-వనితో-చెనుమది॥ దీవన॥ మోక్షగుండాధ్యక్షుకృపా! వీక్షణచే! లక్షణ వృక్షము లక్షయమౌగగల॥దీవన॥

సంధితోహర. రాముండిటువలె-రయమున నా వి-శ్వామిత్రునితో నడుగ, స్వామి తెలిపెదను జక్కగవినుమీ-స్థలవిశేషమును వేగ॥రా॥

విశ్వామిత్రుని కీర్తన, ఆదితాళము.

గౌతమవనమిది-కనుగొను రాఘవ! యాతని భార్య యహల్య యగు; నాతరుణిని బురుహూతుండు గలియంగ! బ్రీతితో నెంచంగా-మాతురుండై॥ గౌ॥ కుక్కుటరూపుండై-కొనినడిరేయినిం! గొక్కరొకో యని-కూయగను! జక్కగ నమ్ముని-స్నానార్థము జన-నిక్కడంతు సుఖి-యించంగను॥గౌత॥ కాలముగాదని-క్రమ్మరవచ్చియుం! జాలవారి చే, ష్టలకలిగి యాలినిగని శిల-యటులగుమనియా! వేళనుమాని శ, పింపంగను॥ గౌత॥ రక్షింపుము శాప! మోక్షము దెలుపుము! కక్షవద్దనగ! గరుణతోను! మోక్షగుండరా-ముని పాదము సోక! నాక్షణమే తీరు! ననియెను॥ గౌతమ॥

వ. ఇట్లు శాపవిమోచన కాలంబు చెప్పి గౌతముండు హిమవంతంబునకుం జనియె నది మొదలీవనంబు నిర్జనమైయున్నది రామా! పరంధామా!

తో॥ కావుననో రా, ఘవయీరాతిని! గావింపుము వనితగను! నావుడు రాముడు, నవ్వుచునటులనె! కావించెదనరియనెను॥రామ॥ రాముండామా, ర్గంబున నేగియు! రాతిమీద బదమిడగన్! గోమలియై గ్ర-క్కునను లేచి శ్రీ, రాముని బొగడగ దొడగెన్॥రామ॥

అహల్య కీర్తన, ఆదితాళము, తంగిమెట్టు-వలె.

వందన మో రఘు-వర్య సుందర ధైర్య! సుందరపాదార, విందయు

గ్మమునకు॥ వం॥ నాపాపమునసిలా । రూపమునొందిన । శాపముబాపిన నీపాదపద్మములకు॥వం॥భువనత్రియంబుల-బ్రివిమలముగజేయు।దివిషత్స్రవాహిని। భవమైనపదములకు॥ వం॥ మూడడుగులు భక్తి, తోడనిచ్చిన బలి, మాడుపైనుంచిన। మంగళపాదములకు॥ వం॥ భాసురమోక్షగుండ। వాసనారాయణ। దాసమనోబ్జ సం, స్థాపితపాదములకు॥ వం॥

తోహార॥ అని యిటువందనమాచరించి రాముని వీడ్కొనియాకాంత। పనివినియెనుదన భర్తచెంతకును నినకులోదయుండంత॥ రా॥

వ. గంగానదినిజేరి యన్నదిని దాఁటుటకు నావ యెక్కఁబోవు రామునకు నావికుండిట్లనియె.

ఆ. రామ! తమపదాబ్జ ♦ రజముసోకంగనె
కఠినమయినరాయి ♦ కాంతయయ్యె
నావదారుమయము ♦ నాతిగాకుండునే!
యెటులఁబ్రదుకువాఁడ ♦ నినకులేశ!

వ. కావునఁ దమపదంబులు గడిగికొనక నావ యెక్కవలదన్న నన్వియటులనే! కానిమ్మనినఁ గణధారుండు గంగానదీజలంబులచే రామపాదద్వయ ప్రక్షాళనంబుఁజేసి వస్త్రంబుచేఁదుడిచి యారోహింపఁజేసి నదిదాఁటించిన పిదప.

తోహార॥ తాపసవర్యుడు-రామునుపర మిథి-లాపురికేగగ నెరిగి। ప్రాపుగజనకధ, రాపాలుడుదా । బరుగున నెదురుగనరిగి॥ రామ॥

తోడుకొనిపోయి సభాస్థానంబునకుఁజేర్చి రత్నసింహాసనాసీనులంజేసి.

క. రంగుగఁ గౌశికునకు సా
ష్టాంగనమస్కార మొసఁగి ♦ యర్చించి యనం
గాంగులగు రామలక్ష్మణు
లంగని సంతోషమునఁ జె ♦ లంగుచుఁ బలికెన్.

జనకునికీర్తన, సురటరాగము-ఆదితాళము.

మునీంద్ర! వీరెవరో! తెలుపుము॥మునీం॥ మనోజసుందర మంగ

శరూపులు॥ ము॥ మేరుసమానసు-ధీరులునతిసుకు, మారులునెవరి కుమారులో । వీరిటురాగను గారణమేమో!॥ మునీం॥ వేడివెలుగుతే-వెలుగుల వలెనే! జోడుగూడిమీ-తోడుతను। వేడుకతో కుత-నేడువచ్చిరి॥ మునీం॥ మోక్షగుండపుర। మునవెలసిజగ-దక్షిణచేయు ప, రాత్పరుని। దీక్షమీ అవిను, తెల్పుచు దెలుపుము॥ మునీంద్రా॥

వ. ఉల్లంబులు రంజిల్ల విల్లమ్ములు గరపల్లవమ్ముల నల్లనల్లనధరియించి మెల్లమెల్లనవచ్చిన యీమారసమాకారులు సుకుమారులెవరి కుమారులో! దెలుపవే! మహానుభావా! తపఃప్రభావా!

తో॥ అనియిటువలెవే, డిన యాజనకుని-వినయవాక్కు లాలించి। వినుమనిబాలుర, వృత్తాంతముముని, విభునకు తెలిపెమోదించి॥రామ॥

విశ్వా-కీర్తన, జంఝూటి- అటతాళం.

మహా, రాజ! దశరథతనయులాదిన, రాజకులఘనులు । దినరాజకులఘనులు । శ్రీరామలక్ష్మణులు ॥ మహా ॥ చను, దెంచి మారీచుని సుబాహుజ, యించియాగమ్ము । జయించియాగమ్ము । సా, గించిరిదినమ్ము॥ మహారాజ॥ శిల, రూపమైన యహల్య శాపము । వాపిరివీరు । వెత । బాపిరివీరు । కృప తోపగనినారు ॥ మహా ॥ మీ, యింటగల వారచాపమునుగను, గొంట కెకోరి, కను-గొంటకై కోరి । నా, వెంట వచ్చిరి॥ మహా॥ శ్రీమోక్షగుండాధ్యక్షుకృపనిట, లాక్షువిలుసూపి-నిట, లాక్షువిలుసూపి । ప, రీక్షగనుచూపి॥ మహా॥

చ. మునివిభుఁడిట్టులాడఁగఁ బ్ర ♦ మోదముతో జనకావనీశుఁడం
పినపదివేలమంది భట ♦ వీరులు దోర్బలవంతు లేగియ
మ్మనసిజ వైరివిల్లుగల ♦ మందసనీడిచి తెచ్చితత్సభన్
ఘనముగనిల్పఁగాంచినృప ♦ కాంతుఁడుఁ గౌశికుఁగాంచి యిట్లనెన్.

జన-కీర్తన, రూపకతాళము-కాఫీరాగము.

పన్నగశయనయ్యా! మన్నింపుము మౌనివర్య!॥ విన్నప॥ మున్నుభూమిఁదున్నగనుక-కన్నియ వే, గమున దొరకె ॥ విన్నప॥ కూతుగగొంటి

ఖ్యాతిగనేసాకుచుంటి। చేతములరసీతయను। బ్రీతిగనేబిలచుచుంటి॥ విన్న॥ అక్షయపదవిలసా తూన్నా రాయణకవి, కక్షయ। యాక్షితిసి రక్షించెనీ- మోక్షకుండ విభుసాక్షిగ॥ విన్నప॥

వ. ఇట్లుగారాబంబున బెంచుచుండ నబ్బాలికారత్నంబు శుక్ల పక్ష చంద్రబింబాలె దినదిన ప్రవర్ధమానయై యలరార.

గీ. పటికనార్చిన కనకంబు ♦ పగిది మృగమ
దంబుఁ గూర్చిన దివ్యచం ♦ దనముభాతి
సానబెట్టినవజ్రంబు ♦ చందమునను
యౌవనస్ఫూర్తి వహియించి ♦ యలరెసీత.

వ. ఇట్లు జవ్వనంబు నిండారి యున్నతఱి.

జన-తో॥ మాళవఘూర్జర-మగధ నిషధపాం, చాలసింధుకాస్మీర। చోళవంగ నేపాళముఖ్య దే-శాళినృపులువేర్వేర॥రా॥

వ. చతురంగబలంబులతోఁ గూడివచ్చి మదాద్రిజధానింజేరి క్రమక్రమంబున నిట్లని యడిగిరి.

రాజుల-॥కీర్తన, కమాస్-ఏకతాళము.

వినవయ్యా!జనకభూవరా!॥వినవ॥ నెయ్యముతోడమీ।నియ్యము గోరి। యియ్యెడకునుమే। నేతెంచితిమో॥యయ్యా॥ నిరుపమగాత్రికి। నీవరపుత్రికి। సరియగునాతని-బరికింపుము॥ వినవ॥ మాలోనెవనికి-బోలునో! వానికి। నాలలనామణి-నర్పింపుము॥ వినవయ్యా ॥ అండబాయక మోక్ష, గుండవిభునుబోంచు । చుండుసదామిము నుకృపతో॥ వినవయ్యా॥

అనియడిగిన వారికినే నిట్లంటి.

తో॥హర॥ ఈశునివిలుమా-యింటగలదుదాని-నెక్కుడురాకొమరునకు। నీశుకవాణిని-నిచ్చిపెండ్లిగా-వింతునన్న వినియటకు॥రా॥ గాకుమారకుల- నేకులుగుములై -ప్రాకటబలురై చేరి। యాకోదండము। నెత్తగలేక ను-విందుండిరికనువారి॥ రామ రామ॥

క. ఈవింటఁ గూల్చెఁ ద్రిపురము

లీవింటగజాంధకాద్య ♦ నేకరిపుల నుం
దేవధియించెను శంకరుఁ
డీవింటనె! దక్షయాగ ♦ మిలఁబోకడచెన్.

వ. అప్పుడు మామూలపురుషుండగు నిమిచక్రవర్తికి నాఱవ తరంబువాఁడు దేవరాతుండు సహాయపడి దేవతలఁదోలిన మెచ్చి యత సికీశ్వరుఁడీ విల్లునిచ్చె.

తో॥ అదిమొదలుగమా,యన్వయజాతులు-హరదత్తశరాసనము। ముదమునమందస, మునిడిసంతత, మునుబూజింతురునిజము॥ రామ ॥

జన.కీర్తనము, కాఫీ-ఏకతాళము.

ఈశరాసనంబసాధ్య-మేర్కెనను।గౌశికమునిచంద్ర! ఘోరము,హీ శులరయను॥ ఈ॥ భీతిలేక రాముడెక్కు-వెట్టితిగిచిన।సీతనిచ్చి నేనుపెండ్లి-సేతుబ్రియమున॥సీశ॥ ఈక్షితినారాయణాఖ్య-రక్షకుండగు। మోటుగుండ నగర విభుని-సాక్షిగవినుడు॥ ఈ॥

వ. అని జనకమహారాజుసెప్పుచుండ సీతాదికాంత లంతఃపురం బుననుండియాలించి సోరణగండ్లనుండి శ్రీరాముని వీక్షించి సీతకుఁజూపు చుఁ జెలులిట్లనిరి.

క. రాకొమరు లనేకులు నేఁ
డీకార్ముకమెత్తవచ్చి ♦ యిందుండిరిదో
యోకోమలి! వారెవ్వరు
నీకమనీయాంగుఁ బోల ♦ రిదినిజముసుమీ.

ఉ. ఆ నగు మోముసుందరము ♦ నాకరపల్లవకోమలంబు నా
జానువులంటుబాహువుల ♦ చందము నాకనుదోయియందముల్
మానిని కాంచుమా! త్రిదివ ♦ మర్త్యరసాతలలోక వాసులం
దీనవమోహనాంగునకు ♦ సీడగువారొకరైన లేరహా !

చెలి-కీర్తనము, శహానరాగము, రూపకతాళము.

నీకుదగినమగడుగదవే ! నీలవేణిరో ! శ్రీకొమరునియాకారముఁ

జేకొనినా-డోకోమలి॥ నీకుదగిన ॥ మున్ను నోచినట్టినోము, లన్ని చేకూరె నీవు। మున్ను॥ కన్నారగఁ గన్నానదె - వన్నెలచేఁ జిన్నెలచే ॥నీకు॥ పుండరీకనయన మోక్ష-గుండవిభుఁడగు ॥ పుండ ॥ దండిగఁగో। దండంబును ఖండించును-ఖండితముగ॥నీకుదగిన॥

వ. అనిపలికిన సిగ్గువడి జానకిదేవియవతలఁ జని చెలికత్తియలు వినకుండఁ దనమనంబున.

క. మాతండ్రి విల్లువిఱచిన
యాతనికివి నన్నునిచ్చు ♦ నటువలె శపథం
బీతఱివి జేసి యుండెను
సీతవిచేనోనో! కానో! యెటు సేయుఁదగున్.

తే. ఇదివఱకుఁ గొందఱరుదెంచి ♦ యెత్త లేక
పాఱిపోయిరి వారిలోఁ ♦ బాటునీతఁ
డేగునో! లేకమోపెట్టి ♦ యెలమి నన్ను
గొనునో! నాప్రాప్తమెటులౌను ♦ కో! తలంప.

సీత-కీర్తనము, ఆరభిరాగము, ఆదితాళము.

మరునికోపు। మాపురూపు। మరునితూపు। మాపుజూపు॥ మరుని॥ కరిగతులకునోపు । నడకలు । గమలారికిదాపు । వదనము । సరసిజములపసగరములువాపు। గుసులళితతులను । బసువడిలేవు ॥ మరుని ॥ కంబుడంబు, గలకంఠంబు। నంబరంబు। ఆమధ్యంబు। భంబులజెలువంబు॥ గలుగున। ఖంబుల పొంకంబు। మోక్షువు, రంబులోననా । రాయణాకవికివ। రంబులిచ్చు। శ్రీ, రమణునినుతుడగు॥మరు॥

వ. ఇట్లుసీతాదేవి రామసౌందర్యం బుపలక్షించి వర్ణించుచుఁ దండ్రి నుద్దేశించి మనంబున.

తే. కమఠ పృష్ఠకఠోరమీ ♦ కార్ముకంబు
నమిత సుకుమారమూర్తి యీ ♦ యర్కకులుడు
దీనినెక్కిడునటు విధి ♦ యించుటకట

తాత మీరిమపణ మతి ♦ దాసణంబు. వ. అంత.

క. ఈవార్తఁ జెప్పిపంపక
యేవేగులవలనఁ దెలిసి ♦ యెలమిని సీతా
దేవినిగోసమిథిలకుఁదా
రావణుఁడరుఁదెంచి జనక ♦ రాజునకనియెన్.

రావణుని కీర్తనము, జంఝూటి, ఆదితాళము. వాసంతికా—వలె.

నీకన్యకామణినీరా జనక ॥నీకన్య॥ నాకన్నను జగ। దేకవీరులీ లోకముననుగలరే। యొక। లోపములేదిక ॥నీకన్య॥ కులగోత్రంబులు।గుణములురూపము। బలిమియు గలిమియును। గలవరునకునీదగు ॥నీకన్య॥ మోక్షగుండపతి। ముద్దుకొమరునిక। టాక్షముబొందితిని। విను రాక్షస విభుఁడను ॥నీకన్యకా॥

అనిపలికిన రావణాసురునిగాంచి.

జన॥ తోహ. శంకరునిశరా, సనముగలదునూ, సదనంబునదని దాల్చి। కొంకకనీవును-గుణముసారించినఁ। గూతునిత్తునన లేచి॥రామ॥

రావణుని కీర్తనము, ఆదితాళము, మంగళంహరి.

ఏదిరాయోరి! ధను-వేదిరాయోరి ॥యే॥ ఏదిరాచాప। మేమంత్రింతుభూప। నాదుప్రతాప। నై పుణిదోప ॥నేదిరా॥ పట్టనేరనా। మో। పెట్ట బాలనా పట్టికిపట్టి-వందెమ్మగట్టి। పెట్టెలోఁజుట్టి పెట్టితివట్టి ॥ దేదిరా ॥ ఎల్లరాజుల। వలె-నెంచితేబళా। ముల్లనజెల్లు। మోపెట్టఁబెల్లు। పెల్లునవిల్లు గిల్లునుడుల్లు ॥నేదిరా॥ మోక్షపురపతి। గన। నోక్షమాపతి। అక్షీణబలుఁడు। నతివిక్రముఁడు। రాక్షసవరుఁడూ। రక్షోదుచూడు॥ మేది ॥

అని పరాక్రమంబున నాడినమంచిదని విల్లున్నచుందస దెఱచిన నవ్వుచునతండు.

తోహ. ఎడమకరంబుల-నెత్తగనాధను। వేమియు లేవకయున్న।గుడిహస్తంబులఁ-గోరియెత్తదల। పడినను గదలకయున్న ॥రామ॥

దశదిశలు కలయఁజూచి దశవదనంబులఁ గోపంబు జేగురింప

నవుడు గలచుచు.

క. ఇరువది కరములనెత్తఁగ
దొరకొనబరుపై నవతని ♦ దోర్బలమెల్లం
దఱిగి సరివారునవ్వఁగ
వెఱచుచు ధరమీఁద వెల్ల ♦ వెలకిలఁబడియెన్.

వ. ఇట్లు వెలికిలఁబడిన రావణుని యురంబున హరశరాసనంబు వడియె నాభారంబు మస్సహంబయిన లేవలేడయ్యె నప్పుడు.

క. లాలామూత్రస్వేదము
లాలోనేఱులయిపాఱె ♦ నఖ్ఖులుదిరిగెన్
నాలుకలు సాచెనిలపయి
వ్రాలెఁగిరీటములు మేను ♦ వడకఁదొడంగెన్.

వ. ఈయవస్థ గనుంగొని యచ్చట నున్నరాజులు పక్కునవ్వి రదిచూచి జనకధరారమణుం డురుకృపారస పరిపూరితహృదయుండై సభయందున్న రాజన్యులతట్టు చేయిసాచి యిట్లనియె.

జనకుని కీర్తనము, కమాన్, ఆదితాళము.

లేరైరేశూరులు, రారైరేధీరులు॥ లేరై॥వారకనీసభ, వారెల్లను గ, న్నారఁగఁగనుచు। న్నారదేల॥ లేరై రె॥ వింటిక్రిందఁబడి, పీనుతన్నుకొను, చుంటఁగాంచియూర, కుంటరేల॥ లేరయిరే॥ త్రాణలేదువా- స్తవముఁగసీతని। ప్రాణంబులుగా-పాడువారు ॥ లేరయిరే ॥ మోక్షగుండపతి సాక్షిజీవసం రక్షణచేయనుపేక్షయేల॥ లేరయిరే॥

వ. అనియిట్లు రావణునివిషయమై దయాపహాస్యంబులు గనుపట్ట జనకుండాడిన వాక్యంబులువిని.

కం. అక్కుపయినున్న చాపముఁ
జక్కగఁ దొలఁగించిప్రోచు ♦ శక్తినృపులలో
నొక్కరికిని లేదయ్యెను
గ్రక్కున రాముండుకాంచె ♦ గాధితనూజున్.

అప్పుడు శ్రీరామభద్రుని యభీష్టంబెఱింగి విశ్వామిత్రుండు,

విశ్వా-కీర్తన, బేహగ్-ఆదితాళము.

ఇఁక-లెమ్మా! శ్రీరామా! లేచిరమ్మా! నీవిమ్మహాధనువుచే, కొమ్మా,॥ ఇకలెమ్మా॥ లెమ్మా। రమ్మాకొమ్మా । కోదండ॥ మికలెమ్మా॥ అది, వరాహమైయున్ననీవుగోర । వసుం । ధరయెత్తిన మేటివవురా। అరపు- వెరపు మరపు-లేకను॥ నికలెమ్మా॥ ఈ,కార్యమెంతదిరఘురామా! జన,వర్యులుజూడ గుణధామా! శౌర్య- ధైర్య- స్థైర్య- ధుర్యుఁడ॥ వికలెమ్మా॥ తఱికొండవీపున నెత్తలేదా। మోటు- గుండేశ! యెక్కు-పెట్టరాదా। నిండియుండు-బెండు-వంటిది॥ లేలెమ్మా॥

అనియిట్లు గాధేయుం డుత్సాహంబుగల్పించిన రాముండు కట్టాయితుండై.

క. కోదండపాణితనవర
కోదండములక్ష్మణులకుఁ • గొమ్మనియిడితత్
కోదండ మెత్తమునిపతి
కైదండయొసంగనడిచెఁ • గడు చిత్రముగన్॥

ఇట్లుచని దశవదనుని మెదపయిబోదలు నరసురాసుర గరుడోరగాదుల కసాధ్యంబగు ముక్కంటివింటిని రాముండు వామకరంబున సులభంబుగనెత్తినం దద్భారంబు దొలంగుటచే మెల్లన బొరలిలేచి రావణుండు బోడితలలతోఁ దిరిగిచూడక పోవుచు॥

రావ- కీర్తనము, కమాసు; ఆదితాళము.

ఈకన్యయేల । నాకనుకూల । గాకుండుజాలఁ గైకొనఁజాల॥ నీకన్యయేల॥ కావలసియున్న । నీవిల్లుదిన్నఁగావీరలెన్న । గానెత్తలేన॥ యీకన్య॥ మునుమోటుగుండ । ఘనుగోల్పుచుండఁ। గనిరోసి వుడ। మినిపూడ్చినాడ॥ నీకన్య॥

అని వదరుచు రావణుండు యుద్ధేచ్ఛంజనియె నంత.

క. రాముఁడు శంకరధనువును

వామకరంబునను బెండు ♦ వలెదాలిచి సు
త్రామాదిసురలు వొగడఁగ
భూమీశ్వరులరయజనక ♦ భూపతికనియెన్.

రామునికీర్తనము, కన్నడ, ఆదితాళము.

ఇదిగోధనువునరపాల ! చూడుమి॥ యిదిపాత్రదిగద । గుణశీల॥ చూడు॥ ఇదిబహుచులకనగాదా ! నాకిది । యిదినిస్సారంబనరాదా । చూడుని॥ పొగడితినాకడదీని । తెగగొననిలువదు । విరిగిచూడు॥ మోక్షగుండపతినైన । నాకు । లక్ష్యమెదీనినెత్తగలేనా॥ చూ॥

అని నిర్లక్ష్యంబుగఁ బలుకుచు.

సీ. గాధితనూజుని♦కాయరోమాంచంబుతోఁగూడ నెత్తెను♦ దొడరివిల్లు।
నానావనీశ్వరా ♦ ననకంజములతోడ వంచెనత్రుటిఁబుర ♦ వైరివిల్లు।
జనకభూపాలసం♦శయబుద్ధితోఁగూడఁగదిలించెనపుడుశం♦కరునివిల్లు।
జనకకన్యామన♦ స్సంకల్పయుతముగాఁగడువడిలాగె ము♦క్కంటివిల్లు॥

గీ. కార్తవీర్యార్జునుని బలా ♦ ఖర్వగర్వ
నిర్వహణశక్తియుక్త మా ♦ నితకుఠార
భరిత లసదంసతలుఁడైన ♦ పరశురామ
విపులదర్పదయుతముగా ♦ విఱిచెవిల్లు॥

క. కాకుత్స్థుండీరీతిని
బాగ్రికటముగ శరముదొడగి ♦ పటుముష్టినిదా
నాకర్ణాంతము దిగిచినఁ
జీకుపుడకగతిని విల్లు ♦ జెచ్చెఱవిఱిగెన్.

కీర్తనము, కమాసు, రూపకము.

విల్లువిఱిగెఁ బెల్లుపెల్లున॥ మెల్లనరిపు లుల్లంబులు జల్లనభీతిల్లగశివు॥విల్లు॥ అల్లనదశదిక్కులదర, నల్లదిగ్గజములు బెదరి । తల్లడమునబాఱనల్ల। కల్లోలము గావారిధు । లెల్లనుఘూర్ణిల్లగశివు ॥ విల్లు ॥ ధరశివి శ్రీమోక్షగుండ-ధాముఁడు శ్రీరాముఁడు దీ, వరమునఁ దిగియంగ

నురగ। వరులును భూచరులును ఖేచరులునుగడు, వెరగుపడఁగ ॥ విల్లు ॥

తో॥ ౹జనకుఁడు గౌశిక। మునియు రామ ల, క్ష్మణులుదప్ప నం దఱును।మునుకొనియాధ్వని-విని మూర్ఛలలో । మునిగిపడిరితందరను॥ రా॥

వ. ఈప్రకారంబున శ్రీరాముండు ఖండేందు ధరకోదండఖండ నంబొనర్చినఁ గాంచి డెందంబున నానందంబు నొందుచు గాధినందను నకు జనకవసుంధరా పురందరుండిట్లనియె.

జన, కీర్తనము, కాంభోజిరాగము, ఆటతాళము.

ఈ మహనియ్యని। నేమనిపొగడుదు। నోమునికులవర్యా! నామ నోభీష్టమిా-నాటికిఁదీరెను ॥ నీమోహనాంగున కిచ్చెద సీతను ఈధరను మోక్షగుండ-ధామునిమిత్రిని। వరశరాసనమెత్తగ। నరసురాసురవిద్యా। ధరకిన్నరులకైన। దరముగాదీతఁడి-త్తఱిబట్టి విఱిచెను॥నీమహ॥

అని యీప్రకారంబున జనకచక్రవర్తి భూసుతయగు సీతా దేవిని శ్రీరామచంద్రి మహాప్రభువునకిచ్చి వివాహంబు సేయ నిశ్చ యించి పురము సింగారింపుఁడని యాజ్ఞయిచ్చి దశరథ మహారాజును కుటుంబపరివార యుతముగఁ బిలచుకొనిరావలసినదని బుద్ధిశాలురగు మంత్రిలబంపిన వారును బ్రియాణంబై మూఁడుదినంబులకుసాకేతపు రికి జేరిరంతలో నక్కడదశరథుండు తనమంత్రిలతో నిట్లనుచున్నాడు.

దశ-కీర్తనము, రూపకము, హిందూస్థానితోడి, భుజగవలె.

కొడుకులరిగిరి। చాల, తడవునిలిచిరి । గడియయైనఁగాని నన్ను - విడిచియుండరు ॥కొడు॥ ఎన్నఁడుగందు। వార్త నెన్నడు విందు । గన్ను లకును గట్టినటుల। నున్నదియుందు ॥గొడు॥ అరివధచేయ। జేతనైనదో ! లేదో ! గురుతర మోక్ష, గుండవిభుని-కరుణలేదేమో ॥కొడు॥

వ. అక్షీణబలదక్షులగు రాక్షసులను శిక్షించి మునియాగరక్షణ మొనరింపఁ దక్షిణమున రామలక్ష్మణులేగిరి. యొక్కలంపురక్కసులచే జిక్కువడిరో! యెక్కడనున్నారో! యెక్కరివలననైనఁ దెలియదక్కటా!

తోహ॥ అనితనయులురా, నందుకు వగచెదు। నాదశరథ విభు

జేరి। జనకునిమంత్రులు-వినతులగుచు నిట్లనిపలికిరి శ్రీమీారి ॥ రామ॥

మంత్రులకీర్తనము—ఆదితాళము.

రాజాదశరథ-రాజమహారాజ ! ఆజనకాధీశు-నాప్త మంత్రుల మో॥రాజా॥ నీముద్దుతనయులు-రామలక్ష్మణులు । సామోదమునమహాని సవనముగాచినారు ॥రా॥ సాౖపుగనహల్య । శాపముబాపిమిథి। లాపురి జేరి శివు, చాపమువిరిచినారు॥రా॥ తనపుత్రిసీతను-దాశరథికినివ్వ, జనకుఁ డుతలఁచిమ, మ్మనిచెరు మిమ్ముఁబిలువ ॥రా॥ ప్రకటితమోక్షగుండ-పతిని దలంచుచు। సకుటుంబ పరివార సహితముగనురండి॥ రా ॥

సం, తోహ. అనిజనకుఁడు పం, పినవస్తువులను -నర్పించిన దశర థుఁడు। మనమునసలరుచు-మంత్రులనార్యుల-గనిపలికెనుదానపుడు ॥రా॥

దశ-కీర్తనము, ఆదితాళము, రామమంత్రిము.

మీారువింటిరా।సభ। వారుగంటిరా! మీరు జనకరాజమంత్రి-వీరవ రులట॥మీా॥ గాధిపుత్రునిఁ। గూడి కరముమైత్రిని। నాదుసుతులు మిథిల లోను-న్నారట సుఖులై ॥మీా॥ లక్షణాంధుఁడై। సర్వ, సాక్షి రూపుఁడై। మోక్షగుండ దేవుడుగ, టాక్షముంచెరు॥మీా॥

**తోహ.** అలసురాసురుల। కలవిగానిహరు। విలువిరిచెనురాముం డు, చెలఁగి యాతనికి। సీతనిచ్చిపెండ్లి। సేయుఁదలఁచె జనకుండు॥రా॥ మ మ్ము రమ్మనుచు-మంత్రులబంపెను। నెమ్మది మనమందరము । సమ్మో దంబునఁ జనుదము ప్రయా, ణమ్ములు సేయుమస్థిరము ॥రా॥

వ. అనిచెప్పి జనకునిమంత్రులకు బహుమతులిచ్చి పట్టణమలం కరించి బంధువులకు సుభరేఖలంపి వసిష్ఠాదిమునులును భరతశత్రుఘ్ను లును దక్కిన పరిజనులును రాజబంధువులును దోడరాఁ గదలి కరిరథ తురంగంబులమీాద సమస్తవస్తుసంభారంబులు సాగించుకొని ప్రయాణం బై నాలుగు దినములకు మిథిలాపురికిఁ జేరిన నవ్వార్తవిని జనకుండెదు రేగి వసిష్ఠాదిమునులకు నమస్కరించి దశరథుని కుశలంబడిగి బంధువుల సన్మానించి తోడితెచ్చి విడిదికిఁ జేర్చి యిట్లనియె.

జన, కీర్తనము, ఆదితాళము। తంగంమెట్టు-వలె.

సాకేతరాజ । నీకుమారునకు । నాకూతునియ్యఁగను । బూనితి। మీకువార్తనంపితి ॥సాకేత॥ ఈవసిష్ఠాదులు। నేతెంచుటచేత। మావంశము గేహము। జన్మము। పావనమాయెఁగదా ॥సాకేత॥ భూపాలపెండ్లికి । రేపేముహూర్తము। రూపించియున్నారుగా। విబుధులు। లోపములు లేవుగా ॥సాకేత॥ ధారుణిదాళ్వారి। నారాయణాఖ్య, ధారుడె। మోక్షగుండ। ధాముడు। శ్రీరాముడెా నిజము ॥సాకేత॥

క. జనకుఁడు వలికిన వాక్యము
లనువిని దశరథుఁడు గడుఁ జె ♦ లంగుచు దనన
మ్మనమున సంతోషించుచు
వినయముతో సభ్యులెల్ల ♦ వినఁగా ననియెన్.

దశ, కీర్తన, బేహాగ్, ఆటతాళము,

మిథిలాధినాథా! విను। నాదుపలుకులు ॥మి॥ పృథివినినాకుఁ, బ్రియమగు నీసరి। వియ్యమెన్నటికిని జిక్కదు॥ నాదుపల్కులు ॥మి॥ కూర్మి సుమిత్రా, కొడుకు లక్ష్మణునకు। కూర్మిళాదేవినీయుము ॥ నాదుపల్కులు ॥మి॥ అరుదుగ నీసో, దరునికుమార్తెల । భరతశత్రుఘ్నులకీయుము । నాదుపల్కులు ॥మి॥ అక్షయశుభము, లీక్షితినిచ్చు। మోక్షగుండేశుడు మనకును। నాదుపల్కులు ॥మి॥ అనిన.

తో॥ మంచిదిమీాస, మ్మతమే! మాస, మ్మతమని జనకుడు వలుక। నంచితముగ సభ-యందునున్న వా, రనిరి తథాస్తనికడక ॥రామ॥

వ. అంత జనకుండు సని పురాలంకారము మొదలుగాఁగల వివాహయత్నములోనుండె. అప్పుడు విశ్వామిత్రుండు రామలక్ష్మణులఁ దోడ్కొని దశరథునిబసకువచ్చిన నమ్మహీపతి యెదురుగఁజని పూజించి తోడితెచ్చి కనకపీఠంబుపైఁ వసియింపంజేసిన దీవించి మౌని యిట్లనియె.

విశ్వా - కీర్తనము, రూపకము.

మంగళమగు। మంగళమగు। మంగళమగు రాజా! పొంగుచు నీవు।

ష్టార్థము । బొందెదవిన తేజ !॥ మంగళ॥ నీకొమరులు-నా కార్యము-నెరవేర్చిరిరాజా! యేకొఱతలు లేకుండిరి-నాకడమహారాజా!॥మంగళ॥ కొమరుల గై, కొని శుభములు- వడయుముమహారాజా! కడువడిమోక్షుగుండేశుని కరుణను మహారాజా ॥మంగళ॥

సం-తోషా. అని తెలిపెడుతఱిఁ-దనతనయులు మ్రొక్కిన ముదమునదీవించి। ఘనముగకౌఁగిటఁ, దనిపి దశరథుం, డనియెను మానిని గాంచి ॥రామ॥

దశ, కీర్తనము, ఆదితాళము, శంకరాభరణము.

తాపసేంద్ర! దయారసము-దోపమిూరుచూడఁగ । నాపుత్రులకెన్నటికి-లోపములుండవుగా ॥ తాప ॥ మిూసేవచేయుట చేత-మేటిగుణము లందును। భాసురముగబ్రవీణులై । పరగిరవీరెందును ॥తాప॥ దీక్షనారాయణకవిని। రక్షింపుచునుండెను। మోక్షగుండవిభునకును। మ్రొక్కికొలుచునుండెను ॥తాప॥

వ. ఇట్లు ప్రశంసింపుచున్న తఱి శతానందుండు దశరథమహారాజుగారి దర్శనార్థమైవచ్చిన వారికిఁదగన మర్యాదసలిపి పీఠంబొసంగి కూరుచుండఁజేసి పూజించి ప్రస్తావవశంబున దశరథుండిట్లనియడిగె.

క. జనకునకుఁ బురోహితుఁడవు
ఘనుఁడవహాల్యాత్మజుఁడవు ♦ గావునసర్వం
బునువేద్యంబగు నీకును
వినిపింపఁగఁదగును సీత ♦ వృత్తాంతంబుళ్.

వ. ఈసీత జనకభూపతి యారస పుత్రికయా! లేక దత్తపుత్రికయా! యటులయిన నామెనుగనిన తలిదండ్రులెవరు వివరింపవేముని వరా! యని వేఁడిన శతానందుండు.

శతా-కీర్తనము, త్రిశ్రజాతి.

విన్నవించెద। వినుమవీనులలర ॥విన్న॥ నన్నుదెలుపుమని-యన్న జనక సుతపూర్వచరిత ॥ విన్న ॥ మునుపద్మాక్షుఁడను, జనపాలుఁడొక్క-

రు। డెనలేకదనరాజ్య। మేలుచు నుండెను ॥విన్న॥ తనయగలక్ష్మిని, గని సాకగాఁగోరి। ఘనమైనతపమును-గావించెనారాజు ॥విన్న॥ ఆమెప్రత్యక్షమై । యారాజవర్యుని । కామితమెఱింగి-గ్రక్కునఁబలికెను ॥విన్న॥ నేనస్వతంత్రిను, గానమోక్షగుండ। శ్రీనాథువేఁడుము । భూనాథ యుం మొఱగె ॥విన్న॥

వ. అంతనాభూకాంతుండు శ్రీకాంతుని బహుకాలం బారాధించిన నతండు ప్రత్యక్షంబయి.

విష్ణు-తోహర. ఏమిగోరితప-మిపుడొనరించెద । విస్తార్థమువివరింపు। భూమీపాలక ! ప్రేమనిత్తునిఁక-బొసఁగఁదపముఁ జాలింపు ॥రామ॥

అని నుడివిన సద్భక్తిపూర్వకంబుగా మ్రొక్కి పద్మాక్షుండు.

పద్మా-కీర్తనము, ఏకతాళము, కంజలోచనా । వలె.

ఓన్నమోనారాయణాయ-యోగివిధేయ ! సన్నుతింప నెంతవాడ-సజ్జనధ్యేయ॥ఓన్నమో॥ కన్నియగలక్ష్మినేఁ-గాంచిసాకంగ। నున్నది కోరికయటు। లొసగవేవేగ ॥యో॥ సంతసింతు మోక్షగుండ । స్వామి ! యీవయ్య। యింతకంటె నెందుకాంక్ష-యేమిలేదయ్య ॥యోన్నమో॥

అని యడిగిన సంతుష్టుండై.

సం॥ తో॥ శ్రీతరుణీపతి-క్షితివిభునకునొక । మాతులుంగఫలమిచ్చి। యాతరుణంబున-నంతర్ధానుం-డైనఫలముగొని తెచ్చి॥రామా॥ కాంచిననందొక కాంచనాంగియగు-కన్నియయుండిన నలరి । పెంచుచునుండెను బ్రీతిపద్మయని। పేరిడిపిలుచుచుమీఱి॥ రామా॥

వ. గారాబంబునఁ బెంచుచు నంకతలంబుపయిఁ గూర్చుండఁబెట్టుకొని ముద్దాడుచు నుండఁగాఁ గొంతకాలంబునకు బాల్యంబు గడచిన నెమ్మనంబున.

పద్మా-కీర్తనము, కన్నడ-అటతాళము.

కన్యకేడగు। కాంతుడెవ్వాడోయీ॥క॥ ధన్యుడై పట్టిరా । జన్యుఁడెందున్నాడో॥క॥ రూపవయోగుణా। లావలక్షణముల । లోపములులేక

లోకములోమన॥కన్యకీ॥ నరులలోపలవిద్యా। ధరులలోబన్న౯। వరులలో మరియుఖే। చరులలోగాంచిన॥ క॥ మోక్షగుండపభు। వక్షయకృపాక। టాక్షముచేనిచ్చి। నట్టినానెయ్యంపు॥కన్యకీ॥

వ. అనియోచించి యనంతరంబ స్వయంవరంబు చాటించినప్పుడు.

చ. నరులునుఖేచరుల్ సురలు ♦ నాగులు యక్షులు సిద్ధచారణుల్
గరుడులు రావణాద్యసుర ♦ కాంతులుమానులు వార్ధులుఁ గిరుల్
దరువులు కామరూపములు ♦ దాల్చి మహావిభవంబుతో స్వయం
వరమును జూచుకోరికను ♦ వచ్చిరి తన్నగరంబుఁ జేరఁగ౯.

వ. ఇట్లు వచ్చిన వారలందఱువిన.

తే. రహినినాకాశ నీలవ ♦ ర్ణంబురీతి
నెవనితనుకాంతి వెలయునో! ♦ యవనినతని
కీశుభాంగినినిచ్చి నే ♦ నిపుడుపెండ్లి
చేయఁబూనితి ననిపల్కె ♦ క్షితివిభుండు.

పద్మాక్షుని వాక్యంబునకందఱు కుపితులై యిట్లనుకొనిరి.

రాజులకీర్తనము, కన్నడ,రూపకము.

బలుమోసకాడుగాడె॥ యీతడుబలు॥ కడు, నాసకొల్పి మనల ను రా-జేసియిటుల భా, షించెను॥ బలుమోస॥ ఈ, కన్నెచక్కదనము యే, కన్నెలందుగనము। చే, కొన్నవానిభాగ్య। మది-యెన్నవలవిగా, కుం డును॥బలుమో॥ ఆ, చందమైనరూపు। మన, యందునెవరికొదవు। భువి యందుమోక్షగుండ, విభు నందునుండఁ-గాఁజెల్లును॥ బలుమో॥

వ. స్వయంవరమని పిలిపించి వంచించి యెందునులేని యొద్దను బన్నియున్నవాఁ డిన్నరాధముని కదనంబునవధియించి యీకన్నియను గైకొందమని యెంచి యందఱును యుద్ధాభిముఖులయిన నెఱింగి పద్మాక్షుండు.

తోహర॥ వారలనెల్లను - వాడిశరంబుల - వైచుచుబోరాడగ ను। శూరులుగాకను-సురలు మానవులు-స్రుక్కియువలఁజనగాను॥రా॥

పద్మాక్షుండు విజృంభించి తఱుముచుండిన సహింపక దానవులు మాత్రము వెనుదీయక పోరాడి.

మ త్త కో కి ల.

అక్షయంబుగ బాణముల్గొని ♦ యాతనిన్ వడివైచి రూ
క్షేక్షణంబులఁ జూచుచుండగ ♦ నేపుమాపినసుక్కి ప
ద్మాక్షుఁడాహవభూమిఁగూలిన ♦ సందడుల్ జెలిఁగ్రైకొనన్
ఆక్షణంబున రాఁగదాఁచెను ♦ నామె దేహము వహ్నిలోన్.

వ. ఇట్లగ్నియందుదాఁగి కనఁబడకుండినవాకన్నియను వెదకివేసరి యాపురంబంతయుఁగాల్చి శ్మశానతుల్యంబుఁజేసి యందఱు యథేచ్ఛం జనిరి. లక్ష్మీకామతత్పరుండై పద్మాక్షుండిట్టి దశననుభవించె.

క. వరియింపరు లక్ష్మిని ధీ
వరులెన్నఁడు నెమ్మనమున ♦ భయశోకంబుల్
మరణముఁ జిత్తచలనమును
సిరిఁబొందినవారికెపుడుఁ ♦ జేకురుననుచున్.

వ. అంత నతనిపత్నులు వేయిమంది సహగమనంబొనర్చిరి. పిమ్మట బహుకాలంబునకు దశకంఠుండు విమానారూఢుండై దిగ్విజయార్థంబరుగు వాఁడామార్గంబునవచ్చిన.

తోహ॥ అనలకుండబాహ్యప్రదేశమున । నాపద్మ చరింపగను। గనిసారణుడా, కన్యనుదశకం। ఠునకటుజూపఁగఁగనెను॥ రా॥

ఇట్లు గాంచి యతఁడు మోహంబుచే విమానంబు గ్రిందికి బఱపుచు.

రావ-కీర్తనము, అటతాళము-పూరికళ్యాణి.

ఉండుండవె! యోచెలి!॥ యుం॥ దండిమగండబ్రబ్బ, లుండదయనిఁడారగ॥ నుం॥ లోకులనేకులు। నీకొరకై కద! యాకడ జీకాకుగ। దాకిమునుపేకూలిరి॥ యుండు॥ అప్పుడుదప్పిన। నిప్పుడుదప్పనె। యొప్పులకుప్పముద మొప్పననుమెప్పజేయు॥ ముం॥ రాక్షసరాజును। రావణ।నాముడ।

నీక్షితిమోక్షగుండా-ధ్యక్షువరసాక్షియగు॥ సుం॥

వ. అని పలుకుచు డాయంజనిన యామెతిరిగి యగ్నిగుండంబు నం బ్రవేశించినఁ గోపించి.

రా॥ తోహార॥ బహుమందినిమును । బాధించెనుదా। దహనుని లోపలఁజేరి । యహాహా ! యిప్పుడు- నటులనజేసెను । సతివకడు చమత్కారి॥ రామ॥

అయిన నీరహస్యంబుఁ దెలిసితిగదా! యిఁకను సాధించెదనని యెంచి.

సీ. అంతటరావణుం♦ డాయగ్నిగుండంబు చల్లార్చిచూచిన ♦ సరగనందు
బంచరత్నంబులే♦ ర్పడఁగనుపట్టిన నవిపెట్టెలోఁదాఁచి♦యదివిమాన
ముననుంచుకొనిపుర♦మున కేగుదెంచి తత్పేటిక దేవమం♦దిరమునందు
నునిచియారాత్రిమం ♦ దోదరితోనని భామిని నేరత్న ♦ పంచకంబు
తే. నీకునై తెచ్చి దేవమం ♦ దిరమునందు
బెట్టినానన నామెయా ♦ పెట్టెకడకుఁ
జేరియెత్తంగఁజాలక ♦ సిగ్గునొంది
భర్తతోఁదెల్ప నద్భుత ♦ పడుచు నతఁడు.

వ. ఆమందిరంబునకుఁ జని.

సం-తో॥ కదిలించిననది-కదలకయుండినఁ-గడురోషముపెనగొన్న। యెదమెచ్చుచునిరు-వదికరములతో నెత్తినలేనకయున్న॥ రా॥

వ. అతండు మహాపరాక్రమంబునలాగి మూఁతదీసిన నందుఁ గోటిసూర్యప్రభావిరాజమానయై కన్నుల మిరుమిట్లు గొలుపుచున్న కన్నియయున్నఁ గన్నులారఁగని మందోదరి.

మందో-కీర్తనము, బిలహరి-రూపకము, ఘోరసా-పలె.

ఏమియీావిధము। నామనంబు-లోసంశయమగు॥ నేమి ॥ స్వామి రత్నము। లేమిలేవిట। యీామెయెవ్వారగు॥ నేమి॥ మేలుమేలగు। బాలికా మణి। నేలదెచ్చితి। వేళనెచ్చట। లీలగన్పడెఁ। జాలదెల్పుము। జాలమేటికి॥

యేల॥ కూరిమిమోక్ష-గుండశ్రీహరి। నారిగాబోలు। వేరువారింత । భారి మాదు రే! తేరిచూడఁగ। నేరరెవ్వారును॥ యేలయీ॥

వ. అని యడిగిన రావణుండు పద్మాక్షభూపాల కులసంభూత యగు నీమెకొలకుఁ బూర్వంబు తాముపడిన పాట్లన్నియు నగ్నికుండం బునఁ దాఁగిన నామెనుదాఁ దెచ్చినవిధంబును దెలిపిన విని మందోదరి యదరిపడి.

మం-తో॥ స్వకులధ్వంసము, నకునీమెనులం,కకుఁదెచ్చితివగు నేడు। అకటా! ఇదిబా, లికయనియెంచకు। మాదిశక్తియగుజూడు॥ రా॥ నీవం శంబును, నీరుజేయునిక-గావుననిటునిల్పకుము । రావణవనముల-లోవిడి పించిన బోవునచట సత్యమ్ము॥ రా॥

మం-కీర్తనము, హిం, కాఫిరాగము-రూపకతాళము-ననుమారు-వలె.

మరు, మాటతెలుపవలదు వినుము, మానవాశనా! పేటికయం దీమెనుంచి-పేర్మితోడను। నొక, చోటభూమి త్రవ్వియందు, మాటదగు ను॥మరు॥ వరగృహస్థుడయ్యువిషయ-వాంఛదవులక। ధర। బరగురాజయో గియింట-బెరుగుముందిక॥ మరు ॥ సర్వమునుమోక్షగుండ, స్వామిమయ ముగ। గను। నిర్వికారు గీమునందు-నిలుచునింపుగ॥ మరుమా॥

వ. ఎంతమాత్రమీ సమయమందిచ్చట నుంచవలదని నొక్కి-వక్కాణించిన భయకంపితగాత్రుండయి రావణుండు.

తో॥ మందసయందా-సుందరినుంచి వి-మానముపయినుంచుకొని। యెందైననుధర । యందుబూడ్చిరం-డిప్పుడెయని చెప్పవిని॥ రా॥

వ. రాక్షసభటులు సిద్ధపడుచుండ నప్పుడు సర్వులువిన నాకస్వ యిట్లనియె.

సీ. ఈసారిలంకకు♦ నేతెంచిరావణుఁ బుత్రమిత్రులతోడ♦ బొలియఁగూల్తు
మూడవసారినే♦ ర్పునవచ్చి పౌలస్త్యకు శతకంఠ రావణు♦సంహరింతు
నాల్గవసారిమా♦నకవచ్చిమూలకాసురుఁడను ఘటకర్ణ♦ సుతునిగూల్తు
ననిచెప్పనాలించి♦యసురులెల్లనుమృతప్రాయులై రంతట♦ రావణుండు

గీ. భయమునొందియు నదియులో ♦ పలనడంచి
దీనినిప్పుడె పట్టెవ ♦ ధింతుననుచు
ఖడ్గముధరించి పైకిపో ♦ గ్రమునఁబోవ
నడ్డమైనిల్చి మయకన్య ♦ యనియెనిట్లు.

మందో-కీర్తన, ఆదితాళము, నీతితో-వలె.

చాలునీకింతమూర్ఖ-మేలగలిగె రావణా!॥ చాలు॥ బాలికామణిని చంప, బోలునె! యోరావణా॥ చాలు ॥ ఎన్నఁడో! వచ్చియిచట-నిన్ను ద్రుంతుననుచు। నన్నమాటలకులికి-యబలద్రుంతుననుచు। నున్నవాడ వెంతవెఱ్ఱి-యుక్తిదోచె బెను చు॥ చాలునీ ॥ ముందువచ్చె మరణమిపుడె యెందుకుఁగోరెదవు। మందబుద్ధిపెంపుజేసి-మంచిత్రోవగానవు । పొందు గాఁరి మోటుగుండ। నుందిరుని నెఱుఁగవు॥ చాలునీ॥

వ. నీకుమృత్యుప్రాయమైయవతరించినదినిజమైన నిప్పుడేచంపిన నేమిచేయఁగలవు. కాలాంతరమందలి గతియోచింత మింతటితోనీయిం తిని బరిత్యజింపుమనియన్న విని మిన్నకుండెనంత రాక్షసభటులు.

మ. మానినియున్న పేటిక వి ♦ మానమునందిడి సత్వరన్నభో
యానముతోగమించి మిధి ♦ లాధిపు దేశమునందునొక్కచో
దానిని బాతిపెట్టిచని ♦ దానవనేతకు విన్నవింపఁగాఁ
దానలరారుచుండెఁ గ్రమ ♦ తక్ జిరకాలము దాటెనంతటన్.

క. ఒకసూర్యగ్రహణమునాఁ
డకుటిలమతితో విదేహుఁ ♦ డాభూమినిదా
నొకవిప్రోత్తమునకునా
ర్థకముగ దానంబుసేయుఁ ♦ దద్విజుఁడంతన్.

వ. బహుకాలంబు పరిశీలించి యొక్క చక్కని ముహూర్తంబు నాఁడు దున్నమనియొక్క శూద్రుని నియమించిననతండు.

సం-తోహా ॥ నాగలిచేను-న్న గను హలాగ్రము-తాటిమందసము లేవ। వేగమెశూద్రుడు_విప్రుని చెంతకు-నేగిమ్రొక్కి-భూదేవ॥ ఎంచగనీవు

వ, చించిన లగ్నము, మంచిది యగునేమనిన। మించిధనముగను, పించె సీదికొను-మంచుమొసగ మోదమున॥ రామ॥

వ. ఆపెట్టె యెత్తించుకొని జనకమహారాజు సభకుఁజేరబోవు ద్విజుండు.

విప్ర-జనక, సంవాదము, కీర్తనము.ఆదితాళము.

వి-భూమీపాలవరా! ప్రేమునునా మనవివినదగు॥ భూ॥
రా-భూమీదేవవరా! ధీమతితోఁ దెలుపఁగదగునది॥ భూ॥
వి-తామొసంగిన। భూమిదున్నఁగ। నేమొకాని। యిదియొకటలవడె॥ భూ॥
రా-ఏమియున్నను। నేమికర్తలు। స్వామితామే, సంశయమేటికి॥ భూ॥
వి-క్షోణియేకద! దానమిడితివి। యీనిధాన। మిడియుండితివే॥ భూ॥
రా-దానమిచ్చిన ధరణియుండిన। దానినేను। దగఁగైకొందునె। భూ॥
వి-ఈక్షితికి రా, జేంద్రులే! యా। ధ్యక్షులౌను। రంతటికివిను॥ భూ॥
రా-మోక్షగుండా, ధ్యక్షులిపుడ। సాక్షిగను। సర్వముతమదే॥ భూ॥

వ. అని విప్రరాజన్యులు వివాదపడుచుండ సభవారిట్లనిరి.

తోహర॥ వలనువలదుసం-వాదమేటికి। వాకిలిదీసిచూయుగనిన। నెల మిపెట్టెలో, నేమియున్నదో! తెలియుదమందరమనిన॥ రా॥

వ. మంచిదని భటులచేత మూతఁదీయింప నంతమేఘవినిర్గత విద్యుల్లతికయుంబోలె బాలికామణి వెడలివచ్చిన నాశ్చర్యకలితులై సభాసదులిట్లనిరి.

క. తనతంత్రియైనసాగరు
గనవచ్చిన లక్ష్మిబోలెఁ ♦ గన్యామణి చ
య్యనఁదమ గేహముఁచేరెను
మనుపందగుఁ గూఁతుఁగాఁగ ♦ మనుజాధీశా.

వ, అని పలికిన సభ్యులపలుకులకలరి యిలాపతి యందుకియ్యకొనియె. ద్విజుండును బాలామణిని జనక భూపాలున కర్పించి నిజగృహంబునకు జనియెనంత.

సం-తో॥ ఆడిరిగుణులై-యచ్చరబోటులు-పాడిరి గంధర్వులును। కూడిదేవతలు-కుసుమవర్షములు, గురిపించిరియచ్చటను॥ రా॥

వ. మాతులుంగఫల సముద్భూతగావునమాతులుంగి యనియు నగ్నికుండంబునవసియించినదిగావుననగ్నిగర్భయనియు, రత్నాంతరవాసి యగుట వలన రత్నావతి యనియు, ధరణినుండి వచ్చుటచే ధరణిజ యనియు, జనకునిచేఁ బెంపఁబడుటచే జానకియనియు, సీతాగ్రమునకు దవ్వులుకొని వెడలుటచే సీతయనియుఁ, బ్రహ్మక్షత్రపాలకుల జాతయగుటచేఁ బ్రహ్మయనియు, ననంత సార్థక నామంబులచే నామెను జనులు పిలుచుచుండ జనకుండు సునీలయను భార్యతోఁగూడి గారాబంబున సాకుచుండ.

క. బాలక్రీడలొనర్చుచు
శూలిశరాసనమునెత్తి ♦ చులకగ నీడ్వన్
బాలిక బలమును గనిభూ
పాలుడు విస్మయమునొంది ♦ భావములోనన్.

వ. ఈకోదండంబెత్తుట కసాధ్యంబగు నీమె మనుష్యరూపంబున నవతరించిన పరాశక్తియై యుండవచ్చునహాహా! నాప్రాప్తంబుమంచిది యీహర శరాసనంబెత్తి యెక్కువెట్టిన వాఁడు గాని యీయామెనుజెట్టబట్ట నర్హుండు కాడనియెంచి యదియొక శపథంబుఁ బూనియుండె.

శతా-కీర్తనము, కల్యాణిరాగము, ఆదితాళము, మనవినివలె.

దశధరభూమిరమణా! మహాప్రభో॥దశరథ॥ యశము రంజిలగ-నామెయుస్సుషమై। యలరారెనునీకు। మహాప్రభో ॥దశ॥ ఘనుడురా మూడా। కాశనీలనిభ, తనువువిరిచెవిల్లు। మహాప్రభో ॥దశ॥ పద్మాక్షు ధరా-పాలునిసంకల్పము నేటికిదీరె ॥మహాప్ర॥దశ॥ నలుగురు కోడం, డ్రమగై కొంటివి-వెలశెథవత్కులము ॥మహా॥దశ॥ భవదగ్రసుతుండవని మోక్షపుర। ధవుఁడగు రాముండు ॥మహాప్ర॥దశ

శతా-తో. తమరడిగినసీ-తావృత్తాంతము, దాపకదెలిపితినేను,

విమలచిత్తమున-వింటిరి పెండిలి-సమయమయ్యెబోయెదను ॥రామ॥

వ. మీరువివాహమందిరమునకు దయచేయుండని చెప్పి శతానందుండుపోయె. నిక్కడ జనకుండు వివాహమునకు సమస్తము సిద్ధముసేయించి వధూవరులను గైసేయుండని యాజ్ఞాపించినఁ గాంతలుసని రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను, సీత, యూర్మిళ, మాండవి శ్రుతకీర్తులను, వేఱువేఱ నలంకరింపఁ బ్రయత్నించి.

మధురగతి రగడ. పల్లవి॥ సీతారాములను। గై। చేసిరివేడుకను.
పెండ్లికుమారుల, బ్రియమునఁగొందఱు। పెండ్లికూతులను, బ్రేమనుగొందఱు ముత్తయిదువులటు-ముదమునఁబిల్వఁగఁ। జిత్తరుచపికెకుఁ - చేరిరి చెల్వగ। బీటలమీఁదను, బెంపుగనుంచియుఁ। బాటలుబాడుచుఁ, బసువముగాంచియు సంపెగనూనెను, సరగునబూయుచు, సొంపుగనలుగుల, శోభిలఁజేయుచు నలువొందఁగస్నా-నము గావించిరి। చెలువుగఁదడియార్చిరి మోదించిరి వన్నెగలుగు దువ్వలువలగట్టిరి। కన్నులసొగసుగఁ-గాటుకఁబెట్టిరి ముద్దులమోముల-ముదితలుగూర్మిని। దిద్దిరికస్తురి, తిలకముఁబేర్మిని బరిమళగంధము-బాగుగపూసిరి। పరువడి వరధూ, పంబులు వేసిరి। సురుచిరసుమముల-సొంపుఘటించిరి। వరకంచుకముల, వారకమించిరి। నవరత్నాభర, ణంబులు దాల్చిరి। ననసీరజసమనయనలు గొల్చిరి॥ మకరికలప్పుడు-మమతనువ్రాసిరి। ప్రకటితముగఁద, ప్పకగైసేసిరి। అంతటజనకుండం, దఱుఁజూడను। సంతోషంబున, సభ్యులతోడను। మంగళకరహిత-మహితనాదములు। పొంగుచుమ్రోయఁగఁ, బొలఁతిమొత్తములు। సేసలుచల్లఁగఁ-జెలఁగుమనములను। వాసిమీఱఁగను-వరపురజనమును। వారకచేసి వి, వాహమందిరము। వారలఁదోడ్కొనివచ్చి సుందరము। మీఱఁగఁజేర్చియు, మేయువిభవముగఁ। దీనగలగ్నముఁ-దెలిసివిభవముగ॥



# సీతాకళ్యాణఘట్టము.

కీర్తనము, కళ్యాణి, అటతాళము.

కళ్యాణమొనరించె। కన్యకామణులకు । కళ్యాణరాగనం । కలితు డై నృపుడు। బాల్యమునురూపంబు దేజమును। సుగుణమునుగనికా। సల్య తనయుడె! పాత్రుడనుచును। యెంచి, మించి, సాకల్యముగ రామునకు సీతను। గరుణతోడనుధారవోసి॥కళ్యాణ॥

ఊర్మిళాకన్యను। నుల్లములోపల। నర్మిలితోడుత। నాలక్ష్మణునకు గూర్మితోమాండవిని భరతునకు। శ్రుతకీర్తినెంతో । పేర్మితోశత్రుఘ్న ధీరునకు। మెచ్చి, యిచ్చి, కడు। నిర్మలుండగు జనకభూపతి। నిండునేర్కు తో ధారవోసి॥కళ్యాణ॥

ధరనునారాయణ-దాససన్నుతుడైన। వరమోంకుగుండని । వాసు చ్యుతుడు।సరగదమ్ములుఁదానుఁబ్రీతిగను। సీతాదికాంతల। కరుతమంగళ సూత్రములుదగను । గట్టి, పట్టి, స-త్వరితముగఁదలబ్రాలు వోయగ । వరుసగాజనులెల్ల నరయగ॥గళ్యాణ॥

సంధితోహార॥ బంధువులందరు-బరమానందము- వొందగబంచా మాములు। విందులోనర్చుచు।వేడుకతోగా, వించెను। గళ్యాణములు॥రా॥

'తటుకునవిప్రో - త్తములకుఁగోరిన యటులనిచ్చె బహుమతులు। నటుపిమ్మటఁగ న్యావరులకుఁదా। నరణమిచ్చిసత్కృతులు ॥రా॥

గావించినవారు గదలి యయోధ్యకుఁ । బోవ నిర్నిమిత్తమున । దోవమధ్యమున దుర్నిమిత్తములుఁ। దోచిననృపతిభయమున ॥రా॥

వ॥ వడవడవడంకుచు వసిష్ఠమహామునింజేరి ప్రాంజలిబద్ధుండ యి యిట్లనియె.

దశ, కీర్తనము, ఆదితాళము, హిం, కాపి, శ్రీపతిమెంతటి.

ఈవిపరీతము। లేలదోచెను। సామి ! ॥యి॥ భావుకకార్యములు।

వడసియుత్సాహమున। బోవనుత్పాతము । లావహిల్లెనుగటా ! ॥ యీ ॥ గాలియత్యంతముగ । బాళివీవగబూనె । ధూళిసూర్యునికాంతి - గలగ మ్మెనుగటా॥యీ॥ ధరణినిమోక్షగుండ । వరుకృపరాదాయె । గరితురగాదులకు। వెరపుగలిగెఁగటా॥యీవిపరీతము॥

వ॥ అని యడలున నడిగిన దశరథునకు వశిష్ఠముని యిట్లనియె.

వశి, తోహార.

అదరకుముందుము। హాభయమొక్కటి । యీావరించిత్వరలోను । అదితొలగుసునా। పిదపనయోధ్యకు-నరుగవచ్చుమేలగును ॥రా॥

వ॥ అని చెప్పనంతలో.

సీ. తండ్రిమహాజ్ఞనుఁదలమోచితనతల్లికంఠంబుదునిమెనే♦ఘనుఁడుతొల్లి
పితృవిరోధిని గార్త♦వీర్యార్జునుని బట్టిప్రాణముల్ దీసెనే♦బల్లిదుండు
ఇరువదియొకమాఱు♦దిరిగినిర్బాహుజముఁగఁజేసెనుర్వినే♦సుగుణశాలి
కశ్యపునకునిచ్చి♦కాశ్యపియనునామమొసగె నీధరకునే♦యసమశూరు
గీ. డట్టి వీరవరుండు ను ♦ హాబలుండు
పరశురాముఁడు దివ్యచా ♦ పంబు కేలఁ
గ్రాల శ్రీరామచంద్ర భూ ♦ పాలమౌళి
మ్రోల నిలిచె జగజ్జాల ♦ ములుఁవడంక.

వ. ఇట్లు కట్టెదుటనిలిచిన పరశురామునిం గని శ్రీరాముండు గరంబులుముకుళించి నమస్కరించిన నతండిట్లనియె.

పర, తోహార॥ మొక్కిన విడుతునె, మునురాజన్యుల-బెక్కండ్రను గూల్చితిని । జిక్కితివికనని । నేయుమునిన్నును । జక్కాడెద నే ధృతిని ॥ రా ॥

వ. అనిన నవ్వుచు శ్రీరాముండిట్లనియె.

రాముని మత్తకోకిల.

ధారుణీతలమెల్లఁ గశ్యప ♦ తాపసేంద్రునకిచ్చి వి
స్తారశాంతుఁడవై తపంబును ♦ సల్పుచుండుటచే నమ

స్కారముర్హుడఁవంచు జేసితి ♦ గాని నీకుభయంబునర్గ
జేరిమొ్రిక్కినవాఁడఁగాను హ ♦ సింపనేటికి భూసురా.

వ. అనిన రోషించి పరశురాముండిట్లనియె.

పర, కీర్తనము, రూపకతాళము, కన్నడరాగము.

ఆహా నేతాపసుండ, నాదునేసుమా! శ్రీరామ!॥ యాహా॥ ఆహవముననహస్రి, బాహార్జునముఖ్యనృపుల, మోహరించి చంపినట్టి, సాహసుండునాదుగాక ॥యాహా॥ రాముండనగనేరిల, రాజిల్లగనీవింకొక రాముడనని వచ్చినావు, రాజపునినుబోనిత్తునె ॥యాహా॥ ముల్లోకవిభుడు శివుడు, మోక్షగుండ నేతనాకు। విల్లువిద్య గరపెనతని విల్లుద్రుంచి తటయోర్తునే ॥యాహా॥

వ. అందునకు శ్రీమదాౄమభద్రుౄండిట్లనుచున్నాఁడు.

రా, కీర్తనము, హిందుస్తానికాపి, ఆదితాళము.

నెమ్మదిగ వినుభార్గవా ॥నె॥ ఇమ్మహినాభుజాసత్వ మిట్టిదనికానవు ॥నెమ్మ॥ నేనువినోదముగ లాగ, గానె విఱిగె నాకర్ణాంత, మూని తీయునంతకలదె, యుగ్రినికోదండము ॥ నెమ్మదిగ ॥ గోవులవిప్రుల జంప, గోరరర్క వంశజులు, నీవెగ్గులెన్నియాడిన, నీకెచెల్లె నిన్నింప ॥ నెమ్మ॥ సదయుడౌ మోక్షగుండేశు, సాక్షినాకుత్తుకయిది, యదియెనీగొడ్డలి యుచిత, మైనరీతి జేయుము ॥నెమ్మదిగ॥

వ. అనువాక్యంబులకు నత్యంత కుపితస్వాతుండయి జామదగ్ని యిట్లనియె.

గీ. నీవు క్షత్రియుఁడవు ♦ నేను విప్రుఁడనను
గర్వమున్నదటులఁ ♦ గాంచఁబోకు
నాపరాక్రమంబు ♦ నాభుజాశక్తియు
నీకుఁజూపువాఁడ ♦ నిశ్చయముగ. వ. అనిపలికె.

పర-కీర్తనము, ఆదితాళము, పోపొమ్మ.

పోనివ్వఁబోనివ్వరాఘువ! నిన్ను॥ బోని ॥ పూనికతో నిన్ను బట్టి,

పొంగడంగ జేయకనే॥ బోని ॥ సారహీనమైనవిల్లు, బూరిపుడకరీతి విఱిచి, వీరుఁడనుచువిఱ్ఱ, వీగుచునే తెంచెదవు! వైరులకుగాలమన, వచ్చునునావిల్లుసూడు॥ బోని ॥ భీమబలుడవయిన నెక్కు, వెట్టుదీని లేకయున్న శ్రీమోక్షగుండశ్రీరఘు, రాముడనియెన్న నిన్ను, నామందరనీసామర్థ్య, మేమి పనికివచ్చునింక॥ బో॥

వ. జనకునియింటనీవు విఱిచినవిల్లును నేధరించినవిల్లును విశ్వకర్మ యేకకాలమందు నిర్మించియున్నాఁడందొక్కటి త్రిపురాసురహరణ కాలంబునందు హరునకు సురులచే నియ్యఁబడియె. దానిచేఁ ద్రిపుర సంహారణంబొనర్చి తనశక్తిని ఈశ్వరుండు వొగడుకొనుచున్న విష్ణుండు శరాకృతిచే సహాయపడ శివుండు జయించెనని దేవతలాడిరది ప్రముఖులవల్లవిని శివుండుకోపించి హరిని యుద్ధంబునకు రమ్మన రెండవ కాండాసనంబు హరికినిచ్చి దేవతలు పురికొలుప హరిహరులకుఁబోరు ఘోరంబయ్యె. నప్పుడు హరికరనిర్ముక్తశరంబు దాఁకుటచే హరునివిల్లునొచ్చి పెట్టిన శివునిబలంబులోపడియె. నదిగని దేవేంద్రాదు లుభయులను ప్రార్థించి యుద్ధంబుమాన్పిరి. శంకరుఁడు తనధనస్సు దేవరాతునకిచ్చుటచే నది జనకునింటనిలిచె. విష్ణువు తనకోదండంబు రుచికునకునిచ్చిన నతండు జమదగ్ని కొసంగె. అతండు నాకొసంగె. మొదటఁగ్రోటభారి వేత్రునకు నోటువడి పెట్టి పేటికయందు మాటియున్న భూతపతి చాపంబుగాదు. పెటక్కునవిఱువను. నాచేతనున్నది వైష్ణవచాపంబు. దీనిబలంబు నీవెఱుంగవు. మంచిది దీనినెత్తి గుణముసారించిన నీవు మొనగాఁడవని యెంచెద లేనిచో నసదవని తలంచెద నిన్ను వధించెద ననిన,

సం-తో॥ ఇవ్విధమునననత, చెదిరిపలుకరాము। డవ్విలుదాజేకొనెను। నవ్వుచునొకబా, ణముసంధించి-మ, నంబున నలరుచునననెను॥ రామ॥

రామునికీర్తనము, అదితాళముఁఖోపొవన్యం.

మంచిది మంచిది భార్గవా ! బహు॥ మంచిది ॥ మించిదీననీపాద

ములు। ద్రుంచి త్రుళ్ళడంచెదను॥ మంచిది॥ సాత్వాద్విప్రుఁడనినిన్ను జంప నైతిలేకపోతె। దీక్షతోరాజులపగ, దీర్పకనేవిడిపింతునా! మోక్షగుండా ధ్యక్షుడని వీక్షింపలేవైతివీవు॥ మంచిది మంచిది॥

వ. ఈలీలఁ గాలాంతకునిబోలె బలాబలంబులు దెలియక పేలుచు మోల్రిల నిలువంబడియున్న పరశురాముని కేల నున్నవిల్లుగొని యల్లె త్రాడు పెల్లునలాగి భల్లంబొక్కటి తొడిగి నీకాళ్ళ నుల్లనేయుదు నని.

తో॥ పర్వినదయనిటు, పలికినరాముని, పలుకులువిని భార్గవుడు, పూర్వజ్ఞానము, వొడమియభవుడని, పొగడఁదొడగె దానవుడు॥ రామ॥

పరశు,కీర్తనము, కమాసు,రూపకము.

రామ! మేఘశ్యామ! బ్రోవవే! సకలలోకాభి॥ రామ॥ రామా। రణభీమా। ఘననామా! పరంధామా! రఘు॥రామా। అజుడనవ్యయుడవు పరుడవు, నానందమయుడ, వాదిమూలకారణుండవు, నిజమాయాగుణ యుతముగ, సృజియింతువు, ప్రజలనురఘు॥ రామా॥ సంగసహితులయి నవారలు। నినుగాంచలేరు, సంగరహితులైనధీరులు। రంగుగదమమనము లలో, నంగనియానందింతురు॥ రామ॥ మోక్షగుండపురవిహారకా! నారాయణకవి, రక్షక! షడ్భావదూరకా! మోక్షప్రదదేహాదుల, వీక్షింతువు, సాక్షివగుచు॥ రామా॥

పర-తో॥ ఆదియందునే-హరినిగూర్చితప, మాచరింపగానతడు, నాదరమునబ్రి, త్యక్షంబయియిటు, లనుచుబలికెఁదానవుడు॥ రా॥

మచ్చిదంశమున, మహినిగలిసినీ, విచ్చలుహైహయనృపుల। మెచ్చకఁద్రుంచియు, మేయశమంబును, మెరయదాల్పుమేనవల ॥రా॥

రాముడనగదశ, రథకౌసల్యల, కీమహిలోనుదయుంచి। నీముతోమత, నీకుదర్శనము, నేనొసగుదుదయయుంచి॥ రా॥

అనిపలికినయా, హరివేనీవై, యవతరించితనివేడి। చనిమెమహేంద్రా, చలమునకాతని, సెలవుపొంది కొనియాడి॥రా॥

వ. ఇట్లు పలికి పరశురాముండు చనినపిదప రాముండు భయభ్రాంతచిత్తుండై యున్న దశరథునకు నమస్కరించినఁ గౌఁగలించుకొని దీవించి యిట్లనియె.

దశ-కీర్తన, పున్నాగవరాళి-ఏకతాళము.

నాపుత్రరత్నమా! నాపెన్నిధానమా! ముద్దులయ్య! ॥ నాపుత్ర॥
నానోముఫలమా! నాపాలిభాగ్యమా! చిన్నితండ్రి! ॥ నాపుత్ర॥
నినువేగగంటిని, నేగీర్తిగొంటిని, లోపమేమి॥ నాపుత్ర॥
వరమోక్షగుండ, పురమేలుపుండ, రీకనయన! ॥నాపుత్ర॥

సం-తొ॥ అనియిటుపలుకుచు, నందఱుగూడుచు, నప్పుడయోధ్యకుఁజేరి । ఘనముగబౌరులు, గని ముదమొందగ, జనిరి గేహముల కలరి॥ రామ॥

వ. తదనంతరంబున భానుమంతుండుఁ గోసలుఁడు లోనుగాఁగ వారెనమండ్రు శ్రీరాముని మేనమామలు దమతమ స్వదేశంబులు పాలింపుచు రాముని పాణిగ్రహణ మహోత్సవమునకు రావలసినదని దశరథుండు శుభలేఖలంపగా వారివారి మనంబులలోవారువారిట్లనుకొనిరి.

తొ॥ రామార్పణముగ, రయమునగాంచిన, నాముద్దులబిడ్డలను। బ్రేమమీఱగవ, రింపకసీతను, బెండ్లియగుటయెట్లిలను॥ రా॥

వ. అయిన దీని విచారింపవలసినదని ప్రతివారును యోచించి భూ, నీళా, విమల, జ్ఞాన, క్రియ, యోగాదినామంబులచే నలరారు తమకూఁతుండ్రు నూటయిరువది యెనిమిదిమందిని దోడ్కొని యయోధ్యకు వచ్చి దశరథాదులరాక గాచియుండి వారు గృహప్రవేశమునకు వచ్చుసమయమున.

క. తనయాయుతముగ రాముని
గనవచ్చిన మేనమామ • గారికిఁ బ్రియవం
దనములొనరించి యుచితా
సనములఁ గూర్చుండఁజేయ • సంతోషమునన్.

వ. ఆసీనులయి యిట్లనుచున్నారు

మేనమామ, కళ్యాణిరాగము, రూపకతాళము.

శ్రీకరముగ భానువంశ, శేఖర! వినుమా! యీకన్యలఁగై కొనివరి యింపుఁము భరియింపుము నీవు॥ శ్రీకరముగ॥

నీకర్పితముగను, గం, టిమికావునదగను, రాకోమరులకింకొకరికి రాదివ్వగ సత్యంబుగ॥ శ్రీకరముగ॥

రక్షోవరహరణా! నా, రామయణకవి శరణా! మోతుకుగుండపురవల్లభ, మోహించిరి ముదితలు నిను॥ శ్రీకరముగ॥

తోహా॥ వీరికోరికలు, దీరిచిపోవ్రుము, వీరికిభర్తవునీవు। వీరుభార్యలిక, వెలయుగనీకును, వేరుగజూడకబోవు॥ రా॥

వ. అనిపలికిన మేనమామల వాక్యంబులకు విశ్వసించి తండ్రి యుండిన సభకుజని నమస్కరించి రాముం డిట్లనుచున్నాడు.

రాము, కీర్తనము, రూపకతాళము.

జనకనామనవి, వినుము మేనమామ, లెనమండుగురువీరె, యే తెంచినారుఘనముగదానుగన్న। కన్యలనూటయిరువ, దెనిమిదిమందిన్ వెనుకన్ గొనుచున్, గై కొనుమనుచున్॥ జనక॥

ఆముద్దుబిడ్డల, రామార్పణముగ, దాముగన్నారట, తలగిపోరట। ఆమోహనాంగుల, నన్యులకీరట, యీమాటలకున్ దలపన్, ఏమని యెందున్ముందున్॥ జనకనామనవి॥

ధరనుమోతుకుగుండ, ధామునిసాక్షిగన్, వరియించికన్యలు, వచ్చిరినేడు, పరిణయమగుదునో! తిరిగిపొమ్మందునో! పరమోపాయంబొందున్ సరగన్ దెలపన్ వలయున్ ॥జనకనామనవి॥

వ. అని రామచంద్రుండడిగినఁ దండ్రియిట్లనియె.

గీ. అగ్నిసాక్షిగ మొదటఁ బెం ♦ డ్లాడినట్టి
సీతనెమ్మదిరయొప్పినఁ ♦ జెట్టబట్టు
లేనిచో మానియుండుము ♦ మేనమామ

బిడ్డలైనను ధర్మంబు ♦ విడువఁదగునె.

వ. అని వచించిన తండ్రివాక్యంబులకలరి రాముండు సీతాదేవి యున్న దెసకభిముఖుండయి నయోక్తుల నిట్లనియె

రాముని, కీర్తనము, ఆదితాళము, కనలిపని,

కలికీ! చిలుకల, కొలికి! యాలింపవే! పిలుచకమేనమామల, బిడ్డలునను బ్రేమ, దలచిరి, కలిసిరి, వలచిరి, గదవే॥

ననుబెండ్లియాడ, గనువేడ్కతోడ; జనకులపనుపున, జనుదెంచి రటుగాన! నినుగాంచి, వినిపించి, తిసిమంచి, తెలుపవే॥కలికి॥

మునుమున్ను స్పష్ట, ముగనీయభీష్ట, మునుదెల్పుతరళాక్షీ, మోక్షగుండేశుసాక్షి, మనమున, ననుమాన, మునుబూన, వలదే॥కలికి॥

వ. ఇట్లు తనభర్తయడిగినందుకు డెందంబున సరదియంబునొందక యానందంబున ముఖారవిందంబు వికసింప వసుంధరానందన దశరథ నందనున కిట్లనియె.

సీతకీర్తనము, కన్నడ, అటతాళము.

వల్లభ! వీరునా, వంటివారే! కద! యెల్లననకన, వశ్యముగైకొను॥వల్లభ॥ జననము మొదలుగ। నినుఁబతిగాగను, మనమునగోరిరట, మగువలుపాపము ॥వల్లభవీరు॥

ఇందరుఁగనుగొన, నీ ఇందువదనల, నందరిబెండ్లియాను, మగ్నిసాక్షిగమనో ॥వల్లభ॥

మోక్షగుండాధిప ! ముదముననన్ను వీరి। బక్షపాతములేక, బాలింపునాప్రాణ॥వల్లభ॥

క. భూమిజ పలికినపలుకులు
కామోదము నొందియటుల ♦ నౌననిసభ్యుల్
వేమఱుఁ బొగడఁగనంతట
రాముఁడుతాబెండ్లియాడె ♦ రమణులనెల్లన్.

వ. ఇట్లు నూటయిరువదియెనిమిదిమంది కన్యకలను నొక్క ల

గ్నంబున వామదేవ, వశిష్ఠాదిమునుల సమక్షంబునఁ పాణిగ్రహణంబు సలిపి సీతతోఁగూడ నూటయిరువది తొమ్మిదిమంది భార్యలతోఁగలసి యేకపత్నీవ్రతుండను ప్రతీతితో రాముండు వెలసెనంత.

సం॥తో॥ అగ్రిభార్యయగు। నవనీజయుఁజెలు। లందరు వెంబడిరాగ। స్వగృహమునకును-జనితల్లులకును-సరగున మ్రొక్కిరివేగ ॥రామ॥

సం-వ. వారానందంబునొంది వారిని లేవఁదీసి యాలింగించి యాశీర్వదించిరంత.

సం-క. శ్రీరాముడయోధ్యనుసీ
తారామ యుతంబుగా ము ♦ దంబుననిత్య
శ్రీరంజిల వైభోగము
లారూఢిని బొందుచుండె ♦ నతివేడుకతోన్.

సీ. కననెల్లెడలనల్ల ♦ గనుసల్లుకొనినమబ్బులుదుల్లిదెసలెల్లఁ ♦ దెపునొంద
జలజాకరతటా♦కము లు వాక లెడలేకజలపూర్తి నొందిము♦చ్చటగదోప
ఘనపంకములుడొంక♦లనునింకనకళంకగతిజంతుతతికి♦సంకటమువాయ
జనులెంతయును సంత ♦ సమునొంద ఫలవంతముగ నంతటను స
స్య ♦ ములుసెలంగ

గీ. నవనిజయుకాంతితోరాజు ♦ లలరుచుండ
ధవళకిరణములను సుధా ♦ ధాముఁడొప్ప
నరులు దైవోత్సవముల య ♦ త్నములుసేయఁ
బొడమె శరదాగమంబు సం ♦ పూర్ణముగను.

సం-వ. అట్టిసమయంబున దీపావళ్యుత్సవంబు నెరవేర్పనుద్యమించి మిథిలాపురిలో జనకచక్రవర్తి తనమంత్రులఁగాంచి.

జన-తో॥ రాముఁడుమొదలగు-జామాతృల సీ, తాముఖులగుదుహితలను। భామాయుతముగ । బరువడిదశరథ । భూమీశుని మంత్రులను॥ రామ॥

వ. దీపావళిపండుగకు మననగరంబునకుఁ బిలుచుకొని రావలసిన దనిచెప్పిన వారుఁగదిలి యయోధ్యకుఁ గొన్ని దినంబులకుఁజేరి దశరథు నిచే సన్మానింపఁబడి.

మంత్రులకీర్తన, ఆదితాళము, పోవెపాన్న.

ధారుణీశ! చిత్తగింపుమా। జనకుండుపంపెను ॥ ధారు॥ మీ-రా-కర్-గోరెర్ మా రాజేంద్రుఁడు॥ధారు॥ దారలుఁ గోడండ్రు। దనయులుఁ జెలికాండ్రు। బౌరులుబంధుగులు। మీరు రాదగు॥ధారు॥ మోక్షపురపతి కృపను మిథిలకుదగర్ బోవుదము ప్రయాణంబగుడు॥ ధారు॥

సం-వ. ఇట్లు జనకుని సచివులుదెలిపిన దశరథక్ష్మాపతి యానంద భరితుండయి భటులను గనుఁగొని.

దశ-సీ. దీపావళికిమిథి ♦ లాపురికినిమమ్ము రమ్మనిజనక ధ ♦ రావిభుండు
పుత్రించెగానమ♦త్పుత్రులున్నుషలుమత్కాంతలు హితులుఁబ ♦ ధానులంగ
బంధుపులాశ్రితుల్♦పౌరులుమరిజానపదులునుజతురంగ♦బలమువారు
దగఁబ్రయాణంబులై ♦ తరలిరావలెననిచాటించుడంతట♦ సకలవాద్య
గీ. నృత్తగీతములలరార ♦ నేడువార
కామినులు వందిమాగధ ♦ గణములెల్ల
సిద్ధముగనుండునట్లాజ్ఞ ♦ సేయుడఖిల
యానములలంకరింపుడు ♦ హర్షమునను.

సం-వ. తదాజ్ఞాప్రకారము సర్వము సిద్ధమయిన సంతసించి.

కీర్తన, కాంభోజి, రూపకము, శ్రవణామృత.

మిథిలాపురమున కేగెను - మిత్రకులుఁడు॥ రథమునీఁద నెక్కి-యధికవిభవములరారఁగ॥ మిథిలా॥ రామాదికుమారులెల్ల- సామజముల బ్రేమమీఱనెక్కి।ప్రియమునదనవెనుకనడువ॥ మిథిలా॥ మెల్లన సీతాది స్నుష-లెల్లవెంబడి।బల్లకీలలోన। నుల్లములలరఁగరాగను॥ మిథిలా॥ కౌసల్యాదులుబౌరులు, డాసినడువ । వాసిమోక్షగుండ, వాసునిసన్నుతిసే

సేయుచు ॥మిథిలాపుర॥

సం-వ. ఇటుల జటుల విభవంబున శుభంబున బయలుదేరి కొన్ని దినంబులకు మిథిలఁ బ్రవేసించినఁ దద్వార్త విని.

చ. ఘనుఁడువిదేహరాజెదురు ♦ గా జనియుండఁజగౌరవించి పా
యనియనురక్తిఁ బౌరులు ర ♦ యంబున సేసలుజల్లవారకా
మినులు నటింపఁగాయకులు ♦ మేలుగఁబాడనువాద్యఘోషముల్
దనరఁగ స్వీయధామము ము ♦ దంబునఁజేర్చెఁ బ్రసన్నచిత్తుఁడై.

వ. పిమ్మట వారిని మృష్టాన్నపానంబుల సంతుష్టి నొందించి దీపావళి దివసంబున.

తో॥ కూతుండ్రకు జా, మాతల కమిత-ఖ్యాతిని దలలంటించి। పీతిగనలుగులు-బెట్టించిశుభ-స్నాతుల నటుగావించి ॥ రా ॥ అతులాంబర ది, వ్యాభరణాలం। కృతులగునటు జేయించి। చతురంగంబుల సద్దాసీ దా, సచయంబులనర్పించి ॥రామ॥

సం-వ. దశరథుని దత్కాంతలను దక్కినబాంధవులను బలువిధసత్కారంబుల సన్మానించి దీపావళుత్సవంబు సేయించిన నానందభరితులై దశరథాదులు.

క. జనకుని వీడ్కొనితమపుర
మునకరుగఁగ మార్గమధ్య ♦ మున రామునితో
ననిపొనరింపఁగగొందఱు
జనపాలురు వచ్చిరసద్భ ♦ శంబగుబలిమిన్.

సం-వ. హరధనుర్భంగం బొనరించి సీతనుగైకొనిన వైరంబు కారణంబుగ శ్రీరామునితోఁ బోరెజయించువారై చుట్టుముట్టినన్నృపులను బరికించి దశరథుండు కంపితగాత్రుండై మంత్రులనవలోకించి.

దశ-కీర్తన, ఆదితాళము, ఆహోబాలా,

ఈరాజులనేకులెంతో-శూరులక్కట। వీరితోడఁ బోరొనర్ప-నేరనొక్కడ॥సి॥ పరిణయమొనరించునపుడు। పరశురాముఁడు। సరగనడ్డపడఁగ

భంగ। పరచెరాముఁడు ॥ఈ॥ ఇపుడువీరలే తెంచిరి - యీసుతోడను। అప
జయము నపయశము - నందనాయెను ॥నీ॥ మోకుగుండాధ్యక్షునిక-టా
క్షమున్నను। యీక్షితిజయింపవచ్చు। నేమిసేతును ॥నీ॥

సం- వ. ఇట్లు చింతింపుచున్న దశరథుని డగ్గఱి రాముండు విన
యోక్తులతో.

రా-తో॥ క్షణమాత్రములో - సమయఁజేతునీ-జనపాలురయుద్ధ
మున। నణుమాత్రమునీ, వాలోచింపక-యనుమతియిమ్మనియనిన ॥రా॥

దశ-తో॥ బాలుఁడవీవు న్నృ, పాలురనేకులు, నాలములోఁబోరాడ।
జాలవునేజని-చంపెదనుండుము-సైన్యముబ్రోచుచునీడ ॥ రా॥

వ. నేనోపలేనియపు డడ్డపడుమన రాముండు-

రాము-కీర్తన, ఆదితాళము, జౌరయిది.

తండ్రి! కను। పట్టుగవైరుల। ముట్టెదనిలఁబడ। గొట్టెదమట్టెదను
వారినీ। తట్టునిలువనీయను। కాలుపర। పట్టణమునుజేర్తును। ఈ వాహిను
లన్। వెలదులను। నేమరకు॥పట్టుగ॥ మోకుపురీశు। సాక్షిగను దీక్షగను।
దెలిపెదను ॥పట్టుగ॥

వ. తండ్రికిఁ బ్రీణతుండయి యనుజ్ఞవడసి శస్త్రాస్త్రపూరితం
బైయున్న తండ్రియరదంబెక్కి లక్ష్మణయుతంబుగఁ గదిలినఁగని.

సం. కం. భరతుఁడు శత్రుఘ్నుండును । బరువడిఁబదివేలరాజ♦
భటులనువెంటన్। శరకోదండంబులుగగొని। నరపాలురతోడ బోర♦ నడి
చిరిబలిమిన్.

సం. వ. ఇట్లు శత్రురాజుల కభిముఖంబుగ నడిచి దిగ్గజంబులు
బ్రెుగ్గ ధనుష్టాంకారంబొనర్చినఁ బగతురును వెనుదీయక యెదిరించి.

రాజుల-కీర్తన, ఆదితాళము, రామసీదయ.

నేడుమమ్మెదిరించిపోరుమ। శ్రీరామచూతము॥నేడు॥ చూడుజన
కుని। వీడునందల్ల। నాడుద్విజరాజ । చూడు, ధనువుఁద్రుంచి । యీడురా
జులకెల్లసిగ్గొన। గూడఁబెండ్లి, యాడి సీతఁ। దోడుకొని । చనితివపుడు॥

నేను॥ దానమూకవ। మానమాయెను। గానవాలను, లోన। గరకులైన బాణ జాలము-మేనవైతుము। మానసము-లోనవభి-మానసం, యుతుండవైన ॥నేను॥ అండయై మోక్ష-కుండదేవుఁడ। ఖండము గుదయు। నిండఁ। గనుచు నుండ। ఖండ శశిధర। ఛండకోదండ। ఖండనో, ద్దండ సను, ద్దండవై । యలరితపుడు ॥నేను॥

వ. అని త్రిణప్రాయంబుగాఁబలికిన రాముని సైన్యంబులు మూఁగి,

భటుల-ఉ. బుద్ధివిహీనులార ! బల ♦ ముం దలపోయక రాము మూర్తితో। యుద్ధము సేయవచ్చితి ర ♦ యోశలభంబులు వహ్నిసేసిన। ట్టుద్ధతి మేము సిద్ధముగ ♦ నుండఁగ రాముఁడేల మిమ్మదే। యుద్ధరఁగూలఁ జేతుఁమిపు ♦ డింటను గెల్చియు రచ్చ కేగుఁడీ.

సం-వ. పరశుకుంత భిండివాలాది సాధనంబులువచ్చుచున్నవి. వీనిఁదప్పించుకొని పొండనివైచి భటులార్భటించిన నవిలక్ష్యంబుసేయక యక్షయరూక్షేక్షణంబుల వీక్షించి యక్షమాధ్యక్షులు.

భుజంగప్రయాతము. ధనుర్జ్యానినాదంబు ♦ దగ్రింబుగాఁజే । సి నారాచముల్ పూన్చి ♦ చేబల్మివేయు। గ నాబంటులుంముండఁ ♦ గా లేకదూరం। బునన్నిల్చిరామీద ♦ భూమీశులెల్లన్.

వ. సింహనాదంబులుసేయుచు రామునికభిముఖులైన భరత శత్రుఘ్న లక్ష్మణులడ్డగించి.

భరతాదుల. సీ- తాటకాదులనిరా ♦ ఘాటంబుగాఁదోలి యాగంబుఁగాచిన ♦ యదియెఱింగి । పాషాణరూపమై ♦ పడినయహల్యకు శాపంబు వాపిన ♦ జాడయెఱిఁగి । మీకసాధ్యంబైన ♦ శ్రీకంఠుచాపంబు వేయెత్తి విరచిన ♦ విధమెఱింగి । పుడమిరాజక ♦ ముగనొనర్చినభృగు రాముగెల్చినపరా ♦ క్రమము మెఱింగి। రాము నెదిరింపవచ్చితి ♦ రా! యిదేమి! యెనుటిబలముగు స్వబలము ♦ నెఱుఁగలేరి। మానవులైన మిమ్ము నే ♦ మంనుమింపు। మమ్ము గెలిచి తరవంత ♦ రమ్ముపొందు.

వ. మాబాణంబులు రాకముందు ప్రాణంబులు గాపాడుకొనుఁ

డని మిక్కిలి యుక్కుగల పెక్కుమ్మ లెక్కవెట్టి చుక్కలురాలినట్లు గ్రక్కున నక్కల దిక్కులక్షించివై చిన వారలిగి.

తో. బహువిధశరములు, వరపితకుణము। భరతునిమూర్ఛలంజే సి। సహజన్ములల, క్ష్మణశత్రుఘ్నుల-సరకుంగొనక వెనుడాసి॥రామ॥అమి తబాణవ, ర్షములముంప వా, రంతయోర్వంగాలేక। విముఖులై సంగని-విక్రమము నరఘు-వీరు జేరి పెనుదాక॥ రామ॥

రాము-కీర్తన, ఆదితాళము, సరేసరే.

బలాబలంబులు-దలంపకిటునను। గలంచవచ్చెదరా! రణకౌశలం బుంజూపెదరా! ॥బలా॥అజంబులాది-గ్గజంబులునుగె, ల్వంజాలునే వినుడీ! దీని-నిజంబుగను గొనుడీ ॥బలా॥ దురంతమగుమీ-పరాక్రమంబుల-తె అంగెఱిగియుంటి। మిథిలా, పురంబులోఁగంటి ॥బలా॥ ప్రగల్భములుప, ల్కగానేల మోక్షగుండపతియాన। నిలువంగ! దగుఁరణములోన॥బలా॥

వ. వర్షాధారలంబోలి వెడలెడు మద్బాణపరంపరల కోర్చినంజా లునని పలికి కౌసల్యాదికాంతలు స్నుషాసహితంబుగఁ దనయుద్ధనై పుణ్యంబు జాలరంధ్రంబుల నుపలక్షింపుచుండ దశరథుండచ్చెరువంద.

శా. వాయవ్యాస్త్రము వింటనెక్కిడి కడుఁ ♦ వైళంబుతోలాగితా

వ్రేయఁ వార్ధితటంబునన్ బడగవా ♦ రిఁగొందఱఁ ద్రోసెనా

చాయల్నిచ్చిన వారిగర్వముమగఁ ♦ సమ్మోహనాస్త్రంబుపై

డాయంజేయవితాకులై పడిరి చే ♦ ష్టల్ దక్కి భూనాయకుల్.

వ. రాముండు ప్రియజనకుఁజేరి నమస్కరించి సోదరుల యవస్థ నుగురించి విచారించబోవునంతలో కైక.

ఆ. యుద్ధభూమియుం ద ♦ యోమయముగఁబడి । మూర్ఛము నిఁగియున్న ♦ ముద్దుకొమరు । శిరముస్వాంకతలము ♦ నేర్చి యత్యంత దుః। ఖాబ్ధి లోనఁగూలి ♦ యడలుచుండె.

కైక-కీర్తన, రూపకము, ముఖారి, హోపాణినాయక.

నాకూర్మినందనా! నమనిటు, దేరిచూడరా। కైకనేరమేమిచేసె।

నీకరణిని శోకాబ్ధిని-వేకూల్చిర భూకాంతులు॥ నాకూ॥ పలువురురణశూ రులుండి। కలననునిమునులఁ బను వోఁ। దలగింపఁగఁ-దలపరైరి ॥నాకూ॥ మనుకులమున జనియించిన । నినుబగతును-సెనికెమచో। జనకుండమను గనుచుండెను ॥నాకూ॥ జగతిని శ్రీమోకుఁడు। నగరేశుఁడు, దగ నడ్డ ప-డఁగఁ జాలక-నగదోశ్రిసెను ॥నాకూ॥

వ. ఇట్లుదుఃఖింప దశరథకౌసల్యాదులునేరి యూరాస్చుచుండి రంతటరాముండు లక్ష్మణునిజూచి.

రా-మ. అనుజా! ముద్గలమౌని యూశ్రిమను దా ♦ పైయుం డునిచ్చోటికా। యనదివ్యౌషధ వల్లికల్ పెనిచె నీ ♦ వందేగినాయాజ్ఞఁ దె। ల్వినసంజీవని నిచ్చుదానివలనన్ ♦ లేచున్‌దగన్ గైకజుం। డనుమా నింపకహామ్మకార్యవిఫలం ♦ బౌజాగుగావించినన్.

వ. రథారోహణంబునేసి హామ్మనఁ దకుణంబు లక్ష్మణుండుత దాజ్ఞ శిరసావహించి ముద్గలాశ్రమంబు ప్రవేసించితదీయ శిష్యులంగని.

సంవాదసీసము.

లక్ష్మ-వటులారయెందున్న ♦ వారుమీగురువులు.
వటులు-ఒనరసమాధియం ♦ దున్నవారు.
లక్ష్మ-మాకార్యములుదీర్చు ♦ మాన్యులిందెవ్వరు.
వటు-కార్యంబులెవ్వి చ ♦ క్కగఁదెలుపుడు.
లక్ష్మ-సంజీవకరణికై ♦ చనుదెంచినారము.
వటు-అదిమీకొసంగ సా ♦ ధ్యంబుగాదు.
లక్ష్మ-రామాజ్ఞలక్ష్మణ ♦ నాముఁడవచ్చితి.
వటు-మెనరైననేమిమే ♦ మియ్యమిపుడు.
గీ. లక్ష్మ-ఎప్పుడదిమాకుదొరకునో ♦ చెప్పరయ్య!
వటు-ముద్గలార్యుని నడిగికొం ♦ పోగదయ్య!
లక్ష్మ-తడవుజరిగినఁ గార్యంబు ♦ సెమనుగాదె!
వటు-యిందరికినిచ్చుటకుగురు ♦ నాజ్ఞ లేదు॥

వ. అంతట విప్రులుండై వేగంబున రామునికడకరిగి

మత్తకోకిల. మానివర్యుడు నిర్వికల్పస ♦ మాధియుండెను శిష్యు తెం। తేనినన్ను నిరాకరించిరి ♦ దేశికాజ్ఞకుబద్ధులై । నేనిపానము సేయు కార్యము ♦ నిష్ఫలంబగునంచునా। వైనముల్ దెలుపంగవచ్చితి♦ భావి కార్యము దెల్పవే.

వ. రాము- తడవుజరిగిన భరతునకపాయంబువాటిల్లు.

లక్ష్మ- దేవరవారి యాజ్ఞననుసరించి చేయుటకు సిద్ధముగా నున్నాను.

రా-బ్రహ్మచారుల ధిక్కరించి యామధలతలఁ దేనోపుదువా!

ల-ఋషివర్యునకలుకవొడమిన మనకుముప్పగలుగునని భయము.

రా-ఈకార్య మనుకూలమాయినపిదప వారికోపశాంతికిఁ గారకుఁడ నేనుంటిఁగదా!

ల-చిత్తము వెళ్లుచున్నాను.

చ. చటులజవంబుతోనరిగి♦ సంయమిలేవక యుంటఁగాంచియుఁ। తటఁబరికించియామధ ♦ లతల్గొనసడ్డము వచ్చినట్టియు। వ్వటులనిరాక రించిబల ♦ సంతముగానవి సంగ్రహించి పి। న్మటనథయామఁడై చని క్ర ♦ మంబున నర్పణచేసి మ్రొక్కినన్.

వ. రాముండు పరమానందభరితుండయి యమ్మందు ప్రయోగించినఁ దత్ప్రభావంబున భరతుండు సుప్తునింబోలి మేల్కని తలిదండ్రులకు రామునకుఁ బ్రణమిల్లిన దీవనలిచ్చిరి. కైక పరమసంతోషిత స్వాంతయయ్యె. నక్కడ బ్రహ్మచారులు హాహాకారంబులు సేయుచు గురువునడగ్గఱె.

వటుల-కీర్తన, కన్నడ-అటతాళము-మూడవేల.

మానినాథా! మామాయబోధ। మానవే! తప, మానవే! బోధ॥ మా॥ భూనాథుఁడెవ్వఁడో! కానినేడేతెంచి। తానౌషధవల్లి। త్రివ్వికొని పోయె॥మా॥ మేమెంతదెల్పిన। దామునమునఁజూచి। స్వామీ! బెదిరించి।

చనియెనేమందుము॥మా॥ మోకుగుండేశుక। టాకుముఁగొన్నమీ। యు
కుయతపోశ। క్తి క్షీణమాయెను॥మాని॥

వ. తాముశాంతంబుతోనున్న తపోబలంబు నిరర్థకంబుగాదె.

సం-వ, అనిపలువిధంబులఁ బలవింపుచున్న బాలకులవాక్యంబు
లాలించి కన్నులువిచ్చిచూచి-

ముని-ఉ. బాలకులార! యేమియిది♦ పామరులట్ల విషణ్ణచిత్తులై
యేలవిచారమొందెదర ♦ రథీశుఁడులేని భటాళిభోలియే। జోలికిఁబోక స
త్వరముఁ ♦ జూచెదమూకుఁ గొఱంతయేమియో। కాలగతిప్రకార మెఱు
గఁ దగు సర్వముఁదెల్పుఁడీయనన్.

వటుల-వ. మీరుచితత్సమాధినున్నతఱియొక్కభూపాలుఁడువచ్చి
దివ్యపుషధలతలు మమ్ముతిరస్కరించి తస్కరించికొనిపోయె. మేమశక్తుల
మై మిన్నకుంటిమి. అదివిని మునీందుఁడు.

ముని-సీ. ఏకాలమందైన♦ భూకాంతులిటువలె ఋషులకునెగ్గా
చ♦ రించినారె! ఏజోలికినిబోము♦ రాజాధములఁజేరి యన్నవస్త్రంబుల ♦
నడుగఁబోము। అడవులలోఁబడి♦ యాకలములదిని యుందుముమృగము
ల ♦ చందమునను। నిరపరాధులముమా ♦ నిలయంబులకువచ్చి కొదమ
సింగంబును ♦ గదిసినట్లు। రేపుచుండుదురిది విప ♦ రీతమనక। తపముసా
త్వికవృత్తి వ్య ♦ ర్థంబుగాదె। మూలనుండినవారిని ♦ ముంగిళులకు। దీ
యనాయమె! యీభూమి ♦ నాయకులకు.

ముని-వ. వానినామధేయం బెఱుంగుదురా!

వటు-వ. ఇదివర కెఱుఁగము. లక్ష్మణుఁడని వచించె.

ముని-వ. క్రోధతామ్రనూత్నుండై ఎక్కడిలక్ష్మణుఁడు. మనవన
మెక్కడ! నతండెందుండువాఁడు. అక్రమప్రవేశమేలచేసె. మదీయకోపా
నలజ్వాలలు ప్రజ్వరిల్లిననతఁడు భరింపఁగలఁడే!

వటు-రాముని సోదరుండనని మాతోఁబలికె. రాముఁడెవ్వఁడో!

ముని-ఏమీ! రామునిసోదరుఁడా! (అని యోచించి దివ్యదృష్టితోఁగని)

ముని-చ. దశరథరాజనందనుఁడు♦ దారుణుశోనిధి రామనాముఁడా। కుశకతనూజుతో మిథిల ♦ కుర్జని తత్పురమందునున్నయా । పశుపతివిల్లుద్రుంచి సుల ♦ భంబుగసీతను గొన్నయట్లనే । విశదముగాఁగ వింటిమును ♦ వీరవరుండతఁడే! యితఁడగుర్.

వ. అయిన మనమతనిఁ దర్శించి రాఁదగును. అని శాంతంబు వహించి ప్రయాణంబగుచుండ నిక్కడ దశరథుండు విషాదంబున సతీసుతాదుల నవలోకించి.

దశ-కీర్తన, ఆనందభైరవి-రూపకము, ఓమహాత్మా.

ఏమిసేతు నేయుపాయము। నాకేదీతోచ॥దే॥

ఆమునీంద్రు నాజ్ఞగొనక। ఔషధములు దెచ్చిరకట! తామసించి శాపమిడక। సామాన్యముగా। గనునే॥యేమి॥

మానులవిశ్వాసమునకు। భూనాథులుపాత్రులగుదు। రీనాడది దవ్వాయెను। నీనేరంబెట్లువాయు॥నేమి॥ మోక్షగుండవిభుభక్తుల। కీక్షితినప కారంబును। దీక్షనుజేయఁగదగునె! యోక్షేపించరే! లోకు॥లేమి॥

దశ-వ. ఇదిగాక యతనియనుమతంబు వడయక తెచ్చిరి. అ ఘనుండు సమాధిచాలించక ముందే! పోయి క్షమాపణ వేడుకొనియెదనని యందరితోఁ గలిసి మునియాశ్రమంబున కరిగిన నెఱింగి యంతం డెదుర్కొని.

ముని-కం. క్షితినాథసతీసుతభట। హితయుతముగ వచ్చినారు ♦ హృత్తోషముస్వా!। గతమొసఁగెద నీదినమున । నతిథులుగాఁదగను మామ ♦ హాశ్రమమందుర్.

వ. ఇదిమదీయసంకల్పంబని యశోదృశకుసుమ సమన్విత వృక్షలతా సముదయంబులపొంత నాసీనులగుటకు వసతులుగల్పించిన వసించి దశరథుఁడు విన్నదనంబున.

దశ-భవత్పాదారవిందంబుల కనేకవందనంబులు మునీంద్రా!

ము-సర్వదా దిగ్విజయోస్తు. పుత్రపౌత్రాద్యభివృద్ధిరస్తు.

సంవాదసీసము.

ద-అపకారమొనరించి ♦ రయ్య! నానందను
లలుగక కృపఁజూడ ♦ వలయు నేడు
ము-అపకారమేమి చే ♦ యఁగలేదు భూనాథ!
యుపకారమే చేసియుం ♦ డిరిపుడు
ద-ఔషధలతలు మీా ♦ యాజ్ఞఁగైకొనక స్వ
తంత్రించి తెచ్చుట ♦ తప్పగాదె!
ము-రాముండు సుగుణాభి ♦ రాముండు సర్వలో
క స్వతంత్రుఁడగుఁ ♦ గాదెభూప
తే. ద-తమకునాగ్రహ మొదవెనో! ♦ తగనెఱింగి
శాంతమొందింపవచ్చితి ♦ సంయమీంద్ర!
ము-మనుజరూపముదాల్చిన ♦ మాధవుండు
రాముఁడాతని మాకోప ♦ మేమిచేయు.

సం-వ. అంతఁ గౌసల్యాదికాంతలు సీతాదిస్నుషలు, రామాది కుమారులు వేర్వేఱసుమతీముద్దలులకుఁ బ్రణామంబులాచరించి వారి దీవనలంది పిమ్మట వారి యాతిథ్యం బంగీకరించి యాదిన మందుండిరి. యప్పుడు.

దశ-కం. మునివర్య! నొక్క విషయము। వినఁగోరితిమిమ్మునుండి♦ విశ్రాంతిమెయిన్। అనవుఁడు తులసీఖండం। బునకునుగొనిపోయివివర ♦ ముగనడుగుమనన్.

దశ-తో. తమ రెఱుగనివిష, యములుండవు నా। కొమరుఁడైన రాముసకు। గ్రమమునరాఁగల-కాలశుభాశుభ గతు లెఱిఁగింపుము నా కు॥ రామ॥

సం-వ. ముద్గలుఁడానందకందళిత హృదయారవిందుండయి.

ము-కీర్తన, హిం, కాఫి-ఆది, ప్రొ మొక్కోదన్.

చెప్పెదన్వినుభూధవా! ఇప్పుడు చేసిన ప్రశ్న-కొప్పఁ బ్రత్యుత్తర

ము॥ చెప్పెదర॥ శ్రీరాముఁడనఁగనాది-నారాయణుఁ డుద్భవించె। ధారుణీశ! నీదుపుణ్య। కారణముననీకు॥జెప్పె॥ నష్టమైనధర్మమును। సృష్టిపైఁ గ్రమ్మరనిలుపు। దుష్టులనుశిక్షించును। శిష్టులనురక్షించుఁ॥జె॥ శ్రీమానిని యంశమైన। సీతనుజాయఁగఁగొని। భూమిని శ్రీమోతుకుండ। ధాముఁడై రంజిల్లును॥ జెప్పెద॥

ముద్గలుని-సీ. కొలఁదికాలంబున♦ కునునీవుదివికేగ గలవువృందా శాపకారణమున। రాముఁడుదండకా♦ రణ్యంబునకునేగి యవల నయోధ్యకు♦నరుగుదెంచి। రాజ్యంబుగైకొని♦పూజ్యంబుగానేలులీలబదునొకండు♦ వేలయేండ్లు। కొడుకులిద్దఱుమఱి♦ కోడండ్రునల్వురు మనుమ లిర్వది నాల్గు♦ మంది మనుము। రాండ్రుపండ్రెండుగురు ప్రపౌ♦ త్రిలియగణి। తంబుగానిట్లు సూర్యవం♦శంబువెంచి। దీవులేడింటిఁదానుసా♦ధించి యేలఁగ లఁడు నీయగ్రసుతుఁడొక ♦ కాలమందు.

వ. ఇదియనీకొడుకు భావికాలవర్తమానమనిన.

దశ- తొ. వృందయనఁగనెవ-రెందుండునునా। సుందరి విభుఁ డెవ్వాఁడు। ముందుశాపమా,యిందిరాపతికి నెందుకొనఁగె నదినేడు ॥రా॥

వ. ఆకథాభిధానంబు కరుణారసపరిపూరిత హృదయుండవై యెఱిఁగింపుఁడన ముద్గలుండు.

ము- పాట, రూపకము, జనకా,

వినుముభూమిపాల! మునుపుశంకరుని। ఘనకోపవహ్ని। వనధిని బడిన। జనియించెనందులో। జలంధరాసురుఁ,డనఁగన వరుణుండతనిన। అనురాగమునం బెనిచెన॥విను॥ జాలంధరమును। పోలుగల్పించి। చాలఁ గనందు-లీలనాలించి। కాలనేమిగన్న। కన్యను వృందయన। బాలన సద్గుణ జాలన। ఆలింగాఁబాఁగైకొనె॥విను॥ దండిపేరుఁడనఁ।డనరివేలుపుల దండించుతలో। దర్పముడుల। నుండతావులేక। బెండువడిమోతు। గుండనగరవిభుని। యండంజేరఁదెల్పిరి॥విను॥

వ. ఇటువలెఁ దనశరణుసొచ్చిన దేవతల నాదరించి వివరించిజనకుఁడు.

విష్ణు-కం. పురహరుఁడు దక్క నొరులె। వ్వరు వాని జయింపలేరు ♦ వాస్తవమాశం। కరునారాధింపుండా। తఱిగని నేఁదోఁడుపడును ♦ దైత్యుఁడుమడియుగ.      వ. అంత దేవతలు.

దేవి- లావణి- శివప్రార్థన.

పురవైరీ! పురవైరీ! పురవైరీ! పురవైరి! విధృత। వనజారి! వినుతఘనసూరి నిచయ! కరివైరీ! కరివైరియానవర! శౌరి! మత్త। హర! భూరిభయద। నరకారీ! నరకారివినుత। పద- వారిజాత! స్మరవైరి! హర। గరుడారి! గరుడారితల్ప। శరధారి! విమతపంహారి! లోక! హితకారి॥1॥ శ్రీమోక్షగుండ ధామా క్షుదామ। ప్రతిపక్షద్విరద హర్యక్షా। హర్యక్షవక్త్రబుత్రాక్షశూర। ఘనరాక్షసప్రకరశిక్షా। కరశిక్షోపరిపరిరక్షిత। రావణ! యక్షరాజ సంరక్షా! సంరక్షితమునినుత! దక్షాధ్వరసర్వక్షయ । దివ్యకటాక్ష॥ 2॥

వ॥ ఇక్కరణిఁ బెక్కుగతుల నగ్గించిన ముక్కంటి దేవతల దిక్కువీక్షించి ప్రసన్నుండయిన మొ్రక్కులొసఁగి.

దేవతల-ఉ. దేవజలంధరాసురుఁడు దీర్ఘ ♦ బలంబున మమ్మెదిర్చిమా। తావులు దానుగైకొనెయెఁ ♦ దాళఁగఁజాలము వాని ధాటికిగ। యేవెరవింక వానిసమ ♦ యించి దయార్ద్రలమమ్ముఁ బ్రోవఁగా। నీవసమర్థుఁడౌదువన ♦ నింబరులోపరు చంద్రశేఖరా॥

దే-వ. మాకుశరణ్యుండవుగావే! యనిప్రార్థించిన వారికభయంబిచ్చి వానియుద్వేగం బడంపనిశ్చయించి.

సం-తో. శూలముఁగైకొని। జాలంధరుసలఁ। గూలుపఁజనుచుండఁగను। వేలుపులనుదా! వెడకుచునెదురుగ। వేగవచ్చెనాతఁడును ॥రా॥

సం-వ. ఇట్లిరువురొకచోఁ దారసిల్లి పోరొనర్చుచుండిరప్పుడు.

సం-క. శీతాద్రిజాతప్రేరణ। చేతరమానేత దనను ♦ చేతమునంద। త్యాతురమొందుచు వృందా। పాతివ్రత్యంబు సెరుప ♦ బరువడినరిగెగ.

సం-వ. జాలంధర పురోద్యానవనంబున నొక శిష్యునితోఁ బ్రవే

శించి యొకచోనాశీనుండై తపంబు సేయుచుండె.

తే. వృంద నిజభర్తపాదార ♦ విందములను। డెందమునఁగొల్చి యొకనిశి ♦ యందుఁదనదు। మందిరంబునఁబూపాన్పు♦నందునిదుర। జెంది కలఁగనిలేచి లోఁ ♦ గుందికంది.

వృంద-పాట- ఆది, వలదచటికి.

కలగనినానే! చెలియ! వినుము తెలియ॥గల॥ చెలువుఁడునానెదల కంటుకొని, వలువఁబాలుపకను। యున్నటులను॥గల॥ ముండియైమహిషఁ మునునెక్కి నిశిని। దండధరుని దిశకుఁ। దరలినటుల ॥గల॥ మోక్షగుండేశు ని। యక్షయకారుణ్య। వీక్షణకలదో! లేదో! తెలియరాదు॥కల॥

వృంద-సీ. పలువేలుపులడీబు ♦ పడఁజాలుగాఁదోలు నలకాలుప సవీలు♦నటులఁజేయు। దగఁబాసి దెసడాసి ♦ తనవాసిఁ గనఁజేయు నుతియక్షవరుశిక్ష ♦ పఱచి పనుపు। సిరిబిడ్డగనబడ్డఁ- జిఱుగడ్డమునులాగు బలుమారు జడదారు ♦ లలయుఁదూరు। బనిమాలి వనమాలిఁ ♦ గనిగేలిసేయును గురిమీఱ హరుబోరఁ♦ గోరుచుండు। నెంతదెల్పిన వినడిసు ♦ మంతయైన। నిపుడుదిప్పురారిపై కేగ ♦ విపుణుఁడగుచు। యుద్ధమగుచున్నదచట న ♦ యోమయముగఁ। జెడ్డకలగంటి నేనేమిసేయుదాన.

వ. ఈసంతాపంబు కొంతయుపశాంతించుటకు వనాంతరంబున విహరింతమని పలికి తెల్లవారిన పిదప నిరువురు చెలికత్తియలతోఁ గలిసి యుద్యానంబు సేరి విహరింపుచు ప్రాణ నాథుని దలంచి వగపు గలుగ.

వృంద-కీర్తన- హిం- తోడి, రూపకము- వరధాత్రితనయా.

తరుణీ! నావిభుఁడు। తానురాక- తడసినాడు॥తరు॥ పురహరుతో బోరుసలుప। దరమగునటె- తనబోటికి॥తరు॥ అశుభ సూచకములుదోఁచ। నాయెనేమ- నాకిక। విశదంబుగ క్షేమవార్త। వినుపించెడువారు రేరు॥ తరు॥ ధరణిని శ్రీమోక్షగుండ। ధాముడైన శ్రీహరి। హరులజేయు లనుచును। బలుఁమఱుదెలిపిన వినఁడాయె ను॥ తరుణీ॥

వ. ఇట్లు విలపించుచున్న.

చెలులు-క. కల కేమి! కనులుమూసిన। బలువిధములఁదోచుచుం డుఁ ♦ బ్రతిదివసమునా। ఫలమనుభవించితిమె! యీ। కలననుభయపడఁ గవలెనె ♦ కంజదళాక్షీ.

వృంద-వ. నామనంబునకు మిగుల దిగులును భయమునుగలుగుచున్నదమ్మా!

చెలి-వ. నేనుండభయమేల తల్లీ!

వృంద-వ. ప్రళయకాలాభీల జగత్కల్లోల దుర్జయమేఘగర్జనంబునుంబోలిన ధ్వనియొక్కటి వినంబడుచున్నదిగదే!

చెలి-వ. ఇంతలో నీకెంత చిత్తచాంచల్యము గలిగినదమ్మా.

వృంద-వ. నాకు చిత్తచలనముగాదు నీకు బధిరత్వము వచ్చినది. (ఆమెకొంచెమాలోచించి)

చెలి-వ నీమాటనిశ్చయమయిన నిజగుహాంతరమునుండి సింగంబుమాతంగంబుపై లంఘించు గర్జనయని తోఁచెడిని.

వృంద-వ. సింగమయిన మనమాడువారముగదా!

చెలి-వ. శీఘ్రంబున నడువుము తలంగుదము.

సం-ఉ. కొండలుమారుమ్రోయ దివి ♦ కుంభిను లట్టిటు నల్లలాడ మా। తాండముఁదు ద్రోవఁదప్ప విల ♦ యంబనిలోకులు దల్లడిల్లనా। దండకిలార్భటింపుచు వి ♦ తండపురాక్షసయుగ్మమప్పుడు। ద్దండముగాఁ బయింబడినఁ ♦ దద్దయు భీతినునింగి రంగనల్.

సం-వ. భీషణదంష్ట్రికరాళ నయనంబులతో వెనుకొనినరాక్షసులంగని భయవిహ్వలులై పరుంగువారును నా చెంగట తపంబు సేయుచున్న మునిపుంగవునిం జేరి యాలింగనంబుఁ జేసికొని.

వృంద-కీర్తన, జంఝూటి, అటతాళము, కామిన్యైకా.

మునివర! నను బ్రోవవె। కరుణాగనవె। నినుగని। ఘనుఁడని। మనమునఁ దెలిసితి॥మునివర॥ వెనుకొనిదనుజులు। ననుదరుమఁగభయ।వనధి

నిమునిగీతి। ఘనముగనో కాగతి।మునివర॥ ముందాపద। నొందె। వగ।
జెందినవ। మందుఁజేరి। యుందమన। నందుకుదో। డింపొకకి। ఁ్ోందనా
యె॥ము॥ తాపసేంద్రి। మోక్షగుండ। శ్రీపతినిబోలియిపు। డీపాపుల। కో
పాగ్నిని। రూపాపు్సము। కాపాడుము ॥మునివర॥ (ఇంతలో)

తో. పటుభయంకరా, రృటులతోడ నచ్చటికి రక్కసులురాగా।
నటుగని । తటుకున । నమ్ముని । హుమ్మన । నవ్వాల కేగిరివేగా॥ రామ॥

వ. అమ్మహానీయుని ప్రభావంబునకు నాశ్చర్యంబునొంది సా
ష్టాంగ నమస్కారంబొనర్చి వృందాదేవి.

వృంద-సీ. భవదీయహుంకార ♦ పటురవస్ఫూర్తిచే మత్ప్రతిప
క్షులు ♦ మాయమైరి। మీందయాగసమునా ♦ మీాదవమీక్షింపంగ సకల
భయాగ్నులు ♦ నమసిపోయె। మీా రెఱుంగనిదెద్ది ♦ మేదినిలో లేదు మ
హానీయులరుమీారు ♦ మానితిలక। యడిగెద మిమ్మొక ♦ యంశంబుచా
నియదార్థంబును దెల్పఁగా ♦ నగును దేవ! నాదుమగఁడు జలంధర ♦ నా
మదనుజుఁ। డభవునెదిరించి యనిసల్ప ♦ నరిగినాఁడు। బహుదినంబులుజ
రిగె ని ♦ ప్పటికి రాఁడు। వార్త దెలియుకయిాగతి♦ వనరుదాన.

వృంద-వ. నాయభీష్టంబు దీర్పుఁడని ప్రార్థింప మునిసత్తముం
డూర్ధ్వదృష్టితో నవలోకింప రెండుకోఁతులు వియన్మండలమునుండిక్రిం
దికివచ్చిన నమస్కరించి మౌనికనుసన్నతోఁ దెలిపిన.

క. గగనమున కెగసి రెండుగ। దెగియున్న జలంధరాఖ్యు♦దేహా
ముగొనివా। ర్మగుడఁ జనుదెంచి వృందకు। నగపఱచిరి క్షణములోన ♦
నాశ్చర్యముగన్.

వ. భిన్నమైయున్న భర్తృకళేబరంబు గని వృందమూర్ఛిలిన
మునీంద్రుండు కమండలోదకంబు ప్రోక్షింప మూర్ఛదెలసి.

వృంద-విలాపకీర్తన, నాదనామ, ఏంతదుర్ది. ఆది॥

దైవ దుర్బలమో। నాప్రాతఫలమో! యీావేళవిగత । జీవుఁడా
యెను పతి॥దైవ॥ ఏకాలమున। కేమేలగునో! యేకీడగునో! యెఱుఁగలే

మకట! ॥దైవ॥ విజయమునొంది। వేవత్తువని। నిజముగనమ్మి। నేనుంటి నయ్యో! ॥దైవ॥ గురుతర మోహక। గుండేశుఁగెల్వఁ। దరమువునేనిక। దరియెవ్వరింక॥దైవ॥

వ. అప్పుడు మునివర్యుండు సమీపించి.

ముని-క. చచ్చినవారలుగ్రిమ్మఱ। వచ్చెదరే! శోకమొంద ♦ వలదు విబుధులీ। వచ్చుంబోములు సమమని। చెచ్చెర చెప్పెదురుకాదె! శీ ♦ తాంశుముఖి?

వ. దుఃఖింపవలదు లెమ్మనఁ దెలివినొంది జడదారి పదములఁ పయిఁబడి.

వృంద-భుజంగప్రియాతము. మునీంద్రా! భవత్పాద ♦ ముల్నమ్మితిన్నా। మనోనాయకుంగూర్చె ♦ మారారియుల్కన్। బునర్జీవితుం జేయఁ♦బూజ్యుండవీవే!! కనన్వేఁటఁ కండోపఁ ♦ గాలేఁదుధాత్రిన్.

ముని-పంచచామరము- పురారిగొన్నవీని ప్రాణ ♦ ముల్ మరల్నేడునా।తరంబె!యైన మత్కృపాసు ♦ ధారసంబునీపయిన్ ।గరంబుజిల్కుఁజూడునీమ ♦ గండిదే సజీవుఁడై। కురంగటంజరింపఁజేతుఁ ♦ గూడుమంగనామణీ.

వ. అంతలో జలంధరుండు యథావిధిగలేచి నిలిచిన వృందయానందకందళితహృదయుఁడై ముని నభినందింపుచుఁ బ్రాణనాథుఁ నాలింగనంబుఁ జేసికొనియె నది మొదలు.

సం-సీ. ఖేలానుకూల వి♦ శాలలాలిత మాలతీలతా నికురంబ ♦ కూలములను। సారసకల్హార♦ వారిపూరితదివ్య చారుతరోవర♦తీరములను। సంతతసుమఫల♦ సంతానశోభిత సంతాపహరతరు♦ ప్రాంతములను। మలయానిలాయాత♦ సలలితసురజో కలితమహాపులినను ♦ స్థలములనుజ। లంధరాకృతిఁ గైకొన్న ♦ లచ్చిమగఁడు । వృందముదమంద ముఖసుఖం ♦ బించిమోవి। పానకముగ్రోలి చొక్కి ♦ గంధరతుల । గలిసిమెలఁగెను దాజిర♦కాలమచట.

వ. ఒకనాటి సురతాంతంబున ప్రమాదంబుచే నిజరూపంబున నిదురించుచున్న యతనింగని వెన్నుండనిగుర్తించి యాయన్నులమిన్న కన్నుగవఁగెంపులొలుక.

వృంద-కీర్తన, కన్నడ-ఆదితాళము, రాకేందు.

నీమాయదెలిసె। మనసుసొలసె। మాయఁ, జేయ-న్యాయమగునా॥ నీమా॥ అప, కారబుద్ధివచ్చినట్టి-శౌరివని-కంటి। కపటతపముగావించితివి॥ నీమా॥ పర, దారనంటి-వెంటనుంట-గౌరవంబగునా! మేర-మీరి-తౌరా ధీరా! ॥నీమా॥ గరుడుండుశిష్యుఁడాయె। మోక్ష, గుండవరనీకూ। దండ నుండఁదగదు-తలఁగు॥నీమా॥

వృంద-గీ. జయవిజయులను నీపారి ♦ షదులునాకుఁ। గీడొనర్చిరి రాక్షసా ♦ కృతులతోడఁ। బుణ్యశీల సుశీలు రి ♦ ప్పుడుకపులయి। నీదు పనుపాచరించిరి ♦ నిశ్చయంబు.

వృంద-కం. ముందీపురాక్షసులచేఁ। బొందుగనిజ సతినిఁగోలు ♦ పోయిమనములోఁ। గుందికపులుదోడ్పడఁజే। కొందువుకామిని నిమగుడఁ ♦ గూరిమితోడన్.

వృంద-వ. దండకావన విహారంబు భార్యా వియోగంబు కపిస హాయంబు నావచనంబునంజేసి నిశ్చయంబుగ నీకులభించగలదని.

సం-తో॥ ఇందిరాపతికి-నిటుశాపంబిడి-వృందవిభుని స్మరియించి। పొందుగననలము, నందుదుమికె యా, నందంబున మేనుబాసి॥రా॥

వ. పరలోక సుఖంబునకరిగె.

ముద్గ-పాట-అట-ఓర్చియుండుమిక-వలె.

రాజరాజ! విను। దశరథమహా॥రాజ॥ ఆజయవిజయులె। యసురు లై నారిపుడు॥రాజ॥ రావణకుంభకర్ణ, నాములై రిపుడు॥రాజ॥ అబ్ధినడుమ లంక। యందువసించిరి।రాజ॥ లోకకంటకులై యా। నేకులగెలచిరి॥ రాజ॥ మోక్షగుండేశుపైఁ। బూనిరివైరము॥రాజ॥

ముద్గ-సీసము. కలితలేశనీకొడు ♦ కనుగోడలుబంచ వటియందు

నుండరా॰ వణుఁడువచ్చి। రాము నేమరఁజేసి ॰ భూమిజఁగొనిపోయి తల్లిరీ తినిజూచి॰ తానుబోచ్రిచు। వాలినివధియించి॰వానితమ్మునిగూడి కపిసేన చే వార్థి॰ గట్టజేసి । రావణాదులఁగూల్చి ॰ రామతోడనయోధ్య సేరితాఁ బట్టాభి॰ షిక్తుఁడగును॥ యజ్ఞములొనర్చిమఱితీర్థ॰ యాత్రలొచ । రించి ద్వీపంబులేదుసా॰ధించియేలు। నిదియుగోప్యంబునీకునే॰ నెఱుకపరచి। తిని మహీవరయొరులకుఁ ॰ దెలియనీకు॥

శివుని-క. ఈరీతినిముద్గలముని। శ్రీరాముని భావిచరిత॰చెప్పినవిని యో । గౌరీ ! దశరథుసునమ । స్కారములర్పించిపలికెఁ ॰ గ్రిమ్మర మునితోన॥

దశ-కీర్తన, శంకరాభరణము-ఆట, వింతలాయె-వలె.

సన్మునీంద్ర। సంతసమాయెను॥సన్ము॥మన్మనోభీష్టము। మానుగఁదీ ర్చితి॥సన్ము॥ రాముఁడుహరియని। భూమిజరమయని। స్వామి తెలిపితివి॥ స॥ జోడుగగొడుకుఁగోడలుగానను। గూడగనేటికి॥ సన్ము॥ శ్రీకరమోక్షపు । రీపతికృపతో। నాకథఁదెల్పవె॥ సన్ము॥

వ. నాపూర్వవృత్తాంతముదయాంతఃకరణతోఁ గొంతసెలవిండని ప్రార్థింప ముద్గలుం డానందభరితుండై.

ము-మ. ధరణీనాయకసంవ్యాపర్వతము చెం॰ తన్ వింతగానొక్క ప్రోల్। గరవీరంబున నొప్పనందుఁ గమలీ ॰ లన్ ధర్మదత్తాఖ్యభూ। సురు డొక్కండుగలండు సద్గుణుఁడు సు॰శ్లోకుండు సద్ధర్ముఁడున్। హరిసేవాపర తంత్రుఁడై మెలఁగు ని॰త్యంబాత్మ సంతుష్టితోన్.

ము-వ. ద్వాదశాక్షర విద్యాపరాయణుండై భార్యాద్వయమును తోఁగూడి యతిథిపూజ యొనర్చుచునుండు వాఁడొకపరి.

ము-తో॥ భాసురకార్తిక। మాసంబునహరి। వాసరమునగురియుం చి। వాసిగఁదానుప। వాసయుక్తుఁడై । వాసుదేవునర్చించు॥రామ॥

సం-వ. రాత్రిజాగరణకొఱకు హరిమందిరమునకు నరుగుచుండ మార్గమధ్యంబున.

సీ. వెడదశరీరంబు ♦ విన్నుమన్నుకునంటి కాటుకకొండతో ♦ దీటుగాఁగ। దీర్ఘనిశ్వాసంబు ♦ ఘుర్ఘురస్వనమును దెగువభీమంబుగ ♦ దిశలఁబర్వ। రక్తలోచనముల ♦ రగులువహ్నికణంబు లలప్రళయాగ్నితోఁ ♦ ననుకరింప। లంబజిహ్వాగ్రంబు ♦ జుంబించువక్రదంష్ట్రలు వరహంబుతోఁ ♦ జెలిమిసేయఁ। గడుదిగంబరమై పైకి ♦ గవయుశుష్క। దేహనొకరక్కసిని గాంచి ♦ ద్విజవరుండు। దనువుగంపింప నొకకొంత ♦ తడవుభీత। చిత్తుఁడైయుండు నిలచియోచింపఁదొడఁగె.

ధర్మ-కీర్తన, ఆది-కదంబరాగము, ఇంతపాపమెన్నఁడైన-వలె.

ఏమియీవికారరూప। మిటుల నెదుటదోప। స్వామికేమి లోప। మే। సలిపినానొ తలప॥ నేమియీ॥ ఎన్నిసారులిటురాలేదు। యెన్నడిచట లేదు। చిన్నిరూపుగాదు। పై। కొన్నదలవబోదు॥ యేమి॥ మోక్షగుండ హరినిగొలువఁ। బోవుచుండతులువ। రాక్షసిటులనిలువ। జన। రాదికే మితోప॥ యేమి॥

సం-వ. ఆపన్నివారణుండగు హరియుండ భయపడనేలనని నిశ్చయించి వాసుదేవ ద్వాదశాక్షరిజపించి తులసీదళయుక్తంబగు నుదకంబు దానిపైఁ జల్లిన.

సం-క. తులసీదళయుక్తంబగు। జలసంస్పర్శమునకలుష ♦ సమితి దొలఁగియా!! వలపూర్వజన్మసంస్మృతి। గలిగిద్విజన్మునకుమ్రొక్కి ♦ కడు వడిఁబలికెన్.

తే. నీప్రసాదముచేఁబాప ♦ నికరమడఁగి। పూర్వజన్మవిజ్ఞానంబు ♦ వొడమెమదికిఁ। జెప్పుమునిననుసర్వంబు ♦ జెప్పఁగలను!! భూసురోత్తమ! యేమినా ♦ పుణ్యమహిమ.

సం-తో॥ అనవుడునాశ్చ। ర్యమునొందియుతం। డనియెనవుడుమోదమున। వెనుకెవరునీ। వేకర్మముచే। తనునిటులైతివియనిన॥ రామ॥

కలహా-కీర్తన, కేదార, రూపకము, ఇనకులాబ్ధివలె.

వినుముభూసురాగ్రణీ! అనుపమగుణ। గ్రామణీ! ధీమణీ! ॥విను॥

ఇలలోఁ గలహాయనంగను । వెలసితినేఁ దొలిబామున ॥ విను॥ ధీరా-సౌ రాష్ట్రమునావాసము ॥వినుము॥ బిత్తుందుర్ । విప్రిందుర్। బ్రియమున వరియించి। యాత్మీతినను బెండ్లాడెను॥విను॥ పతిమాటలువినక। యతిప్రీతి నిగనక। సతిధర్మముగొనక। మతిమూర్ఖమువిడక। సతతమిట్లు। జరుపుచుం డు॥విను॥ శ్రీమీరన్ మోక్షపుర। స్వామినినే । గొలిచియెఱుఁగ॥వినుము॥

కల-క. పతికన్న ముందువంటక। మతిముదముచదినుచునుందు ♦ న తఁడేమనినర్ । బ్రితియునక యూరకుండనుఁ। బ్రితినూలిన ముఖమును దిప్పి ♦ పలుకకయుందుర్.

కల-తో. ఇటువలెఁజేయవె । యాపనియనినను రెటుమతముగఁజే సెదను । నటుమళ్ళినతటి । దటుకునఁబెళ్ళున । మెటికలునేవిరచెదను॥రా॥

వ. ఇది మదీయనిత్యకృత్యము.

సంవా-సీ. భి-చెప్పినరీతిగఁ ♦ జేయవే మదినీవు.

కల-చెప్పిచేయించ ♦ నీచేతనౌనె.

భి-ముందుగాఁదినిపంపు ♦ కొందువటేకొమ్మ!

కల-నీయాజ్ఞ నాకేమి ♦ నేరవ్రుండు.

భి-దేవపూజయువైశ్వ ♦ దేవమెట్లగునింక.

కల-వేఱుపాకరేఖుఁగా ♦ వించికొనుము.

భి-నేవండుకొనునెడ ♦ నీవుండినఫలమేమి.

కల-నాయింటనుండుట ♦ నాకుఁదగదె!

భి-ఎంతతెగువరివైతివి ♦ యిందువదన.

కల-నీకులోబడుదాననే ♦ నిశ్చయముగ.

భి-మారునల్కినశిక్షింతు ♦ మగువనేడు.

కల-కూవమునఁగూలి ప్రాణంబు ♦ గోలుపోనె.

కల-వ. నానామంబు సార్థకంబగునట్లు వితండములాడుచుఁ బ్రవర్తింపుచుండ నవకీర్తికిలోఁబడి యతండుబహుకాలంబు గడిపి విపికి యొకనాడు తనపిత్రియమిత్రునింజేరి.

భిక్షు-కీర్తన, ఆదితాళము, రారాశుభంగ. వలె.

విన్నావెమిత్రా! యీ। వేశనాచరిత్ర॥విన్నా॥వినుటకుంజిత్రి। మీ। వేశనాచరిత్రి ॥విన్నా॥ ఇంటిలోపోరహో । యింతింతయనరాదు। కంటకమాయె। వే। గమెనాచరిత్ర॥విన్నా॥చెప్పినరీతిగం। జేయదుపెండ్లాము। తిప్పలబెట్టు। నీ। తీరునాచరిత్రి ॥విన్నా॥ మోక్షగుండేశుని। సాక్షినాతో బ్రితి। కక్షగజేయు। వే। గమెనాచరిత్రి ॥విన్నా॥

వ. ఇహపరసౌఖ్యంబులకు నాలవాలముదార యనుకారణంబు ననోరిచి యెంతబోధించినను భస్మహవ్యమువలె వ్యర్థమగుచున్న యది దీనికేదైన యుక్తి చెప్పుము. సఖా! అనివేడిన.

సఖుని-క. క్రమముగఁబనిసెప్పినన।క్రమముగఁ దానాచరించుఁ ♦ గావుననీవ। క్రమముగఁజెప్పుముతానది। క్రమముగఁ గావించునదియ ♦ కార్యముపొమ్మా-

వ. ఈయుపాయంబున కచ్చెరువంది భిక్షుండుందక్షణమున గీము నకువచ్చి యువి పరీక్షింపంగోరి.

సంపతులవివాదము-మానినీవృత్తము.

భి. మానిని! నాప్రియమిత్రుండు ధూర్తుండు, మానుగ విందుకుంబిల్వకుమా। నేనునునాతనిఁ బిల్వనునాపుడు.

కల. నేరవుజ్ఞానవిహీన! ధరన్।వానిసమానుండు లేడు కృతఘ్నుడ, పాపరమాప్తునిదూరెదవా। మానుగనేఁజనివిందుకుఁ బిల్తును, మా వలదన్నను మానుదునా!

వ. ఇట్లుపలికి యతనిదోడితెచ్చి మృష్టాన్న తృప్తునింజేసి పంపితి నదిమొదలు నిషేధోక్తు లాజ్ఞాపింపుచు సంసారంబు నెరవేర్చుకొనుచుండి యొకనాడు.

సంవాద-కీర్తన, ఆటతాళము, రామునంపిన. వలె.

భ-ఇద్దినమునసాతండ్రిది। తద్దినమువినగదె। ముద్దుగుమ్మ! నేఁ వేర్పవద్దు మనమిద్దరము ॥ఇది॥

కల-అద్దిరా! యిదేమియబ్బ! తద్దినముమా! నుమర। బుద్ధిలేమా రకుంటు! పెద్దలిదిమెచ్చెదర॥అద్ది॥

భి-మాటికినేటేటఁబెట్ట। నేటికిదిబోటి! విను। కూటికై పితరులి! చ్చోటికరుదెంచెదరె॥ఇద్ది॥

కల-పోటికోడుకవునీవు! చేటులకుమూలమిది! సాటివారువెలి వేసి యరె! టాటోటుమాటలుచాలు ॥అద్ది॥

భి-ఆక్షేపణలేకయుండ। దీక్షగనేనొక్కనికిఁ। గుక్షికింతకూడువెట్టి! యాకణమెపంపెదను ॥ఇద్ది॥

కల-మోక్షగుండశౌరిపద। సాక్షిగనుశాస్త్రవిధి। లక్షింపక యిచ్ఛాగతి! నీక్షితిఁజరించెదవె ॥అద్దిర॥

వ. ఇట్లు భర్తను ధిక్కరించి తక్షణమపోయి పదునెనిమిదిమంది భోక్తలను నియమించి గృహాదులు శుద్ధిచేసి సమస్తశాక శూపభక్ష్యాన్నములు సిద్ధపఱిచి భోక్తలఁదోడితెచ్చి శుద్ధాసనాసీనులఁజేసి యర్చింపుమన.

భిక్షుండు-నాకు శరీరముజబ్బుపడినది స్నానము మానుదునా?

కల-ఇంతదురాచారుఁడవా! స్నానముమానిన వృథా శ్రాద్ధముకాదా!

భిక్షు-(స్నానముచేసివచ్చి యథావిధినర్చించి)

సంవాదము-ఉత్సాహావృత్తము.

భి-అందఱు౯ భుజించుదనుక♦ నాఁగలేవుభామినీ! ముందునారగించిపిదప ♦ భోక్తలకునుబెట్టుమా!

కల-మందమతివి ధర్మశాస్త్ర ♦ మతమునీకుఁదెలియదా! ఇందఱి౯ భుజింపఁజేసి ♦ యేమపిదపఁదినియెద౯.

వ. ఇట్లుపసవ్యంబుగఁజెప్పిన పనులెల్ల సవ్యంబుగ నాచరించుచుండి నప్పుడు బిండప్రదానంబుతోఁగూడ శ్రాద్ధంబునెరవేర్చె.

సంవాదము-మత్తకోకిల.

భి-ఈదినంబుపవాసముండెద♦ నింతనేభుజియింపనా। మోదమం

దిభుజించుమిప్పుడు♦మూముజాములుమిాతేనా.

కల-వాదమా! యిది పైత్రృకం బుప♦ వాసహేతువుగాదుమ|స్త్యా దగన్దినుమంచుఁబెట్టితి♦నారగించెదునాతఁడుఁ.

వ. అటుపిమ్మటఁ బ్రిమాదంబున.

తో. ఈపిండంబుల| నిపుడుగంగలో| నింతివై చిరమ్మనఁగ| బాపమనక మల, కూపములోనవి| పడవై చితినా వెనుక॥రామ|

వ. ఆయకృత్యంబున కసూయనొందియు నదిలోపలనడంచికొని.

క. మలకూపంబుననుంచుము| జలములలోఁ వేయఁ దగదు ♦ సతి యన మలిన| స్థలమందు నుండనీయక| తలఁగించిజలంబులందుఁ♦ దప్పక యిడితిన్.

వ. అట్టివిపరీతకృత్యంబునకునోర్వలేక యలుకరెట్టింపభిక్షుండు.

భి-కీర్తన, ఆదితాళము, కేదారగౌళ, ఇంతరంసం-వలె.

ఎంతగయ్యాళివేనీవు| నా| శాంతముఁ బోద్రోచినావు, కుంత ముందూరిచి| గొంతుసింపి| గుంతలోఁద్రోతునా| దోషకారీ! హాంతకారీ! తంత్రకారీ! యంతమొందింతుమ| దీంతునొంతు॥నెంత॥దీక్షతో నాయిల్లు సేరిపత్రితి| కక్షఁబూనితివౌరా| మోక్షగుండేశుని సాక్షిగాను| శిక్ష గావింతునుజిక్కపట్టి| రక్షపెట్టి| రాతఁగొట్టి| భిక్షుకుఁబాపింతు| నీ క్షణమున ॥నెం॥

వ. కఠోరంబుగాఁబలికి నన్నుత్యజించి కులశీలసుగుణంబులుగల యొకకన్నియను బెండ్లియాడిన నేనురోషించి విషపానంబున నసువులువిడిచితి నప్పుడు.

కల-తో. దండధరునిదూ, తలువచ్చిరి యుద్దండపరాక్రమ మొప్పఁ| జండశాశనము| సలుపుచుగొనిచని| శమనునిసన్నిధినిలువ॥రా॥

చ. శమనుఁడు చిత్రగుప్తుఁగని ♦ చక్కగనీబిడచేసినట్టికర్మము లువిమర్శచేసి వివ ♦ రంబుగఁదెల్పుము నాగనాతఁడా| క్రమముగణించి దేవరని ♦ రంతరమిాచెలి పాపకృత్యముఁ| బ్రిమదముతోనొనర్చె ని

ది ♦ బంధురశిక్షకుఁ బాతురీరాలగుఁ.

చిత్రి-సీ. ఇష్టాన్నమును భర్త ♦ కీయక తినె గాన వల్గునీజన్మం
బు♦వడసిన్వమల। భక్షణయగునిజ♦ భర్తతో ద్వేషించి కలహించెనిత్యం
బు గాన నడచి। పందివైయెన్వమలము ♦ భక్షించుచుండును బాకభాండము
నుంచి ♦ భర్త సూడ। కుండమ్ముందుగఁదిని ♦ యుండెనుగావునఁ బిల్లివై
తనుగన్న♦పిల్లలఁదిను। నధిపుసాధింప నాత్మహ ♦ త్యయొనరించెఁ। గానఁ
బ్రేతశరీరంబు ♦ పూనిముందు। ననుభవించియనంతర ♦ మవనిమీఁదు।
తనువులెత్తఁగదగు భామ ♦ తనయ! యిపుడు.

చిత్రి-తే. (ప్రేతశరీర। పేతయగుచు మరు।భూతలమున నుండు
టకుఁ। బీతిగనాజ్ఞాపించి పంపుఁడిదె-దూతల వెంబడినటకు॥రా॥

చిత్రి-వ. ఇది క్రమమైన శిక్షయని చిత్రిగుప్తుఁడు పలికిన విని
యమమండునిజభటుల కాజ్ఞాపించిన.

కల-ఉ. దూతలు నన్నుఁదెచ్చి పగ ♦ తో మరుభూమిని జేర్చియిచ్చటఁ
(బ్రేతశరీరమిచ్చి విడి ♦ పించిరి పంచదశాబ్దముల్ సనెఁ
జేతముత్క్షుత్పిపాసలఁ గృ ♦ శింపఁగఁదాళఁగ లేక నేనుగ్రా
మాతటమందుఁజేరఁగని ♦ నన్నటనుండగనీకఁ గ్రమ్మరఁ.

వ. హరిహరదూతలుగొని తెచ్చియీనిర్జలప్రదేశమునవిడిపించిరి.

కల-కీర్తన, తోడి, ఆదితాళము, వినవేయొకమనవి-వలె.

ధరణీసురతిలక। తత్ప్రభృతియిందునే। తాళయుండు॥ ధర॥ తర
ముఁగాదికను। భరియించుటకును। తరిగెబలమంతఁ। దనరెబలుచింత ॥ధర॥
అలసితికడుదాహమునఁ। వ్యాకులముఁగలిగెనాకలికిఁ। నిలువవశముగా
దు। నిజవ గనునా ని। కలుషమడఁచితి। కరుణనుగాచితి॥ ధరణీ॥ అయో!
ముందుతి విధయోనులనుబు,ట్టుయోగమునుధర। డుల్లఁగ మెల్లఁగనల్లన
జేయుము॥ధరణీ॥ క్షితిఁబురా,కృత దురా,గతంబు। హతమొనరించితివి।
ధృతపుణ్యమతివి॥ధర॥ వెలయఁదపోబలము। గలతను మహిమము। దెలి
య నెవరితరము॥ధర॥జగన్నుతుండైన।మో,క్షగుండహరికరుణ.వడసిన ॥ధ॥

వ. నేనెంతదురంత పాపములుసేసి యింతవంతపాలైనను భవద్దయాంతఃకరణమున నా కొఱంతలు దీరెఁ దమకసాధ్యంబేదియు లేదు. నన్నుగడతేర్పవలసినది. దీనదయాపరా! యని వేడినవిప్రుండు.

సీ. నీవుసేసినపాప ♦ నికరంబులెల్లను నిర్మూలమయ్యెను ♦ నేటితోడఁ। బ్రేతత్వమునుబాసి ♦ పిమ్మటయోనిత్రి- యంబునొందగఁజాల♦ ననివిచార।పడెదవునీకు♦ నపాయంబులేని యు ♦ పాయంబుఁగంటిని ♦ భయపడకుము। జన్మాదిగానేను ♦ సలిపినకార్తిక। వ్రతఫలంబుననర్ధ ♦ భాగమిపుడు । ధారవోసితిఁగొనుమని ♦ ద్వాదశాక్షర । మునుజపియించి తులసీయు♦తముగ జలము।పాణియందుంచఁ బ్రేతరూ♦పంబడంగి। విమల లావణ్య యగునొకఁ ♦ వెలఁదియయ్యె.

వ. అంతనాయింతి యనంతతేజోభిరామమై ధర్మదత్తునకుఁబ్రణమిల్లి.

కల-స్రగ్విణి. నీప్రసాదంబునన్ ♦ నేనుధన్యాత్మనై। సుప్రభాయుక్తమా ♦ సుందరాకారమున్। విప్రచూడామణీ♦ వేగఁగైకొంటినా। నాప్రకారంబులం ♦ నాకుమేలయ్యెడిన్.

వ. ఇట్లనుచుండునంతలో దేదీప్యమానమగు నొకవిమానముఁగొని విష్ణుదూతలరుదెంచినఁ గనిధర్మదత్తుండు వారికి సాష్టాంగ నమస్కారంబులర్పించి.

ధర్మ-తో॥ ఈవిమానమును నెవరికొరకునీ- రిచటికిఁ దెచ్చితిరిపుడు। నావైనమునా। కానతియ్యుడని। యడిగినంతవారపుడు॥రామ॥

విష్ణుదూతల-కీర్తన, కమాస్, జుల్వ- నేరమేరబార-వలె.

నేలవేలుచా! వచింతు। మాలకింపుమా। మేలుగభువన।మీలెను వనమాలిబహిర్ద్వార। పాలురము మేము॥నేల॥ ప్రేతరూపంబున। నీ తెరవున న్నన్న! పాతకురాలినిదే. నీతపోబలమున । నాతినిజేసితి। వ్రాతరుణిందుపు। నీతురాలయ్యెను॥నేల॥ శ్రీమోక్షగుండేశుఁ,శ్రీ మాధవుండుదా। వైమానికపుఁబంపెను। భామలతోనీవు। నీమానినీమణి। యీమేటిపుష్పక। మెక్కుడుపోదము॥నేల॥

ఉ. చిన్నటినుండి శ్రీహరికిఁ ♦ బ్రీతిగఁ గార్తికమాస సువ్రతం| బె
న్నఁగఁ జేసినావు జపి ♦ యించితి వెప్పుడు ద్వాదశాక్షరిన్| బన్నుగ జాగరం
బు నుప ♦ వాసములున్ జరిగించినావు నీ| కన్న ఘనుం డెవండు త్రిజ ♦
గంబుల భూసురవంశ శేఖరా!

గీ. అట్టిపుణ్యంబునందు న ♦ ర్థాంశమిపుడు| దానమొసఁగితి వీ
మెకుఁ ♦ దానఁ జేసి| ద్విగుణమయ్యెను బుణ్యంబు ♦ ద్విజవరేణ్య| విష్ణు
మూర్తి కినదిమహా ♦ ప్రీతియయ్యె.

క. సుకృతార్ధంబును గొనుటను| సకలాఘంబులకుఁ బాసి ♦
సద్గుణఖనివై | యకలంకరూపతేజము | బ్రకు: దానకమయ్యె నీమె ♦ లా
వణ్యనిధీ!

వ. ఈకారణంబున మీకు విష్ణుసాయుజ్యంబు గలిగె భక్తపరా
ధీనుండగు వైకుంఠుని దయారసంబపారంబు వినుము.

సీ. హరినిగారాధింప ♦ నొత్తానిపావెకి దారకామండల ♦ స్థా
యిదోరకే | గ్రాహగృహీతయై ♦ గజరాజు ప్రార్థింప గ్రాహంబునుంచి
నా ♦ గమునుగాచె | హరిచక్రమునఁగూలి ♦ నట్టియాగ్రాహంబు విజ
యుఁడై జనియించె ♦ గజముజయుఁడు| నాబుట్టియుపురు ♦ నారాయ
ణుని పార్శ్వచరులైరి వారలె ♦ ద్వారపనేను | విష్ణుఁగొల్చుచునుందు నా ♦
విష్ణునాజ్ఞ | మిమ్ముఁ గొనిపోవ నీవిమా ♦ నమ్ము వెంట| వచ్చినాను హరి
పరిభా ♦ వమునఁ గాదెఁ| మాకుఁ జెడిపోనివవి సం ♦ భావ్యమగుట.

వి-దూ-కీర్తన, కాపి, ఆది, ఆనాతిమ్మ్నవలె.

ఆనందాబ్ధి, లోనదోగుచు| గదలుఁడిపుడు||ఆనం|| మేనుప్పొంగ|
గానునీవి| మానమున, మఱియెక్కుడు||ఆనం|| నారాయణుని| జేరిచెదము|
మీరాఘునుని| కారుణ్యమును| గోరినిర్వి| చారసుఖము| లారూఢముగ|
ననుభవింపు||ఆనం|| దీక్షపుణ్యము క్షీణింప| నాక్షణంబునను| మోక్షగుం
డనం, రక్షునిపనుపున| నీకుమాతలి| కరుదెంతును|| ఆనం||

ఆ. ధర్మదత్తనీవు ♦ దశరథుఁ డనుపేరఁ| బ్రొద్దు కొలమునందుఁ ♦

బుట్టఁగలవు। నీసతీమణులును ♦ కౌసల్యయు సుమిత్ర। యనఁగఁ బుట్టి భార్య ♦ లగుదురపుడు.

క. జగతీసుర నీసుకృతము। సగముఁగొనినట్టి కలహ ♦ జనియిం చును గై। కగ నామెనీకు మూఁడవ। మగువయగుఁ భావి వర్త♦మా నమిది సుమీ.

గీ. దేవతాప్రార్థనమున శ్రీ ♦ దేవవిభుఁడు। రాముఁడన నీకును దయించి ♦ రావణాది। దనుజులనుగూల్చి ధర్మసం ♦ స్థాపనంబు। సేసిరా జ్యంబు పాలించుఁ ♦ జిత్తమలర.

సీ. మాధవచైత్రకార్తీ ♦ మాఘమాసంబుల నుదయంబునను స్నా న ♦ మొనరఁజేసి। తేకాదశీవ్రత ♦ మెప్పుడొనర్చితి బృందావనముఁవ్రే సి ♦ పెంచితరసి। బ్రాహ్మణులనుమఱి ♦ వైష్ణవులనుగోవు లనుభజియిం చితి ♦ వనుదినంబు। మదమత్సరంబులు ♦ మాని యీరీతిని జన్మవ్రతం బుగ ♦ సలిపినావు। గాన విష్ణుండు ప్రీతుండు ♦ గాకయున్నె। నీకు సా యుజ్యమీకున్నె ♦ నిన్నుఁగనుట। చేతమేమును ధన్యుల♦మైతిమహహా। హరినిదర్శింపఁబోదము♦సరగరమ్ము.

సం-వ. అనిపలికి జయవిజయులు వారిని విమానా రూఢులఁజేసి కొని దేవతూర్యరావంబులు నింగినిజెలంగఁ దక్షణంబున వైకుంఠ పు రంబున విష్ణుసన్నిధినిజేర్చిరి.

ముద్గ- కీర్తన, భైరవి, ఆదితాళము, దుర్యోధనా-వలె.

ధాత్రీశ్వరా! దశరథనామ॥ధా॥ ధర్మదత్తుఁడెం,తయు వింతగను॥ ధాత్రీ॥ గోత్రధరుని।గురురూపము।నేత్రములఁగని। నివ్వెరగంది ॥ధాత్రీ॥ మిత్రకులజనుప విత్రశౌరిపుర। చిత్రములనువీక్షింపుచు సుజన। స్తోత్ర ములకుఁ దాఁబాత్రుఁడగుచుఁగను। మైత్రిని జిరకాలమువసించి నాడచ ట॥ధాత్రీ॥ నిర్మలినంబగు నిజకృతపుణ్యాను। కర్మమడఁగినంతట నందుండ క। ధర్మదత్తుఁడీపుడమిని దశరథ। వర్మయనఁగ నవతరించె నెవరననీవను మి॥ధాత్రీ॥ అతనిభార్యలిరువురు కౌసల్యా। సతిసుమిత్రలై రిపుడు గల

హాయను। నతివకై కయనసలరెను మువ్వురు, క్షితివరసతులై చెలఁగిరి నీకును నిశ్చయము॥ధాత్రీ॥ శ్రీమిాఱఁగ శ్రీమోక్షగుండహరి। శేషశంఖచక్రములు గ్రమముగను' రామలక్ష్మణభరతశత్రుఘ్నను। నామములు నీకుఁ గుమారులైరి విను వీరెకను॥ ధాత్రీ॥

వ. జన్మాంతర సుకృతపరిపాక విశేషంబున నిన్ను ధన్యునిం జేయంగోరి యీజన్మంబున భగవంతుండు నాల్గురూపంబుల నీయం దవతరించె నీతనికతంబున నీకు విష్ణుసాయుజ్యంబు గలుగు నిశ్చయము.

క. నీవడిగినస్వచరిత్రము' నేవినిపించితిని ధారుణీవర యింకన్, దేవులతోఁబుత్రులతో। వేవేగనయోధ్యనేరి విశ్రాంతిమెయిన్.

వ. నిజరాజ్యపాలనంబు సేయుచు సుఖంబున నుండుమని యాశీర్వదించిన దశరథుండుఁ గళత్రపుత్రసహితంబుగ మునీంద్రున కనేకప్రణామంబు లాచరించి వారినివీడ్కొని యనంతరంబో పార్వతీ॥

శివుని-తో. వందిమాగధులు। బృందములై తమ। ముందుఁబొగడుచునునడువ। దుందుభిలోనగు। తూర్యరావములు। సందడియలరగ మొరయ ॥రామ॥

వ. నిజయానంబుల నారోహించి రెండు మూఁడు దినంబులకు నిజరాజధానియగు నయోధ్యకుఁ జేరి యానందమున నగరు ప్రవేశించి. రంత దశరథుండు గొలువుకూటంబున నివసించి సభికులు విన భరతునితోనిట్లనియె.

దశ-కీర్తన, జంఝూటి-ఆదితాళం.

పామ్కిక। గేకయభూపతి-పురికిని నెమ్మదిఁ బొదలఁగ భరతుఁడ॥పా॥ నెమ్మదిని, నిన్నిపుడురమ్మనిమిా మేనమామ । సమ్మతమునఁబిలువవచ్చె॥పా॥ తాతకు, నవ్వకు నిరతము। బ్రీతినిదండము। పెట్టుముభరతుఁడ॥పా॥ మాతలునీ, మదిఁగొలువ। నీతో గూడశత్రుఘ్నుని। ఖ్యాతిగానుబిలచుకొని॥పా॥ కోరిన, చదువులు నేరుచు, కొనుముచ్చటనీవు, కొదువలు లేకను॥ పా॥ పౌరులను, భక్తిగను। ధారుణిమోక్షగుండ, ధామునినమ్ముచు వెడలి॥పామ్కి॥

అంత. క. భరతుడుజనకునియాజ్ఞను
సరగున శిరమునవహించి ♦ శత్రుఘ్నునితో
బరువడి గేకయరాట్పురి
కరుదెంచెను బంధుదర్శ ♦ నార్థముగాఁగన్.

కాండాంత తోహర॥ అనితాఖ్యారినా, రాయణకవిరా, మాయణమునుహరికథను । ఘనముగఁజెప్పెను, గద యందిది బాల, కాండము చిలుకునుసుధను॥ రా॥

ఇదివినువారల, కిహసౌఖ్యంబులు। గొదువలేక చేకుఱును । ముదమునఁదుదకును। ముక్తిలభించును । మోక్షగుండహరికృపను॥రామా॥

క. నాచేతనయినకొలఁదిని
జూచిరచించితినిదీని ♦ సుజనులు నెరసుల్
దోఁచినయెడ దిద్దుదురని
నాచిత్తములోననమ్మి ♦ నాననయంబున్.

శ్రీమోక్షగుండ రామాయణమునందలి బాలకాండము

సమాప్తము.





శుభమస్తు.

# మోక్షగుండ రామాయణము*హరికథ.

## అయోధ్యకాండము.

క. శ్రీరాముడు జానకితో

నారూఢిగఁగలసిమెలసి ♦ యంతఃపురిలోఁ

గూరిమిని నున్న వేళను

నారదుడరుదెంచె దర్శ ♦ నముజేసికొనన్.

కీర్తనము, ఆదితాళము, కళ్యాణి.

సీతాధిపకరుణా। సాగరా॥సీతా॥ ఆధారాదిష। డ్జసమన్విత।
బోధరూపగుణ, భూషణా-గుణభూ॥ సీతా॥
శుద్ధస్ఫటికప। శోభితచిన్మయ। సిద్ధయోగి హృద్గోచరా॥ సీ॥
వ్యష్టిసమష్టిమ। యప్రపంచఘన। సృష్టిస్థితిలయకారణా॥ సీ॥
రాక్షసహర నా, రాయణకవినుత। మోక్షగుండపరి, పాలకా॥ సీ॥

సం-తోహర.

అరుదెంచినయా। సురముని కెదురుగఁ। దరుణితోడఁ దానరిగి।
సరగునరఘుపతి, సాష్టాంగనమ। స్కారములిడియనెఁ జెలఁగి॥ రామ॥

మునినాయకమా, బోటిగృహస్థుల। కనయంబునుమీవంటి। ఘ
నులదర్శనము। గలుగుటదుర్లభ। మనఘుడనైతిని మంటి॥ రామ॥

వ. అనిన నారదుడిట్లనియె.

నార-కీర్తనము, ఘరజురాగము.

నీమాయనుదాటగ। నేర్తునా। రామ॥నీ॥ ఏమాత్రమునీ। యెరుక
లేకను। సామాన్యముగను। సర్వేశా! హరి॥ నీమా॥

నీవుహరివిశ్రీ, దేవియెజానకి। దేవనీకృపచే। దెలిసితిరామ॥నీ॥
సకలపురుషరూ। పకుడవునీవే। సకలయువతులీ। జనకజరామ॥ నీ॥
భువినిమోటుగుండ। ధవనారాయణ। కవినుతసాధుల। గావగదేరామ॥నీ॥

గీ. రాజ్యభారంబు దశరధ ♦ రాజునీకు
నీయఁదలచెను దానినీ ♦ వియ్యకొనిన
రావణాది నిశాటవ ♦ గములఁదుంచి
మమ్ము రక్షించుటెన్నడు ♦ మదనజనక?

వ. అనిన శ్రీరామచంద్రుఁడు నారదున కిట్లనియె.

రాము-కీర్తనము, ఆదితాళము.

దేవమునీశ్వర! దెల్పెదను। నావాక్యంబులు నమ్మివిను। రావణాదిదు, ర్మార్గులఁదుంచి సు! రావళిఁ బ్రోచుట-కరుదెంచెదనే॥దేవ॥ దండకాటవిని। దాపసవృత్తిని। నుండెదబదునాల్గేండ్లుచటు। మెండుగసీతా। మిషమునఖలులను। ఖండించెదమోటు। గుండేశుడనై ॥దే॥

వ. ఈప్రకారంబున శ్రీరామచంద్రుని రావణవధార్థము చనుమనిప్రేరేపించి ముమ్మారునమస్కరించి రాముల సెలవుపొంది నారదుండుయథేచ్ఛంజనియె. అంతదశరధమహారాజు రాజ్యపాలనంబుచేయుచుఁ గొలువుకూటంబునఁ బరివేష్టించియున్న సభ్యులఁగని యిట్లనియె.

దశ-కీర్తనము, అటతాళము-కాఫిరాగము.

వినుడిదిసభవారు, విన్నపమొక్కటి, ఘనముగముదిసితి, మనమునరోసితి, పనిబూనిరాజ్యముఁ, బాలింపఁజాలను। గనుకరామునకును, గట్టుదుఁబట్టము॥విను॥ మీకిదిసమ్మత, మేకదదీనికి, జేకొనిసర్వము, సిద్ధముసేయుడు, మాకులమునగల, మర్యాద యగునివె, యాకరుణాంబుధి, యగ్రజుఁడర్హుఁడు॥ విను ॥ భరతశత్రుఘ్నులు, పరగఁగలేరట, నరిగిరిమాతుల, పురమునుజేరగ, ధరనునారాయణ, దాసనుతుండగు, వరదునిమోటుగుండ। హరినిదలంచుచు॥ వినుడిది॥

సం, తోహార.

వదలకదశరథు౯। వాక్యంబులుసభ, వారలుదామూలించి, సదమలమతులయి, సంతోషింపుచు౯, బిదపననిరి యోచించి॥ రామ॥

సభి-కీర్తనము, ఆదితాళము-కళ్యాణి.

ఇదిఘనకార్యము। భూవరా! మా॥కిది॥ ఎదలోపలనీ। వెంచినకార్యము। ముదమున౯జేయుముచాలు॥ ఇది॥

మేలుగత్రిభువన, మేలెరునేతను, నీలోకము నేలుటెంత॥ ఇది॥ మోక్షగుండరాము, మూర్తి౯నిమాక, ధ్యక్షునిజేయుము, రాజ॥ఇది॥

వ. అని సభ్యులు పలికిన.

సం, దశ, తోహార. అప్పుడుదశరథు౯డావసిష్ఠు౯గని, యయ్యా! కులగురువర్యా!। ఇప్పుడు రాముని। కిది యెఱిగింపగ, నేగుము సద్గుణధుర్యా॥ రామ॥

క. అనుడువసిష్ఠు౯డు రాముని
గననేగినవారిరాక౯ ♦ గనిరాము౯డెదు
ర్కొని కాళ్ళుగడిగి తజ్జల
మును శిరమున౯జల్లుకొనియె ♦ ముదితయు౯దాను౯.

వ. ఇట్లు కులగురువును దోడితెచ్చి రత్నపీఠంబుపయి కూర్చుండ౯జేసి పూజించి కరకమలంబులు ముకుళించి రాముండిట్లనియె.

రా-కీర్తనము, అటతాళం, నమిలాం-వలె.

మాకుశుభంబువిూ। రాక కేవలమును, శ్రీకరమైయున్నది, ధీరవర॥ మా॥ పాకటముగగృహ। పావనమాయెను। మాకులమిదెపాదలె॥ధీర॥ తమ। పాదాంబువు। దాల్చుటకతనసా, ర్థకమాయెనాజన్మము॥ధీర॥ అవిరళమోక్షగుండాధీశు౯గొల్చువిూ। రనఘులుధన్యాత్ములు। ధీరవర॥మా॥

సం-తోహార. ఇనకులవర్యం, డీరీతిగనన। వినివసిష్ఠమునివరుడు। మనమునవలరుచు, మాబోంట్లనునీవు, మాయల౯బెట్టెదవెపుడు॥ రామ॥

నీపదజలమును।నెత్తినదాల్చెను। నీలగఘుడుశ్రియమునను। నీపదజ

లమున। నీరజభవుడవు। నీతుఁడ య్యెగ్రమమునను॥ రామ ॥

ఇటులనుటుపదేశించుటగాదే! యిలలోగలజనులకును। బటుతర సాక్షివి। పరమాత్ముఁడవను। ప్రజ్ఞ గలదుమీదయను॥ రామ॥

వశి-కీర్తన, జంఝూటిరాగము-అటతాళము.

దేవదేవుఁడవు। నీవుపుట్టినావు। రావణవధకుశ్రీ, రామా! రామా వేవేగమీసేవ। గావింపనీదూష్య। జీవనమందుంటి। నీవరకు॥ దేవ॥

అగుణుఁడవగునీవు। సగుణుఁడవై యిందు। భగవంతుఁడనగను బ్రిబలితివి। తగనిన్నుఁగనుగొంటి। ధన్యుడనయితిని। జగదీశ మాయలోఁ దగిలించకే॥ దేవ॥

గురుగురుఁడవునీవు। గురుఁడనినన్ననుట। కరమొప్పనాభాగ్యగరి మగాదే। నరపాలతాళ్ళూరి। నారాయణార్చిత। వరదమోక్షగుండ। వాస రామ॥ దేవదేవుఁడవు॥

వ. అనిపలికిన సంతోషించి శ్రీరామచంద్రుండిట్లనియె.

రా-తోహర. మీరరుదెంచిన। కారణమేమో! కోరి తెలుపుమో స్వామీ! సారెకునేశిర, సావహించియది। నలుపునుసంశయమేమీ.

వ. అనిన వశిష్ఠుండిట్లనియె.

వశి-కీర్తన, రూపకతాళము, మధ్యమావతి.

రఘునందన! రఘునందన! రఘునందనరామా!॥ రామా॥

అఘసంహార! రాజ్యమునీ। కర్పింపగ। నెంచెరాజు ॥రఘు॥

ముద్దియతోఁగూడ నెక్క। పొద్దుందును నేను రేపు। పొద్దున మీతండ్రిగారి। యొద్దకునే తెంచినచో। ముద్దుగనన్నియుఁ దెలుపును॥రఘు॥

ఈక్షితిపరిపాలనమున। కీయర్హుఁడగుదువయ్యా! మోక్షగుండపుర మందిర। సాక్షాన్నారాయణకవి। రక్షకనేవీక్షించనియెద ॥రఘు॥

వ. అనిన.

సం-తోహర. మంచిదిమీయను। మతమురీతిగా। వించెదబొండ నియనగ। మించినభక్తిను, తించదశరథుని। గాంచనేగియిట్లనెగా॥ రామ॥

శ్రీమీరఘురఘు। రామునికన్నియు। జెప్పివచ్చితినిరాజా! క్షేమం బుగ నభి, షేకదివ్యము। జేర్పింపుమురవితేజా ॥రామ॥

క. అనిన నృపాలకుఁడు సుమం
తునిగనియిటుచేయుమనిన ♦ దోడ్తోభటులన్
గనియతఁడాజ్ఞాపించుడుఁ
జనికూర్చిరి సకలవస్తు ♦ సంభారంబుల్.

రగడ. అంతనృపాలకు ♦ నాజ్ఞనుజారులు । వింతఁగదెల్పఁగ♦విని యాపౌరులు। చెలువుగఁబురిగై ♦సేసిరి చేలగిరి। నిలయంబులు ప♦ న్నీట నునలికిరి। ముత్తెపుముగ్గులు♦ముదమునఁబెట్టిరి। చిత్తరువలదిరి♦చిలుకలు గొట్టిరి। పలుతోరణములు♦బరువడిగూర్చిరి। చలువపందిళులు♦ చయ్యన దీర్చిరి। ఎచ్చటఁగనహా♦ యింతురుభేరులు । ఎచ్చటఁగనదీ ♦ వింతురుపౌరులు। తులలేకనుబహు♦తూర్యనాదములు। వెలసెనునంతట♦ విపులమోదములు। కడువడి గాయక♦గణములుపాడఁగ । గడనచేడియలు♦ఘనముగ నాడగ। మంగళజలములు♦మరితెప్పించిరి। అంగుగ నభిషే♦కార్థమ్మొంచిరి। పురియెల్లెడలను♦ బొలుపునఁజూడగ । మురియుచుజనములు♦నుచ్చటలాడగ। నాకలకలరవ♦మటుమందరయును ! కైకదాసి చక్కఁ♦గ దావినియును। నొక్కమేడపై♦ కొయ్యననెక్కియు । గ్రక్కున నాశ్చ♦ర్యంబునఁ జిక్కియు। రామునిదాదిని♦ రయమునఁగనుఁగొని। భామినియిట్లని♦పలికెను ఘనముని.

మంద-కీర్తనము, జంఝూటి, ఆదితాళము.

ఏమది! చెలి! నామది। కెరింగింపవమ్మ ॥యేమది॥
భామినిరో! పట్టణము। నేమి, టెక, లంక, రించి ॥రేమది॥
కానగ ను, కౌసల్య। దాన, ముల, నిచ్చు, చున్న ॥దేమది॥
చేడియలు। నేడేమొ। వేడు, కలు, సేయు, చుండి ॥రేమది॥
భూమినిశ్రీ। మోహనగుండ! స్వామి, దయ, తోడఁ, దెల్పు ॥మేమది॥

తోహార. తన్నడిగినమం, దరకారామునిదాదియిటుల దానని

ను। బన్నుగ రాముని। పట్టాభిషేకం। బెన్నగ రేపనవినెను ॥రామ॥

తందరనొందుచు। మందరకై కేయి! మందిరమునకును జేరి। క్రిం దటి కసిదీ, ర్చుకొన సమయమని! తొందరపడియూనారి ॥రామ॥

కేళీగృహమున డోలికమీదను। బాలపాన్పుపై జాల। లీలతోడం బవ, ళించియున్నయా। లేమకనియెనవలీల ॥రామ॥

మందర-కీర్తనము, కళ్యాణి, ఆదితాళము.

సరోజసమానముఖి ! భరింపగజాలసఖి॥ సరోజ॥

నరా, ధిపుం, డరే, యరే, ధరి, త్రినె, ల్లరా, ముడే॥భరించన్। వరించెన్। బరోక్షంబునన్ ॥సరోజా॥

ననున్, గనుం, గొనున్, బ్రియుం, బునన్, విభుం, డనం, గనె, దినంబున్, ఘనంబున్ వినేయుండుదున్ ॥సరోజా॥

క్షమా, ధిప, త్యమె, ల్లనీ। కుమా, రుడూ, నమో, క్షగుం, డమాన్యుం, డుమీకున్। బ్రిమోదంబిడున్ ॥సరోజా॥

తోహర. నీమీందను కడు, బ్రేమగలిగితే, నీకొడుకునుబోనాడి। రామునకిచ్చెనె, రాజ్యముదశరథ! రాజుకపటివగలాడి ॥రామ॥

వ. అనిన పలుకులు విని కైకాదేవి మందరను గసరిచూచు నిట్లనియె.

కయిక-కీర్తన, దర్బారు, అటతాళము.

రామునకీయ్యగ। రాదటెరాజ్యము। గోమలినీకింత। క్రూరమెటు లగలిగె ॥రామున॥

ఘనముగఁగౌసల్య। కన్నసుమిన్నగ । గనుచుండునన్నును । గడు గుణవంతుడగు ॥రామున॥

ఈమేలు వాతఁనా। కెరిగించినందుకు। బ్రేమతో ముత్యములఁ। దామమిచ్చెదగొను॥ రామున॥

భరతునకైననేమి। ధంమోక్షగుండరఘు। వరునకునైననేమి। యి రువురొక్కటెనాకు ॥రామున॥

వ. అనిన మందర గటగటపడుచు నిట్లనియె.

మంద-తోహర. నీసంతోషము! నీటనుగలియును! నీసుతుండెక్క-
వగాదా! ఈసువహింపవు! ఇంతమూర్ఖమా! ఇకనయిననువినరాదా॥ రా॥

కీర్తన- నీలురాగము, ఆదితాళము.

తల్లితల్లి! భరతుని, తల్లి! ననుగన్న,తల్లి! వినుమీతల్లి! తెలిపెద!
తొల్లినన్ను నీ! తోగూడమీ, తల్లిదండ్రులే! దాసిగబంపిరి॥ త॥ తడయు
కరాముని! ధరణిజనునీ, కొడుకునుగోడలు! గొలువగవలదా॥త॥ సవతియు
యిన కౌసల్యకులోబడి! తివిరిదాసివై! తిరుగవలదేనీవు ॥త॥ ఆక్షణమే
వారి పక్షమగునుపతి! మోక్షగుండవిభు, సాక్షిగం దెలిపెద॥త॥

తోహర. భరతునిదేశ! ప్రభునిజేయుమని! పదునాల్గేండ్లడవులకు!
బరువడి రాముని! బంపుమనుచునీ! వరునడుగుము మేలుమనకు॥ రామ॥

వ. ఇట్లుపలికినం ద్రివక్రవక్రోక్తులు విని యర్థాంగీకారంబున.

కయిక- కీర్తన, ఆదితాళము.

ఏమనియడిగెద! నామనోనాథుని! రామునిగానన! నీమకంపుమని॥ఏ॥
అడిగితిబోన! న్నదలించుచునుగాని! చెడుకార్యంబును! జేయునటేసఖి॥ఏ॥

కైకమానసమెంత, కఠినంబనుచును! లోకులునన్నను! శోకనుబో
దురా ॥ఏమ॥ సాకెన్నారాయణ! రక్షకుడయినట్టి, మోక్షగుండేశుడే!
మోహన రాముండు॥ ఏమని॥

ద్వి- అనియిటు పలికిన- నాకైకతోడ! ననియెనామందర యతి
హర్షమునను! యువతిదేవాసుర- యుద్ధంబునందు! దవిలి యేతెంచియు
దమకుదోడ్పంగ! నింద్రుంముగోరిన- నేతెంచిదశర! థేంద్రుండు నీవప్పు
డేగితివెంట! రథచీలయూడంగ-రణమధ్యమందు!రథచీలగా నీక, రంబుంచి
తబల! నీదుధైర్యమునకు, నృపుండలరారి ! నీదుకోరికదెల్పు, నేనిత్తురెం
డువరములననియెనీ, వలననేవింటి! మఱచితివిపునే- మఱవంగలేదు! ఒక
దానికినిరాము-నగాంటవులకు! ప్రకటితంబుగంబంప, బదునాలుగేండ్లు!
మఱియొకదానికి- మనభరతునకుం- గరుణతోంబట్టంబుం - గట్టునట్లుగను!

గోరుమునీకోర్కె-కొనసాగువిభుఁడు సేరవచ్చెడివేళ చెచ్చెరవచ్చె.

మంద- కీర్తన- బేగడరాగము- ఏకతాళము.

జవదాటకే, చానరోనామాట॥జ॥ ధవళాక్షినీకోప।భవనముజేరుము॥

జ॥ అలివేణిసొమ్ము। లలంకరింపకు। మలినాంబరము। మానకగట్టుము॥జ॥

క్రిందబరుండుము। సుందరినాథుని। జిందరవందర। చేయుమునామాట॥జ॥

మోక్షగుండేశుని। సాక్షిగబల్కెద। దీక్షతోనీకోర్కె। దీరునునామాట॥జ॥

తోహర॥ అప్పుడుకైకదాసి। యగుమందర తన, కుపదేశించినకర

ణి। జపలతతోడుత। నలుపదలచికోప। సదనముఁజేరెయువరుణి॥రామ॥

భూమిపయినబడి। పొరలుచునుండగ। భూమీశ్వరుడేతెంచి।కామి

నిబాస్సున। గానకద్వారకు।గనియడిగెను వివరించి॥రామ॥

కైకయేదిరా! కనబడలేదన। గారణమెరుఁగనురాజా! ప్రాకటము

గగోప। భవనముచేరెను, బరికింపుమమారాజ॥రామ॥

క. ద్వారకుఁడు తెలుపఁగానా

నారీమణివార్తఁదెలిసి ♦ నరపాలుండే

కారణ, మోయని పొగులుచుఁ

జేరగఁజని దేహమును స్పృ ♦ శించుచుఁబలికెన్.

దశ- కీర్తన, ఆదితాళము.

ఇదియేమే! సుదతీలలామా! యిటుమళ్ళిచూడవేభామా॥ఇది॥

కోమలి! నీకింత! కోపముగల్గుట। కేమిలోపమువచ్చె॥ నిది॥

వెలలేనిచీరలు। విడిచియీరీతిగ। మలినవస్త్రముగట్ట॥ నిది॥

కొమ్మరో! రత్నపు। సొమ్ములనొల్లక। నెమ్మదివగవగను॥నిది॥

మృదుసుమతల్పము। వదలియీడిగువను। సుదతిపరుండగను॥నిది॥

శ్రీమోక్షగుండ। స్వామియెసాక్షిగ। నీమాటమీరలేదే॥ నిది॥

తోహర॥ ఎవరయినను ని,న్నెగ్గులుపలికిన। వివరింపుమునాతోను।

భువిఁజెలులయినను। బురుషులునైనను। బొరిగొందునువ్యథమాను॥రా॥

నినుయాలించిన। నిరుపేదలనై। నను ధనికులజేసెదను। నినుదూ

రిన చో। ధనికులనయిన నిర్ధనులగునటు జేసెదను॥ రా॥

రాముని సాక్షిగ। రమణిరో! నీతల। వేమయినను నేదీర్తు। భామిని రో! నా, ప్రాణములిమ్మని। పలికిననవియుర్పింతు॥ రా॥

వ. అని దశరథుండు ప్రతిజ్ఞగాఁ బలికినవాక్యంబుల కలరి కన్నెత్తి చూచి తిన్నగా లేచి గద్గదస్వరంబున నిట్లనియె.

కయిక- కీర్తన, అటతాళము, జంఝూటి.

మాటదప్పకు రాజచంద్ర! కోటిసేయును నీదు, గుణముభూమీంద్ర! ధాటిగ దేవని! శాటుబయుద్ధము। నాటివరద్వయమిూ। నాడు నెరవేర్చు॥ మాట॥ ఒక్కదానికి భరతునకు। గ్రక్కునబట్టము, గట్టుకాదనకు। తక్కక రెండవ। దానికిరాముని। నిక్కడనుంచక। నిలువెళ్ళనంపు॥ మాట॥

దండకాటవికేగునునుము। దండిగ బలునాలుగేండ్లుండు మనుము ఖండితమిదియనా। కాంక్షితమగు మోక్ష।గుండ దేవునియాన। రెండవది గోర॥ మాట॥

తోహార॥ పిడుగువంటియూ। నుడుగుకర్ణములబడిన మాత్రము ననపుడు। గడగడవడకుచుఁ। గనువడిమూర్ఛిలి। పడియె బుడమిపయి నృపుడు॥ రామ॥

కొంతకాలమున,కును దెప్పిరితన। చెంతనున్న కామినినీ। యెంత యుగనితన। మంతనమెరియుగ। జింతతోననె నత్తఱిని॥ రా॥

దశ- కీర్తన, ముఖారిరాగము, అటతాళము.

కలికి! యిదియేమే! నాతోనిటు। పలికిఫలమేమీ॥ కలికి॥

రామునిదండకావన । ములకుబంపుమటంచునాతో । నళుకకను కఠినాత్మగాలా! పలుకనోరెట్లాడెనీకుఁ॥ కలికి॥

నిరతముబాగడుదువు। రాముగుణ। నికరమెన్నుదువు। సరగ నాకు పచారములుదా। సలుపునాకౌసల్యతోడను । సరిగ ననుచుండుదువు నీవీ వటుకునది యిపుడేలమరచితి॥ కలికి॥

ధరలోదాళ్ళూరి। నారాయణ। దాసుకడజేరి। వరములిమ్ము శ్రీమో

క్షగుండని। వాసుదేవలో మెచ్చవలదా। భరతుఁడిలనేలినను రఘుపతి। పురములోనుండంగదగడా॥కలికియిది॥

తోహార. అనియిటుభూపతి। యతినిష్ఠురములాడిన వినియాకైక। మనమునగోపము। మల్లడిగొనగా। మగనిమాటగై కొనక॥రాము॥

కయిక- కీర్తన, యదుకులకాంభోజి- ఏకతాళము.

ననుగారించక మానుమా! నాథా! నాథా!॥నను॥

మనమున నిసుమంత। నినునమ్మగాలేను॥ నను॥

వేళా, క్రోళా। లేలా। మేలా, మనుజాధిపాల ॥నను॥

పలుమా, టలచే, ఫలమా! యిల బొంకుల మా, రివిచాలు చాలు॥ నను॥

జలజాప్తా,న్వయజాతుల్, దెలియన్న, వ్వల్లకై నత్। గలలోబొంకరునీవా, కులజాతుండ, వలమర్యాద, దలపోయంగ, వలదే నేడు॥నను॥

మనసొప్పింతు। బనిగావింతు, నినుమెప్పింతు, బహుమానింతు, ననుచునుమొద,టనునవి, తెలిఁపిన। వెనుకనువినసయిచక। వెతజెందెదవు॥న॥

నాకన్నమిన్న, యాకాంతలెన్న, నీకున్నవారు, గాకేమియింక నీకావరంబు, లోకయికయాను, పోకాదటంచు, బోదోలరాదే, యీకపటము, లిటుఘటియింపుచు॥నను॥

సరగమోక్షగుండేశు, సాక్షిగశ్రీరామునకున్। ధరయిడినీదేవులతో। జిరసౌఖ్యంబులదేలు। భరతుడునే, నునుమేనుల్, దొరగెదమా, తరువాతన్, నిరంతరము, సరాసరిగ, జరించినను, భరించెదరె, సరెసరే, ధరారమణ॥నను॥

వ. ఇట్లు కయికమాట్లాడిన కఠోరవాక్యంబులకు బదులుచెప్పనోపక దశరథుండు మహాదుఃఖాంబుధిలో మునుంగుచు నారాత్రి నాలుగుయామంబులు నాలుగుయుగంబులుంబోలెఁ గడపుచుండె నంత నుదయమైన నక్కడ రామపట్టాభిషేకమందిరమున కందఱుఁ జేరిరి.

ఉ. అంతట జానకీసహితుఁ ♦ డైన రఘూద్వహుఁడగ్నిహోమ మ

త్యంతముదంబుతో సలుపు ♦ నట్లుగఁజేసి వసిష్ఠుఁడంత ధీ
మంతునిజూచిపల్కెను ♦ సు,మంత! మహీపతిరాఁడదేమొ! నీ
వెంతయుబ్రీతితోడఁ జని ♦ యిప్పుడెతోడ్కొని రమ్మపొమ్మనెన్.

సం. తోహర. అంతవశిష్ఠుని, యానతిచేత సు, మంతుడంతిపురి
కరిగి। యింతివిభుడుసభ। కేటికిరాడన। నిట్లనెగి కేయితిరిగి॥రామ॥

కయిక, కీర్తన- బేహాగ్ రాగము- ఆదితాళము.

వినుమంత్రివర్యా! కనకాద్రిధైర్య! గుణగణధుర్యా! మనరాజుచ
ర్య॥ విను॥ రామునిమీాది। ప్రేమతోరాత్రి। యేమియునిద్ర। యెరుగక
యుండె॥ విను॥ ఈవఅదనుక। లేవగలేదు। కావుననీవు। గదువడిబొమ్ము॥
విను॥ భూమీశుజూడ। భువిమోకుగుండ। ధామునిరాము। దగ రమ్మను
ము॥ విను॥

సం. తోహర. రాజదేమికారణమున బలుకడు।రాజీవాక్షిరోయ
నగ। రాజుసెప్పుమన। నేజెప్పితినిక। రామునిరమ్మనుమనెగా ॥రా॥

కైకయిటుల బ, ల్కగను సుమంతుడు। గదిలిపోయి రఘుపతిని।
బాకటముగగని। పదముల కెరగియు। బలికెనపుడు నెమ్మదిని॥రా॥

సుమం. కీర్తన, ఆదితాళము.

రామ! రమ్మికా,రఘు రామ! లెమ్మిక। భూమివిభునిజూడగాను।
బోదమింపుగ॥రామ॥ నిన్ను బిలువగ। రాజు నన్ను బంపెగా। పన్నగనాకై
కయింట। నున్నవాడుగా॥రామ॥ తడవుసేయకా! రా,దగునుమీాయిక బు
డమి మోకుగుండదేవ, పోయిచూడగ॥ రా॥

వ. అని చెప్పిన.

తోహర. అపుడురాఘవుం। డనుజ యుతంబుగ। నరదమునారో
హించి। విపులవేగమున। బిత్రుసన్నిధికి। వింతగాను జనుదెంచి॥రామా॥

తనపాదములకు। దండము పెట్టిన। తనయుని లేవగదీసి, కనికరము
నదా, గాఢాలింగన। మొనరించె జేతులగదసి॥రా॥

వ. అంతట.

క. హాహా! యని దుఃఖింపుచు
మోహంబున దశరథుండు ♦ మూర్ఛమునింగెన్
ఆహా! యీదుఃఖంబున
కేహేతువో యనుచుఁ గైక ♦ నినకులుఁడడిగెన్.

వ. ఈప్రకారంబున నన్నుఁబిలిపించి మహత్తరమయిన దుఃఖాంబుధిలో దశరథుండు మునుఁగుచున్నాఁడ దేమి! కారణము తల్లీ సద్గుణమ తల్లీ, అనిన రామునకుఁ గైకాదేవి యిట్లనుచున్నది.

కయిక- కీర్తన, కాఫిరాగము, అటతాళము.

రాజుదుఃఖకారణంబు। రామ! తెలిపెద। దేజములరనీ కెచెల్లు। దీని దీర్పగ॥రాజు॥ నాకు రెండువరములిచ్చి నాకుపిమ్మట । శోక మొందుచున్న వాడు-చూడుమిచ్చట॥రాజు॥ నరకములకు బాపితండ్రి, నరసిబ్రోచిన।వర సుతుండె! పుత్రుడనగ। బరగుజూచిన॥రాజు॥ ఆడితప్ప లేకయున్న-వాడు జనకుడు। నేడుమోక్షగుండనగర-నిలయపలుకడు ॥రాజు॥

వ. అనినఁ గైకాదేవి వాక్యంబులువిని రాఘవుండిట్లనియె.

రాజు_కీర్తన, యదుకులకాంభోజి, అటతాళము.

జనకుని కార్యము, సలుపలేనట్టి యీ, జన్మమేటికమ్మా॥జన॥
ననబోణి, యిట్టిజీ,వనము కంటె విష, మైన దాగుటమేలు॥జన॥
రాజాజ్ఞయైననీ, రాజ్యమునైనను। భూజాతనైన విడుతు॥ జన ॥
మోక్షగుండవిభు। సాక్షిగతత్క్షణ- మునవచింపుముతల్లీ॥జన॥

తోహార. అనినవాక్యములు। కతిహవణంబున। ననిమెఁగైకరామునకు। దనయవరద్వయ। మునకొక్కటికిని। నినుబంపగవనమునకు॥ రామ ॥
కడమదానికిని। పుడమికిభరతుని । యొడయునిజేయుగనడుగ । దడయకప్రిత్యు। త్తరమీయకదా। బడియున్నాడనినుడువ॥ రామ ॥

నీకుఁ బట్టంబుగట్ట యత్నింపుచున్న రాజునుజూచి భరతునకు బట్టంబుగట్టుమనియు రాముఁడు జటావల్కములుధరించి నిరాహారుండై దండకాటవులకేతెంచి పదునాలుగేండ్లుండవలసినట్లు పంపుమనియు నేను

గోరినందుకు నిదివఱకు రెండు వరంబులు నాకు నిచ్చియున్నాఁడు గాన లేదనఁజాలకనిన్నుఁ బాసియుండలేక దుఃఖించుచు నీతో మాటలాడుటకు లజ్జించియున్నాఁడు. కాఁబట్టి పితృవాక్యపరిపాలనముచేసి కీర్తివడయుము. కుమారా! సుకుమారా! శరీరజితమారా! అనిన కైకమాటలకామోదించి రఘునందనుండు.

రా-కీర్తన, అటతాళము, రామకృపా-వలె.

పోయెద బోయెద! బోయెదనాతల్లీ! హాయిగనేదండ। కాటవిజేరగ॥భరతునకీరాజ్య। భారమర్పించియు। బరువడిబితృవాక్య, పాలనజేయగ॥ బోయెద॥ ధరణిమోక్షగుండ। ధామునిసాక్షిగ। నరమరలేకన। న్నంపుముమ్మాటికి॥బోయెద॥

వ. ఇట్లు దృఢముగా రాముండు కైకతోఁ బలుకుచున్న సమయంబున దశరథుండు మూర్ఛదేరి కుమారునింజూచి శోకావేశంబున.

దశ-తేవారము. హా! నాకుమారరామా! హా! త్రిలోకాభిరామా! మానుగరాజ్యమిచ్చి, మరలగైకొంటిహెచ్చి। నేను భ్రాంతాత్మకుండ। నీచవర్తనుడ జడుడఁ గానలకుసీవుసనిన బ్రాణముల నుండఁగలనా.

వ. అనిపలికినఁ దండ్రికినమస్కరించి యుత్తరీయంబుచేఁ గన్నులయందుఁ గాఱు నీరుదుడిచి దుఃఖమపనయించుచు రాముం డిట్లనుచున్నాఁడు.

రా-కీర్తన-ఏకతాళము.

వగవేటికినాతండ్రీ! వనములకునుబనుపండి। తగబరునాగ్లంపుండి। తడయకవచ్చెదజుండి। లెండీ, లెండీ। జగతీశ మాటనిలుపు జూడండీ॥ వగ॥

తమవాక్యముఁ బాలింపర। దల్లికిచ్చియమునుగూర్పర। అమరులకార్యముదీర్పర। అటమానులసేవింపర। వేగర-బోగర-సమకూడెనాకు గానభావింపర॥వగ॥

వరరాజ్యసుఖముకన్నన్ । వనవాసమధికమెన్నన్ । భరతునిప్రభువుగగొన్నన్-బాలించునుగనుగొన్నన్ ।వత్తున్-జొత్తున్ । ధరమోంకుగుండదేవుకృపయున్నన్ ॥వగ॥

వ. అనియిట్లు దండ్రినూరడంబలికి తత్క్షణంబున రామలక్ష్మణులు కౌసల్యమందిరంబున కరుదెంచిరప్పుడు.

సం-తోహార. శ్రీరామునకును । క్షేమముగలుగగ । గోరిబ్రాహ్మణులకెల్ల । భూరిదక్షిణలు । పాలుపుగనిచ్చుచు । బొదలుచుండెగౌసల్య॥ రా ॥

ఆమెనుగనిసా, ష్టాంగమొనర్చిన। యాలింగనమొనరించి। ప్రేమముద్దుగొని। ప్రియమునవన్నము। వెట్టెదరమ్మనగాంచి॥ రామ॥

వ. నాయనా! నన్నుం గన్నతండ్రీ! ఆకొనివచ్చినావు. కాబట్టి యన్నంబు వెట్టెదం గడుపారం దిందువురారా! బంగరుకొండా! ఖండితఖండేందుధరకోదండా! యనినంగన్నమ్మకుం జిన్నికుమారుం డిట్లనియె.

రామ-కీర్తన, శహాన-రూపకతాళము.

దండకాటవులకుబోదు। దండ్రియాజ్ఞను॥ నేదండ॥

అండజాక్షియన్నమేల। దండిగభూ, మండలికధి । పుండట భర, తుండికనే॥ దండ॥

కైకయిట్లుగోరెభూమి, కాంతుతోడను । పోకదప్పదమ్మనాకు । బ్రాకటముగ। వ్యాకులమున। శోకింపగ। బోకమ్మా॥దండ॥

ధారుణిశ్రీమోంకుగుండ। ధాముకృపను। జేరుదుబదునాలుగేండ్లకారూఢిగ। నీరాజ్యమ-పారంబుగ। బాలించెద॥దండ॥

వ. తండ్రియానతిచేసిండిన వేడ్కతో దండకావనములకేగి పదునాలుగేండ్లుండి పిమ్మటవచ్చెద. నవార్యధైర్యంబున నారాకకెదురుచూచుచుండుము తల్లీ! యాశ్రితజనకల్పవల్లీ!

సం-తోహార. శ్రీరాముండిటు। చెప్పినపలుకులు । నచ్చెరకర్ణముులందు, నారసములవలె, నాటినమూర్ఛిలి-నాతితెప్పిరిలికుందు॥ రామ॥

కా-కీర్తన, హిందుస్థానితోడి-అటతాళము.

అయ్యయో! యెటువిందును। హాविధి నిమ్మెందును। నిన్నెడబె టుచుందును। యెటులమరచియుందును॥ అయ్య॥

భరతుడు ప్రియుడయినను। బట్టముగట్టినను। బురమువిడిచి నిన్ను, బొమ్మనగనేలను॥ అయ్య॥

మోక్షగుండనివాసుని। సాక్షిగనినుబాసినే । నీక్షితినెటులోర్తును, ఏదిదిక్కునిజూతును॥ అయ్య॥

సీ. వన్నెలందేరుసీ♦చిన్నారినెమ్మోమును, నెన్నడుంజూతురా♦కన్నతండ్రి! నాయన్న నాకూన♦నాపట్టియనియింక-నెన్నడుపిలుతురా!♦ చిన్నితనయ! నూపాన్న పాయసా♦పూపశాకాదులిం-కెన్నడునినుదురా! ♦ యిద్ధచరిత! అమ్మయటంచునే♦య్యమ్మనననుబిల్వ-నెన్నడువిందురా!♦నృపకుమార!

గీ. కంటకశిలాదిదుర్గమ కాననముల
నీవువిహరింప నెట్లోర్తు ♦ భావజాంగ
కంటబగవట్టి యీకైక ♦ కారణమున
బాపురే! బ్రహ్మయిటులెడ ♦ బాపెమనల.

కా-కీర్తన, పీల్ రాగము- అటతాళము.

నినుబాసిమేనెట్లు। నిలుపుదునకటా! వనములదిరుగనే, వత్తునీవెంట॥నిను॥ ప్రియురాలిమాటకు। బ్రియుడొప్పినేడు। భయవిపినములవెంబడిబంపినాడు॥నిను॥ నినుసదృష్టశాలి, యనిగుర్తించనిమె। జననకాలమునని, శ్చయముగాదాయె॥ నిను ॥ నోములెన్నినోమో! నోచికంటినిరా! యీమేలుసవతి సహించదాయెనురా॥నిను॥ మరిమోక్షగుండేశు। డరగంటనరయ। వెరపులుగలిగె! యీ। వెతలాయె! దనయా॥ నిను॥

ద్వి॥ కైకకువరమిచ్చు-కారణంబునను।నాకూర్మితనయ కా, నన సీమలకును, బొమ్మనుచున్నాడు-భూపతినేడు, నెమ్మదివలదని-నేనుజెప్పితిని। నామాటవిందువో! నాయనమాట। యే! మఱివిందువో! యెఱిగింపవయ్య,! తల్లితోసరిగారు-తండ్రియుగురువు, । నిల్లువిడిచిపోవ-నేటికివిను

ము। వినవేని నేనింక-విశ్వంబుపైన। మనియుండు టేకల్ల-మతిమతిచూడు॥

మ. ఎక్కడకైక! యేవరము♦ లెక్కడ! గారవపుల్లసింప ని
న్నక్కట! పొమ్మటంచు నృపు♦ డంపుట యెక్కడ! నీవుపోవుటల్
ఎక్కడ! చాలునాభరతుఁ♦ డేలినరాజ్యము నేలుగాక నీ
వెక్కడికేగఁబోకు మన♦ యింటనె నిల్వుము నిర్భయుంబుగన్.

సం-శ్లో. అనుసవ్వడుదన। యనుజాతుడువిని। యతిశౌర్యంబున లేచి। ధనువుగుజేకొని। తల్లియునన్నయు। వినగననియెఁజేజాచి॥ రామ॥

లక్ష్మ-కీర్తన, ఆదితాళము-బేహాగ్.

నాసొంపుపెంపుదోపుగనురామా! ని, లింపులైనయడ్డమే! శ్రీరామ। గుంపులై వచ్చినగుణధామా! కనుల। కెంపులొల్క దుమింతుమేఘశ్యామ॥ నా॥

భరతుని దశరథుగూడముట్టి। వారి, బంధుగులందరితోడబట్టి।పురముదాటిపోవవెళ్ళగొట్టి। నే, నరయుదుబట్టమునీకుగట్టి॥ నాసొంపు॥

ఇలనీకభిషేకముగాకుండ। వేగ। వలదన్నవారిబట్టికండ। లోలుతు నీకీర్తిమోతుగుండ। పుర। నిలయసకలదిశలు వెలయుచుండ॥నా॥

వ. అనివిపులోగ్ర మహాగ్రహ సముగ్రుండయి నిగ్రహంబున నగ్రజుని యగ్రభాగంబున నిలిచిపలికిన లక్ష్మణుని వాక్యంబులకలరి కౌగిలించుకొని యుపశాంతికొఱకు రాఘవుండిట్లనియె.

రా-తోహర. తమ్ముడనీ వం, తటి శూరుడవే! సుమ్మువేళగాదిపుడు। సమ్మతినోర్చుము। క్షణభంగుర దే, హమ్మును నమ్మకుమోపుడు ॥రామ॥

సారహీనసం, సారములోబడి। శాశ్వతమనినమ్మెదరు। సారెకు బుట్టుచుఁ। జచ్చుచునుందురు। జనులుభ్రమలబడియెదరు.

రా-కీర్తన, బేహాగ్‌రాగము, రూపకతాళము.

ఏదియునిజమనుచునమ్మ, రాదు వినుముసోదరా! వాదమేలనింద్రజాల, వతుగాదా సోదరా॥ యేది॥ మనముబొందుప్రక్కందన। వని

తాదివిషయభోగము। లనయము మేఘస్థసౌదా। మివివిధముగ దెలియుము ॥యే౩॥

కాలినయినుమందు జల, కణముపడినశించిన, పోలికప్రతిక్షణ మాయువుపోవు దరిగికాంచిన ॥నేదియు॥

సత్యమయిన మోక్షగుండ, స్వామియెరుక లేకను, మృత్యుపాలై యమబాధ,। మిణుకుచుందురేమోను ॥యేదియు॥

గీ. పాముసోటఁబట్టు ♦ వడియునీఁగనుగప్ప
దినఁగఁబూనినట్లు ♦ దినముఁగాల
మనెడుపాముమ్రింగు ♦ టరయక యస్థిర
భోగములను బొందఁ ♦ బూనుచుందురి.

క. కలవంటిది స్త్రీభోగము
కలిమియు నైనీడసనుము ♦ గదయౌవనముల్
జలబుద్బుదమనవచ్చును
దెలియకజీవులుభ్రమింతురి ♦ దృఢమనియనుజా.

క. దేహాత్మబుద్ధిచేతను
మోహించినజను లకెట్లు ♦ మోక్షములొదవుల్
దేహికిఁ గామక్రోధవి
మోహాదులఁ గెలువవలయు ♦ మునిమతమిదియుల్.

రా-తోహార. క్రోధముచేనడ, గును మోక్షంబును। గ్రోధము చే మదిగలగు। గ్రోధముచేహిత, గురు పితృభ్రాతృల-గూల్చుతలపు తాగలుగు ॥రా॥

క్రోధముచే నెన, గూడునుసంసృతి-క్రోధమెధర్మక్షయము। క్రోధమువదలిన-గోరికలెల్లను-గొనసాగును నిదినయము ॥రామ॥

సంతోషంబే! నందనవనమగు। శాంతి కామధేనువగు। శాంతివహించిన, సజ్జనపాలికి-శతృవులెవ్వరో! యెరుగు ॥రామా॥

క. కావున దేహేంద్రియముల

కావలవెలుఁగొందునాస్వ ♦ యంజ్యోతిని సం
భావింపుచునారబ్ధము
వేవేగమెపాప్తిజ్ఞుఁడనుభ ♦ వింపఁగవలయున్.

గీ. ఎంతపర్యంతమాత్మము ♦ నెఱుఁగలేఁడొ!
యంతదాఁకభ్రమించుదే ♦ హమలందుఁ
గానవయ్యాత్మనెఱిఁగిన ♦ వానికెందు
ద్వేషరాగంబులుండవు ♦ స్థిరమువత్స.

తొహర. అనుజునకీరీ, తిని బోధించియు-నాతల్లికి నిట్లనియెన్। ననుదీవించియు-వనములకనుపుము-మనమున వగవకుమనియెన్ ॥రామ॥

వ. ఇట్లుపలికినఁ గౌసల్య సమ్మతించి యరణ్యప్రవాసంబులందుఁ బ్రియాసము లేకుండునట్లుఁగఁ దిక్పాలురు నినురక్షింతురుగాకయని దీవించిన నపుడు లక్ష్మణుఁడన్నకిట్లనియె.

ల-కీర్తన, ఆదితాళము, తంగంమెట్టు.

శ్రీరామచంద్ర। కారుణ్యసాంద్ర। ధీరనాసంశయము। రాఘవా తీరెను నిశ్చయము॥శ్రీరా॥ నీసేవమాని। నేనుండలేను। నీవెంట నేవత్తును రాఘవా! నీపువద్దనబోకుము ॥శ్రీరా॥ రావలదన్నను। బాణములొల్లను। వేవేగమోక్షగుండ। రాఘువా। దేవరనీసాక్షిగ ॥శ్రీరా॥

వ. ఈప్రకారంబునఁబల్కిన లక్ష్మణుఁడు కూడవచ్చుటకు రాముడుసమ్మతించి యీవార్త దెలుపుటకు సీతాదేవిగృహంబునకరిగినఁ గాంచి యర్ఘ్యపాద్యంబులర్పించి యిట్లనియె

సీత-తొహర. శ్వేతచ్ఛత్రము-వివిధవాక్యములు వెలయఁగిరీటాదులును। ఖ్యాతిగవదిలి యొ, కండవిటులరా-హేతువువినవతెననెను ॥రా॥

రా-తొహర. దండకాటవికి-దరలవలెనుమా, తండ్రియాజ్ఞ చేనబల। దండిగమీాయ । త్తనుసేవింపుము। నుందుమింట బహువిధుల॥రా॥

వ. అనిన.

క. ఏకారణమున భూవిభుఁ

డాకానల కేగుమనుచు ♦ నాజ్ఞాపించెఁ
నాఁకును వివరింపుమనఁ
గాకుత్థ్సకులుండు తెలిపెఁ ♦ గాంతామణితోఁ.

చ. భరతుని రాజ్యకర్తగను ♦ బట్టముఁగట్టగఁ దండకాటవిం
దిరుగఁగ నన్నుఁబంపునటు ♦ ధీరతతోఁడుత్కగ్రికకోర నా
వరములు రెండు భూవిభుఁడ ♦ వారగనిచ్చెఁ జతుర్దశాబ్దముల్
జరిగినవత్తుఁ గ్రిమ్మఱను ♦ జక్కఁగఁనింట వసింపుమీవనఁ.

సీత-కీర్తన, శంకరాభరణము, ఆదితాళము.

ఔనౌనుమీమాట। యాశ్చర్యకరమగు। గానలనీవుండ। నేనింట నుందునె ॥యౌనౌ॥ ఇద్దర మొకచోట - నొద్దికనుందము। వద్దనబోకుము-వచ్చెదనీవెంట ॥యౌనౌ॥ పతిసేవకన్నను - బనులేమి యున్నవీ । క్షితినారాయణకవి, నుత మోక్షగుండేశ ॥యౌనౌ॥

వ. అనిన శ్రీరాముండు.

రా-తోహర. కంటకంబులును - గఠినపుశిలలును-గలవునడువగా లేవు-వంటకమబ్బదు-ఫలములుగడ్డలు-భక్షింపగ లేవునీవు ॥ రా॥

ఘోరరాక్షసులు । క్రూరమృగంబులు-గోరితిరుగునటవినుము । నారీమణికా-ననములకునురా-నేరవింటనెనిలుము ॥ రా॥

వ. అనిన సీతాదేవి విలాపంబున నిట్లనియె.

సీత-కీర్తన, హిందు, తోడి, ఆదితాళము.

గడియయినగాని మిము, విడువగజాలవిభో! అడవులమీతోనుంట నదియింద్రభోగమగు॥గడి॥ మీరారగించినంత। మిగిలిన ఫలములాదు। లారగించినవవి, యమృతోపమానమగు ॥గడి॥ తమతోడసంచరింప దర్భలు కంటకములు। శ్రీమలేకమృదువులయి-రాజిల్లుగాదెయిక ॥గడి॥ నేరాకమానిక। నారాయణాఖ్యనుత । ధారుణిమోక్షగుండ । ధామశ్రీరామరామ ॥గడి॥

క. మనుజ్యోతిష్కులువలికిరి

తనపతితో నడవికేగు ♦ ధరణిజయనుచుఁ
నను రానియ్యనిచో నా
ఘనులాడినమాట కల్ల ♦ గా దెన్నృపాలా!

స్రగ్విణి. నన్ను రానీయకే ♦ నాథ! మీ రేగినఁ
బన్నుగా దేహముఁ ♦ బాతు నేనిక్కమా
పన్నసంరక్ష! నా ♦ ప్రాణముల్ నిల్పవే!
తిన్నఁగా నాదుసం ♦ దేహముఁ దీర్పవే!: అని.

సంధి-తోహ. ఈమాడ్కి నిసతి - వేమఱువేడిన - రాముండిటులనె లలనా! నీమదిగనుటకు-నేనంటినిగాని-నిన్ను బాయగాగలనా! ॥రా॥

దండకాటవికి- దరలినావెంబడి- యండజాక్షి! నీపురమ్ము- దండిగనాయరుం, ధతికిహారములు, దగనుపాయనములిమ్ము॥రా॥

వ. ఇట్లు సీతవచ్చుటకు సమ్మతించి వేదవిదులగు బ్రాహ్మణులకును దక్షిణ సమస్త జనంబులకును దరిద్రహతంబగునట్లు షోడశమహాదానంబులవారిగ శ్రీరామలక్ష్మణులిచ్చిరి. సీతాకౌసల్యాసుమిత్రలుగూడ నరుంధతీలోనగు సువాసినుల కభీష్టవస్తువులు దానంబు సేయుచుండ రప్పుడు.

సం-త్రో. త్రిజటాఖ్యుండగు - ద్విజుడొక్కండు ద, రిద్రంబున బాధితుడై । నిజకుటుంబమును, నిర్వహించుకొన, నేరకయున్నాతురుడై ॥ రామ॥

గీ. హాలికవృత్తిని జీవన ♦ మాచరింపఁ
దలఁచి గుద్దలినాగలి ♦ దలనుమోచి
కొనుచునేగి స్వయంకృషి ♦ గోరిచేయ
నతనియిల్లాలుతత్క్షణ ♦ మచటకరిగి.

కీర్తన-త్రిశ్రజాతి, సతాళంబున.

ప్రాణనాయక! ఫలమేమి । నీకిక ॥ప్రా॥
మేను, సుడివ, పిక పంగులశ్రమల నలయగనేటికి॥ప్రా॥

అగ్రజాతినిబుట్టి-యన్యవృత్తికిజొచ్చి-తీ గ్రహచారము-నేమందు నయ్యయో!॥ ప్రా॥

శ్రీరామచంద్రుఁడ, వారిగదానము, లీరాత్రివిప్రులకిచ్చుచున్నాఁడట॥ ప్రా॥ నీపేరువివరించి । నీభేమివచియించి - మాపేరువివరించి - మఱియుయాచింపుము!॥ ప్రా॥ శ్రీమోక్షగుండేశు-ఁడామహానియ్యుడు-నీమనోభీష్టము । నెరవేర్చుఁబోపొమ్ము ॥ప్రా॥

సం-వ. అనిపలికిన భార్యమాటలకియ్యకొని.

కం. వ్యవసాయపుఁ బనిపుట్లను
నవతలఁ బాఱంగవైచి ♦ యాతురమున రా
ఘవ లక్ష్మణులుండినయెడ
కవనీసురవర్యుఁడరిగి ♦ యతివినయమునన్.

త్రిజట, కీర్తన, ఆదితాళము.

రామచంద్రమహాప్రభో! న్నామొరపేమతో వినుమా ॥రామ॥ నేమహీసురుఁడ నిత్యదరిద్రుఁడ । స్వామిత్రిజటుడనునామమువాడను॥ దారపు, త్రులకున్, నిరతము । కోరినట్టుగను కూడును గుడ్డయు, గూరిచిపెట్టుట భారమయ్యెను ॥రా॥

నాదరి, ద్రముదీ, రగ దమ। రాదరించి యి, ష్టార్థపదార్థము। లీఁదగుమోక్షపు, రీశవేడెదను॥ రా॥

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె.

రాం-త్రోహ. అన్నిపదార్థము, లయిపోయినవిక । నావ్రులమందలు గలవు। ఎన్నగరాటని। వేయము నొంటినయు, వచ్చెనొ కొనగలవు ॥రా॥

వ. అనిన భూసురపుంగవుం డా గౌశబద్ధుండై లేచి.

సీ. కుడిభుజమ్మున వేలు♦కోల్లాయి గట్టి కా-బిగబిగనుమనమునై ♦బిగియఁగట్టి
దోవతిపై కెగ ♦ దోపి బట్టుపదిర్చి కటిగాసి గోచిపెట్టుకుడి ♦ గుమురవైచి
వరములతోకిఁ బ్రాణంబులుగు దేబుట్టిపాశియుండియోగ పా♦షాణమూని
కేరు ద్రవసియుఁ బిపీ♦కిలిఁ బెట్టుగాఁ ద్రిప్పి రెండవివాఁడునిండె ♦ మట్టెబుదూల

గీ. నెమ్మదిని రామమూర్తిని ♦ నిలిపిపొగడి
చూచువారలు రాముండుఁ ♦ జోద్యమందఁ
బ్రదుకుజీవనమిదియని ♦ బాహ్మణుండు
తనబలంబున సరయువు ♦ దాఁకవైచె.

వ. ఇట్లు త్రిజటుండు సరయువుదాఁక రాయివేసి యంతవటి కుండు నావులఁ గొనిన రాముండచ్చెరువొంది యిట్లనుచున్నాఁడు.

రామ-తోహర. పన్నుగ మొదవులఁ-బదినూర్లిచ్చెద-బాపడ ! కోరుమనంగా । జన్నమునకునతి - శయముగునట్టి-మ్మన్ననిచ్చిపను పంగా ॥ రామా ॥

వ. అవియన్నియుఁగొని సంతోషంబున దారాపుత్రులంగలిసి తననెలవుకుఁజని సుఖంబుగానుండె. ననంతరంబున ధనుర్బాణధరులయి రామలక్ష్మణులు సీతతోఁగూడ కాంతారంబునకుఁ బోవ నిశ్చయించి యనుజ్ఞకొఱకుఁ దండ్రిగృహంబున కరుగుచుండఁ బురజనంబులు గటకటపడుచుఁ దమలోన.

పౌరుల-కీర్తన, రూపకతాళము, హిందుస్తాని.

కై కకోరిన వరములెంత । శోకకరములు। వీకనెటులదిరుగుదురు విపినపథములు ॥ కై ॥ సీతసుకుమారి నడువఁ। జేతగాదుగా । ధాతవ్రాత వాపనేటి - తరముగాదుగా ॥ కై ॥ ఈక్షితిదప్పింపరెవరి యెవ్వరైనను మోచుగుండ వరనగరా, ధ్యక్షుండయినను ॥ కై ॥

వ. అని పరస్పరంబుఁ జెప్పుకొనుచు వగచు పురజనుల దుఃఖ నివృత్తికొఱకు రామదేవుండను చుని యిట్లనియె.

రా-తోహర. మునుపుదశరథుఁడు, దవనుగూర్చితప-మొనరింపగ హరమెచ్చి। కనబడినీకేమి। కావలెననసీవు। దనయుడవగుమనిచ్చి॥ రా॥ రాజుకోర్కెడీ, రగనుదయించెను। రావణాదులనుద్రుంచుఁ। దేజములర మునిదేవతలనుగడ-తేర్చవేగఁబాలించు॥ రా॥

వా. కీర్తన, ఆదితాళము, వరమువు.

ఆదినారాయణు, డగునీరాముడు । నాదిలక్ష్మిసీత-యనికనుడు । ఆదిశేషుడే! యగులక్ష్మణుడు। మేదినిబుట్టియుమెలగుచురు॥ఆ॥ కరుణతో డమీన, కమఠవరాహనర । హరిశ్రీవామన-పరశురాము। వరరూపములీ, వఱకుదాల్చిరఘు-వరతనువిప డు-వడసెనుమా॥ ఆది॥

అక్షయప్రకృతివి-లక్షణుడీతడు-మోక్షగుండపుర-రక్షకుడు । రా, క్షసగణములు-శిక్షయొనర్పగ। నీక్షితిబహురూపు-లెత్తుచుండు॥ నాది॥

వా. తోహర. ఇతనిగూర్చియిా, రేల । వగచెదరు-ఇతఁడుపరాత్ప రుడనుచు।సతతము దెలిసియు,సన్నుతిసేయుడు।సద్గతినిచ్చుచుమనుచు॥రా॥

సం-తోహర. అసదృశరాముమహాత్మ్యమెఱిఁగియూజనులగ్గించిరి యంత। జనకుని సెలవును-గొనజనికైకను-గనిపలికెనునాచెంత। రా॥

క. సీతాలక్ష్మణయుతముగ
నాతల్లీ! ఘోరవనావ ♦ నంబులకును నే
నేతెంతును నీయాజ్ఞను
నాతండ్రికిఁ జెప్పవచ్చి ♦ నానుఁగదమ్మా!

ద్వి. అని యిట్లుచెప్పిన-నాకైకలేచి। ఘనముగా రామల, క్ష్మణ సీతలకును। నారచీరెలుదెచ్చి-నాతివేర్వేఱ। వారలకిచ్చిన-వరుసతోనంది । రామలక్ష్మణులువ, స్త్రములువర్జించి । శ్రీమీరఁదాల్చిరా, చీరలుసీత । గట్టంగలేకున్నఁ-గాంచిరాఘవుఁడు । గట్టంగఁబూనెన, క్కడనున్నరాజ । వనితలుమొదలైన-వారుదుఃఖింపఁ।గనివసిష్ఠుఁడువల్కెఁ-గైకతోఁగనలి ॥

వసి-తేవారము. ఏమి! దుర్భాగ్యురాలా!♦ఇంతకాఠిన్యమేల! రాము బాయంగలేక♦రమణిపోవంగఁగైక! భూమిజకుజీరలిడగఁ। బోలునే♦ నీకువ డిగ। నీముఖంబరసినంత♦ నిరయమే తెంచుఁగాంత॥

వసి-కీర్తన, కన్నడరాగము-రూపకతాళము,

ఇదినాయమానెసేకుఁ-బాతకి!॥ యిదినాయ॥ ఇటుఁజేయ లోకదూ ష్యముని। తల, పోయులేక-భావించితి॥ విదినా॥

ముడి-పూలమేల! యింత-నర-పాలచంద్రునకును। నను-కూలవతి విగాక। మది, జాలినొంద। గావించితి॥ విది॥

రఘువీరుబాయలేను। చను-దేరగలము వెంట। మన, సారసందు మీఁద। బా, దూరిలోనసీ। వృందము॥ ఇది॥

తన-తంత్రీతోడగూడి। భర, తుంబుమోటుగుండ। పతియుండఁజే యుగాక। నీ-వుండుచోటఁదా। నుండునే॥ ఇదినా॥

వ. అని వసిష్ఠుండు కఠినముగాఁబలుకుచు ధరాపుత్రిదుకూలాం బరాభరణంబులు ధరించిపోవునటుల నిరూపించెనంత రాజు కైకదిక్కు జూఁచి శోకకోపంబులు మల్లడిగొన నిట్లనియె.

దశ-కీర్తన, హిందూ, తోడి-రూపకము.

అడిగియుంటివా! న, న్నడిగి॥ పుడమిజాతలక్ష్మణుల । వడవికను పగ॥నడిగి॥హానివృద్ధులు।గాన, వైతివయ్యయో! మానుషాకారమున ను న్న। దానవురాలా!॥ అడిగి॥ చీరలియ్యగా । నీకు । జేతులాడెగా । నారి మోటుగుండపుర, నాథుసాక్షిగ॥ నడిగి॥

సం-తోహ. అని నిష్ఠూరము,లాడి భూషణములునుమఱి దువ్వ లువలును। జనకజకిప్పిం,చిన ధరియించెను। దనపతియనుమతమునను॥ రా॥

వ. అంత సీతాలక్ష్మణసహితంబుగా రాముండు మున్నూట యేఁబదిమందితల్లులకుఁ బ్రదక్షిణనమస్కారములాచరించి సుమిత్రిం జే రి నిలిచిన నామెకొంతవడుకుఁ జింతించి పిమ్మట లక్ష్మణున కిట్లనియె.

క. రాముని దశరథునిగఁ గను
భూమిజ జననిఁగాఁగ గనుము ♦ భూరివిపినముల్
శ్రీమదయోధ్యగఁ గనుఁగొను
సౌమిత్రీ! నీకునౌదవు ♦ సకలశుభంబుల్.

వ. అనిపలికి శ్రీరామునింగని.

ను-గీ. నీకుసోదరుండు ♦ నీకు నమ్మినబంటు।
నీకు సేవకుండు ♦ నీకుహితుఁడు

నీకు మేలుగోరి ♦ నీవెంటవచ్చును
నడవులందుఁగరుణ ♦ నరసిబ్రోవు.

వ- అనియొప్పగించిన మంచిదని రాముఁడు సీతా లక్ష్మణులం గలసి పోవుచుండ నప్పుడు.

సం-తోహర.

మనుజేశుండు సు,మంతుని గనుగొని। ఘనయురదముఁదెమ్మనగా। చని యాతఁడు దె,చ్చినఁ బిత్రాజ్ఞను-జనకజ నెక్కించెనుగా। రా॥

గ్రక్కున తండ్రికి-మ్రొక్కి- రామల,క్ష్మణులు ధనుశ్శరములతో సక్కజముగ రథ, మెక్కియుఁబోని, మ్మనిరి సుమంతుని ధృతితో॥ రా॥

వ. ఇట్లతివేగమున రథమువిపినమార్గంబు పట్టిపోవఁ బౌరులంద రొక్కుమ్మడి రథంబుఁజుట్టుకొని నడుచుచుండిరంత దశరథుండు దుఃఖాతిశ యంబున నడువనోపక బహిర్ద్వారంబున నిలచి చెయ్యెత్తి పిలుచుచు.

తేవారము:- నిలువు నిలుపోసుమంత! ♦ నీకుద్వరయేలనింత! నలసితిని నింకనపల♦నడుగుబెట్టంగజాలఁ। జెలిమితో నాకుమారు♦చె లువ మింకొక్కమారు।బలుపిరియంబుననుగాంచి♦పంపుదును సమ్మతించి.

గీ. రథము నిల్పుమటంచును ♦ రాజువలుక
రథముఁబోనిమ్మటంచును ♦ రాముఁడనఁగ
నుంచనాతండు రథముఁసా ♦ గించుచుండె
నంతబలికె వశిష్టుఁడ ♦ య్యవనిపతికి.

తోహర. శోకింపుచు నీ,సుతునిబంపఁగా। నీకుఁదగదు వినవ య్యా! ఏకాలమునకు-నేదిప్రాప్తమో! యెవరికెరుక కనుమయ్య॥ రా॥

సం-తోహర-

పదపదమని భూ,పతిని గాంతలను। సదనంబునకునుజేర్చె। సద యుఁడగుచుఁగా,సల్యాదులఁదా। విదితుఁడగుచు మారార్చె॥ రాము॥

వ. అంత నయోధ్యకుఁగ్రోశమాత్రంబుననున్న తమసానదీతీరం బునకు నారాత్రి శ్రీరాముండు సేరి యక్కడ విశ్రమించి యక్కడినజ

కుఁ దనతోఁగూడ వచ్చిన పురజనులఁగని యిట్లనియె.

తోహర. భరతునిఁ గొల్వుఁడు! పురికిని జేరుడు! బహుదూరము వచ్చితిరి! బరువడిబొందకని - పలికినరాముని,బాయలేక యిట్లనిరి॥ రా ॥

పౌరు-కీర్తన, రూపకతాళము, తోవమెుందగ.

మిమ్ము బాయగజాలము- మేమువత్తుము। రామ! నెమ్మదితో వెంబడిరానిమ్ము వేగము। రామ!॥ మిమ్ము॥ మీకువిహరించినచోటే!- యూరగు మాకు-రామ! మీకు లేనట్టిచోటే! కారడవిమాకు। రామ!॥ మిమ్ము॥ భరతునితోఁబనిమాకేల! బట్టణమేలా! రామ! తరుణీసుత భ్రాతృధనధాన్యములేల! రామ!॥ మిమ్ము॥ కూడరావద్దన్న మోక్ష - గుండనాయకా! రామ! నేమమాప్రాణములు మేన-నిలుచునే! పోక। రామ!॥ మిమ్ము ॥

వ. అనిన వారల నిశ్చయం బెఱింగి వారినేమఱించి పోఁదలంచి యాకిటుకు సుమంతునికిఁ దెలిపి యందఱిని శయనించుఁడని చెప్పి చొక్కజల్లినట్లందఱు నిద్రింపుచుండ.

సం-తోహర. అర్ధమురేయిని-ననుజాదులతో-నరదము నారోహించి। తద్దయుసాకే, తమునకుఁబోయెను దారిఁబట్టుకొని నడచి ॥ రామ ॥

ఇంకొకదారిని-నేగిరి యడవికి-నెవరికెరుక పడకుండ। శంకలేక దము, సానదిదాటిరి సరయువుదాటిరి యుచట॥ రామ ॥

వ. ప్రాతఃకాలంబున.

ఉ. పౌరులు మేలుకాంచి రఘు ♦ వర్యునిగానక చింతనొంది తా
మారథనేమిమార్గమును ♦ నారసిచూడ నయోధ్యదిక్కుగా
బాఱినయట్లుతోఁచిన శు ♦ భంబనియూరికిఁ బోయిరాముఁడుఁ
జేరకయుంట కెవగచి ♦ చెచ్చెఱనిండ్లకుఁ జేరిరందఱున్.

సం-తోహ. అంతటనానా,యంత్రికి గంగా,ప్రాంతములకువారు జనుడు।సంతసమున వచ్చుటనున్నట్టిని,పాదనాయకుడు గుహుడు॥ రామ॥

క. ఫలములుఁ బువ్వులుఁదేనెలు
నెలమిని గానుకలుగొనుచు ♦ నెదురుగఁ జనిసా

గిలిపడిదండములిడికే

వలభయభక్తులోదవ రఘు ♦ వర్యునకనిట్లనె.

ఉ. నేను నిషాదవర్యుఁడను ♦ నిక్కముదెల్పెద శృంగిబేర సం
స్థానమునేలుచుందుదును ♦ సజ్జనవంద్య! గుహాభిధానుఁడన్
గానలకేగమీరిటకు ♦ గ్రక్కునవచ్చుటెఱింగియుంటిగా
నానిలయంబునన్ నిలిచి ♦ నన్నుఁగృతార్థుని జేయుదేవరా !

గుహుని, కీర్తన, అటతాళము, ఒకదివ్య-

స్వామి ! నాజన్మము-సార్థకమాయె! భూమిపై నాపావ,ములు గూ నీపోయె॥ స్వామి॥ ఈనిషాదరాజ్య-మేలుదేనా!. నేను సల్పుచునుందు-నీపాదసేవ॥ స్వామి ॥ కందమూలాదులు- గలవుమాయింట । విందుగా గొనుమునే - వింతునీబంట॥ స్వామి॥ మోక్షకుండధామ ! మునిసుతనామ సాక్షాన్నారాయణ- రఘుశ్రీరామ! ॥ స్వామి॥

వ. అనిపలికిన గుహుని వినయవాక్యముల కలరి రాఘవుండిట్లను చున్నాఁడు.

రా.ఉత్సాహవృత్తము. దండకాటవులకు వేగి♦ తాపసులనుగూడి లే। వుండుమనుచుఁదండ్రి వనుప♦నొప్పివచ్చినాడనే। నుండఁదగదు గృహములందు♦ నూళ్ళయందుగావునన్। ఖండితముగ నేటిరాత్రి♦ గంగదరిని నుండెదన్.

వ. ఇట్లుతెలిపి సీతాసహితంబుగా జలపానంబుఁజేసి గుహుని చేనిర్మింపఁబడిన కుశపర్ణాస్తరణంబున శయనించి నిద్రింపుచుండలక్ష్మణుం డు ధనుర్బాణధరుఁడయి శ్రీసీతారామచంద్రగురువు నారాధింపుచుఁ బదునాల్గేండ్లపఱకు నిద్రాహారములు వర్జించియుండ నిశ్చయించి నిద్రా దేవిని స్వాధీనముచేసికొని తానుదిరిగి యయోధ్యఁ బ్రవే జేసునంతకునూర్మి ళయందు రెట్టింపుగానుండుమని యాజ్ఞాపించి రామునికి వచ్చినయిడుముల నెఱింగి గుహునితో నిట్లనిచెప్పుచున్నాఁడు.

లక్ష్మ-కీర్తన, కాంభోజి, ఆదితాళము.

ఎంత! దెల్పుదు రాసఖా!. వీరలకష్ట మెంతని కాంతుననిక॥ ఇంతకుమూలము కైక। వంతలపాల్ సేసెగదరా ॥ యెంత॥ కాంచన పర్యంకమున। సుఖముగశయు। నించు వీరికింతలోన। నెంచగ నేలబవ। ళించగవలసెన య్యో!॥ యెంత ॥ పట్టుపీతాంబరములు । శృంగారముగ । గట్టుచుండెడి వీరలు। నెట్టన నారచీరలు। గట్టగవలసె!. నయయో!॥ యెంత॥ ఎండకన్నెరుగరుగా। శ్రీకరమోక్ష। గుండవాసునిసాక్షిగ। దండిగ గారడవుల। నుండవలసె ! నయ్యో!॥ యెంత ॥

వ. అనులక్ష్మణుని దీనాలాపంబులువిని గుహుండిట్లనుచున్నాఁడు.

గు-తోహార. పూర్వజన్మకృత। పుణ్యపాపమునఁ। బొదలును సుఖ దుఃఖములు। సర్వము గుడువగఁ। జనుజీవులకును । స్పష్టమివియుస్వకృతములు.

అనుభవింపకను-నజునకునైనను- నామునక్కంటికినైన। ననువుగ నారాయణమూర్తికైనై। ననుదప్పనె। భువిలోన॥ రామ॥

క. పగలరుగ రాత్రి నిశివో
వఁగఁబగలును, వచ్చునట్లు ♦ వరసౌఖ్యమువో
వఁగ, దుఃఖము ♦ దుఃఖమునో
వఁగ, సుఖమును, జీవతతికి ♦ వచ్చుచునుండున్.

క. జలమును బంకము నొకటగఁ
గలిసియుభిన్నముగ నున్న ♦ గతి సుఖదుఃఖం
బులుఁ రెండుఁగూడి యుండియుఁ
బొలుపుగ నేదయిన నొకటి ♦ పొందును దేహిన్.

గు-తోహార. కావున సుఖము, దుఃఖములును సమముగ। భావింతు రుధీవరులు। భావములోపల [illegible] గనకుండరాలు॥ రామ॥

అ॥ వారిరువురు-ననుమానము మందగ- నింత దెల్లవారగను । జనకతనూజా-సహితముగను రామ-చంద్రుమేల్కొనిరిగను ॥ రామ॥

ఉ. రాముఁడు మన్త్రిపాలుఁగొని ♦ రమ్మనియూ గుహుఁబంపనాతఁడున్
ధీమతిఁ దెచ్చియీయఁగను ♦ దీవ్రముతో జడలున్ ధరించి మ
హిమ్మమహనీయగంగఁ దరి ♦ యింపుగఁ జేయుమటన్న నావఁ దే
గా మొగిఁ రెక్కి రాదరికి ♦ గ్రక్కునఁ జేర్చె నిషాదభర్తయున్.

వ. ఇట్లద్దరిఁ జేరినపిదప నడవికి మీతోఁ గూడి వత్తుమని కోరినసు మంత గుహునూరార్చి సుమంతుని నయోధ్యకుఁ బొమ్మని సెలవిచ్చి మేమీసారి వచ్చునంతకు మారాకఁ గోరుచు శృంగిబేరంబున నుండు మని గుహుని వీడ్కొలిపి గంగాభవానికి నమస్కరించి శ్రీసీతారామ లక్ష్మణులు గంగనుబోగడి యనంతరంబ.

గీ. అచ్చటికి యోజన ♦ త్రియమైన యట్టి
యాభరద్వాజమునియుండు ♦ నాశ్రమంబుఁ
జేరె రాఘవుఁడనుజాత ♦ సీతలరసి
యరుగుదేరఁగ నాటి సా ♦ యంత్రమునకు.

సం-తోహ. రాముని రాకభ, రద్వాజుడుగని। ప్రేమను నెదురుగ నేగెన్। శ్రీమహిళాపతి-గామది దెలిసియు। వేమఱుబొగడగ సాగెన్ ॥రా॥

భరద్వా-కీర్తన, దర్బారు రాగము, రూపకతాళము.

శ్రీరామా! శ్రితకామ! శివశంకరిజపనామ! క్షీరాంబుధివరతల్పక! ఘోరాహిత! ధారాధర! మారుతసమ! ॥శ్రీ॥ నీభక్తులరక్షింపగ-భూభారముబరిమార్పగ। నీభువిలోనుదయించిన!। నీభోగము-వేభంగుల-నేబొగడెద॥ శ్రీ॥ నారాయణకవిపాలిత। శౌరి మోక్షగుండేశ్వర!। నీరాకయు మేలాయెను, ధీరాత్మక! కోరికలీ, డేరెనుగద ॥శ్రీ॥

క. అనివేఁడి పర్ణశాలకుఁ
గొనిదెచ్చియుఁ బూజనేసి ♦ గురుతరభక్తిన్
వినమితుఁడయి కొలువఁగ నా
దినమచ్చట నిలిచి బయలు ♦ దేరెను బిదపన్.

వ. అంత రాముండు భరద్వాజుని వీడ్కొని యమునానదిదాటి

చిత్రకూటాద్రికిఁ జేరిన నందుఁదపంబు చేయుచున్న.

సం. తోహ. వాల్మీకుండను-వరమునిచంద్రుడు-వారలగనుగొనె నంత। పేర్మినిలక్ష్మణ। సీతారాములు। నెలగిమ్రొక్కియునిరంత॥ రామ॥ తండ్రియాజ్ఞచే-దరలివచ్చితిమి-దండకావనికినరుగ। దండిగగొన్నా-ళ్ళుండగసుఖముగు-తావుదెలువుడనసరిగ ॥రామ॥

వా, కీర్తన-ఆదితాళము, నీవను.

నీవుండనితావులేవీ! యేవీ! నీవెఱుంగని తావు-లేవీ! యేవీ! ॥నీ॥ స్థావరజంగమ-స్థలములలోపల। వేవేగంబున-వెతకినగానీ ॥నీవుం॥ అంతర్బాహ్యము, లందునాదిమ। ధ్వాంతరహితమై-యలరుచునిండి ॥నీవుం॥ నానామహిని వి, తానహృదయ సం। స్థానంబున వి, జ్ఞానరూపమై॥నీవుం॥ మోక్షగుండపుర, రక్షణపరిక్షిత వి। లక్షణయంత, ర్లక్ష్యవశ్యమై॥నీవుం॥

క. ఏనామస్మరణంబున
నేనమలుఁడనైతినో! గ♦ణింపఁగ నదియే!
నీ నామసత్ప్రభావము
దానిని దెలియంగ నెవరి♦తరము మహాత్మా!

వ. తొల్లినేను జాతిమాత్రంబున విప్రుండనయ్యుఁ గిరాతవృత్తిచే గిరాతకులంగలసి జీవహింస చోరకర్మాది వృత్తులచేఁ బ్రవర్తించుచు బ్రహ్మర్షుల యనుగ్రహమువల్ల నీనామమును సంపాదించి నిష్ఠతోఁ జపించుచున్న నాపయినఁ బుట్టలు పెరిగెఁ బిమ్మట నీయనుగ్రహమును బొంది వల్మీకమును భేదించుకొని బయట వచ్చుటచే వాల్మీకియను నామము వచ్చినది. అంత బ్రహ్మర్షినయి యిక్కడ నిలిచి తమనామస్మరణ మఱువక చేయుచున్న కారణంబున.

వా. తోహర. నీయనుగ్రహము-నేటికి గలిగెను- నీదేవీసహితము గ। బాయకనాకును-బ్రత్యక్షంబయి-తీరెడ నిష్టములిడగ॥రామ॥

ఇంకిక నాతప, మీడేరెను నే- నెలమిఁగృతార్థుఁడనైతి। బంకజాక్ష! యీపర్వతాగ్రమునఁ బరఁగఁగనుందుము ప్రీతి॥రామ॥

వ. అని రామునొడంబఱచి.

క. గిరిమధ్య సీటిదాపున
నరసియు నొకపర్ణశాల ♦ నత్యద్భుత సుం
దరముగ శిష్యులచేతను
విరచింపఁగఁ జేసెమౌని ♦ వీనుఁడుగడిఁకన్.

వ. అంత సంతోషించి శ్రీరాముండు కాంతానుజ సహితంబు గ నాపర్ణశాలయందు వశించియుండె.

క. అంత నొకనాఁడు సీతా
కాంతాంకతలంబు దిండుగాఁ ♦ దలనిడి య
త్యంత సుషుప్తిని రఘుకుల
కాంతుఁడు పవళించియున్న ♦ కాలమునందున్.

సం. తోహర. కాకియొకటివే,గమునజనకసుత, కాలివ్రేలుముక్కు-నను। బీకిరక్తమును-బీల్చదోలినను- బోకవచ్చెఁగ్రమ్మఱను॥ రామ॥

వ. ఇట్లేమఱించి వచ్చి బాధింపుచుండినఁగొంతవడికి రాముండు నిద్రలేచి। వ్రేలియందు రక్తస్రావమగుటఁదిలకించి యిట్లనుచున్నాఁడు.

సీతారామసంవాదము. పాట- ఆది.

రా॥ స,రోరుహాక్షి! రక్తమట్లు-గారగన్। గారణంబదేమొతిన్న-గావచింపుమా! కూరికు-లేరు లేరునుమ్మిట॥ సరో॥

సీ॥ సు,ధీర। మీరునిద్రయందు-దేరగన్। జేరియొక్క-కాకిముక్కు-చేతనిటువలెన్। గీరన్। గీరన్। గారెరుధిరము॥ సుధీ॥

రా॥ స,హోదరుండు తేఁడె।దాని-మోదగన్। బాదమిట్టుజీరినట్టి పాపికాకము। ఏదీ-యేదీ-లేదుచూడఁగన్॥ సరో॥

సీ॥ ఫ,లాదిసంగ్రహంబుజేయఁ-గాదగన్। నాదుమరది మోఁకుగుండ-నాథ!పోయెను। బోదు।మీద-మీదవచ్చుచు। ॥సుధీ॥

వ. అనివారు చెప్పుకొనుచుండునంతలో.

సం-తోహర. క్రిమ్మర నక్కా-కము సీతాంగన। కాలుచీరుటకు

రాగ। నె[illegible]దిగని క్రోధమ్మున నుక్కతృణమ్మునువై చెనువేగ॥ రా ॥

వ. ఇట్లు రాముకర నిక్షిప్త తృణంబు బ్రహ్మాస్త్రంబై వాయసం బుపైకి ఘోరంబుగా గవిసిన నదికావుకావుమని వాపోవుచు.

కాకి-కీర్తన, యెదుకులకాంభోజి, అట తాళము.

దేవేంద్ర! యోశచీ। దేవీ మనోనాథ! వేవేగఁ కావు! కావు! ఓవిష్ణునందన! యోవాణీవల్లభ ! వేవేగఁ గావు! కావు! ॥దేవేం॥ అక్షయబ్రహ్మాస్త్ర-మావరించె దిశా। ధ్యక్షులారా! కావరే ! మోక్షగుండేశ్వర! ముక్తీశ! నేనిక-మ్రొక్కెదఁ। గావు! కావు! ॥దేవేం॥

వ. అవియిట్లువాపోవుచు వేడుకొనుచున్న కాకికేకవాక్యంబుగా వారందఱిట్లనిరి.

తోహర.

రాముడువైచిన। బ్రహ్మాస్త్రంబును। మేము నిలుపఁగాఁగలమా ! ఆమహానీయ్యుని-నాశ్రయించినను-నతడుఁ బ్రోవునునికఁజనుమా!॥ రామ॥

వ. అనివారిచేత నియమింపఁబడి త్రిలోకంబులు దిరిగియు నెందును శరణంబులేక కాకంబు గ్రమ్మరవచ్చి శ్రీరామమూర్తి మఱుఁగుఁ జొచ్చి భయభక్తుల నిట్లని వినుతించె.

కా-కీర్తన, కమాను-ఏకతాళము.

సీతాధిపా! శ్రీరామా! త్రిభువననుత!॥సీతా॥ గౌతముని నాతిన పుడుపు-నీతనుజేయవె!॥ సీతా॥ కావు-కావు-కలుషాపహార!॥ సీతా॥ కుజనవారణ! సుజనహృదయ గురుజలజాత నిలయ!॥ సీతా॥ ననుగన్న।జనకుఁడవన్న। కనుగొన్న। నినునమ్మియున్న। ననుఁబ్రోవుమన్న॥సీతా॥ నీకన్న వేరు।లోకాధ్యులేరు। కాకుత్స్థలేరు కాపాడువారు । చేకొని పాపము-జిందరవందర। జేసిశుభములిడు॥సీతా॥ రామరామ! నా, రాయణకవినుతనామ! మోక్షపుర, ధామా! రాజల, లామా ! పాపవి, రామా! సజ్జన, కామ! రూపజిత కామ! నీరదశ్యామ! శరణు॥ సీతా॥

వ. అని యీవిధంబున వేడిన కాకిపయిఁ కరుణగలిగి శ్రీరామ

దేవుండు పలుకుచున్నాఁడు.

క. నాయస్త్రము వృథవోవదు
నీయంగంబొక్కటిమ్మ! నేఁ ♦ డనవిని యా
వాయసమొక కన్నిడితాఁ
బోయెను శ్రీరామునాజ్ఞఁ ♦ బూనియథేచ్ఛన్.

వ. అదిమొదలు గాకులకు నొంటికంటి చూపేర్పడె. నాపిమ్మట సీతారామలక్ష్మణులు ఫలహారంబులుసేసి వాల్మీకాది మహాఋషుల సాంగత్యంబులచే బ్రహ్మానందంబు నొందుచుండ నిక్కడ.

సం-శో-హ. సుంతనమెకియ సు, మంతుడు రథమును, మరల నయోధ్యకుఁ జేర్చి। వంతచేత దల, వంచుచుజని భూ, కాంతున కెఱిగియు నిలచె॥ రామ॥

వ. ఇట్లునిలచినఁగాంచి దశరథుండు వగచుచుఁ కన్నెత్తిచూచి.

దశ-తోహార. ఇడుములు గుడుచుచు। గోడుకులు గోడలు। నెచటనున్నారోయి। యుడరుచున న్నే । మని నిర్దయుఁతో । నాడినారో చెప్పవోయి॥ రామ॥

అనియెలుగెత్తియు-హాయని యేడ్చుచు-నడిగిన నాదశరథుని । గనుగొనిచింతా, క్రాంతుడగుచును-ననియెమంత్రి నెమ్మదిని॥రామ॥

సు-ద్వి. రాజేంద్రశృంగిబే, రము జేర్చినాను। వేజడలు ధరించి-వెడలి జాహ్నవిని । దాటి కాల్నడకతోఁ - దద్దయుఁజిత్రి । కూటశైలమ్మున, కునుజేరినారు।తల్లిదండ్రులకునుఃదండముల్ సెప్పు। మల్లనవగవ వ, ద్దనుమనినారు। సాకేతమునకన్న-సకల సౌఖ్యంబు। లాకాననలం దెక్కు-వని యనినారు । సీతయత్తలకును-జెప్పిదండములు । భూతలాధిపయి దె-పో వాతఁలనిన॥

మ. వినికౌసల్య విలాపమొందుచు విభున్ ♦ వీక్షించి హానాథ! నీ
యనుకూలంబుఫలించెఁ గైకకొడుకున్ ♦ హర్షంబుతోనిందు ర
మ్మనిపిల్పించి పట్టభద్రుమిమ్ము వలదీ ♦ యాలస్యమింకేల నా

తనయుల్ నాఁకులుగూరలై బ్రతుకరా ♦ దైన్యంబునన్ గానలన్.

వ. అనునుడువు లాడలిపైఁ యుమకుజల్లినట్లయిన వాపోవుచు.

దళ-కీర్తన, సురట-ఆదితాళము.

ఎందుకుఁబల్కెదవే! సుందరి!॥ ఎందు॥ నందనునెడఁబాసి। డెంద ముగుందగ। ముందేనేదుఃఖింప, నిందరిలో। నందుకుదోసముగ, నగ్నిజిలికిన రీతి॥ఎందు॥ నేనింకప్రాణాలు,నిలుపగజాలను।గానగశాపము, గలదునాకు మానినియింతలో మర్యాదబోనాడి॥ ఎందు॥ శ్రీమోక్షగుండవు, రీశుని సాక్షిగ। గామిని! నాశాప। కారణము। వేమరునేనీకు - వినుపింతునింత లో॥ నెందు॥

ఉ. ప్రేమను వేటలాడుటకుఁ ♦ బిన్నటనాఁడు ధనుశ్శరంబులన్
యామినియందుబూనిఁ వెల ♦ యన్ సరయూనది తీరమందునో
భామిని! పొంచియుండఁగఁ ద ♦ పస్వికుమారుఁడొకండు నీటికై
కోమలి! వచ్చిహస్తగత ♦ కుంభము గ్రక్కున ముంచెనీటిలోన్.

వ. అప్పుడు.

దళ-తోహ. బుడబుడమనిచ, వ్వానుగలిగిన న, వ్వానుగజమనినేఁ ద లచి। జడియకవైచితి-శబ్దవేదియను-శరమును దరిపైనిలచి॥ రామ॥

హాతాతా! హామాతా! మిమునను-నావిధివాపెనుననుచు। నేతె రువిక! నని-యిలపైబడవిని-యేతెంచితి భయపడుచు॥ రామ॥

వ. ఇటుల చెంతకుఁజేరి యిట్లంటి.

దళ-కీర్తన, హిం॥కాపి-ఆదితాళము.

నీవెవరో! తెల్పుమునాకు॥నీవె॥ నేవనకుంజరమని-భావించి వేసితినిశర ము॥ నీవె॥ వేటకువచ్చితినీ। యీ। యేటిదరినినుంటిని। ధాటిగనయోధ్య మాదీ, దశరథావనీశుఁడను॥ నీవె॥ కానకచేసితినీ, తప్పు। గావుముమొ్రక్కితినీ, పూనినాకుబ్రహ్మహత్య। పొందెనేమిచేయువాడ॥ నీవె॥ ఏకులమే స్థలమురా! నేల! నీస్థలము ప్రాకటముగ। మోక్షగుండ, పాలుదయలే కపోయెను॥ నీ॥

వ. అనిన నతండు.

క. నాపేరు యజ్ఞదత్తుఁడు
భూపాలక వైశ్యుఁడను ద ♦ హోమహీతులు మా
తాపితరులు గలరంధకు
లీపొంతను నిదిగోయుందు ♦ రినకులవర్యా!

గీ. వారిదప్పిఁదీర్ప ♦ వారికై వచ్చితి
నాపురాకృతంబు ♦ నన్నుఁబంప
బ్రిహ్మహత్యయనెడు ♦ భయమునీకిఁక లేదు
మిగిలినట్టి పనికి ♦ వగవనేల!

య-కీర్తన, ధన్యాసి, ఆదితాళము.

ఇకఁబొమ్మా ధరణీవల్లభా॥ ఇక॥ అమ్మయునబ్బయు- నతిదాహ
ముచే- నల్లాడుచును-న్నారచటికినిక॥ బొ॥
ఏకారుదురా- చీకులునాకై । యీకలశంబును-గై కొనినీవిక॥బొ॥
నాపోబడిఁగా,నక నేడయ్యో! వాపోవ్రుదురీవార్త దెలుపనిక ॥బొ॥
దక్షతతోవారి- దాహముదీర్పగ।మోక్షగుండపతి, సాక్షిగనీవిక॥బొ॥

య-తోహ. శాపంబిత్తురు। చనుమికదడయక ।శరవేదనబడజా
బ్రిపుజేరియా। బాణముఁలాగుము। ప్రాణముబాతునీవేళ ॥ రా॥

వ. అనిపలికినఁ జింతాక్రాంతుండగుచుడగ్గరి యతనియెడ నాఁ
టియున్న శరంబుపెఱికిన యజ్ఞదత్తుండు దేహంబుబాసి దివంబునకరిగె
నంతనేను విధినిదూరుచు నక్కలశంబును నెత్తినమోచికొని మెల్లన న
డుగులిడుచు యజ్ఞదత్తుండుసెప్పిన గుఱుతుప్రకారము ముదుసళ్ళున్న
చోటికిఁబోయిన కాళ్ళచప్పుడువిని.

వృద్ధు-తేవారము. కొడుక! నీవింతసేపు♦ దడయగానేలఁ జెప్పఁ।
బడు గులముఁదప్పిచేత♦ బడలియున్నాము ధాత। యిడుమలొందంగఁజేసె♦
నిటుల దలమీఁదవ్రాసె। గడియయును నిన్ను మేము ♦ కానకను నిలు
వలేము.

వ. అనిన భయభ్రాంతచిత్తుండనై యుదకకుంభంబచ్చటదించి వారిపాదంబులపై వ్రాలి.

దశ-తేవారము. నేనుమీసుతుండఁగాను♦ నిక్కమును దెల్పలేను। భానువంశోద్భవుండ♦వసుధలో దశరథుండ। నేనిచటవేటలాడఁగాను♦జను దెంచినాఁడ। గానకపకారమొకటి ♦ గడఁగి నేజేసియుంటి.

వ. అదియేమియనిన వచించెద.

చ. సరయువుఁజేరిమీకొడుకు ♦ చప్పుడుఁజేయుచు నీరుముంచఁగాఁ
గరియని శబ్దవేదియను ♦ కాండముఁవైచితిఁ గూలెనాతఁడా
తురపడివైచినాఁడ దయ ♦ తోఁగనుమంచును నేనువేఁడ నా
గురువుల దప్పిఁదీర్చుమన ♦ గొబ్బున నీరముఁగొంచువచ్చితిన్.

దశ-తో. నేపాపాత్ముడ- నీచవర్తనుడ- మీపుత్రునిజంపితిని। నా పయిమిక్కిలి,గోపముసేయక- ననుబాలింపుడుధృతిని॥రామ॥

మేకొనియుదకము- మీకుదెచ్చితిని- జేకొనిత్రాగుడువడిగ। నాకృత్యముమానసమునసుంచక- ననుగృపగనుగొనుడనగ॥రామా॥

వ. అంతవారు మూర్ఛపోయి కొంతవడికిఁదెలిసికొనుచుఁగూర్చి.

వృద్ధు.కీర్తన, జోగిరాగము, ఆదితాళము.

మాపుత్రరత్నమా, నీవు-మము బాసిపోతివా!॥నీవు॥

మాపైనగలభక్తి-మఱచిపోయితివా! భూపతిశాపమున-భువినింత టిలో। బాపురేవిధిమెడ- బాపెనుమనలను ॥మా। మాకెవ్వరింక దిక్కు- మర్యాదచేయుగా। గాకులకొల్లజేసి-కదలిపోతివిగా। యీకానలలో నెటు ల మెలగుదుము। చీకులమెవ్వరు- చెట్టబట్టెదరు॥మా॥ భూమీశుచేత నే డు- పోలియుగనాయెగా। శ్రీమోతుగుండశౌరి- ప్రేమలేదాయెగా। శ్రీ మీఁటి చిరంజీవివి కమ్మని । మేమను మాటలు - మిథ్యలాయెనుగా॥ మాపుత్ర॥

వ. ఇట్లు దుఃఖించి యెట్టకేలకు ధైర్యంబుఁబూని.

వృద్ధు-తో. క్షితిపాలకనీవు- జిచ్చులుజేర్చియు-జితిబేర్చుము త్వ

రలోన। నతులితముగనూ- సుతుడరుదెంచిన। గతికిబోదుమేమనిన.

గీ. అటులఁజితిఁ బేర్చితిని నేను ♦ నంతవార
లగ్నిలోఁజొచ్చి ముందు మా ♦ యటులనీవుఁ
బుత్రశోకాగ్ని చేతనే! ♦ పొలియఁగల వ
టంచు శపియించి దివికరు ♦ దెంచిరబల.

దశ-తో. కావున నాశాప, కాలమువచ్చెను- గామినివ్యర్థముగా
దు। వేవేగంబున- బోవునుప్రాణము- వెలదిరోనిల్వగబోదు॥ రామ॥

వ. అని కౌశల్యకుఁజెప్పి తత్క్షణంబున.

శా. హా రామా! సుగుణాకరా! ప్రియసుతా! ♦ హాసీత! హాలక్ష్మణా!
మీరున్ నన్నెడఁబాసిపోవుకతనన్ ♦ మేనున్ విసర్జింపఁ జే
కూరెన్ దీనికిఁ గైకకారణమగున్ ♦ గూరాత్మయంచాడుచున్
జేరెన్ దేహముఁబాసి స్వర్గమునకున్ ♦ శీఘ్రింబెరాజేంద్రుఁడున్.

సం-తోహార. అంతటగౌసల్యాది కామినులు-హాహాకారముతో
డ। నెంతయువగచుచు- నెదలుమోదుకొని। చింతనొందిరప్పుడాడ॥ రా॥

కా-కీర్తన. ఆదితాళము, జోగి.

సుగు,ణాకరా! రణ,భీకరా! నృప-లోకశేఖరా! యిహ,లోకభోగ
ముసరి,పోకవేగము। ని,రాకరించిపొందితే! పరలోకసౌఖ్యము॥ సుగు॥

నిను, దూలనాడితి, గను, జాలిబెట్టితి- సు,శీలుడంచునీమది. గన,
జాలకెన్నితి॥ సుగు॥ అల, కైకకృత్యము। బహు,శోకమూలము। అ,నే
కమైనకష్టము। లెడ, లేకదోచెను॥ సుగు॥ ధర, మోక్షగుండ నా। ధును,
కడుగట్టినా । సురక్షితంబుగల్గునా! తల, వ్రాతదొలగునా!॥ సుగు॥

వ. ఇట్లు రాజకాంతలు దుఃఖింపుచుండ.

సంధి-తో. తెల్లవారగను- దెలిసియుపురజను- లెల్లరుగుములయి
వచ్చి। గొల్లుననందరు, గూడియేడువగ- గోలయయ్యెనదిచూచి॥ రామ॥

చ. గురుఁడువసిష్ఠమౌని చని ♦ గొబ్బుననందఱ నూరడించి భూ
వరఘనమూర్తినిఁ దైలమునఁ ♦ బక్వముఁజేయుఁగఁబంచి దూతను

క్కరుఁగనియోరి! నీవరిగి! ♦ గ్రిక్కనఁ గేకయురాట్పురంబునన్
విరివిగనున్న యాభరతు ♦ వేగముగాఁగొనిరమ్ము పొమ్మిఁకన్.

వ. గిరివ్రిజపురంబుననున్న భరతునిగాంచి యేసమాచారముఁ జెప్పక తమ్మునితోఁగూడఁ ద్వరితమ్మునవసిష్ఠుండు మిమ్ము దోడుకొని రమ్మనెనని చెప్పి పిలుచుకొనిరమ్ము దూతా.

తోహ. అని పంపిన నత, డతివేగమ్మున-జని యీవార్తనుదెలుప। వినిభరతుండతి- వికలచిత్తుడయి- తనవారలుపీడ్కొలుప॥ రామ॥

భర-కీర్తన, ఆదితాళము-శంకరాభరణము.

ఓహోబంధులార! నేన, యోధ్యకేగుదెంచెదా। యాహా! నన్ను బిలువభటుని-నంపిరి యోచించెదా॥ ఓ॥

రాముఁడెందుబోయినాడో! రాజుమాటదెలియదు! ఏమి! కారణమో! నా- కేమిదోచగాలేదూ॥ ఓ।

దక్షుఁడగుచు వసిష్ఠుఁడు-దానుబంపెనేమో! హా! మోక్షగుండ శౌరికెరుక। మోసమేమో! వచ్చెహా! ॥ఓహో॥

వ. అప్పుడుశత్రుఘ్నసహితంబుగా భరతుండు శీఘ్రయానంబున సాకేతనగరంబుఁజేరి కళాహీనముగానున్న యానగరంబునుగని ఖిన్నుండయి రథంబుదిగి మాతృగృహంబునకరిగి యొంటిగానున్న తల్లికి నమస్కరించిన లేవనెత్తి దీవించి యిట్లనియె.

తోహర. మాతులుడత్తయు - మాతామహీయును । దాతయు జుట్టంబులును।బ్రీతిగగుశలంబే! కదయనవిని-మాతకుదానిట్లనెను॥ రామ॥

భర-కీర్తన, ఆదితాళము-మధ్యమావతి.

ఎందుబోయె। నాతండ్రినేడు॥ యెం॥

ఎందుబోయెమది-యందుదోచలేదు । ముందునీదు గృహమందు నిలిచితిని। డెందమందునానందమొందు నిపు, డింక-లేడాయెదంఢ్రి॥ఎం॥

దుందుభిరవముల సందడులలరగ। వందిమాగధులు-బృందములై తన, ముందరగొలువగ సుందరముగజెలు।వొందు, భూమీంద్రుడిపు॥ఎం॥

ఈక్షితినారాయణ కవినేలెడు। మోక్షగుండపురరక్షకుదయతో।
నీక్షణమున ప్రతిపక్షగణంబుల। శిక్ష-జేసెటిదక్షు॥ డెండు॥

వ. ఇట్లడిగి కించిన్మాత్రింబు దుఃఖితుండయిన.

కయిక-తో. వగవనేలసుత-వాజిమేధముఖ-వరయాగకులేగతికి।
దగజనుదురో! యా, స్థానమునకుమీ। తండ్రిసేరె సద్గతికి॥ రామ॥

సం-తో. అనగా నామాట, వినగామూర్ఛిలి, యవనిపైని బడి
పొరలి।కొనకొనిశత్రుఘ్నునిసహితంబుగ।గొంతవడికి దెప్పిరిలి॥ రామ॥

క. నాయనస్వర్గమునకుఁ దాఁ
బోయెడు సమయంబునందుఁ ♦ బొలుపుగమాకుఁ
ఏయేబుద్ధులు గఱపెను
నాయెడదయయుంచి తెలుపు ♦ ననుగన్నమ్మా!

వ. అనిన దల్లి యిట్లని యె.

తోహ. శ్రీరామునినా, సీతనులక్ష్మణు, సారెకుదలపోయుచును।
దోరపుదుఃఖము, తోఁబొదలుచుగడ। తేరెననగవినియనెను॥ రామ॥

వారెచటికినావలెనే! పోయిరో! వారకదెలుపగదమ్మ! చేరువకొక
రును-జేరనిహేతువు-జెప్పుమనగనాకొమ్మ॥ రామ॥

కయిక-కీర్తన-ఆదితాళము-జంఝూటి.

వినుతనయా! తెలిపెద॥విను॥నినుగురించిచే, సిననాకృషి ॥ విను ॥
నట్టడవికిరఘు-నాధుబంపగా । బట్టమునీకును-గట్టగను గట్టిగగోరితి-గాం
తునితో॥విను॥ రెండు వరములిడి-యుండెగానమా। తండ్రియవియు లేదన
లేక। దండిగవరములు-దయచేసెనువి ను॥ తన॥ దీక్షగసీతా। దేవిలక్ష్మణు।
లాక్షణమునరా। నడవులకు। మోక్షగుండపతి। సాక్షిగఁజనెవిను॥ తన॥

గీ. వారినంపి పిదప ♦ వారిపైఁ బ్రియమునఁ
బొగలిపొగలిచచ్చె ♦ జగతివిభుఁడు
కొడుకవయేమియింకఁ ♦ గుతలంబు నేలుము
తనయ యనిన నతఁడు ♦ గనలిపలికె.

భర-కీర్తన, ఆదితాళము.

హాహాగదేహాగదే! పాపాత్మురాల! ॥హా॥ నీపట్టినె భర-నేబుట్టుటే! రోత॥హా॥ మాతవనుచునిక-బ్రీతిగగనవచ్చు। నే! తండ్రిజంపిన। ఘాతకురాలవు॥హా॥ అన్ననువనములు, కంపి యీరాజ్యము। నన్నేలుమనియెదవు నాలికెటులాడె॥బోహా॥ శ్రీమోహగుండ పు, రీశుని సాక్షిగ। వేమారునీ మోము। వీక్షింపఁగాఁజాల॥ హా॥

వ. అని యిట్లు కఠోరంబుగాఁ బలుకుచున్నయెడఁ జూడవచ్చిన వారిలోఁ గొందఱీ మందరవల్లనే! యింత తొందరగలిగెనన విని శత్రుఘ్నుండు తాత్రివంతంబున లేచి.

సం-తోహర. గూనిముండనిక-కూల్చివేతునని - దానిపాదములు బట్టి। మానుగగిరగిర, మనితిప్పియునిల, పైనబడగదాఁగొట్టి॥ రామ॥

మరికైకనుజం, పగదలచిననిది। మాతృద్రోహంబనుచు। భరతుఁడు హోదము-పదకౌసల్యా, వరగృహమునకన పనుచు॥ రామ॥

వ. అంతలేచి యిరువురుఁ- గౌసల్యనగరంబునకుఁజని భర్తృవియోగంబునఁ బరితపించు నామెపదంబులపయిఁబడి యేడ్చిన.

కా-తో. లెమ్మతండ్రి! సర్వమ్మదల్లిచే-నెమ్మదివినియుండెదవు। యిమ్మహినెల్లను, నేలుమునీవిక-నిష్టార్థంబులు పొదవు॥ రా॥

రామలక్ష్మణులు, భూమిజయునునా। రచీరలుధరియించి। ధీమతి నడవుల-దిరుగబోయిరిక-దేవుడెదిక్కనగాంచి॥ రామ॥

భర-కీర్తన, హిం, తోడి- ఆదితాళము.

యెటుదోచదాయెదల్లీ! యికనేమిచేతునే! కుటిలాత్మురాలుకైక యిటువలెజేసెను॥ యె॥

ఈకృత్యమెల్లనేను। యెరిగియుండితేను। బ్రకట బ్రహ్మహత్య। పాపమువొందును॥ యె॥ గురునివసిష్ఠునిదరుణితోగూడను। నరికినవచ్చిన। దురితముబొందుదు॥ యె॥ నాతల్లిమోహగుండ। నాథునిసాక్షిగ। నీతప్పునేజేసి। యెఱుగనునమ్మించు॥ యెటుదోచ॥

వ. ఇట్లు భరతుండు ప్రమాణపూర్వకముగాఁ బలికిన గౌసల్య జాలినొంది కొడుకును లేవనెత్తి నాయనా! నీమనోభావంబుఁగనలేక పలికితినని గారవింపుచు నొకరినొకరు గౌఁగిలించుకొని మెలుఁగెత్తి యేడ్చుచున్నతఱి వసిష్ఠుండువచ్చి భరతునితో నిట్లనియె.

చ. వగవగనేమికార్యము ధుర్వంబుగఁ జచ్చినవారు వత్తురే!
జగమున నశ్వమేధముసు ♦ సల్పియె రాముఁ బరాత్మఁగాంచి యీ
యగణితమర్త్య భోగముల ♦ నన్నియుఁబొంది దివంబుఁజేర్చె దా
మిగుల నృపాలుఁడన్నిటను ♦ మేటిగదా! యిఁక లేవులోపముల్.

సీ. దేహమెప్పటికిని ♦ ధ్రువముగానుండదు - మృత్యువువెన్నంటి ♦ మెలఁగుచుండు! సర్వసంపదలును ♦ శాశ్వతంబులుగావు ప్రాప్తంబుకుడువక ♦ వాసిచనదు! పుత్రదారాదులు ♦ బూనివెంబడిరారు బ్రహ్మాదులును నడ్డ ♦ పడగలేరు। బాల్యకౌమారయవ్వన ♦ జరావస్థలు పరిణమించకనొక్క ♦ పగిదినుండ॥ గీ. విట్టితనువుల నెన్నితా ♦ నెత్తినాఁడొ! పుట్టిచచ్చుటసహజంబు♦పురుషులకును, నశ్వరంబని దీనిని ♦ నమ్మరాదు! యింక దుఃఖించినను ఫల ♦ మేమిభరత!

క. చినిగినగుడ్డలు విడిచియు
మనుజులు గ్రొత్తవిధరించు ♦ మాడ్కిని తనువుల్
వెనుకటివి విడిచి నూతన
తనువిలఁ గాలక్రమమునఁ ♦ దాల్తురు జీవుల్.

క. కావున విజ్ఞతఁగైకొని
చావులు పుట్టుకలు రెండు ♦ సమమని మదిలో
భావించియు సంస్కారముఁ
గావింపుము తండ్రికిపుడుఁ ♦ గనువడితోడన్.

వ. అని బోధించిన వశిష్ఠుని వాక్యంబుల వలనఁ దెలివినొంది తైలద్రోణంబుననున్న తండ్రికళేబరంబు దీయించి విధ్యుక్తప్రకారంబుల నగ్నిసంస్కారంబు చేసి దశరాత్రంబులు కర్మమాచరించి వేదవిదుల

గువిప్రులకు షోడశమహాదానంబులిచ్చి సభాస్థానంబునఁ బరిజనమంత్రి సహితంబుగాఁ గొలువుదీరియున్న భరతునకు వసిష్ఠముని యిట్లనియె.

క. మీతండ్రి యనంతరమున
నోతండ్రీ! రాజ్యభార ♦ మూనుము రాముం
డాతత దండకవనమున
కీతఱిఁ జనెఁ గైకకోర్కు ♦ లెల్లఫలించెన్.

వ. అనిన భరతుఁడు.

భైర-కీర్తన, రూపకతాళము, జంఝూటి.

రామునిసేవింపబోదు-రాజ్యమేలను। నోమునీంద్ర! హేయసుఖము।లొల్లనునే, నుల్లంబున॥రా॥ కారడవులరాముఁడుండ-నూరనుందునా। యూరుమాటలేదు రేపు, మనమందర-మరుదెంతము ॥రా॥

కైకదప్ప స్త్రీపురుషులుగడమవారలు। ప్రాకటముగ మోక్షగుండ। పతికృపతో-రావచ్చును ॥రాము॥

తోహ. రామునిదోడ్కొని-రయమునవచ్చియు - రాజ్యమునేగట్టెదను। రాముడు రానంటే! మఱియుచటనె! రమ్యముగానుండెదను॥రామ॥

వ. అనినిశ్చయించి వేగినతరువాత వశిష్ఠాదిమునులును సుమంత్రాదులునుఁ దల్లులునుజతురంగ బలంబులు పౌరులును గూడిరా భరతశత్రుఘ్నులు గదిలి గంగాతీరంబునకుఁ జనిన గుహుండుసూచి.

గీ. కాననంబుల దిరిగి రా ♦ ఘవుఁడు మరల
వచ్చునో! యంచు దండెత్తి ♦ వచ్చుచున్న
యటులఁ దోఁచును నీరాక ♦ యైననేమి
నన్ను గెలిచియుఁ బొమ్ము నీ ♦ వన్న ననియె.

గీ. రాముఁ బ్రార్థించి తోడ్తెచ్చి ♦ రాజ్యమియ్యఁ
బోవుచున్నానటన్న ను ♦ ప్పొంగి యతఁడు
ఫలములును దేనెలిచ్చియుఁ ♦ బడవలందు
నుంచి యందఱ నవలిదాఁ ♦ టించె నపుడు.

వ. భరతశతు్రఘ్నులు రామ లక్ష్మణులవలెనే జటావల్కలము లుధరించి యానాఁడు భరద్వాజాశ్రమంబుఁ జేరిన నతండు.

భరద్వా-తో హర. పురినీ కిచ్చియు-బోయిన రాముని-బోనియ్యంగాలేవా! భరతుఁడ! యిటువెం, బడి బడివారల । దరుమగజనుచున్నావా! ॥రామ॥

సం-తో హర. అనిసభయంపడి-మునివర! రాముని। గొనిదెచ్చియు విభుజేయఁగ। జనుచున్నాననఁ । సంతసపడి యా, యనసత్కారము జేయఁగ ॥రామ॥

వ. అందుండి మఱునాఁడు బయలుదేరి చిత్రకూటాద్రిఁ జేర వచ్చినఁగాంచి లక్ష్మణుండు మునిజనపరివృతుండయిన యగ్రజుంగాంచి.

ల, కీర్తన, ఆదితాళము.

వారెవరో! చూడుము॥వా॥ వివిధసేనలతో- వెడలివచ్చు ॥వారె॥ సమరధులున్నారుగా। అతి, రధులున్నారుగా, రధహ యభటవా, రణములుగలవా ॥రె॥ ఇనకులుల చిన్నెలు। ఇదె । గలిగియుమనదెస। కలరివచ్చు॥వారె॥ ప్రతిపక్షవీరిలో ।ప్రతి। మోక్షగుండపుర-రక్షకయుల ॥వారె॥

న. అనిన రాఘవుండు.

రా-తో. భరతుడు మనలను - బురికినిరమ్మని - ప్రార్థింపగ రాబోలు। సరగున నీమది-సంశయపడకుము - సౌమిత్రీయిక జాలు ॥రామ॥

సం-తో. అనుకొనుచుండగ - నంతలోనవా - రరుదెంచినముందెముంది। తనతల్లులకును, దండములొసగియు, ఘనముగదీవనలంది॥రామ॥

క. కులగురునకు దండము లిడి
యలరుచు ధన్యుండనైతినయ్యా! మా త
ల్లులుఁ దమ్ములు వచ్చిరియిట
కలవడి మాతండ్రియేడి! యగపడడనఁగన్.

వ. విని వశిష్ఠుండిట్లనియె.

వ-ద్వి. మిమ్ముఁగానలకంపి- మేదినీవిభుఁడు । మిమ్ము దలంచుచు-

మృతుడయ్యె నంత। భరతుని విలపించి-పరలోకవిధులు। బరువడిజేయుంచి, పరిభువుగమ్మన్న। నెల్లకమిముఁజూడ, నొయ్యనవచ్చె। తల్లులతోఁగూడ-దశరథరామ!

అనుపల్లవి-లాలించి-యారామవిభుడు। జనకజాలక్ష్మణ-సహితంబుఁగాగ। గడువడిమూర్ఛిల్లి-గ్రక్కునఁదెలిసి। నుడియుచునిట్లని, శోకింపదొడఁగె॥

రా-కీర్తన, రూపకతాళము, హిం॥ తోడి.

తండ్రి! పోతివా! కన్న॥తం॥ తండ్రియయిన-కైకకోర్కె-దీర్చిపోతివా॥తం॥కొడుకులకొరకు। వెత। గుడిచియుఁగడకు। బడలిచెంతనెవరు లేక-బాసిపోతివా॥తం॥చాలకాలము,నీచాటునమేము।లీలమెలగుప్రాప్తిమాకు। లేకపోయెను॥తండ్రి॥ ఎంతదలంచితో! మ,మ్మెంతబిలచితో! సంతతంబు మోక్షగుండ, స్వామికెరుకగు॥ తండ్రి॥

వ. అప్పుడువచ్చినవారందఱుఁ కన్నీరుమున్నీరుగాఁబార నేడ్వ వశిష్ఠుండు శాంతవచనంబుల వారందఱ నూరార్చి రామునిఁ దగ్గరి.

క. లోకంబులు గల్పింపను
బ్రాకటముగఁ బెంపనొంపఁ ♦ బటివయ్యునిటుల్
బ్రాకృత పురుషుని విధమున
శోకింపుచు నుండనేల ♦ సురగణపాలా!.

వ. నీయంతవానికిది దగునే! దుఃఖించినఁ జచ్చినవారు వత్తురే! లెమ్మన గురువాక్యంబువలన రాముండుదేరి తమ్మునితోఁగూడ గంగానదియందు స్నాతుండయి తండ్రికి వాసోదక పిండోదకముల నిచ్చి యాదినముపవసించి మఱుదినంబున స్నానంబుఁజేసి యథాస్థానంబునకు వచ్చి మునిజన పరివృతుండై యున్న యన్నకు భరతుండు సాష్టాంగనమస్కారము లర్పించిన నిట్లనియె.

క. పితృవాక్య పాలనకు నే
ధృతితోఁగానలకు నేగు ♦ దెంచితినీవుల్

క్షితిభారముఁ దాల్పకయీ
గతినడవికి రాఁగ నేమి ♦ కారణమనుజా!

వ. అనిషఁ భరతుండు దీనాననుండగుచు నిట్లనియె.

భర-కీర్తన, ఆదితాళము, బ్యాండుస్వరము.

రామచంద్ర! రమ్మిక। రాజ్యమును గొమ్మిక। తామురాక నేనిక। దరలిపోను బురికిఁక। భూమిపాలింపగ- బోలనేను। శ్రీమీర మీపంపుజేసెదను॥ రామ॥ కపటచిత్తురాలగు। కైకమాటదలపకు। తపనకులజ నామెడ। దప్పులేదు చొప్పడ। విపులాటవుల కేగుటిక మానుము। కృప యుంచునామీద గేవలము ॥రామ॥ మోక్షగుండ దేవునీ। సాక్షిగ నీవు రానని। పక్షపాతముంచిన! బాధనుబుపిమతునా! లక్ష్మణసీతలు లలితాంగులు। అక్షయ కష్టములందలేరు॥ రామ॥

వ. అనిన శ్రీరామచంద్రుం డిట్లనియె.

క. జనకునియాజ్ఞను దాటఁగఁ
జనునా! రాజ్యంబునీకొ ♦ సంగియు ననుఁగా
ననములకు నరుగుమనియెను
బనివడి నెరవేర్చకున్నఁ ♦ బాపముగాదా ?

వ. అనిన భరతుండు శోకవ్యాకుల చిత్తుండై యొక్కదర్భాసనంబునఁ గూర్చుండి యిట్లనియె.

భర-తో. ప్రాణామారామము। బట్టియునేనును। ప్రాణంబులువిడిచెదను। గానమీరురాక యయోధ్యకు నే।బోనుసత్యమనియు నను॥ రామ॥

వ. అంత భరతుని మనోనిశ్చయంబునకు నేమిచెప్పుటకుఁ దోఁచక శ్రీరాముండు గన్నుగీటిన వశిష్ఠుండు భరతున కభిముఖుండయి యిట్లనియె.

వశి-కీర్తన, అటతాళము, నాయున.

అగ్రజుశాసన మాలించరాబా!! వ్యగ్రతగానీవు, వగ్రింపవలెనా!॥ అ॥ కారణకార్యము। లారయవలదా! తీరు మిక్కిలిలు। దెలియగవల

దా॥అ॥ రావణగూల్చి సు,రావళినెల్లను। బ్రోవగబుట్టిన- దేవుడుగాడా॥

అ॥ ఆపనిదీర్చగ । నదికడుమేలగు । పాపాత్ములెల్లను । బలిసిరిభూమిని॥

అ॥ మోక్షగుండపురా, ధ్యక్షునివల్లనే । రాక్షసకులములు - శిక్షింపబడనగు॥ అ॥

వశి-తో. తిరిగిరాముడరుదెంచిన నాపని। దీర్చువారలికయేరీ! చెరియొకకార్యము। జేయుడుజనులకు। క్షేమంబగునెనూరి॥రా॥

సం-వ. ఇట్లు భరతునకుఁ దెలిపి రామునింగాంచి.

వశి-తోహార. పదియునాలుగ,బ్దంబులు నిండిన। పిదపనయోధ్యకురండి! సదమలముగ స,జ్జనులౌననగా। బృధివినెల్లనేలండి॥రామ॥

వ. అని తెలిపిన.

క. ఇందుకురాముఁ డొడంబడె
నందుకు భరతుండునొప్పె ♦ నటుపిమ్మటఁ దా
వందనమొనరిచి సభవా
రందఱువిన భరతుఁడనియె ♦ నగ్రజుతోడన్.

గీ. తండ్రితర్వాత రాజ్యంబు ♦ దమదికాన
నాకుఁదగదయ్య సింహాస ♦ నంబునెక్కఁ
బాదుకలనిండు వానికే ♦ భక్తితోడఁ
జేసికొనియెద రాజ్యాభి ♦ షేకమింక.

ఉ. మీరరుదెంచుదాఁక నెల ♦ మీఁద బృధివీభరమూని ప్రీతితో
నూరకపాదుకల్ గొలిచి ♦ యుందును నేఁ బదునాలుగేండ్లకున్
మీరరుదేరకున్న విను ♦ మీ! విషమైనను ద్రావిచచ్చెదన్
నారసనేత్రమీపదము ♦ సాక్షిగ నారఘువర్యుఁడిట్లనెన్.

రా-తోహార. తమ్ముడ! నీయిష్టమ్మురీతిగా। దప్పక నేజేసెదను। బొమ్మికపాదుక - లిమ్మంటివి కై, కొమ్మని యిచ్చెదయును॥ రామ॥

వ. అంత భరతుండానందమొంది పాదుకలు శిరసావహించి రామునకుఁ బునఃపునః ప్రమాణంబు లాచరించిన దీవించియిట్లనియె.

రా- కీర్తన, అటతాళము.

ప్రజలను బాలింపుమీ! తమ్ముడ!॥ప॥ సుజనులగాంచి- సొరది బూజించి। వృజినమునొందక-గజిబిజిలేకుండ॥ప॥ నీతిమానక। ఖ్యాతిఁ బోనీక। దాతతండ్రిలబోలి - ధర్మమార్గముగాను॥ ప॥ వేదపాదలను బిట్టుదూరకను। నాదరమునమిత- మయిన పన్నుగొనుచు ॥ప॥ రాక్షస నాశ। మోక్షగుండేశు। నక్షయఫలదుని - నర్చనజేయుచు॥ప॥

వ. అనిబోధించి శత్రుఘ్నుని భరతునికి సహాయుంబుగానుండు మని నియమించి తల్లులకుఁ మగుడ నమస్కరించినగైకరామునకిట్లనియె.

కయిక-తో. నీవుదేవుడవు। నిర్వికారుడవు। కేవలపరిపూర్ణుడవు। నావిరించికిని నయిన దెలియదరా। మవునే! గుణశూన్యుడవు॥ రామ॥

కపటాత్మను నే,గష్టపుజీవిని, నృపహంతను గావునను। నపరాధ ము నీ,కాచరించితిని, నపనయించి కావునను॥ రామ॥

వ. అనిన.

గీ. మాయచేత జనులు ♦ మనుజునిగాను భా
వింతురి కానునేను ♦ విశ్వమయుఁడ
నమరహితము గోరి ♦ యవతరించితివచ్చి
నట్టిపనులు దీరి ♦ నంతఁబోదు.

రాముని-తో. నీవేమెఱుగవు। నీకీబుద్ధిని। నేబుట్టించితీసుమ్మీ।రా వణుగూల్చియు। రయమునవత్తును। గావునబురికికబొమ్మీ॥ రామ॥

నన్నుధ్యానింపుచు, నన్నుమరువకను, నాతల్లీ! నీవుంము। అనువుగ నంత్యము-నందునాపదవి- నంది సుఖింతువుజుండు॥ రామ॥

వ. అని కైకమ్మకు విజ్ఞానంబుఁగటిపి యందఱవీడ్కొలిపినఁగద లి వచ్చినమార్గంబుననే! శీఘ్రయానంబున సచివామాత్యసహితంబుగా నయోధ్యంజేరి యందరిని వారి వారి నివాసంబుల నిలిపి తానందుండ నిశ్చయింపక భరతుండు.

క. సంది గ్రామముజేరియు
నందుఁ సింహాసనమున ♦ నాపాదుకలిం
పొందగ నిలిపియు నిరతముఁ
జందన కుసుమములఁబూజ ♦ సల్పుచు మఱియుఁ.

సం-తో. ఫలభోజనమును-వసుధశయనమును- బ్రహ్మచర్యమును
గాగ।సలలితనియమము-సలుపుచుదమ్ముని, సహితముం దగుచువేగ॥రామ॥

పాదుకాజ్ఞచే-బాలన జేయుచు-బదునాలుగువర్షములు । గాదగు
కాలము, గణనము జేయుచు। గడుపుచునుండెదినములు॥ రామ॥

క. అక్కడ రాముఁడు మదిలో
నిక్కముగాఁదలఁచె నిచట ♦ నిలిచిన బౌరుల్
ఇక్కడికి వచ్చుచుందురు
చక్కగ నెక్కడికినయినఁ ♦ జనఁదగుననుచుఁ.

తో. అనితాభ్యూరినా, రాయణకవిరా, మాయణమునుహరికథ
ను।ఘనముగఁజెప్పెను, గనగనయోధ్యా, కాండము చిలుకునుసుధను॥రా॥

ఇదివినువారల, కిహసౌఖ్యంబులు। గొదువలేక చేకురును। ముద
మునదుదకును।, ముక్తిలభించును। మోక్షగుండహరికృపను॥ రామ॥

రామా! రామాయనవే! శ్రీరామాయణకథవినవే!గారీ!॥ రామ॥

క. నాచేతనైన కొలఁదిని
జూచిరచించితినిదీని ♦ సుజనులు నెఱసుల్
దోఁచినయెడ దిద్దుదురని
నాచిత్తములోననమ్మి నా ♦ నయంబుఁ.

అయోధ్యకాండము-హరికథ,

సంపూర్ణము.





శ్రీ ర స్తు.

# మోక్షగుండ రామాయణము*హరికథ.

## అరణ్యకాండము.

క. శ్రీమద్రామకథామృత
మామోదముతోడఁ గ్రోలి • యలరుచుఘనులా
నామహనీయుల కెల్లను
భూమినిధర్మార్థకామ • ముక్తులుగలుగున్ .

వ. అంత శ్రీమద్రామమూర్తికిఁ జిత్రకూటాద్రియందున్న ఋషికాంతలు మంగళహారతులు పాడిరెటులనిన.

మంగళహారతి-సురట రాగము-అట తాళము.

మారఘుకులజాత! మహిజాసమేత! జయమంగళం-శుభమంగళం॥
మారకోటినుత! మారశరీరా! జయ-మంగళం-శుభమంగళం॥
మానిహృద్గోచర-మహితతేజ! నీకు-మంగళం-శుభమంగళం॥
మానితకామక్రోధాదిఖండన! జయమంగళం-శుభ-మంగళం॥
మండలోజ్వలమోక్ష-గుండరాఘవ! జయ,మంగళం-శుభ-మంగళం॥
మహినారాయణ-కవి, మానసాధీన! జయ,మంగళం-శుభ-మంగళం॥

వ. అనంతరము శ్రీరామలక్ష్మణులచటి మునులవీడ్కొని కదలి యత్రిమహాముని యాశ్రమంబుఁ బ్రవేసించిన నమ్మహర్షి యెదుర్కొని తోడితెచ్చి పూజించిన సంతసించి రాముండిట్లనియె.

రా-తో.

వనయాత్రకురా-వలసిన నెపమున - నిమగన గలిగెముక్తిదా

అనయమునేనుగ్రొ, తార్థుడనయితిని-ననుబ్రోవు కృపాసాంద్రా!॥ రామ॥

వ. అనిన నత్రిమహాముని యిట్లనియె.

అత్రి-కీర్తన-ఆదితాళము.

కర, వరద! కామితఫలదా! శ్రీవరే! కరి॥వరదా॥

ధరనునీమాయలో-దగులక మెలగగ-దరమే! యజహర-సురలకై న॥కరివర॥ ననుభావనునిచే-యనువచ్చితనీ। వనుమాటలునా। కద్భుతము లు॥ గరివర॥ నారాయణకవి, నందిత! సంసార। తారక! నేనిక-ధన్యుడ నో! ॥కరివర॥ వసుధమోక్షగుండ। వాసదయానిధే। యనుపలబాధలు। హరియింపుము॥ కరివర॥

వ. అంత ననుసూయాదేవి సీతాదేవినిగని.

అన-తో. అన్నివిషయముల-ననుసరింపదగు-నధిపతిని బతివ్రతలు। గ్రిన్ననీవటు-గావించుటకయి-కదలివచ్చితివి మేలు॥ రామ॥

సం-తో. చేడియనీగతి-జెలగుచుదాఁగొని, యాడియు సన్మానించె। వాడనిపూలును-మాయనిచీరలు-వరభూషలు నర్పించె॥రా॥

వ. పిమ్మట రామునకు దండకావనమునకు మార్గముంజూప శిష్యులఁబంపుమన నత్రి యిట్లనియె.

క. లోకులకుఁ ద్రోవఁజూపెడు
నీకెవ్వరు త్రోవజూప ♦ నేర్తురు! ధరలో
లోకానుసరణిచే నీ
వీకరణిని గోరితివి ప ♦ రేశ! యనంతా!

వ. అటులనేబంపెదనని తనశిష్యులలోఁ గొందఱిని బంపినవారి వెంబడి గదిలి.

రగడచుబోలిన కీర్తన.

దండకాటవికిని। వారు, దగజొచ్చిరిధృతిని.

బెబ్బులులెలుగులుఁ-బొబ్బ మెకంబులు, గస్తురిమృగములు, ఖడ్గ శరభములు। గండకఖగములు, గొండయేనుగులు,। సారంగంబులు,

గారెనుబోతులు। నడవిపందులును, హయచయంబులును। నక్కలరణ్యపు-కుక్కలుముప్పలు। జెవులపోతులును, జెలగుబాతులును। కోతుల గుములును, గొండముచ్చులును। దాసరిపాములు, నూసరవెల్లులు। పెనుసివంగులును, బునుగు బిల్లులును। నుదుములుమిడతలు। నుడుతలునెలుకలు। ఘూకచయంబులు, గాకులగుంపులు। మొదలగుమృగములు, సదమలపక్షులు। భూతగణంబులు, భేతాళంబులు। బ్రహ్మరాక్షసులు, పైపైనార్చుచు। తిరుగుచు జనులకు- జొరకాకుండెడు॥ దండకా॥

వ. ఇట్లు దండకారణ్యంబుఁజొచ్చి యతిశిష్యుల వెనుకకుఁబంపి యొంటిగా నరణ్యంబునఁ బోవుచుండ.

సం-తో. శూలముభుజమున- సొంపుగదాల్చి క,రాళవక్త్రమును దెఱచి। వాలాయముఁగా। వచ్చెవిరాధుఁడు। వడినార్చుచు జేజరచి॥ రామ॥

వ. ధీరులవలె నీనారీమణితోఁగూడ గారడవిలో దూరిదూరి వచ్చెదరు మీరెవరు! చరాచరంబులుగూడి పరుగున వచ్చినదురంబున భరించగల విరాధుండను బ్రతుకఁదలచిన నీసతిని విడచి కపువడితో జడదారులార! మీయిరువురుకరుగుఁడు. అనిన రాఘవుండు విరాధుని గనుంగొని.

చ. దశరథ రాజసూనుఁడను ♦ దానవ! నాదియయోధ్యతండ్రిచే
విశదముగాఁగఁబంపఁబడి ♦ వేగమెవచ్చితిఁ గానకుణ్ భవా
దృశులగు రాక్షసాళిని వ ♦ ధించుటయే! పనినాకు సీత యీ
శశిముఖిభార్య యీతఁడను ♦ జాతుఁడు లక్ష్మణుఁ డేనురాముఁడణ్

వ. అనిన నతంఁను బెబ్బులింబోలి బొబ్బపెట్టిన నాదెబ్బకుమును లుబ్బుచెడి యబ్బబ్బా! యని తబ్బిబ్బులాడుచుఁ గొబ్బునఁ బాఱెదరు. మీరెననెంత! పంతంబుమీాత్రే యింతింతలుగా మీగొంతులు గోసికి రుధిరంబు, గ్రోలుదురా! నరాధముఁ!

విరా-కీర్తన, ఆదితాళము, కమాస్.

నిలునిలుమోభూవరా॥నిలు॥ బలిమిని నినునే. బట్టి వధింతును॥

బలము గలిగితే-దొలగక నీవునిలు॥నిలు॥

మః ప్వరినొకపరి। గొవ్వసెడగనే! నవ్వచుగ్గై కొని। నమలుదునిక॥ నిలు॥ రాక్షసులకు నర-భక్షణమగు విధి। మోక్షగుండవిభు- సాక్షిగ నిక నిలు॥నిలుమో॥

వ. అని ప్రగల్భంబు లాడుచు శూలంబుచేతవైచి సీతనెత్తుకొని యాకాశంబున కెగరిన.

సం-తొ. సరగున రాముడు- శరములువైచిన- సరకుగొనకపైకె గయు। బరువడినొకఘన- శరమున శూలము- విఱుగగ రాముడువేసెయు॥ రామ॥

అంతటసీతను- నపనిదోసెయుగను- నాక్రందమున రాగ। గాంతు డురాముడు- గరుడాస్త్రంబున- గ్రిక్కునదించెను బాగ॥ రామ॥

వ. అప్పుడు.

చ. పుడమితనూజఁ గాంచి రఘు ♦ పుంగవుఁ డద్భుత కోపదృష్టితోఁ
గడువడినర్ధచంద్ర మను ♦ కాండము వైవ విరాధుఁ డీల్గి యా
పెడదశరీరముఁ విడిచి ♦ వేగవిమానము మీఁదనెక్కి యే
ర్పడదివినుండి మ్రొక్కుచును ♦ బల్కె రఘూద్వహుతోడనివ్విధిఁ.

వి-తొ. వినురఘువర! నే-విద్యాధరుడను- మునుదూర్వాసుడు న న్ను। గనలుచుశపియించిన సంమన రాక్షసుడనయితినిటునేను॥ రామ॥

నీచేజచ్చితి- నిన్నునెఱింగితి- నీవుపరాత్పరుడగుదు। నీచకృత్యము లు, నేటికిబోయెను- నేనుముక్తికిక జనుదు॥ రామ॥

వ. తదనంతరంబ శ్రీరామలక్ష్మణులు శరభంగముని యాశ్ర మంబున కరిగిన స్వామిరాకనుగని యెదురేగి నమస్కరించి.

శర- కీర్తన- అటతాళము- బేహాగ్ రాగము.

స్వామిశ్రీరామ రామచంద్ర! నమో। స్వామిశ్రీరామ॥ రామ॥

నీమనముతోడుత। నీదర్శనము సు। గామించి తపమాచరింపుచు॥స్వా॥ నేధ న్యుడనయితి। నేగడతేరితి। నేటికిగోరికలుతీరె॥స్వామి॥ మోక్షగుండపురా,

ధ్యతనారాయణా। రక్షమీపదములు నమ్మితి॥ స్వామి॥శ్రీ॥రామచం॥

చ. అనికొనియాడి గంధకుసు ♦ మాక్షతలుక్ గొనితెచ్చిపూజనం
బొనరిచి కందమూలములు ♦ నెయ్యన నిచ్చిన నారగించి రా
వెనుకను దత్సమీప ముని ♦ బృందములెల్లను రాముఁరాకకే
విని శరభంగసన్ముని ని ♦ వేశముఁ జేరఁగ వచ్చిచేరగన్.

తో. రాముడుసీతా- లక్ష్మణయుతముగ- నామునులకు॥మొక్క-
గను। నామోదంబున। నందరురాముని। నర్చించిరిభక్తిగను॥రాము॥

అప్పుడు.

మును-కీర్తన, ఆదితాళము, హిం, కాపీ.

తావకదాసులము। రామ!రామ! భావములనుగొలుతుము॥ నీవు
వైకుంఠుడవు। శ్రీ।దేవియెసీతయు। రామ॥తావక॥

వరశంఖచక్రములు। రామరామ! భరతశత్రుఘ్నులు। ధర ల
క్ష్మణుడే శేషుడు। నగుచునుదయతో। బుట్టినవారు। రామరామ ॥ తావ॥

రాక్షసులనుగూల్పను। రామ। రక్షింపసాధులను। సీక్షితిగలిగితివి
రామ। మోక్షగుండేశుడవై। రామ॥ తావ॥

ఇట్లుపొగడి.

తో.తమతమవాయా,శ్రమములుసూడగ। దనసురమ్మనుచు బి
లువ। ప్రమదంబునజని। పరికించెనువారు। పరమభక్తితో గొలువ॥రాము॥

అచ్చటచ్చటను- ననులుశిరములు, నగపడరాముఁడనెను। నిచ్చ
లెలువుడివి-యెక్కడివనియను- నెలమినివారందఱును॥రాము॥

ఉ. రావణు నాజ్ఞచేత మద ♦ రాక్షసబృందము లప్పుడప్పుడున్
దేవర! వచ్చిమాముల వ ♦ ధింపుచుఁ బోవుచునుండ్రు కూరులై
కావున నిప్డు పుట్టె లెము ♦ కల్గ గమశౌర్యముమీర వారి మీ
రేవిధినైన వేగ వధి ♦ యించి దయన్ మముఁబ్రోవఁగావలెన్.

అనివేడిన.

తో. సాధుపులనుగమ బాధజేయునసు - రాధములనుబోకుండ।

సీధరగూల్చునని-నిక వారల భయ-మేమిమీకు లేకుండ ॥రామ॥

వ. అని శపథంబుగా రాముడు పలికిన మునులందఱు డెందం బుల నానందంబునొందుచు.

మును-ఆర్యావృత్తము.

జయజయ తులసీధామా! జయజయరవికుల సుధాంబునిధిసోమా!
జయజయ తారకనామా! జయజయత్రిజగద్విభో! పరంధామా!

వ. ఇట్లువారు పొగడుచుండ గ్రమంబున వారి యాశ్రమం బులన్నియుజూచుచు సుతీక్ష్ణాశ్రమంబుజేరిన.

సం-తో. రామదివ్యమం, త్రంబుజపించెడు-నామునివర్యుడు లేచి। రామున కెదురుగ-రయమున జనితా-నేమముతోదోడ్తెచ్చి ॥రామ॥

పాట। ఆదితా॥ గురుమహరాజవలె.

దశరథరామా! దశరథరామా! దైవలలామా! దశరథరామా॥ సగుణ నీమంత్రి, జపమును సలుపగ। దరమెగారీ,తరుణికిదక్కక ॥దశ॥ నీపదసేవయు-నీదు దర్శనము। నాప్రాప్తంబున-నాకులభించెను ॥దశ॥ అక్ష య ప్రకృతి వి, లక్షణ చిన్మయ। మోక్షగుండపుర, రక్షపరాత్పర ॥ద॥

ఇటులనుతించిన రామచంద్రుడు.

పంచచామరము.

సుతీక్ష్ణనాదుమంత్రిముక్ వి ♦ శుద్ధితో జపించివ్రా
ద్గతుండనైన సన్ముఖక్తి ♦ గాంచి గొల్చుచుంటివా
నతిప్రమోదమయ్యెనాకు ♦ నర్థిమోక్షమిచ్చితిక్
క్షితిక్ జనించపంకమీద ♦ సిద్ధమో మునీశ్వరా!

అనిపలికిన.

రా-తో. అరయగ మాగుటు, డగునగ స్త్యముని, వరునిజూడ బోవలెను। బిజబిజ మానెను, వెంబడింపుమ్మని - పిలిచికొనుచటు వెడలె ను ॥ రామ ॥

వ. ఇట్లుపోవుచు.

క. సీతారాము లగస్త్య
భ్రాతృగృహాంగణముజేరి ♦ భక్తిని నాతం
డాతిథ్యమియ్యఁ గొని సం
ప్రీతునిఁగాఁ జేసిచనిరి ♦ ప్రియముననవలన్.

వ. ఇట్లుచని యగస్త్యాశ్రమంబు సమీపించిసుతీక్ష్ణునిఁగాంచి.

తో. మీగురునకు మా, యాగత వార్తను-రాగంబున నెఱిగిం పన్ । వేగమె పొమ్మన-వెడలి సుతీక్ష్ణుఁడు-దాగదిలెను రాముఁడం పన్ ॥ రామ ॥

పేర్మిను శిష్యుల-కామోదంబున - రామనామ మహిమంబు । వేమఱుదెలుపుచు-వెలయుచున్నగురు - మీరున కెరగికరంబు ॥రామ॥

గీ. స్వామి! శ్రీరామచంద్రుఁడు ♦ జనకజాత
సోదరులతోడ మీయాశ్రమంబుఁ ♦ జూడవచ్చె
ననఁగనుప్పొంగి యర్ఘ్యపా ♦ద్యములఁగొనుచు
నేగి శిష్యాళితోఁగూడ ♦ నెదురుగాను.

వ. ఇట్లుచని జానకీలక్ష్మణ యుతంబుగా రాముండుమ్రొక్కిన లేవనెత్తి యాలింగనంబుఁజేసికొని పర్ణశాలకు గొనివచ్చి పీఠంబిడి పూజించి ఫలహారంబులు వెట్టి యిట్లనియె.

అగ-కీర్తన, ఆదితాళము, బిలహరి.

అత్యంతసంతోషము, భవ, దాగమనంబునూ ॥ కత్యంత॥ శ్రుత్యంతములచేత। శోధించిచూచిన। నిత్యానందమైన । నీదివ్యదర్శన॥ మత్యం॥ నీనామమంత్రాను, ష్ఠాన, తత్పరులకు । మానుగగోచర, మానీదుదర్శన ॥మత్యం॥ మోక్షుగుండమందు। మోహానరూపుతో। సాక్షివై నిలచిన సర్వజ్ఞ మీరాక ॥యత్యంత॥

అగ-తో. నామరూప సుగు, ణములు లేనిజగ । న్నాథుఁడవగు నీయందు । నామాయయుదాని। యందుమహాత్మున, హంకారము దాని యందు ॥రా॥

అందున త్రిగుణము, లవ్యాకృతములు। నిందిృయములు ప్రాణ ములు। బొందుగనిన్నిటి, యందుసూక్ష్మముగ, నుందువంటకనునీవు ॥రా॥

క. రాజస సాత్విక తామస
రాజితగుణములను గలిసి ♦ బ్రహ్మహరీశివుల్
గాఁజనియించియు జగముల
నోజను బుట్టించి పెంచి ♦ యుడుపుదు వభవా!

అగ-తో. క్షీరసముద్రపు। తీరంబునదును। జేరియజాదులు వేడఁ। క్రూరరాక్షసులఁ। గూల్పదలఁచియవ। తారమొందితివి మూడఁ॥ రామ ॥

క. అప్పటినుండియు దర్శన
మెప్పటికగునోయటంచు ♦ నెదురారయుచుఁ
దప్పక యీస్థలముననే
నొప్పఁగఁదపమాచరింపు ♦ చుంటిననంతా!

వ. నేటికిఁ బ్రత్యక్షంబైతివి. నామనోభీష్టంబుదీరె. నేను కృతార్థుండనైతి.

అగ-ఉత్సాహవృత్తము.

గౌతమీతటంబునందుఁ ♦ గలుగుపంచవటికినీ
సీతతోడజేరుమది వ ♦ సింపమంచితావగుఁ
బ్రీతితోమునీంద్రులందు ♦ బెక్కుమందియుందురి వి
ఖ్యాతియాఫలాదులచట ♦ గలవుసూ సమృద్ధిగఁ.

వ. అనిచెప్పి యక్షయతూణీర బాణంబులును ఖడ్గంబును మహేంద్రచాపంబును నిచ్చి వీడ్కొలిపిన నగస్త్యునకుఁ బునర్వందనంబులు సమర్పించి పంచవటికిఁ బోవుచున్న నప్పుడు.

సం-తో. దారినదుమ కొండనుబోలిన యా। కారముతోఁ గనఁబడిన। ఘోరు జటాయువు। జూచినెమ్మదినిజోద్యమందివేగమున ॥రామ॥

తమ్ముఁడ! లక్ష్మణ ! తెమ్మధనుర్బాణమ్ములు ద్రుంచెదవీని। లె

మ్మనవపుడా, లించి గృధ్రపతి- నమ్మోయిఁ బలికెను బూని ॥రామ॥

జటాయు-కీర్తన, కాపి, ఏకతాళము.

రామ! నేజటాయువను నామము వాఁడ। నీ। భూమికోనదశరధున కుఁ-బోలుపుగ సఖుఁడ ॥రామ॥ ఈవనంబువందు నేను-నెపుడు మెలఁగెదనో! దేవమీకు హితము నేను-దెలుపదొడఁగెద ॥రామ॥ పంచవటికిఁబోవుచున్న వారు మీరలు । మించిదనుజు లప్పుడపుడు - మెలఁగుచుందురు ॥రామ॥ మోఁక్షగుండ దేవమీరు - మోసపోకుఁడు। యీక్షమామునూనెనరసి-యేలు చుండుము ॥రామ॥

వ. కావున నేను వధాహుఁడఁగాను మీహితంబుఁ గోరువాఁడ ననుఁడు మన్నించి యనంతరంబున.

మధురగతి రగడ-పల్లవిసహితము.

పంచవటికిఁజనిరి। వారు। పంచవటికిజనిరి॥ కుందకురంటక - కోవి దారములు। జందన తిందుక-సాలవృక్షములు। మందారంబులు - మామి డిగున్నలుఁ। బొందుగఁజెలఁగెను - పొగడలుఁబొన్నలు। మాలూరంబులు మాకందంబులు। దాళంబులు హిం - తాలచయంబులు । దాడింబలును గ, దమ్మృవృక్షములు। నా డెములగు ఘన, నారికేళములు।కరకలుసిరికలుఁ గంటక ఫలములు। గురువకములు న్యగ్రోధవృక్షములు। శ్రీగంధంబులుఁ జిరుబిల్వంబులు । బాగుగజాతీ, ఫలవృక్షంబులు । నౌదుంబరము లు-నశ్వత్థంబులు । మోదుగలనఁటులు - మొదలగుతరువులు । ఫలకిసల యనుమభరితములనుచును। వెలయుచునుండఁగ-వేగమెకనుచును । శుకపి కరవము లు, సొంపుగవినుచును । బ్రికటితసీతా, రామలక్ష్మణులు ॥ బంచవటికిఁజనిరి.

గీ. ఇటులపంచవటికి ♦ నేగి నిర్మలమైన
తావుఁజూచి యచట ♦ దాశరథులు
పర్ణశాలఁగట్టి ♦ బాగుగఁ బూజించి
యొనర సంతసించె ♦ నుత్సవమున.

వ. ఇట్లుపర్ణశాలయందు నివసించి మునుల సద్గోష్ఠిఁ గాల యాపన చేయుచున్నంత.

సీ. అంతటలక్ష్మణుఁ ♦ డన్నకు వదినెకు
నుపచరింపుచునుండి ♦ యొక్కనాఁడు
ఫలములుఁ దేఁబోయి ♦ వనమునఁదిరుఁగుచో
నురుగుచుల్ దేలెడు ♦ నొక్కఖడ్గ
మభిముఖమైరాఁగ ♦ నదిగొనియచ్చటి
వెదురుఁబొంపంబును ♦ జిదురులుగను
గరఖడ్గముననరు ♦ కగ నందుమునియుండి
చచ్చిన నాతని ♦ చావుఁజూచి
గీ. వెఱచి మూర్ఛిల్లి తెప్పిరి ♦ వేగలేచి
యన్నకడకేగి నేబ్రహ్మ ♦ హత్యఁజేసి
నాఁడ గతియేమియని చర ♦ ణములవ్రాలి
వగవనూరార్చి శ్రీరఘు ♦ వర్యుఁడపుడు.

సం-తొ. అచటిమునులగని-యయ్యో!యిదియెట్లనిరాముండడుగ గను|బ్రచురంబుగవారు,పలికిరిస్వామీ!భయపడకుడుమీరిఁకను ॥రామ॥

వ. శూర్పణఖ మగని విద్యుజ్జిహ్వుఁడనువాని లంకకుఁ గావుంచి రావణుఁడు దిగ్విజయార్థంబుగాఁ జనిన.

గీ. లంకతానుగొను త ♦ లంపునవాఁడు
మాయనేర్వదాను ♦ బోయెనపుడు
మరల రావణుండు ♦ పురమునకేతెంచి
వానిచేష్టకలిగి ♦ వడిగఁగదిలి.

వ. పాతాళంబుననున్న యతనిఁజేరి యవక్రవిక్రముండై.

ము-తొ. తప్పకయాతని-తల దునుమాడియు-దనపురిజేరెనుమర ల| జుప్పనాతిశోఁ-జెప్పనీయిష్టము| చొప్పనబొమ్మనియవల॥ రామ॥

వ. శూర్పణఖతనయుండు జంబుఁడనువాఁడు దండ్రిపగదీర్చుట

కయి సూర్యునిగూర్చి బహుకాలంబుఁ దపంబుఁ జేయుచున్న.

ఉ. భానుఁడుమెచ్చి ఖడ్గమును ♦ బంపినఁదానిటురాక నిన్నునుర్
బూనికఁబంపెనిర్ గొనను ♦ బొమ్మనిచెప్పి తపంబుఁచేయుటర్
మానకపోయి యావెదురు ♦ మధ్యముఁజేరి సమాధినుండె నా
దానవుఁడట్టి ఖడ్గమిది ♦ దానిగొనెర్ మన లక్ష్మణుండహా!

వ. ఇట్లులవడిన ఖడ్గంబుఁబూని మిూంతెన్నుఁడు.

ము-తో. వెదురుజొంపమును-జిదుమఁగ జంబుని-వెడదశిరము దె
గనీగ్లె। నదిగనిమునియని-యదరుచువచ్చెను-నిదిమంచిదివెతదొగ్లె॥రామ॥

సం-తోహర. ఈవిధిగానే। రావణాదులజ-యించిబ్రోవు। మమ్మ
నిరి। తావకచిత్తము, దయయుంచండని-తాపసులెల్లను జనిరి॥రామ॥

క. అంతట శీతారాముల
నెంతయుఁ బూజించి ఫలము ♦ లిచ్చియధేచ్ఛర్
సంతుష్టులఁ గావింపుచు
సంతతమును గొల్చుచుండె ♦ సౌమిత్రితెగర్.

వ. అప్పుడు చుప్పనాతి యధాప్రకారము సుతునకు బోనపుటి
కగొనివచ్చి ఖండతనుండయియున్న కొడుకుంగాంచి కొంతవరకు దుఃఖిం
చియగ్నిసంస్కారంబుఁజేసి సమీపస్థులయియున్న మునులనుగాంచి క్రో
ధతామ్రికయయి.

చుప్ప-కీర్తన, ఆదితాళము-బేహాగ్.

ఓహోపాతులారా! యుండు॥ డోహో॥ మంచి। దో హా॥
సాహసమునసింత-ద్రోహముజేసినార॥ యో॥ మారులేకను నాకు, మా
రుజంపినయట్టి-వీరుడెవ్వరోవాని-పేరుదెలుపుడునాతో॥నో॥ మోంక్షు, గుం
డశౌరి-యీాక్ష, ణమున వారి-పక్షమైననుగాని,శిక్ష జేయకమాన॥నోహో॥

వ. అని కరాళించి పయికి లఘించిన శూర్పణఖ దెబ్బకుఁ దబ్బి
బ్బునొంది జటాధారులు వడవడ వడంకుచు.

ము-సు-ద్విపద. అన్నాకుమమ్ముల-నతిచరోయొక్క। మునికుమా

రుడువచ్చి-ముదమున వెదురు। జొంపంబున తికెదు, చోసినుతుందు । జం పంగబడీయె నా, జడదారిపిదప। నాపర్ణశాలకు-నరిగెనునీవు । పోహొమ్మ వానిజం, పుటకనిపంపి।దీనికృతంబున-దెగును రావణుడు। మానకగలుగును, మనకు సౌఖ్యంబు। లనియుబ్బుచుండిరి-యచటితాపసులు। జను దెంచె నాపర్ణ-శాలదగ్గరకుఁ। జయ్యనసడుగుల, జాడ వెంబడిని । నయ్యసురాంగన-నప్పుడుగాంచి.

క. నవ్వుచు రాముండనియెను
నివ్వనమున కేలవచ్చి ♦ తెందుందువు నీ
వెవ్వరిదానవు తెలుపుము
నివ్వెఱఁగగు మాకు నేఁడు ♦ నినుఁగన్నంతన్.

వ. అనినఁ జుప్పనాతి.

చు-తోహర. రాక్షసరాజయి లంకను నేలెడు రావణుచెలియలిన గుదు। సీక్షితినా పేరు, వినుడు శూర్పణఖ-యెతిగింపుదు మీరెవరు॥ రా ॥

వ. అనియడిగిన రాముండు.

[illegible] రా-కీర్తన, ఆదితాళము-కళ్యాణి.

ఆకర్ణింపుము భామినీ॥ నీవాక॥

రాకమ రుడను రాముడు నా పేరు । సాకేతమ్మగుమాది॥యాక॥

సీతాదేవిది । చెలువుగ భార్యగు । నీతడు తమ్ముడు-నాకు॥ నాక ॥

ఈక్షితిఁదశరథుఁ, డెలమిదండ్రియగు।మోక్షగుండవిభు, సాక్షి॥ఆ॥

గీ. తండ్రియాజ్ఞ చేత ♦ దండకవనములఁ
దిరుగవచ్చినాము ♦ తెలువ మేము
నీవు మకిడకను ♦ నేడ వచ్చుటకేమి
కారణంబొ చెప్పు ♦ కోమలాంగి!

వ. అని యడుగుటయు.

ఉ. రావణునాజ్ఞ చేతను న ♦ రణ్యమునన్ జరియింపుచుండు నే
నీవనమందుఁ దాపసుల ♦ నేరనిఁజూచిన మోహితాత్మనై

భావజుకేళిలో బలిమిఁ ♦ బట్టిరమింతును నొప్పకున్న నే
వారినిఁబట్టి మ్రింగుదు ♦ ధృవంబిదినా కెదురాడ రెవ్వరుక్.

చు-కీర్తన, అటతాళము, హిం॥ కాపి.

మారుకేళిదేలింపును। మారశరీరాననుః॥మారు॥ మారుబారిద్రో
యకుము। కోరినిను మోహించితి॥మారు॥ వేడుకగనీకునాకు నీడుజోడుగ
నుండు। నేడు మోక్షగుండమారి-తోడునినుబాయజాల॥మారు॥ అనిన,

రా-తోహర. నాకుభార్యయు,న్నది దీనికిని। నీకును సరిపడకుండు।
నాకుఁదమ్ముఁడగు నాతిలేదువిను। జేకొని రతులనుగూడు॥రా॥

కావున లక్ష్మణు-గలియుగబొమ్మన- వేవేగమెచనుదెంచి। భావజు
కేళిని బరగఁగూడుమన- భ్రాతృభావమునుగాంచి॥రామ॥

మత్తకోకిల- నేనువీరికి సేవకుండను ♦ నేఁడునన్ను వరించినన్
జాననీవును దాసివౌదువు ♦ చాలకష్టముగల్గెడున్
గానరాముఁడెనిన్ను నేలును ♦ గ్రక్కునజనుమన్న నా
మానినీమణి రాముఁజేరి క్రి ♦ మంబునన్ రతిగోరినన్.

క. ఇద్దఱితోఁ బడఁజాలను
ముద్దియ లేనట్టిహాఁడు ♦ మదితరో! యతఁడే!
వద్దన్న నేమి! యాతని
యొద్దకె చనుమన్నఁ గనలి ♦ యుగ్రరవమునన్.

చు-తో. అచ్చటకిచ్చటి- కలయదిప్పచను- హాస్యములాడెద
రార। చెచ్చెఱనేనీ- సీతనుమ్రింగియు- జెలగినిన్ను దమిదీర॥రామ॥

సం-తో. కూడుదుననుచును, గూయుచుగదిసిన, గ్రూరరాక్షసిని
జూచి। పోడిమిచెడియ।భూమిజవడకగ। బొసగలక్ష్మణుఁడులేచి॥రామ॥

లక్ష్మ-కీర్తన, అటతాళము, ఘరజు.

కోరికనుదీర్చెద-రారావేచెలి॥కో॥
నీరూపురేఖ। నేగనినంత। సారెకుమోహాము। మీఱెనేనీదు ॥కో॥
నీమదినేగం,దామనియుంటిని। గామినివిడువగ,గలనటవేనీదు॥కో॥

మోక్షగుండహరి, సాక్షిగనీపని-దీక్షగ నిప్పుడె- తీర్చెదనేచెలి॥కో॥

వ. అనిన విని క్రోసంబు విడిచి యానందంబున సౌమిత్రినిడగ్గ ఱిన రామునానతిఁ గయికొని లక్ష్మణుండు.

సం-తో. కరమునఖడ్గము, బిఱబిఱదాలిచి-కదియజేరికడునలుకన్। కఱకఱనాసా, కర్ణంబులుదెగ- నఱికెనరక్తమ్ములుకన్॥రామ॥

వ. ఇట్లు ముక్కు చెవులుఁ దుదముట్టఁగోసిన రక్తంబేఱుగఁ బా ఱ సిగ్గునుదుఃఖంబును దననుముంప శీఘ్రయానంబున ఖరాసురుని యా స్థానంబునకుం జనిన నవ్వికృతాకారంబుఁజూచి.

క. నీకీ యవస్థ వచ్చుట
కేకారణమమ్మ నాకు ♦ నెఱిఁగింపఁదగున్
శోకింపకు నేనిప్పుడె
లోకేశులనైన క్షణము ♦ లోన జయింతున్.

వ. అనిన, శూర్పణఖ యన్ననుగాంచి.

చుప్ప-తో. రాముండనునొక-రాచకుమారుడు। భీమబలుడుతమ్ము నితో। భామామణితో-వచ్చెగౌతమి। సామీప్యంబున ధృతితో॥రామ॥

నెమ్మదినుండగ-నేజనివలచిన- సమ్మతించకను నేడు। తమ్మునిచే క ర్ణమ్ములుముక్కును- దరిగించెనునీవుచూడు॥రామ॥

వ. అనిన ఖరాసురుండదరిపడి లేచి దూషణత్రిశిరులు వెంటరాఁ జతుర్దశ సహస్రపరిమిత రాక్షసబలంబులఁ గూడుకొని కదలిననాచప్పు డుప్పరంబు నిండిమెండుకొని దిగంతంబులు ప్రతిధ్వనులియ్య నదివిని రా ఘవుండనుజుని జూచి.

ఉ. రాక్షసురాలి పంపునను ♦ రాక్షసబృందము లొక్కపెట్టునన్
లక్షకొలంది వచ్చునటు ♦ లక్ష్మణతోఁచెడు నేను వారికిన్
శిక్ష యొనర్తునంతకును ♦ సీతనునొక్క గృహాంతరాళమం
దీక్షణముంచి ప్రోవుమిఁక ♦ నేగుమటంచును బంపి పిమ్మటన్.

వ. కోదండరాముం డఖండ ప్రచండ మార్తాండ సదృశకాం

డంబులు తంపోప తండంబులుగాఁ గోదండంబున నంకించి యెనుర చూచుచున్నంతఁ దక్షణంబున రాక్షసదళంబులు చుట్టుకొట్టె.

సం. తో॥ కొట్టుమతిట్టుము-పట్టుముముట్టుము- కోయుముత్రోయుమ్రిం డఘుచు॥ నట్టహాసమున-నసురులు శరుశిల, లంబులువై చిరితటుము॥ రా॥

వ. అప్పుడు.

సం- తో॥ బాణపరంపర- బరపిరాఘవుఁడు - పటుతరసేనలనెల్ల। బ్రాణంబులకెడ-బాపెనిముసమునఁ। బరమమునులురంజిల్ల ॥రా॥

వ. అంత ఖరాసురుని యానతిఁ జిత్తంబునఁగొని దూషణుండు భీషణంబుగాఁజని.

జూ. కీర్తన-ఆదితాళము-కమాసు.

నీవననెంతరా! నరాధమూనాకు ॥నీవన॥ కావరమా। తీవరమా, చేవచెడ। బేరిపులు, పోవులు। గావిదళించెద ॥నీవన॥ మానవులా। దానవుల, బూనిరణ। క్షోణిఁజయింపగ। మానుము। మానుము ॥నీవన॥ కండలును గుండెలును। జెండెదను। దండిగశీరి నొంక, గుండ విభునియాన॥ నీవన ॥

వ. అని ప్రగల్భంబులాడి కొన్నిశరంబులవుంచి మహాట్టహాసంబుఁజేసిన నవ్వి శ్రీరాముండిట్లనియె.

రా-తో. నీవారలగతి। నీవెరిగియునిటు। నీవేటికిజేరిలెదవు। చావుమూడియు, చ్చటికివచ్చితివి। గావున నిటుగూసెదవు ॥రామ॥

సం-తో. మంచిదుండుమని। మహానియ్యాస్త్రము, మించియురంబును గాడ। నంచితముగ। వే, యంగ నవనిఁబడి, యతడునీల్గెనపుడాడ ॥ రామ ॥

క. పిమ్మట దిరిశిరుండతికో
పమ్మునఁ జనుదెంచి యోరి! ♦ బలవంతుఁడవే!
రమ్మానాయెదుటికి బీ
రమ్మెల్లను గొంతునని శ ♦ రమ్ములు వై చెన్.

వ. నిర్వక్రపరాక్రమంబుగల శక్రద్వేషులు పెక్కండ్రు లెక్కకు మిక్కుటంబుగాఁ బిక్కటిల్లుచు నాచక్కికి వచ్చిన నొక్కొక్కరిని ముక్కలుముక్కలుగా జెక్కి చిక్కువాపినాఁడ నెక్కడనో! డాగియుండి యిప్పుడొక్కరుండ పిక్కడికి గ్రక్కున వచ్చితివి. తక్కక నీ డొక్కఁ జీల్చెద. నీకుదిక్కెవ్వఁడుండురా! దానవా! ఇదివఱకు నా ప్రతాపముఁ గానవా!

సం-తో॥ అనియొక ఘనశర, మును సంధించియు। నతిభీకరమున వేసియు। మునుకొని యాతని। మూఁడుశిరంబులు, దునిసిపడియెనాచా యు॥ రామ॥

వ. అంత ఖరాసురుండు క్రోధోద్దీపితుండై యెదిరించి వచ్చి నగాంచి.

రాము-కీర్తన, ఏకతాళము, పూరికళ్యాణి.

ఓరిదానవా! పోరకమానవా। చేరవచ్చినావా యూరకజనవా!॥
ఓ॥ మున్ను పోరి-మన్ను గూరి-మృతులయి-యున్న వారి। గన్న బాణిపోక ను। వన్నెదీరి-చెన్ను మీఱి। యనికిని-నెన్న జేరి-నన్ను జీరితివి॥ యోరి॥
దండిమోక్ష, గుండరక్ష-కుండనై। మెండుకక్ష-జండ రాక్ష, సుల నిల। జెండపేక్ష-నొందుదీక్ష। వెడలితి, నుండుమూక్ష। నిండ, శిక్షయగు॥ వోరిదా॥

వ. అనిన ఖరాసురుండిట్లనియె. దిట్టతనంబున లోకాధికుండగు రావణు తోఁబుట్టువు మీకట్టెదుటికివచ్చిన నట్టహాసంబున నట్టియపకారం బప్పట్టున గట్టిగ నొనర్చితివి. కట్టాయిట్టిచెట్టవాని నెట్టుసహింపఁదగు. దెగువగల మగవానివయిన బిగువుతప్పక జగడంబునకుఁ దగులుపడుము. నేమగువనుగాను నీపొగు దిగురఁజేసెదఁ దులువా! నాయెదుట నిలువ గలవా! నలవా! అని పలికి కఱకుటమ్ములు పెక్కులువైచిన సొలయక రాముండు.

పంచచామరము. వృథాభిమానమైనపల్కు ♦ విఱ్ఱవీఁగి పల్కఁగఁ
బధంబుగాదు నీప్రపీ ♦ బంటవై ననిల్వరా!

మథింతునీమమర్మముల్ గ్ర • మంబునఁ రణోర్వలో
వధింతునీశిరంబునేఁడు • వ్రియ్యవ్రియ్యలై పడఁ.

వ. ఇట్లు పలికి యొక్క యమోఘాస్త్రంబు ధనువున సంధించి.

సం- తో॥ ఆకర్ణాంతము- బీకివిడువగను - నదిచని యాతనిశిరము।
బ్రికటముగ నిల, పై నగూంల్చెసుర-వరలు మేలనగఁగరము ॥రామ॥

వ. ఇట్లు ఖరానురాది రాక్షసులు నిశ్శేషముగా వధించినపిమ్మట సీతాలక్ష్మణులు గుహలోనుండి వచ్చి హతులయిన రాక్షసులఁగని యాశ్చర్యంబునొంది రాముని కుపచరించి యిష్టగోష్ఠిగానుండిరి.

సం-తో॥ అంతశూర్పణఖ - యాక్రిందింపుచు- నపుడులంకకును నడిరిగె। సంతోషంబున। సభకుజేరి రా, క్షసపతిపదముల కెఱిగె ॥రామ॥

వ. అప్పుడు రావణుండు దానియొక్క వికృతాకారంబుఁజూచి.

రావ. కీర్తన, ఆదితాళము, బేహాగ్. ...

అవ, కారమెవ్వరుచేసిరమ్మ! వారి, పేరుజెప్పుమువిందుకొమ్మ!
అవ॥ ఈ, తీరున దుఃఖపడకమ్మ! నారి-వారి, బోరి - చంపుదునవ ॥కార॥
ఆ, ఖండలాదులువచ్చినారా! మోక్ష-గుండహరి పంపినట్టివారా దనుజ, పిండునీకడ్డపడ్డరై రా। తుండె, ములుగ-జెండివేసెద నవ ॥కార॥

వ. అనవుడు చుప్పనాతి యిట్లనియె.

క. మునివేషధారి రాముం
డను రాచకొమారుఁడొక్కఁ • డతివ యుఁ దమ్ముం
డనురాగంబునఁ గొలువఁగఁ
జనుదెంచెను బంచవటికి • సరభసలీలన్.

క. ఆతని యిల్లాలగు నా
సీతావతి చక్కఁదనముఁ • జెప్పందరమే
భూతలమున నాకంబునఁ
బాతాళమునఁ నమనైనఁ • బ్రతిలేరు సుమీ!

చుప్పనాతికీర్తన, బేహాగ్-ఆదితాళము.

ఆ, సుందరియందమే! యందమందు। జగ। మందునెందుఁగాననా పసందు॥ ఆసుందరి॥ మాటలచేమరున్ని ఘోటినేలు। నెర, నీటుగల్గువాల్ చూపులుమీలు। జగి। తేటలయిన చెక్కులద్దములు। దాని। తోటిపొం దేచేయువేనవేలు। మరుని ఘోటినేలు-వాల్ చూపులుమీలు-ఆచెక్కుటద్దములుపొందె చేయువేనవేలు॥ ఆసుందరి॥

కొండలాసిబ్బెపుచనులతీరు। వే,దండముతిన్న నినడకసౌరు। మోక్ష। గుండశ్రీనాథునిసతినిమీరు।బ్రహ్మాండములోదానికిసరి లేరు, సిబ్బెపుచను లతీరు। తిన్ననిన్నడకసౌరు। శ్రీనాథునిసతిమీరు। నల। దానికిసరిలేరు॥ ఆ॥

చు-తొ. దానినీకుఁదేఁబూని నేనుజనఁ-గానేతమ్మునిచేత। నా నా సాక, ర్ణములఁగోయించెను। నేనెటులుందునుభ్రాతా! ॥ రా॥

వ. అంతఁ జింతాక్రాంతురాలనయి చని ఖరాసురుని యుద్ధం బునకుఁ బంపిన ఖరదూషణ త్రిశిరాది చతుర్దశసహస్ర రాక్షసదళంబుల నొక్కండ విదళించె. వీరన నేలఁ జతుర్దశభువనము లెత్తివచ్చిన నమ్మహానీయ్యునకు లక్ష్యమా! రావణా! లోకవిద్రావణా!

చు-కీర్తనము, ఆదితాళము-కేదారిగౌళ.

నిశాటకులవర్యా! వినుమిక॥ నిశాట ॥ విశేషముగనే। వివరించెద విను॥నిశాట॥ సీతలోకవి, ఖ్యాతరూపవతి। భూతలమునునీ। కేతగునూ।బ్రీతిగనదియు, బ్బినజాలునువిను॥నిశా॥ మోక్షగుండహరి।పక్షమేమొ! కాని రాక్షసవరులను। శిక్షించె, నీక్షణమునసీ-విద్దియెఱుంగుము॥ నిశాట ॥

వ. అనిన మంచిదని చెల్లెలి నూరార్చి యింటిలోనికనిపి రావణుండారాత్రి కాలోచితకృత్యంబులుదీర్చి శయనించి కంటఁగూరుకు రామిఁ దనమనంబున.

రా-సం-తొ. రాముడెవ్వరో! రాగగారణఁ। బేమిగొతమీదరికి।
ఆమానవుడీ-యనుజులజంపుట-కేమికార్యమాతనికి॥ రామ॥

మానవులకునీ। మహిమగలుగ సా। మాన్యమె యోచింపగను।

దానవకుల వి, ధ్వంసుడుహరి యువ। త్తారమెత్తెనేమోను॥ రామ॥

క. కావున నాతనిచేతను
జావిక సిద్ధంబునాకు ♦ సరియటులయినన్
ఆవైకుంఠం బలవదు
నేవెరవుననై నదీని ♦ నెఱిగంగఁ దగున్.

వ. అని నిశ్చయించి ప్రభాతంబున రథారోహణంబుఁజేసి మారీచుని గృహంబునకరిగె నప్పుడతండు మునింబోలి సమాధినిష్ఠుండయి పరాత్పరుని హృత్కమలంబునఁ గాంచుచు.

మారీ-కీర్తన, రూపకత్తాళము.

పరమాత్మా! పరమేశా! పరమానందస్వరూపా! గురుతరసహస్రారస్థిత, గుహమయుసురు చిరదీపా! ॥పర॥ నీరాంత, శ్లీలాముని-జాలసుహృత్తేలామర। లోలా శ్రీమోక్షగుండ, పాలారి విషాలావర॥ పర॥

వ. ఇట్లు నిశ్చలత్వంబున నీశ్వరారాధనంబుఁ జేయుచు మారీచుఁడు గన్నులుదెఱచి రావణుంజూచి సత్కరించి యిట్లనియె.

మారీ-తోహర. ఏమిపనికినీ। విచటికివచ్చితి। వెఱిగింపుముదనుజేంద్రా। శ్రీమీఱగనేఁ-జేయగల్గినను। జేయుదుగరుణాసాంద్రా॥ రామ॥

సీ. అనవుడు రావ ♦ ణుండనియె నోమారీచ!
తరణివంశజుఁ డయో ♦ ధ్యావిభుండు
నగు దశరథునకు ♦ నాత్మజుండగు రాముఁ
డనుజుండు భార్యయు ♦ ననుసరించి
చనుదేరఁ దండ్రియా ♦ జ్ఞనువచ్చి యాపంచ
వటియందునిలిచి తీ ♦ వ్రంబుగాఁగ
ఖరముఖ్యులనుజంపి ♦ కడువడిమన శూర్ప
ణఖ ముక్కు సెవులును ♦ నఱికివై చెఁ
గీ. గాన నాతనిసతిని దేఁ ♦ బూనినాఁడ
నీవు మాయామృగంబువై ♦ నేఁడుపోయి

రాముఁగొనిపోమ్ము మిగులదూ ♦ రంబునకును
సీతఁ గొనివచ్చి లంకకుఁ ♦ జేర్తునేను.

వ. అనిన నప్పుడు మారీచుండు ద్రుళ్ళిపడి.

మారీచు-కీర్తన, ఆదితాళము, శంకరాభరణము.

అబ్బబ్బా! రామునిచేత-దెబ్బతిన్న వాఁడను । నిబ్బరముచాలదు మా, యబ్బతోఁడుచాలును॥అబ్బ॥ పిన్ననాఁడేవాధిఁబడి। వ్రేసెబాణము నను। నన్నిప్పుడు బ్రతుకనిచ్చె-నా నామదినుఱువను॥ అబ్బ ॥ మోక్షగుండశౌరి యతఁడు-మునిజన సమ్మతుఁడు। నీక్షితినెగ్గాచరించి-యెవరుబ్రతుకనేర్తురు॥ అబ్బ॥

మా-తో. తర్వాతను నే-దండకవనమున । దగనాతఁడుండగను । బూర్వవైరమున-బులిరూపంబునఁ-బోయితగిలితిని నేను॥ రా॥

తీవరమున నొక-దివ్యశరంబును-వైవ దప్పిపోఁగాను। జావుదప్పినే సరగవచ్చియి, చ్చటమునినై యున్నాను॥ రా॥

క. రాముండన రత్నంబన
రామామణి యన్నరవము ♦ రాజని యన్నన్
రామొదలను గలిగిన యా
నామంబులు విన్నఁ గ్రన్న ♦ న్నన్ భయపడుదున్.

వ. అదియునుంగాక యొక్క విశేషంబు వివరించెద.

క. రాక్షసకులంబు నెల్లను
శిక్షింపఁగఁ బూనియతఁడు ♦ చెలఁగు నయోధ్యా
సుక్షేత్రంబునఁ బొడమిన
సాక్షాన్నారాయణుండు ♦ సర్వజ్ఞుఁడగున్.

మా-తో. కావుననాతని, తోవైరంబునఁ-జావొదవును మనకెల్ల। దేవదేవుఁడని-తెలిసిభక్తితో। సేవించుటకను మెల్ల॥ రా॥

వ అని పలికిన మారీచుని యధైర్యవచనంబులు విని రావణాసురుం డిట్లనియె.

రావ-కీర్తన, బేగడరాగము, అదితాళము.

భయపడకు। భావములోపల॥ భయ॥ నయమతినీవేళ। నామాట మీఱకు॥ భయ॥ రాముడాపరం-ధాముడుచావై న। నేమివానిచేజచ్చి।తే ము క్తిగలుగును॥ భయ॥ నేనుజయించితే వానియిల్లాలితో। మానవనిసుఖ ములు। మానుగబొందుదు॥భయ॥ మోక్షగుండరఘు-మూర్తినేమఱించి యీక్షణమున నేను నిలసుతఁదెత్తును॥ భయపడ॥

సం-తో. పొమ్ముశీఘ్రమున-బోననియంటే! పొరిగొందువునిన్న నగక। నెమ్మదిహరిచే-నీల్గుటమేలని-సమ్మతించిదాఁ జనగ॥ రామ॥

వ. ఈపర్యాయము రామునిచేతనిశ్చయంబుగా మరణంబుగలు గునని తలంచి మారీచుండు రావణునిరథంబెక్కి యిరువురునుమహావేగం బున బంచవటికిననరిగి రాముని పర్ణశాలకు సమీపించిన నంత.

క. కాంచనవర్ణము రజత స
మంచితమగు పొడలునీల ♦ మగునేత్రింబుల్
మించుగ రత్నపుఁగొమ్ములు
గాంచనమణి ఖురములమరఁ ♦ గా మృగమయ్యెన్.

వ. ఇట్లుమారీచుండు విచిత్రమైన యొకమాయలేడి యాకారం బుధరించి పర్ణశాలచేరువకు రాఁగాగాంచి రాముండు సీతకిట్లనియె.

చ. రమణిగో భిక్షురూపమున ♦ రావణుడిప్పుడువచ్చు ముఖ్యరూ
పమును నదృశ్యమానటులఁ ♦ బావకులోపల, దాచిమాయరూ
పమునుధరించియుండు మొక ♦ వర్షముదాఁక దశాననుండు దా
నమసినమీఁదఁవచ్చి ననుఁ ♦ జయ్యనఁ జేరుదుగాక జానకీ!

వ. అనిబోధించిన వల్లెయని యాప్రకారంబొనర్చి సమీపమున జరించు మాయామృగంబునుజూచి మాయాసీత శ్రీరామునకిట్లనియె.

సీత-కీర్తన, అటతాళము, హిం॥ కాపి.

రామయీామృగమ్ము। ప్రేమతోఁబట్టితెమ్ము॥ శ్రీరామ॥ హేమా భముఁదెల్లపొడ-లేమొవింతగానున్నది॥ శ్రీరామ॥ ఈడదీనితోఁడగూడి।

యూడుకొన వేడుకయ్యె। నేడుపట్టి తెచ్చిదయ। తోడనాకు నియ్యఁదగు ॥ శ్రీరామ॥ వనవాసముదీరినంత। మనము యోధ్యఁజేరినపు। డనువుగ మాయత్తలకుఁ, గనబఱచి యానందింతు॥ శ్రీరామ॥ ఎన్నడిట్టి మృగమును గన్నామె యీ వనమందు। గన్నులకు బండువుగ। నున్నదిది మోక్షగుండ॥ శ్రీరామ॥

సం-ద్వి. అను సీత వాక్యంబు, లాలించి రాముఁ। డనుజునిజూచి యిట్లని మోదమ్ముమెండ। దానినేదెచ్చునం, తకునునీవిచట। జానకిఁగాపాడు-జాగ్రతగాను। దానవమాయల, దగులకుమనిన। మానుగామృగమయి, మారీచుఁడలుక। తోవచ్చినటులఁదోఁ, చుచున్నయది। పోవలదన్నన, ప్పుడు రాముఁడనియె। మారీచుడైనల, క్ష్మణవానిమాయఁ। దీరుగామాయించి-తెత్తునేఁజూడు। సీతకోరికెనుదీ-ర్చెదనుంచుమనుచుఁ। జేతవిల్లంబులుఁ జెచ్చెరఁబూని। పోయియామెకమును-బొంచిపట్టంగఁ। బోయినపది యు న, ద్భుతముగా నపుడు.

సం-తో॥ చిక్కినట్టుగా। దక్కినట్టుగాఁ-జేరువకును దాఁ జేరు। మక్కువఁబట్టగ-మఱిపోయిన చో-జిక్కులఁ బెట్టుచుఁ బాఱు॥ రా॥

వ. ఇవ్విధంబున మోసంబుజేయుచుఁ జాలదూరంబు త్రిప్పిన నదిరాక్షసమాయగా నిశ్చయించి రాముండు కోపోద్దీపితుండై.

సం-తో॥ చాలగ బ్రహ్మాస్త్రంబున మాయెలు। దూలవ్రేయనసురుండు। హాలక్ష్మణ! యను-నార్తారవమునఁ-గూలెనవని పైనతఁడు॥ రామ॥

వ. ఇట్లు మారీచుండు గూలిన నతని తేజంబు పరాత్పరుఁడయిన రామునియందుఁగలిసె. నంత నాధ్వనివిని సీతాదేవి భయాకులితచిత్తయై లక్ష్మణునిజూచి

సీత-కీర్తన, హిం, తోడి, రూపకము.

పొమ్ములక్ష్మణా! లే। లెమ్ములక్ష్మణా! నెమ్మదిరాముండుపిలిచె, నిన్నులక్ష్మణా! ॥పొమ్ము॥ ఏలపిలిచెనో। చిక్కు-లేమిగలిగెనో! జాలమేల జేసెదవు చాలులక్ష్మణా! ॥పొమ్ము॥ రాక్షసాళుల-చేత రావుగలిగెనో!

మోక్షగుండశౌరికయిన । మొ్రిక్కు లక్ష్మణా!॥ పామ్మ॥

వ. అను దీనాలాపంబులువిని లక్ష్మణుండు.

క. మారీచుఁడు మాయామృగ
ధారుండై వచ్చెనతని ♦ దఱుముచుఁ జనియా
శ్రీరాముఁడు చంపినచోఁ
బేరెలుఁగున రాముసట్లు ♦ పిలిచెనువన్నా.

ల-తొ. వాఁడుగాదుతి్రిభు, వనములుపై బడివచ్చిన భయమేమ
మ్మ! కూడమ్మట్టియును-గూల్చఁడెగడియలో। కొదువలుండునేయమ్మ॥

నన్నిచ్చటనుం, డమనిచెప్పెఁజని-ననునాప ఋగోపించు । నన్న
యాజ్ఞకేదు, రాడజాలనత-డతివేగమె యేతెంచు॥ రామ॥

వ. అటువెనుక సీతాదేవి యత్యంత సంతాప కోపంబులు వ్యా
పింప మరఁదినిగాంచి.

స్రగ్వి. రాముఁడాలీలఁ జీ ♦ రంగ నాలింపకే
తామసించేవు ఖే ♦ దంబునుర్ జెందవా!
రాముఁడిచోట్టికిక్ ♦ రాకయున్నంతనర్
క్షేమమంచీవు ద ♦ క్కించుకోఁ బూనితో!

వ. దండకారణ్యంబుననుండఁ గోదండరామునిబొమ్మని భూమం
డలంబుఁ దానొక్కండ నేల భరతుండు గాంక్షించె. రామునిక్షేమంబుఁ
గామింపక నామీఁది ప్రేమాతిశయంబుచేత నీమాడ్కి యుపేక్షించి
నీవున్నవాఁడ, నన్నమేలు గన్నులఁ గనలేని మీయిద్దరి సుద్దిబుద్ధికిఁ దద్ద
యుండోఁచె. నీకేలయింతదుర్బుద్ధి నాప్రతిజ్ఞవినుము.

సీత-తో॥ గోదావరిలోఁ-గూలిప్రాణములు - గోల్పోదునుగానిక
ను। నేదక్కుదునే! నీకుఁభరతునకు-నేడని యేడువగాను ॥రామ॥

చేతులతోఁదన-చెవులుమూసుకొని-చింతాక్రాంతుం డగుచు ।
నోతల్లి! నే, బోయెదరాముం, దుండిన చోటికినుచు ॥రామ॥

క. వనదేవతలారా! యీ

జనకజఁగాపాడరయ్యా ♦ చనియెదనింకన్
ననుదూలనాడెసీమెయుఁ
గనఁనాయెడఁదప్పలేదు ♦ కంటిరిగాదే!

వ. అనియొప్పగించి దుఃఖించుచు మెల్లమెల్లగానడచుచు రామసహాయార్థంబుగాఁ జనియె. నంతనది తరుణంబుగానెంచి యాప్రాంతముల దాగియుండిన రావణుండు దండకమండలంబులు ధరించి భిక్షుకవేషంబునఁ బర్ణశాల డగ్గరిన నతని నిజమునిగా భావించి సీతాసతి పర్ణశాలఁదాటి వచ్చిమహావినయంబునఁ బూజించి.

సీ-తో॥ కందమూలములు । ఘనముగనిడి భ । క్షణజేయుడుముని వర్యా! అందముగానా, యధిపుఁడువచ్చెడు-నంతకుండుడోయార్యా॥రా॥

వ. అనిన భిక్షుకవేషధారి యిట్లనియె.

రావ-తో. ఎవ్వరుసీపతి। యెరిగింపుముసతి। యిదిరాక్షస సంవృతము। ఇవ్వనవాసం, బేటికి గలిగెను। నెవరుపంపిరన వినుము॥రామ॥

సీత-కీర్తన, అటతాళము, కాపి,

జానకినాపేరు। జనకునికూతుర। మానుగ నయోధ్య, మాది శ్రీరాముఁడు।నానాథుఁడగువిను।నామఱది లక్ష్మణు। డౌను దశరథుఁడె, యగును మామామ ॥జానకి॥ తండ్రిపంపగనన్ను। దమ్మునిదోడ్కొని। దండకమునకు నా। ధవుఁ డరుదెంచెను।దండిగనొకపని। యుండిపోయిరి వారలుండుడందాక। మోతుగుండేశుదలఁచుచు ॥జానకి॥

వ. అనిన నతండు.

రావ-తోహర॥ లంకాధిపుడను। రావణుడనుబో । లస్త్యసుతుడశూరుడను। బొంకముగాగొని । పోదునిన్ను మా, పురికివలచియున్నాను॥ రా ॥

క. మునివేషధారియగు భా
మునసిఁక విడనాడనన్ను ♦ మోహింపుము నీ
కనుకూలమైన సుఖములఁ

దని పెద వనవాసబాధ ♦ తలగును లలనా!

వ. అనువాక్యంబులు గర్ణశూలాయమానంబులయిన సీతయు ల్లంబున భీతిల్లుచు.

సీత-కీర్తన, అటతాళము. [illegible]

రణరంగశూరుడు రఘు-రాజకుల శేఖరుడు। బ్రిణతార్తిభంజనుడగు। రాము నెఱుగవు నీవు ॥రణ॥ నన్నన రాని మాట-లన్న నికఫలమేమి నిన్ను నొక్క బాణమున। నేడుధరగూల్చుజూడు ॥రణ॥ ఉండుమిసుమంత మోంతు। గుండవిభుడే తెంచు - వే, దండమశకములనఁ-దగును నాతనిని న్ను ॥ రణ ॥

వ. అంతట.

సం-తోవార॥ రాక్షసాధిపుం-డక్షయమగుగురూ- క్షేక్షణములవీక్షించె। నాక్షణమున నాయతివముంగల ని-జాకారముఁ గనబఱచె ॥రా॥

కరములు వింశతి-శిరములు పదియును - గాల మేఘసదృశంబు। గిరిబోలినయా-కృతితోడభయం-కరముగ బరగెగరంబు॥ రామ॥

వ. ఇట్లు దననిజరూపంబు గనఁబఱచి.

క. జనకజచుట్టును భూమిని
దననఖములఁ ద్రవ్వి బాహు ♦ తతిచేఁ గడు బ
ల్మిని నెత్తి రథముపై నిడి
వినువీధిని బఱపెనపుడు ♦ వేగముతోడన్.

వ. అంత సీతాకాంత భయభ్రాంతస్వాంతయయి చింతించుచు నెలుగెత్తి.

సీత-కీర్తన, ఆదితాళము, పిలురాగము.

రామారామా! జగదభిరామా! రామా। వైరివిరామా! రామా ॥రా॥ రామా! నేసన। రానిమా। టలనా। నాముఅంది వ, న్నా నెఱుగక జయ॥రా॥

మాయాత్ముడు చెఱ। బట్టెనన్ను విని। రూపుమార్చి నను, గారాడు ముఘోరాఘము ॥రా॥ రాక్షసుడింత వ, రాక్రిముడాయెను। శిక్షింపుము తగ-

మోక్షగుండరఘు ॥రా॥

వ. ఇట్లు దుఃఖింపుచున్నంత.

గీ. అలతాంగివిలాపంబు ♦ లాలకించి
పక్షిరాజు జటాయువు ♦ పరఁగవేగ
నడ్డముగ వచ్చి యోయను ♦ రాఘవా! భ
యంబు లేశము లేక స ♦ యంబు విడిచి.

జటా-తో॥ లోకమాతయగు - నీకమలాక్షిని. జేకొనిపోవగఁ దగునా! పాకటముగఁద, తృతియుండినసీ-పాణముగూల్పకపోనా! ॥రా॥

వ. ఐన నప్పుహానీయుని సేవకుండనగునేనుండ నీపుండరీకాక్షి కేమిభయము. మదీయ తుండాగ్రమున నీకండలుతుండములుజేసి యెండవేయుదు. గుండెగల దండిమగండవైననుంనుము రా! రండా! నిలువగలవా! నాదండనని రాక్షసుని నాక్షేపించి తత్క్షణంబునఁ దనపక్ష యుగ్మంబు విసరి పైకెగసి తుండంబునంబొడిచి.

సం-తో॥ రథముడుల్చి గు,ఱ్ఱమ్ములగూల్చి చూ,ర్ణముగావించె నుధనువు। పృథురోషంబున-బిట్టుదాకి-నొప్పించెను రావణు తనువు ॥రా॥

వ. ఇట్లువిరథుండయి రావణుండు రోషానలంబు జాజ్వల్యమానంబుగా నుండుచుండ.

సం-తో॥ ఒక్కఖడ్గమున, నొనర జటాయువు-ఱెక్కలు గాళ్ళను విఱుగ। గ్రుక్కిన గ్రక్కున। బక్కితేడుదా। స్రుక్కి-ధరణిపై యొరగ ॥రా॥

క. మరియొకరథమునసీతను
నురవడినెక్కించుకొనుచు ♦ నుప్పరవీథిఁ
బఱచుచునుండగ మదిలోఁ
బురపురఁ బొక్కుచును వగచెఁ ♦ బోలతుక యంతః.

సీత-కీర్తన, హిందూస్తాని, రూపక తాళము.

పాణనాథుమున్న వీడి, పాటు పడునా! పాణములతో వీనినవలం-బాఱనిచ్చునా! ॥పాణ॥ జనకునిపుత్రినై దశర, థుని-కోడలనై।

యనుపమ కష్టములొందఁ। హా మె! బుడమిపై ॥ప్రాణ॥ పతినిబాసి దనుజు నకును పట్టుపడగను। బ్రతికలేక విధాతనుదుట। వ్రాసెనేమోను ॥ప్రాణ॥ శ్రీమోక్షగుండేశుడైన। శ్రీరామునకు। నామాటనెఱిగించెడి। పుణ్యాత్ములెవ్వరో! ॥ప్రాణనాథు॥

వ. శ్రీరామునకీపొంబడి నూఁచించువఱకు నీజటాయువు జీవితుండయి యుండుఁగాకయని మనోవీధి నుద్దేశించి మఱియు.

సీత-తేవారము. హా సుమిత్రాకుమారా!♦హా మహామేరుధీరా!! నీ సమానంబుగానా!♦నిఖిలలోకములలోనా। దోసమనకట్టిమాటఁ♦ దొలఁగ కాడితినినోట। యీనుశోకొ జూడకన్న!♦ నికనుమన్నింపు మన్న॥

వ. ఇట్లు సీతవిలపింపుచుండ రామలక్ష్మణులు వెంబడించి వత్తురేమో! యనుశంకచేత లంకాధిపుఁడు వాయువేగంబున వియన్మార్గంబునఁ దిరిగిచూచుచు బోవుతఱిజానకి యధోముఖి యయియప్పుడు.

గీ. ఋశ్యమూక మనగి ♦ రి ప్రదేశమ్మునఁ
గూరుచుండిరైదు ♦ గురు కపీంద్రు
లరసి చీరజించి యందు ♦ సొమ్ములుమూటఁ
గ్గట్టివారియెదుట ♦ నట్టె వైచె.

వ. వీరయిన నావార్త శ్రీరామున కెఱిగింపరా! యని సీతాదేవి సొమ్ములమూట వారిముందటఁ బడవైచెనంత.

సం-తొ. అంబుధి దాటిర, యంబునలంకకు-నసురేంద్రుడు చనుదెంచె। గంబుకందరిని-గడిమి నశోక వ, నంబులోపలనునుంచె॥రా॥

వ. ఇట్లునిచి త్రిజట లోనగు రాక్షసాంగనలఁ బెక్కండ్రఁ గావలియుంచి.

క. అతివేగమిారు జానకి
కతిహితములు గఱపి యెటుల ♦ నైనను నన్నే
సతతంబుఁ గూడునటు స
మ్మతిఁ జేయుండనుచు మాటి ♦ మాటికిఁ దెలిపె.

వ. ఈప్రకారంబున నాజ్ఞాపించి రాక్షసుండు యథాపూర్వరీతిగా రాక్షసరాజ్య పరిపాలనంబుఁ జేయుచుండె నిక్కడ శ్రీరాముండు.

సం-తో॥ మారీచునిదును। మాడిపర్ణశాల। జేరవచ్చుచుండగను। దారినమను ఖేదమున నెదురుపడ। దమ్మునిగని యిట్లనెను॥ రాము॥

యితి... రాము-కీర్తన, శంకరాభరణము, అదితాళము. ఏంగతి

... సుందరినొంటిగ। నంమంచియిచటికి। నొందుకువచ్చితి। వెతిగింపు లక్ష్మణ॥సుంద॥ మనమీద గనరూని। దనుజులుసనుదెంచి। వనితను నేమేమి। వంతనొందింతురో॥సుంద॥ నీమోముచాడిన। దేమో।! చింతించేవు। శ్రీమోక్షగుండేశు। డేమికావించునో! ॥సుంద॥

వ. అనిన లక్ష్మణుండు విన్నఁబోయిన మొగంబుతో నన్నకు నమస్కరించి.

శా. మారీచుండిలఁ గూలుకాలమున రా ♦ మా! మీవలెన్నన్నుదాఁ
జీరన్ మీరని యెంచితోడుపడఁగా ♦ సీతాంబ పొమ్మన్ననో
నారీ! రాక్షసమాయలంచుఁ దెలుపన్ ♦ నామాటలాలింపకే
దూరెన్ మిక్కిలి నెమ్మదిన్ విసికి నే ♦ దుఃఖంపుచున్ వచ్చితిన్.

వ. అని తెలిపి నాపదంబులపయి వాలి.

క. నావలనఁ దప్పులేదిఁక
నావనదేవతలె సాక్షి ♦ యన్నయ్యా! నీ
సేవకుఁడ నన్ను దయతోఁ
గావుమనుచు దుఃఖపడఁగఁ ♦ గరుణాన్వితుఁడై.

వ. లక్ష్మణునూరార్చి లేవనెత్తి దేహంబునిమిరి.

రాము-తో- తరుణిమాటలకుఁ దందరనొందుచుఁ- దమ్ముడనీవు రానేల! సరగునబోదము- చానచెంతనె- వ్వరులేరొక్కతెబాల॥ రా॥

వ. అనియోచింపుచుఁ దమ్మునిఁదోడ్కొని శీఘ్రయానమ్మున వచ్చి పర్ణశాలఁజేరి యరసిననందు సీతలేకుండినఁ దల్లడింపుచు మూర్ఛపోయి కొంతవడికిఁ దెలిసి దిక్కులు పాఱఁజూచి శోకావేశంబున.

కీర్తన రాము- కీర్తన, హిం, తోడి- ఆదితాళము. నిమ్మ...

ఇకనేమి చేయుదు! నికనెందుజూతును! అకటవిధి నాదు! డతివను బాసెను॥ఇక॥ ఎవరువచ్చినారో! యెవరుగొంపోయిరో!వివరించునట్టివార! లెవరునుగనరారు! ॥ఇక॥ భువిమోక్షగుండ! ధవుడనై యున్నను! నవిరళ సుఖదుఃఖ! మనుభవించకబోనా! ॥ఇకనేమి॥

సీ. నినుఁగూడి విహరింప ♦ వనవాస మాయాస
మగుఁదోఁచదాయెనే! ♦ భుజగవేణి!
నినుఁగూడి భుజియింప ♦ ఘనకందమూలాదు
లరుచింపవాయెనే! ♦ యమృతపాణి!
నినుఁగూడిశయనింపఁ ♦ గను గుశాతల్పంబు
గఱకుగాదాయెనే! ♦ కమలపాణి!
నినుఁగూడి వచియింప ♦ దినములుగడపుట
దడవుగాదాయెనే! ♦ తలిరుబోణి!

గీ. కంటగింపుచు మాయామృ ♦ గంబు గీతి
వచ్చిమారీచుఁ డెడఁబాపె ♦ వనిత మనల
నాదుతలవ్రాత యెంతహీ ♦ నతకుఁ దెచ్చె
నింక నెంటిగ నేటుచరి ♦ యించు నిచట.

వ. ఇట్లు దుఃఖింపుచు సౌమిత్రిని గౌఁగిలించుకొని.

రాము- తేవారము. నమ్మినావెంటవచ్చె ♦ నట్టడవిలోనఁ జొచ్చె! దమ్ముడా! యెచట లేదు ♦ తరుణిగానంగరాదు! సొమ్మసిలెమేనుచాల♦శోకమార్చంగఁ జాలా! నెమ్మదిని దెలియనైతి ♦ నెలతుకనుగోలుపోతి.

వ. రాముఁడీలీల జాలినొందుచున్న లక్ష్మణుండును గొంతవడి కుఁజింతించి పిమ్మట ధైర్యంబవలంబించి యిట్లనియె.

క. జగములు నీలో నుండును
జగములలో నుందువీవు ♦ సర్వజ్ఞ! హరీ!
యుగుణుండవయ్యుఁ బ్రకృతిని

దగులుటచే నోదవె! శ్లోక • దైన్యాదు లొగిన్.

ల-తో॥ హర. అజ్ఞానులవలె-నడలనేల! మీ- యంత వారిపనిగాదు। యాజ్ఞోల్లంఘన, మాచరించియెదు-రాడు వారిలనులేరు॥ రామ॥

తమరు ధనుర్బాణములు ధరించిన- సమయమునన్నె త్రిజగములు। కమలాక్షియు నెక్కడనుండిన నొక। గడియకుఁ దెలియు దేచాలు॥ రామ॥

వ. నావంటిబంటు మీ వెంటనుండ సంశయమేల! విపినంబున వెదకిజాడఁగందము పిమ్మటఁ గాఁగల కార్యంబు యోచింతము లెమ్మని పలికిన తమ్ముని సాహసవాక్యంబులచే ధైర్యంబుఁబూని యిద్దరుఁ గలిసి యచ్చటచ్చట వెదకుచు.

రా-కీర్తన, జంఝూటి, ఆదితాళము.

కానరే! నాప్రాణసఖిని- ఖగమృగభూజములారా! నేనువచ్చునంతలోన-నెలత లేదు హితులారా ॥కా॥ తానెచ్చటికైనబోయి- దాగియున్నదేమోను। యేనీచకర్ముఁడునచ్చి- యెత్తుకొనిపోయెనో ॥కానరే॥ మోక్షగుండహరిననన్ను- మోసగించి యెవ్వడో! రాక్షసుండు వచ్చి చెలిని భక్షించిపోయినాడో!॥ కానరే॥

వ. అని యివ్విధంబున నవ్వనంబునఁదిరిగి సందుగొందులు సూచుచుఁబోగా నొక్కచోట రథపతాకాదులు విఱిగిపడిన గుర్తులు కనబడిన నిక్కడఁ గొద్దికాలంబునయుద్ధంబు జరిగినట్లున్నదని యెంచుచుఁ గొండవలె నచ్చటఁబడియుండిన జటాయువునుగని రాక్షసమాయగా నెంచి రాఘవుండు.

రా-తో॥ ఒక్కరక్కసుం, డున్నాడిచ్చట। నుక్కడంతుసౌమిత్రి! యక్కజముగవి, ల్లమ్ములిమ్మనఁగ। నాలించియుఁగదుమైత్రి॥ రామ॥

జటా-ద్విపద.

నేజటాయువునుమ,న్నింపగాఁదగుదు।నీజనకునకును నేనుమిత్రుండ రావణాసురుఁడునీ-రామ నోరామ! తావడిగొంపోవఁ దాకినేవాని। రథము సుహరుల సా,రథినినడంచి। వధియింపఁబోయిన, వాఁడుజిక్కకను। ఘనఖ

డ్గమునవాదు-కాళ్ళుతెక్కలును। దునిమినన్నిటు బడ-ద్రోచి తాఁబోయె। గొనప్రాణములదన్న-కొనుచునేమీకు। జనకజబాడను-సరగఁజెప్పటకు।జీవించియున్నాఁడఁజెడును దేహంబు। దేవస్పృశించి మీదివ్యధామంబు। సనువుగనిచ్చి కృతార్థునిజేయు। మనివేఁడి ప్రాణంబు,లంతట విడచె॥

వ. అనిచెప్పి జటాయువుమృతుండయినఁ గొంతతడవుదుఃఖించి.

రా-తొ॥ పక్షివిభుఁడు మన, పక్షముగలిగియు- రాక్షసాధముని బోరి। యీక్షితిఁగూలెను-నితఁడుధన్యుఁడగు నీఁకజాగేటికిఁ జేరి॥ రా॥

వ. కృతార్థుని జేయఁదగును లక్ష్మణా! యని యన్నదమ్ములిద్దఱుఁ గాష్టంబులు దెచ్చి యగ్నిచేత నవులుకొలిపి యందు జటాయువు కళేబరంబు దహింపఁజేసి తాము స్నానంబుఁజేసి.

సం-తొ॥ మృగమాంసంబు-ల,మితముగఁదెచ్చియుఁ- దగ ఖండంబులుజేసి। యగణితమయిన విహంగజాతులకు- నాహారంబుగ వేసి॥ రా॥

వ. ఇట్లతనికిఁ బరలోక క్రియలుగావించిన నతండు ధన్యుడై దివ్యవిమానంబునెక్కి వైకుంఠధామంబునకుఁ జనుచు దివినుండి శ్రీరామబ్రహ్మమును నుతింపఁదొడంగె.

జటా-కీర్తన, అటతాళము, జంఝూటిరాగము.

**జయరామ** ! దశరథరామ ! సీతా । రామరఘురామా ! శ్రీరామ ! రఘురామ । సుత్రామనుతనామ!॥ జయ ॥ నా, తల్లిదండ్రియు-గురువుదైవను - దాతవీవనుచు । నెర,దాతవీవనుచు । మదిఁ - దలతు నినుగనుచు॥ జయ॥ భవ, బంధ భయములు వాపుటకు-నాపాలిదేవుడవు। నాపాలిడే ప్రియభక్తవరదుడవు॥ జయ॥ వర,మానిహృద్గుహాలందుదోచుమ, హానుభావుఁడవు । మహాను సుజ్ఞానరూపుడవు॥ జయ॥ నా, రామయణాహ్వాయ - దాసనన్నుత, తోయ భవనయనసిత- తోయ భవనయన। వరతోయ నిధిశయన॥ జయ॥

వ. ఇట్లుకొనియాడి యతండుఁ బరంబునకుఁ జనియె నిక్కడవీరు సీతాన్వేషణంబుఁ జేయుచు దక్షిణాభిముఖులై పోవుచు.

రామ-కీర్తన, యదుకులకాంభోజి, అటతాళము.

శ్రీకంతువిల్లునే। నీకొఱకై విఱిచి। చేకొంటిగదా! జానకి! ॥జాన॥ ననుఁబాయజాలక। నావెంటవచ్చిన నినుగోల్పోతిని జానకీ! జాన॥ గొప్ప యింటబుట్టి! గొప్పయింటజొచ్చి। తిప్పలొందవెనె! జానకి! జా॥ ఆపదలని తోఁచ,వామె గూడ నీవు,న్నందుచేతను జానకీ ॥జా॥ శ్రీమోతుగుండ శౌ,రిని నేనై యుండి ని,న్నేమఱితిని జానకీ॥జాన॥

వ ఇట్లుమాటిమాటికిఁ దలంచుకొని దుఃఖించుచు ధయిర్యంబు నొందుచుఁ బోవునెడ నొక్కచో వికృతాకారంబునవచ్చి తననుఁగూడు మని లక్ష్మణుని వేఁడిన యయోముఖికి నసిధారచేతఁ జుప్పనాతికంటె గొప్పసౌఖ్యంబు లిచ్చి చనుచున్న నొక్కచోట.

సీ. ఉదరంబునోరును ♦ నొకటిగా నొప్పియుఁ
బాదశిరంబులు ♦ బరఁగలేక
యోజనాయుతమగు ♦ నుభ బాహువులుగల్గి
యేదిచిక్కినను బో ♦ నీకదినుచు
నున్నకబంధుని ♦ యురుబాహువులమధ్య
రామలక్ష్మణులు గ ♦ రంబుఁజిక్కి
యున్న నేవీనికి ♦ నాహారమయ్యెద
నీవుసీతను జూడఁ ♦ బోవుమనుచుఁ

గీ. దమ్ముఁడన రాఘవుఁడు విచా ♦ రమ్మునొంది
ఖడ్గమున వానిదక్షిణ ♦ ఘనభుజంబు
దున్ఱించె వామభుజంబు ఖం ♦ డించె ననుజుఁ
డంతనాతండు మీరెవ్వ ♦ రనుచుమనఁగ.

వ. రాముని యాజ్ఞచే లక్ష్మణుఁడు దమ వృత్తాంతంబుఁ జెప్పి నీవెవ్వరని యడిగిన.

కబం-తోహా॥ నేగంధర్వుఁడ - నిఖిలమునీంద్రుల - నేగర్వంబునఁ జెనకి। బాగుగనొకముని-పరగనాకుశాపముఁ బెట్టెనునావెనుక॥ రామ॥

అసురుఁడనై నే, నమర విభునిపయి, నరిగిన నాతఁడువడిగ। వెనద నవజ్రిము। వేసినాశిరము । విపులోదరమునఁనడఁగ॥ రామ॥

వ. అప్పటినుండి శిరఃపాదవిహీనుండనై దీర్ఘబాహుమధ్యంబున సంచరించు జంతువుల బిగఁబట్టి మ్రింగుచుఁ గబంధుండన నిక్కడ నున్నాఁడ మీవలన శాపముక్తి యగునని మున్ను మును లనుగ్రహించి యున్నారు కాఁబట్టి నావికారశరీరంబుదహించి ననుఁగడతేర్పఁడనివేడిన వారటులచేయ దివ్యగంధర్వుండయి వియన్మార్గంబున నిలిచి యంజలి బద్ధుండయి.

కబం-కీర్తన-ఆదితాళము-తంగంమెట్టు.

రామ! రఘురామ! రవికులాంబుధిసోమ! నీమహిమను దెలియ-నేనెంతవాఁడను॥ రామా॥ పంచభూతములకుఁ-బంచకోశములకుఁ బంచ వర్ణములకుఁ-బరుఁడవుగురుడవు॥ రామా॥ విశదముగను జతు, ర్దశ భువనములను, దృఢముగ నీదివ్య-దేహమునందు నిలిచె॥ రామా॥ శ్రీ మోక్షకుండవాస! శ్రీధరచిద్విలాస! భూమి నారాయణదాస, పోష! శ్రీ శ్రీనివాస!॥ రామా॥

వ. ఇట్లుపొగడిన సంతోషించి శ్రీరాముండిట్లనియె.

గీ. వినుముగంధర్వ నీస్తోత్ర ♦ మునకు నేను
సంతసించితి నీకలు ♦ షంబు వోలఁగె
దివ్యయోగంబునొందు మ ♦ దీయదివ్య
ధామమునుఁబొందు కడుశాశ్వ ♦ తంబుగాను.

వ. అని యాజ్ఞాపించిన నానందించి రామునకు రావణుని వృత్తాంతం బాద్యంతంబుఁజెప్పి శబరి యాశ్రమంబునకుఁ బొమ్మనిచెప్పి త్రోవసూపి యతండుఁ బరమపదంబునకరిగె ననంతరంబ.

సం-తో. శబరి యాశ్రమ । స్థలమునకునురామ । సౌమిత్రులు వోవగను, ప్రబలమోదమునఁ-బరికించియువారి । రాకకుబ్బి యెదురుగ ను॥ రా ॥

క. చనుదెంచి వారిపాదము
లనువేడ్కనుగడిగి తజ్జ ♦ లంబు శిరమునన్
ఘనముగ నిడుకొని యాశ్రమ
మునకును దోడ్తెచ్చి పీఠ ♦ ములనిచ్చి తగన్.

వ. మధుర పక్వఫలంబులు సమర్పించిన భుజించిరి పిమ్మటశబరి కరంబులు ముకుళించి.

శబరి_భుజంగప్రయాతము.

పరంధామ మీదివ్య ♦ పాదాబ్జసేవా
పరత్వంబునన్ నిన్ను ♦ బ్రార్థింపగంటిన్
నిరాలంబమీరూపు ♦ నేడిందుఁగంటిన్
మరంతంబులౌ నాదు ♦ దోషంబులారెన్.

వ. శ్రీమన్నారాయణుండవు సాకేతంబున రాముండవై పుట్టి దశకంఠ కంఠలుంఠనంబుఁ జేయఁబోవుచో! నీయాశ్రమంబున కనుజయుక్తంబుగవచ్చి నిన్నుఁగృతార్థునిఁ జేయఁగలండని మద్గురువరుండగు మతంగమహాముసీంద్రుండు చెప్పియున్నందున.

శబ-తో॥ ఇక్కడ దపమొన, రింపుచుమీరాక। కెదురుజూచుచున్నాను। గ్రక్కునజనె బహు, కల్పంబులు నేటి। కక్కజముగగన్నాను॥ రా॥ నాసంకల్పము। వాసిగదీరెను। నాకిమ్మిక సద్గతిని। దాసశతములకు, దాసురాల నే, దక్కువజాతిని సతిని ॥రామ॥

వ. నిన్నుఁగొనియాడుసమర్థత నాకుఁగలదా! రామా! యని పలికినవిని దయారసంబొలుక రామచంద్రుండిట్లనియె.

రా-కీర్తన, జంఝూటిరాగము, ఆదితాళము.

నాభక్తియొక్కటిచాలు।శబరి॥నాభ॥ ఏభోగంబులు-నీడుగానేరని। ప్రాభవమత్పదములసుల, భంబుగజేరగ ॥ నాభ ॥జాతినామమౌ, శ్రీమలింగాదుల। రీతులడుగ వలవ। దేరికినైననుసరి॥నాభ॥ మోక్షగుండమున। మఃదమున వెలిగే। యాక్షయ తేజమును । వెల, యుంగను గలయుగ॥ నాభ॥

గీ. యజ్ఞదానముఖంబులౌ ♦ నట్టికర్మ
లెంత! చేసిన నాయందు సంతతంబు
భక్తి లేకను శాశ్వత ♦ బ్రహ్మపదముఁ
గలిసి సుఖియింప శక్యంబు ♦ గాదు శబరి

గీ. నీవనాదినుండి ♦ నెలఁతనాపయి భక్తి
గలిగియుంటిగానఁ ♦ గలుగుముక్తి
సీతజాడనాకుఁ ♦ జెప్పుము తెలిసిన
శబరియనుచు నామె ♦ సరఁగఁబలికె.

ద్వి. నావల్లవినగోరి, నా రంతెకాని। దేవ ! మీ రెఱుగని, స్థితి యేదిగలదు। రావణాసురుడు మీ, రమణిగొంపోయి । లావుచేఁ జేర్చెను-లంకాపురంబు। భూవరయిటకు దా, పునను బంపాన । రోవరంబున్న ది-రూఢిగా దాని। కడ ఋష్యమూకాద్రి-గలదుతద్గిరిని । గడిమిసివాలితో, గలహించివచ్చి। యున్నాడు సుగ్రీవు, డానర మీరటకు । జన్న మీతో డను, సఖ్యంబుజేయు। నతనిచేఁగార్యంబు-లన్నియుదీరు । వెదకులాడఁగ నేల-వెడలుడచ్చటికి । చనుదును నేహుతాశనులోనఁజొచ్చి । ఘనకాయమునుబాసి-కాంతుమీపదవి। ననిపల్కి వహ్నిని-నటురవుల్ గొలిపి । తన మది రామమం, త్రమునుజపించి॥

శబ-కీర్తన, కమాను, ఆదితాళము.

**మానసమా!** మరువకె! ॥**మాన**॥ అసదృశ పరమా, నందమయు నీ॥ **మానసమా**॥ నిత్యనిరంజన-నిర్వికారస-త్ప్రత్యగభిన్న-బ్రహ్మంబును॥ మా॥ పిండాండబ్రి, హ్మాండంబులలో, నిండివెలుగు మోక్ష । గుండహరిని॥**మా**॥ ధారుణిదాళ్పూరి, నారాయణకవి । చారుమనోబ్జ వి, హారుని నిక ॥ **మా** ॥

వ. అని పరంధాముని దారకనాముని షడ్వర్గవిరాముని శ్రీ రాముని దనమానసంబున నిలుపుకొని శబరి యగ్నింబడి యవిద్యాకల్పిత స్థూలకాయంబును దహింపఁజేసి॥

క. శ్రీరాముని కృపచేతను
జారువిమానంబునెక్కి ♦ శబరిమహాత్మురా
నేరుపునఁ బొందుపదమును
నారూఢిని బొందె నిర్మ ♦ లాంతఃకరణన్.

తో॥ అనితాళ్ళూరి నా, రాయణకవి రా మాయణమును హరికథను । ఘనముగ జెప్పెను గనుక నరణ్యపు గాండముచిల్కెను సుధను ॥ రామ ॥

ఇది వినువారల-కిహసౌఖ్యంబులు-గొదవలేక చేకురును । ముదమునఁదుదకును- ముక్తి లభించును - మోక్షగుండ హరి కృపను ॥ రామ॥ రామాయణవే! శ్రీరామాయణకథవినవే ॥ గౌరీ ॥ రామ ॥

క. నాచేతనైన కొలఁదిని
జూచిరచించితినిదీని ♦ సుజనులు నెఱసుల్
దోఁచినయెడ దిద్దురని
నాచిత్తములోననమ్మి నా ♦ ననయంబున్.

మోక్షగుండరామాయణమునందలి
అరణ్యకాండము సంపూర్ణము.





శ్రీరస్తు.

# మోక్షగుండ రామాయణము-హరికథ.

## కిష్కింధాకాండము.

క. శ్రీరాముఁడ నుజయుతివే। సారక పంపాసరస్సు♦ సరగునఁగనఁగా। గోరియరుదెంచిదాని యు। దారమనోహరతఁ గాంచి♦ తమ్మునకనియెన్.

రా-కీర్తన, బేహాగ్. ఆదితాళము.

పంపాసరోవరము। గణి। యింప నేరితరము। సొంపుగదీని వీక్షింప గ నిం మగ్రి,శింపఁగోర రేని,లింపశుభాంగనలు॥పం॥ ఇంపై,న గాలిచే,గుంపులై యీనీటి। తుంపురు లెల్లఁబ,రంపరలుగ లేచె॥బం॥తమ్ములుగలువ మొత్తమ్ములు జక్రివా, కమ్ములు గోయష్టి- కమ్ములునలరారు॥పం॥ అంచిత కుక్కుట। యంచకారండవ । క్రౌంచనాదముల। మించిరహించునీ॥ పంచ॥ మోక్షగుండపురా, ధ్యక్షుడనౌనాకు। నక్షీపర్వముగ। వీక్షింప గలైను॥ పం॥

రా-తో. మానసమును గం,గానదియునుమఱి। దీనికి సరిరావ,నుము। మానితముగఁగ్రోశ,మాత్రవిస్తృతం। బై నెగడెనుగనుగొనుము॥ రాను॥

మత్తకోకిల. ఈసరోవర తీరవృక్షము♦లెంతో! యందములై తగెన్
ఆసతోజిబుకొమ్మలందు♦ శుకాదులెల్లఁ బ్రియంబుగాఁ
గూసెనుఁ మధుమాసముఁ సమ♦ కూడె దేఁటులుఝుంకృతుల్
భాసురంబుగఁ జేయునెమ్మది♦ పండునైకను పట్టెను.

వ. మనోహరంబయిన యీసరోవరప్రాంతంబులనిట్టివసంతసమయంబున విహరింపుచు సీతాసతితోఁగూడి క్రీడించుభాగ్యంబు నాకెన్నటికి లభించును లక్ష్మణా! అంతఃకరణా లంకృతవీక్షణా!

రా-కీర్తన, కాంభోజి, ఆదితాళము.

తరుణినెన్నఁడుజూతురా। మరుబారికోర్వదరముగా దేమిచేతురా విరహాముమీఱె మేను, బరవశమొందెను గనుల॥ దరు॥ ఒంటిగనుండఁగ లేనురా।లక్ష్మణనాకు। గంటగూసుకురాదురా। తుంటవిల్తుఁడుదూపు। లం టవేశ్రియగబూనె॥దరు॥ పాతకుడింత చేసెను। నానుదుటను వి,ధాతయిటుల నాశ్రిసెను। ఖ్యాతిగమోక్షగుండ। నేతకెటులకయగును॥దరు॥

గీ. జానకిని బాసియొకక్షణ ♦ మైన నింక
నేనుఁ బ్రాణంబులను నిల్ప ♦ లేను నీవు
మరలియు నయోధ్యకేగు ల ♦ క్ష్మణయటంచుఁ
బలుకు నన్నకు ననుజుండు ♦ తెలిపె నిట్లు.

సం, తో- ఇంతినిగొనిపో,యిన వానినివధి,యించి యతనిసాధిం చి। యంతటసుఖముల। నందవలెనుగాక। యదియెల్లనువిడిపించి॥రాము॥

వ. అధైర్యంబునొంద నవార్యశౌర్యధుర్యులగు మీయంతవారి కార్యంబుగాదు. ముందు జరుగవలసిన పనిని యోచింతము. మీకు దె లుపునంత వాఁడనా! యన్నా! సత్యసంపన్నా! యను పలుకులకునలరి రా ముండు తెలివొంది.

చ. పదపడి రామలక్ష్మణులు ♦ బాణధనుర్వరపాణులై శుభా
స్పదమగు ఋశ్యమూకగిరి ♦ పార్శ్వమునన్ ఘనశాంతి దాంతి సం
పదగల యోగిబృందముల ♦ భాతిఁజరింపగ వేగగాంచి నె
మ్మదిఁ గనుభీతినొంది హను ♦ మంతునితో రవిసూనుఁడిట్లనున్.

సుగ్రీ, కీర్తన, బేహాగ్, ఆదితాళము.

**హను**,మంత వారిని బరికించు ॥**హను**॥ ఎంత-వింత- యంతరంగ మున॥ **హ**॥ ధీరులుమౌని కు,మారులవలెనే। వీరుజటా,ధారకులై ।తిరుగు చున్నారు॥ హనుమంతా॥ నన్ను జయింప మా,యన్నవీరలను।బన్నుగను బంపినటు। లున్నదారోర॥హను॥ మోక్షగుండవిభు। సాక్షిగ రాజుల। లక్ష ణము। లీక్షితిని। గలిగియున్నారు॥**హ**॥

వ॥ తా॥ నిక్కొండ నెక్కుటకు వీలులేక నను(గూల(జేయుమని వాలిఁబంప(గా నచ్చిన కపటవేషధారులుగా నున్నవారు తేకున్న(దాప సులకు ధనుర్బాణములు ధరియించవలసిన యవశ్యకమేమి! నీవు వటు రూపంబునఁజని వారియామూలాగ్రంబు విచారించిరమ్ము. హనుమం తా! ధీమంతా! యని సుగ్రీవుండు వలికిన మంచిదని తత్క్షణంబున.

సం-తో. వటురూపంబున। వాయుతనూజుఁడు। వచ్చెను రాముని కడకు। దిటవుగ వినయమి। ధేయుడగుచు ము,చ్చటలాడుచు ననెనపుడు॥ రాము॥

క. మీరెవ్వరు మీయూరును
బేరును దెలుపంగ వలయుఁ ♦ బ్రియమున మీయా
కారంబులు నగుమొగములుఁ
గారుణ్యరసంబుఁ గన్నఁ ♦ గను వెఱగయ్యెన్.

హ-తో॥ మీరిటువిరుగఁగఁ- గారణమేమో ! మిముఁగన మోదము హెచ్చెన్। ధీరతసిభూ, భారమడప నవ। తారమెత్తి నటుదోచెన్॥ రాము॥

వ. అనిన శ్రీరాముండు హనుమంతున కిట్లనియె.

రా-కీర్తన, హిం, తోడి, అటతాళము.

అనఘ! మాచరితంబుదెలిపెద- నవధరింపుము ప్రియమున। నినకు లాధీశులము దశరథ। తనయులముగద నయమున ॥నన॥ అన్నదమ్ముల మతఁడు లక్ష్మణుఁ-డరయ నే రాఘవుఁడను। గన్నతండ్రి యనుజ్ఞదండక కానలకు నేతేరను॥నన॥ ఈక్షితిని నాయింతిసీతను- నెవ్వఁడో కొనిపోయె ను। మోకుగుండేశునకు నెరుకగు। మోసవుచ్చిపోయెను॥నసఘ॥

వ. అట్టివానిని వెదుకుచు నీప్రాంతములకు వచ్చినారము నీను శబ్దాన్వితవాగ్వైఖరి విన్న నీవువ్యాకరణవేత్తవని తోఁచుచున్నది. నీవృ త్తాంతముఁ గొంతముచ్చటింపుము సచ్చరిత్రా! పరమపవిత్రా! అనిపలు కగా నాంజనేయుండు.

గీ. వాలిసుగ్రీవులనునట్టి ♦ వనచరేంద్రు
లన్నదమ్ములు గలహించి ♦ రందువాలి

దరుమనుగ్రీవుఁడుండ నా ♦ ధరువులేక
నలుగురాప్తులతోడ నీ ♦ నగముఁజేరె.

హ-తో॥ అతనికిసఖుఁడను, హనుమంతుండను।ననిలనందనుఁడనేను।
క్షితివర మాను,గ్రీవుఁడంప మీ । స్థితిదెలియఁగవచ్చినాను॥ రామ॥

అచటికి మీరిపు-డరుదెంచినమీ-కనుకూలముఁజేసెదను । సుచ
రితమీసతి-చొప్పదెలియుటకు-శోధించియు నెఱిగెదను॥ రామ॥

క. అనివేడిన శ్రీరాఘవుఁ
డనుకూలము, నొంది యటుల ♦ నాగాకయునన్
దనరూపముఁ జూపియుమూఁ
పునవారినిమోచికొనుచుఁ ♦ బోయెనుగిరికిన్.

వ. ఇట్లువారిని నెత్తికొని కొండపయిఁజేర్చి యొక్కవృక్షంబు నీ
డను గూర్చుండఁబెట్టి సుగ్రీవుని జేరఁబోయి.

హ-కీర్తన, బ్యాండుస్వరము, ఆదితాళము.

మిత్రకులపవిత్రులు। ధాత్రిమీకుమిత్రులు। మిత్రజరామ, సౌ
మిత్రులుపుణ్యచ, రిత్రులుదశరథ। పుత్రులునగుదురు॥మి॥ మీకువారుక
లసిన మేలుకలుగుదెలిసిన। వారికార్యములు। మీరునుమీపని। వారును
సమకూర్చ। వచ్చునుసత్యము॥ మి॥ దండకావనంబున। దరుణిబాసి రయ
మున, గొండలువనములు, గుహలువెదకుచు। నుఁడివచ్చిరి మోక్ష,
గుండేశులనవచ్చు॥ మిత్ర॥

వ. వారిచేరువ నొక్క భూరుహచ్ఛాయనున్న వారు వారిచేర
బోదను నిర్భయంబునరమ్మ సుగ్రీవా! కంబుగ్రీవా! యనిపలికి తోడు
కొనివచ్చి హనుమంతుండొక్క కొమ్మవిఱచి యమ్మువ్వురికి నది పీఠం
బుగా వైచి కూర్చుండఁబెట్టిన తరువాత.

తో. అన్నయాజ్ఞచే। నాలక్ష్మణుడా, ద్యంతముఁ దమసంగతిని।
సున్నఁడుసుగ్రీ, వుఁకుదెలుపవిని। కన్నగినవెనమ్మతిని॥ రామ॥

సీ. ఎవ్వఁడో కాని మీ ♦ యింతినినాకాశ
వీధిఁగొంపోవ నా ♦ వేళనామె
హా రామ! యనుచును ♦ నాక్రందమును జేయు
వింటినేనిందుండి ♦ విశదముగను
నీగొండమీఁదుగా ♦ నేగుచున్నప్పుడు
నామంత్రివరులను ♦ నన్నుఁ జూచి
చీఱకొంగిసుమంత ♦ చించి సొమ్ములునందు
మూటగాఁగట్టి మా ♦ ముందుఁబడఁగ
గీ. వైచెనది దీసియొక్కచో ♦ దాఁచినాడ
జూడుఁడనియయ్య నామాట ♦ నూడఁదీసి
సీత సొమ్మనిగుర్తించి ♦ చింతగదుర
ఘనముగా రొమ్ముపై మోదు ♦ కొనుచునపుడు.

రా-కీర్తన, మ-ఖారిరాగము, అటతాళము.

అనుజా! యేమందు। నీసొమ్ములు। గనులనెటుగందు॥అ॥

వనితనన్నెడ బాయజాలక। వచ్చినందుకు గోలుపోతిని। ననదనై రక్షించుకోలే। నైతినిందలఁబొందితినో॥యను॥ ఆమాయామృగము। చింతకుమూల। మాయెగదనిజము। భూమిలో శ్రీమోక్షగుండ। స్వామినైన బురాకృతంబున। కేమిసేతును భామనునదా। నేమిదూరెను! యంత పిలిచెనో! ॥యను॥

వ. అని యిట్లనంతంబుగాఁ జింతనొందు సీతాకాంతునకు నూర్మిళాకాంతుం డిట్లనియె.

గీ. ఇతనితో సఖ్యమొనరించి ♦ యితఁడు మనముఁ
గలిసి పగవాని సాధింప ♦ వలెనుగాక
యీవిధంబున శోకింప ♦ నేమి! ఫలము
మానవేశ్వర ధైర్యంబుఁ ♦ బూనుమింక.

వ. అనుచుండ సుగ్రీవుండు రామచంద్రున కిట్లనియె.

సు-త్రో. శ్రీరామా! నా । చెలిమిజేసితే । సీతను జెఱగొన్నట్టి । యారావణువధకై సహాయముగ। నరుదెంచెద జలపట్టి॥ రా॥

వ. అనిపలికిన నందుకు రాముండు నియ్యకొనియెనంత.

తో॥ హనుమంతుడ, గ్నినిజ్వలింపఁ జే, సిన రాఘవుడినఁజుండు। ననలుసాక్షిమైత్రిని మెలగుదమని-యనుకొని రచ్చటమెండు॥ రా॥

వ. ఇట్లన్యోన్యంబు సఖులయి యుండునటుల బాసచేసుకొని యనంతరంబు సుఖోపవిష్టులయి యున్నంత సుగ్రీవుండు దమయుదంతంబు రామునకు దెలుపనారంభించి.

క. మాయావి యనెడిదనుజుఁడు
మాయన్నను యుద్ధమునకు ♦ మఱిరమ్మనుచుః
గూయుచువచ్చినఁ గదనముఁ
జేయఁగ ననుగూడిపోయి ♦ చెలఁగుచుఁదాకెః.

కీర్తన, ఆదితాళము.

ఉండుదానవా! పో। కుండుదానవా! ॥ఉం॥ ఉండుముపోక-మోరిపరాకా-గుండెలుదాకాఁ-గుద్దెదగాక॥ ఉం॥ వ్రేటుదగులును, నీ, వీపు పగులును। సాటిగబోర-జాలుదువేర! కాటికిజేర, గాజేతురార!॥ఉం॥ఉబ్బమానవు। నా।దెబ్బగానవు। మబ్బెల్లవీను-మాయావినేడు। గొబ్బునగోడు-గుడిపింతుజూఁడు॥ ఉం॥ భీమబలుడని। విను। వేమొనుమ్మని। వేమఱుగండ-విదళింతునిండ। శ్రీమోక్షగుండ-ధామునుసూడ॥ ఉండు॥

వ. ఇట్లుబెదరించి యొక గ్రుద్దుగ్రుద్దిన నతండుఁబాఱిపోయి తన నివాసంబగు గుహఁజొచ్చె నంత నాతని వెంటనంటి మాయన్నయు గుహాలోఁ బ్రవేశించుచు మఱియొకరినిరాకుండఁ జేయునట్లు నన్ను గుహావాకిటఁ గావలియుంచి చనియె నా వెనుక

చ. నెలయుగునంత కేనచట ♦ నిల్చితి బిమ్మట ' క్తధారలే
ములుగనురాఁగ నంతట వి ♦ రోధుల నార్పులు బిక్కటిల్లఁగా
నెలమిని వాలియీల్గెనని ♦ యెంచి ధరాధరం మొక్కటిజ్ మహా

బలిమిని దెచ్చి యీగుహకు ♦ బైటనునడ్డముఁ ద్రోచివచ్చితిన్.

వ. ఇట్లువచ్చి కిష్కింధఁజేరి.

గీ. వాలిచచ్చెననెడు ♦ వార్త నేఁదెలిపిన
బందులెల్లఁ జిత్త ♦ నొంది పిదప
నన్ను రాజుఁజేయఁ ♦ గ్రన్ననఁ గిష్కింధ
నేలుచుంటి నేను ♦ మేలుగాను.

సు-తో. అక్కడవాలియు-నా మాయావిని-నడచియు గుహవాకి
టికి। దక్కకచేరియు-దద్దిరినవ్వల। దన్నివచ్చె వెలుపటికి॥ రామ॥

వ. ఇట్లుగుహ వెడలివచ్చి నన్నెంతపిలిచినఁబలుకకున్న మహాగ్ర
హంబునఁ గిష్కింధకువచ్చి రాజ్యపాలనంబుఁ జేయుచున్న నన్ను రో
షతామ్రాక్షుండయి కాంచె.

వాలి-తో. ఓరిదురాత్మక! యోరసీచుడా! కౄరుడవయితివినీవు।
కూరిమినిచ్చట-గూర్చున్నావా! కూడివచ్చెనీచావు॥ రామ॥

తమ్ముడవనిసను-నమ్మినవానవుని-దఱుముచుగుహఁజొరగానే। యి
మ్మర్కటరాజ్య-మేలవచ్చితివి-యిటులజేయమేలానే॥ రామ॥

వ. అనిపలికి పిడికిట నొక్కపెట్టునఁబొడిచిన సహింపలేక నేఁబా
ఱిన వెంటనంటి యెల్లలోకంబులుఁదిప్పె నంత నేనుమరలవచ్చి యిక్కొం
డపయికి నెక్కితి నిందు.

సు-తోహార. వాలికిశాపము-వచ్చియున్నదీ-శైలమెక్క రాకుండ।
బోగలనందున-బోయెమరలదాఁ-బురికిదిరిగిరాకుండ॥ రామ॥

క. ఈగతిని నగరుఁ జేరియు
బాగుగ నాసతిని రుమను ♦ బలిమినిగొనితా
భోగింపుచు ధరనేలుచు
బాగుగ నున్నాఁడునుమ్మి ♦ బరవసమలరన్.

వ. ఇది మదీయ వృత్తాంతంబన విని రాఘవుండు.

రా-కీర్తన, దర్బారురాగము- అటతాళము.

వాలినిగూలిచి-వానరరాజ్యము। మేలుగ నీచేత-నేలింతుఁజూడుము॥ వా॥ వెరువెంటముట్టి-నినువెళ్ళగొట్టి। వనితనుబట్టి, వలచియున్నట్టి ॥వా॥ మోక్షగుండపురా। ధ్యక్షుఁడనౌనాకు। లక్ష్యమొయ్యాపని-యాక్షణమందును॥ వాలి॥

వ. ఇది నిశ్చయంబోయి సుగ్రీవా! యనవుడు వానరేంద్రుం డిట్లనియె.

సం-తొ. వాలిబలము దు,ర్వారముదేవా, వళికినిశక్యముగాదు। లీలగానుగె, ల్చెదనని యనెదవు-చాలనమ్మకములేదు॥ రా॥

వ. అతనియొక్క బలవిస్తారమును దెలిపెద వినుండు.

క. ముందొకపరి మహిషాకృతి
దుందుభియను రక్కసుండు ♦ దోర్బలమున సం
క్రందనజునిఁ జంపఁగ గి
ష్కింధకుఁజని పిలువవాలి ♦ గినియుచు వెడలెన్.

వ. ఇట్లు చని కోపోద్దీపితుండయి వాలి వాని బిట్టుదాకిన నొండొరులు.

సు-తొ. పదతాడనముల-బాహుయుద్ధముల- బలుపిడికిటిపోటులను। వదలకశతసం-వత్సరములుదాక-వారుపోరిరావలను॥ రామ॥

గీ. అంతవాలివాని ♦ నవలీలఁబైకొని
క్రిందఁద్రోచి చంపి ♦ కేకలిడుచు
నతని శిరముఁదన్న ♦ నదియూడి రక్తంబుఁ
జిలుక యోజనంబు ♦ చేరిపడియె.

తొ. అదిమతంగముని-యాశ్రమమగుటను-నారక్తముపైఁబడగ। నదలోఁ గనలుచు-నిదివేసినవాఁ-డెవఁడో వాడికవడిగ॥ రా॥

ఈగిరిమీాదికి-నెక్కినసీల్గును-నిదినిశ్చయమనియనుచు। వేగమెశాపము-నెట్టెను గావున-నిందరిజునకు దెలియునుసూ॥ రా॥

వ. అది కారణంబున వాలి యిమ్మహానగంబెక్కఁడు గావున నే నిందుండి కాలంబుఁ గడుపుచున్నాఁడ[redacted]మా ! రవికులాంబుధిసోమా!

క. దుందుభితలఁ జూపించెద
నందంబున మీరుఁదన్ని ♦ నట్లయినను వా
లిం దునుమఁగలరటంచును
సందేహము మానియుందు ♦ సారసనేత్రా.

వ. అనియనుచు రామునిదోడ్కొని చని దుందుభి కళేబరంబు జూపించిన.

క. గిరిపోలిన శిరమునుదన
చరణాంగుష్ఠమున రామ ♦ చంద్రుఁడు చిమ్మెన్
వెరగున సుగ్రీవుఁడుగనఁ
బరువడి నదివోయిపడియెఁ ♦ బదియోజనముల్.

వ. అదిపరికించి సుగ్రీవుండు రామచంద్రునిన కిట్లనియె.

సు-కీర్తన, పాంనధ్వని-ఆదితాళము.

ది, నాథీశ వంశోదయా! ఖర,హరణ! దయామయ!॥దినా॥ మీధైర్యమునుబలము। నెలమిని। గనుగొంటిని॥దినా॥ వాలిదన్నినపు, డోలిరక్తమాం। సాళిమిళితమగుచు। బరువైయున్నదినుమి॥దినా॥ చెలువుగశల్యావ, శిష్టముగానిపు। డలతెలమెండినది। కడుజులకన యుగుఁగద॥ దినా॥ ఇలలోమోకపు - రీశ్వరతగనీ। బల మెక్కువయనుచు। నెటువలెమది దలతు॥ దినా॥

వ. ఐన నింకొక్క పరీక్షయున్నది చూపించెదఁ గనండి రామా!

తో॥ ఏడుతాళ్ల పై-కెగసియెక్కి-మతి-యేకావతిఁ గవాలి। కూడి యాకులను-గోయుచునుండును-జూడుఁడు నాథూజాళి॥ రా॥

క. ఇది యొక్కశరంబున మీ
రవలీలను దుంచివైచి ♦ నటులైనను నె
క్కువబలశాలివటంచును

దవిలి మనమునందుఁ దలఁతు ♦ దశరథరామా!

వ. అనవిని రామచంద్రుం డిటునవ్వొలయు నొక్క యమోఘాస్త్రంబు ధనువున సంధించి దృఢముష్టిని బిగించి గురిగా విడచిన నబ్బాణంబుదాఁకి దశయోజన పర్యంతమున్న తాళంబులు చక్రాకృతిగా నలరినఁగాంచి.

క. తన పాదాంగుష్ఠముచే
నను జుని పాదములపైన ♦ నప్పుడురుద్ధం
గను తాళవృక్షములు పె
ల్లున విరిగెను భానుజుడు వి ♦ లోకింపంగన్.

వ. అని తెలిపినవిని తత్కారణంబేమని పార్వతీదేవియడిగిన సర్వేశ్వరుం డిట్లనియె.

శివుని-కీర్తన, సురటి-ఆదితాళము.

బాలికాతిలక! వివరించెదనీ-వాలకింపుమా! నీ॥వాల॥ చాలతాళఫలసప్తకమును-వాలిదాచె నోలినొకగుహ। ఓ, బాలికా॥ ఉరగమొకటియువిహారియింపఁగగని-సరగగనలి తరు, వులుగనుండుమని। బరువడితో శా, పము దానిడె సుర, వరునితనయుఁడు। సుర॥ నోబా॥ అక్షయముననా, యహిపతి బలికెను-మోక్షగుండరక్షకుని సాక్షియా। వృక్షహాంతయగు-వీరునిచే నీకు-శిక్షయగునని। నీకుశిక్ష॥ యోబా॥

వ. కావున నా శాపకారణంబునఁ దాళఫలంబు లేదును సర్పంబు పయినఁ దరువులయియుండె నది గుఱుతెఱింగి-

ఆ. శేషునంశముననె ♦ స్థిరపైని జనియించి
యుంట లక్ష్మణుని స ♦ మున్న తాంఘ్రి
తలము సలుపనంతఁ ♦ దొలఁగెను శేషుండు
తాళకుజము లొరిగె ♦ ధరణిపైకి.

సుగ్రీ-కీర్తన, హిం॥కాపి-రూపకము.

వినుమ నుకలాబ్ధిచంద్ర! యొక్క-మనవిచేసెదా! ॥విను॥ మును

దపంబుచేయు మెచ్చుకొనుచునప్పుడు। కన్యపు, నరునొక్క మాలయొసఁ
గెఁబురవిదారుఁడు॥ విను॥ అదిపురందరునకు నిచ్చెనామహాత్ముఁడు ముదర।
మొదవ వాలికంఠమందు, నుంచెనాతఁడు॥ విను॥ వాలినిగెలువంగనెంత-
వారివశమగు, గళ। మాలయున్న మోక్షగుండ, పాలనిజమగు॥విను॥

వ. అని సుగ్రీవుండు నుడివిన రాముం డద్భుతమొంది సర్ప
రాజుఁ గని.

సీ. వాలిశాపంబునఁ ♦ దాళభూరుహములు
నిటుమోచుచుంటివి ♦ యిన్నినాళ్లు
తాళద్రుమంబుల ♦ ధరగూల్పనాచేత
శాపమోచనమయ్యె ♦ సర్పరాజ
ప్రత్యుపకారంబుఁ ♦ బరువడిజేయుము
వాలిదాల్చికంఠ ♦ మాలదెమ్ము
పొమ్మనశేషుండు ♦ వోయి యానిశియందు
వాలినిద్రించెడు ♦ కాలమందు

గీ. బొన్పుపైనున్నమాలిక ♦ పరగఁదెచ్చి
యినజునకునిచ్చి రాముని ♦ కెఱుకపఱచి
ఫణిపతి యదృశ్యముగఁజనె ♦ భానుజుండు
సంతసంబున రాముని ♦ సంస్తుతించె.

సు-కీర్తన, కళ్యాణి, ఆదితాళము.

మాం, పాలయ భువనా-ధీశ్వరా! మాంపా॥
ఈలోకంబుల నేలుచునుండే! నీలీలలుఁగన-నేతుఁనా!॥ మాం॥
సుతహితదారా-న్వితసంస్మృతిలో। నతికింతువు జీ, వాళిని॥మాం॥
మాయాబద్ధుని-జేయకుననునా। రాయణాకవిహృన్మందిరా!మాం॥
సాక్షిరూప! వర-మోక్షగుండపుర।రక్షకసత్కరుణాకరా!॥ మాం॥

గీ. మధురవాక్కులచేతి రా ♦ మాయటంచు
గాన మెవ్వారొనర్తురో! క్షణము వారు

బ్రహ్మహత్యాది సర్వపా ♦ పములనుండి
ముక్తులగుదురు రామ! ♦ సంపూర్ణకామ!

వ. కాఁబట్టి ఇది మొదలు నన్ను నీపాదసేవకునిగాఁ జేర్చుకొని నన్ను ధన్యునిఁ జేయవలసినది మహాప్రభో! యాపద్బాంధవా! యని బహుభంగులఁ బొగడిన మెచ్చి రామమూర్తి యిట్లనియె.

తో॥ కొట్టెదవాలిని। బట్టమునీకిక। గట్టెదవానరవర్యా!। యట్ట హాసమున-నరిగియుద్ధమున-కతనిబిలువుపటుశౌర్యా! ॥రామా॥

వ. అనిపలికిన సుగ్రీవుండు శీఘ్రంబున రామలక్ష్మణయుతంబుగాఁ గిష్కింధనగరోపవనంబునకు వచ్చి వారినొక్కవృక్షంబు చాటున నిలిపి తాను పురద్వారంబుఁ జేరబోయి యాకసంబుబద్దలగునటులను ద్దండంబుగఁ బెద్దకేకపెట్టినఁ దద్దయువాలించి తమ్ముని మెలుంగని నెమ్మనమున యోచించి సింహనాదమ్ముఁజేయుచు వెడలివచ్చెన.

క. ఆక్షణమున సుగ్రీవుఁడు
వక్షస్థలముగులఁ బొడువ ♦ వాలియపుడు రూ
క్షేక్షణములఁ దనతమ్ముని
వీక్షించియుఁ బొడిచెమరల ♦ వీరాంకుండై.

వ. ఇట్లన్యోన్యంబు సరాసరి బోరునెడ వృక్షంబు చాటుననుండి రాముండు.

తో॥ ఒకతేవిధముగ-నున్నారిద్దరు-నకటా! నాబాణంబు! నికనె వ్వని వధియించునోయని వేగ్రి, యకనుండెను దనయంబు॥రామ॥

వ. అంత సుగ్రీవుండు నిరాశుండయి యెటులనో! తప్పించుకొని శరీరమాద్యంతంబు గంపంబునొందుచుండ మెల్లమెల్లగా నడచుచు తిరిగితిరిగి చూచుచు రామభద్రునిఁ జేరవచ్చి యిట్లనియె.

సు.-కీర్తన, జంఝూటి, ఆటతాళము.

ఎంతవాడవు రఘురామా! యింతమోసముజేయ-నేటికి రామా! పంతమా! సద్గుణధామా! వంతనొందించమీ-వంటివారికిఁదగునా! వింత

వాలివధి, యింపవైతివి॥ యెంత॥ రక్షింతుననిపంపిచాల। మోక్షగుండే శయు, పేక్షింపమేల। శిక్షింపఁదలచితివేల । యక్షయముగవాలి-కప్పగిం చుటకంటె, సాక్షాత్తుగానీవే! చంపగ రాదా! ॥యెంత॥

వ. అనిన సుగ్రీవుని నిష్ఠురోక్తులువిని గాఢాలింగనముచేసికొని కన్నులనీరునించి యాదరంబున నిట్లనియె.

స్రగ్విణి. అతఁడుగా నీవు నే ♦ కాకృతింగంటిరా
రీతిఁభావించి గు ♦ రిఁజంపఁగాజాలకే
ఖ్యాతిఁగానిన్నుఁజ ♦ క్కాడునోయంచు నే
భీతిచేశాణముగా ♦ వేగ్రియఁగామానితిగా.

వ. అంతియేకాని యితరసంకల్పమేమియును లేదు భానునందనా! యాశ్రితచందనా!

తో॥ సుమమాలిక గం,ఠమున ధరందియు-సురుచిరముగనీవతని। సమరంబున కీ, సారిబిలచినో-రుము చూతువువాధ్యతిని ॥రా॥

వ. ఇట్లుస్వామి యాజ్ఞాపించిన నొకపుష్పమాల గళంబునఁ జిహ్నంబుగా ధరించి సుగ్రీవుండు గిష్కింధసమీపించి మహాట్టహాసం బుఁజేసినవాలియు.

తో॥ తిరిగివచ్చె నీ, తరినీతనినే.దెగజూతును నేఁడనుచు। బగు గునబోయెడు వాలికడ్డవడి-పలికెతార వద్దనుచు ॥రా॥

తార-కీర్తన, హిందు॥కాఫిరాగము, ఆదితాళము.

పోవద్దుప్రాణేశ్వరా! యనికి ॥ పోవద్దు ॥ ఈవలను సీతోనోడి, యితఁడుమరలివచ్చినాఁడు ॥ పోవద్దు ॥ బలవంతులెవ్వారలో! దోడు, పడియుందురేధీరులో! యిలనుమోక్షగుండ నగ-రేశుని సాక్షిగనీవు॥ పోవద్దు॥

వ. అప్పుడంగదనందనుం డిట్లనుచున్నాఁడు.

క. పగతుండాజికిఁ బిలువఁగ
మగువాపోవద్దనంగ ♦ మంచిదియగునా!

తగనతనికి బాసటమై
జగతినన్నెదురునంత ♦ సద్బలుఁడెవఁడో!

వ. అనినఁ దారయిట్లనియె.

తో॥ అంగదుండు తెలు, పంగవింటినా। సంగతి వివరించెదను। రం

గుగరఘుకుల, పుంగవులగు శ్రీ, రామలక్ష్మణులు దగను ॥రామ॥

తరుణితోడ నీ, దండకాటవికి-నరుదెంచిన రావణుఁడు। చెఱగొ

ని బిఱబిఱ, సీతనులంకకుఁ-జేర్చ్చగ నా రాఘవుఁడు ॥రామ॥

ఉ. తమ్మునితోడఁగూడి వని ♦ తత్ బరికింపుచు వచ్చిఋశ్యమూ
కమ్మున భానుజున్ గలసి ♦ గ్రక్కునఁ బాసలుసేసెనిన్ను యు
ద్ధమ్మునఁ గూల్చి రాజ్యము హి ♦ తమ్ముగనాతని కిచ్చునట్లుగా
నెమ్మదివింటి నీమది ని ♦ క్కముగాఁదలపోయు మింతయున్.

వ. ఇదియసత్యంబయిన నీచేతఁదరుమబడినవానికింతశౌర్యంబు తనంతట గల్గునా! యోచింపుము వాలీ! బలవద్విపారణ్యకేలీ! యనంత ధైర్యశాలీ!

గీ. యావరాజ్యంబు నిసజున ♦ కీవునిచ్చి
సఖ్యమొనరించి రామల ♦ క్ష్మణులఁ గొలువు
శుభముగలుగును ♦ గులమును; సుతుని, నన్నుఁ
బ్రోవుమనిపాదముల వ్రాలి ♦ లేవకున్న.

వ. తిన్నగాఁ గరంబులఁబట్టి లేవఁదీసి యాలింగనంబుఁ జేసికొని తారనూరార్చుచు వాలి యిట్లనియె.

క. తెలియుదు రాముండై రవి
కులమున హరిబుట్టెనజుఁడు ♦ గోరిన కతనన్
బలవంతుఁడైన రావణు
బొలియింప నయోధ్యయందుఁ ♦ బొలతిరో నిజమే!

వ. ఐన నేమి యమ్మహానియ్యెందు నిరపరాధిని నన్నేలశిక్షిం చుతారా! నఖనిర్జితతారా!

వాలి-కీర్తన, అటతాళము, సురటరాగము.

రాముడనగబరం, ధాముడులోకాభి, రాముడు, భక్తకాముడు॥ రా॥ తప్పులేకను నన్ను-దండనజేయునె-చెప్పకు, యికరొప్పకు ॥రా॥ నావారు బెఱబార, లనుభేదమతని కు, న్నాదటే! యిదివాదటే!॥రా॥మోతు గుండహారికి మొ్రొక్కుచు సుగ్రీవు-ముట్టెదం-జావ, గొట్టెద ॥రా॥

వ. ఇంతియే! కాని మెంతమాత్రము సుగ్రీవుని మన్నించుట లేదుభామా! గృహంబున కరుగు లేమా! వనితాలలామా!

తోహర. అనితారను మా,రార్చి వాలియు, య్యన యుద్ధమున కునడచి।కనుగవ గెంపులు-గదురుగ సుగ్రీ,వుని వీక్షింపుచు గదిసి॥ రా॥

వాలి-కీర్తన, బేహాగ్, ఆదితాళము.

పోకురాపోకురా! సుగ్రీవా! యిక। బోకురా॥ భీకరముగ నిన్నుజంపి। పీడవదిలించెదను ॥బోకురా॥ లగ్గలెక్క నట్టునిన్నడగ్గరిసి వోడిపోయి। సిగ్గులేక నేడువచ్చి-తగ్గగనెదిరించెదవు। మొగ్గులేక నిన్నుబట్టి-మోతుగుండశౌరిచూడ। నుగ్గునూచుజేతునీదు। పెగ్గెపెటాకులజేర ॥బోకురా॥

తోహర॥ అంతట నినజుం,డతి రోషమ్మున। నార్భటింపుచును బొదవ। బంటమతో నా,వాలిముష్టిచే- బలిమిని నెదపైనడవ॥రామ॥

వ. ఇట్లిరివురు సమబలులయి నఖానఖీముఖాముఖి బాహాబాహి బెనంగునెడ శ్రీరామచంద్రుండు.

తో- ఐంద్రిచాపమున-నస్త్రము దొడగియు- నాకణాంతము దిగిచి। చంద్రియశుడు రాము,చంద్రుడువిడువగ- సరగున వాలినిగదిసి॥ రా॥

క. ఉరమున గాండీవ నాతండు
నురువడి నిలఁగూలి మూర్ఛ ♦ నొంది పిదపం దె
ప్పిరిలి రవితనయ లక్ష్మణ
పరివృతుండయి యున్నరామ ♦ భద్రునకనియెన్.

వాలి-కీర్తన, రూపకతాళము, భైరవిరాగము.

ఇదినేరా! నాసేర- మేమున్నది రఘువీరా!॥ యిది॥ మొమటికిరా

కనుడాగియు-నెదనాటగఁ గమపొక్కటి। యిదేవేరియగ॥ నిది॥ భానుజుడు బంధువుడు - నేనీకునుబగవాడనె। వానరమాంసము గోరుట, యే నీతిదియానానిక - భూనాథుల॥ కిది॥ నాదాపును మోటుగుండ, నాథచేరివివరించిన। నాదనుజుని బాదమ్ముల। తోఁదన్నియు। నీదేవిని - నేదేనా!॥ యిది॥

ద్విపద- అని వాలియీరీతి- నాడువాక్యములు। విని రాఘవుఁడు నవ్వి-వేగనిట్లనియెఁ। బ్రీతిగావానర,వీర యాలింపు। కూతురు మరదలుఁ గోడలుభగిని। సరియని యందురు- శాస్త్రజ్ఞు లదియు। గురిగాఁగ నీవు గైకొనక కామమునఁ। దమ్ముని భార్యను- దగఁగూడినావు। తమ్మునిఁబురి వెళ్ళ-దాటించినావు। ఇన్నియధర్మము- లెలమి నీయందు। నున్నవిగాన నే,నుర్విఁగూల్చితిని। నీయధర్మమెపిన్ను- నీరుగావించె। బాయకమంచి సె,బ్బరలు పాటించి। శిక్షించుపనిగాదె! క్షితితలాధిపుల। కీక్షితిఁదెలియక, యేలపల్కెదవు। చాలింపుమని రాము,చంద్రుండువలుక। వాలివిజ్ఞానియై- వైరంబువదలి.

తోహర॥ ఆపదవేళను- నాడినమాటకుఁ- గోపించగవద్దండి। నీపదయుగ్మము- నెరనమ్మితి మ,న్నించి కరుణజూడండి ॥రామ॥

వాలి- కీర్తన. అటతాళము- జంఝూటిరాగము.

శ్రీరామా, నీవాది-నారాయణుడవు। శ్రీరామామణియె యీ-సీతాదేవియవు॥శ్రీరామ॥ అవతరించితి రావ,ణాదులజంప। దివిజుల మునుల మో,దించి రక్షింప॥శ్రీ॥ అవసానమందు ని,న్నరయంగగలిగె। భువి నినాదుష్కృతములు నేడుదొలఁగె ॥శ్రీ॥ మోటుగుండవాస! మునిజనోల్లాస! అక్షయనారా,యణ కవితోష॥ శ్రీ॥

క. అంగదుఁడు బాలుఁడగుఁగా
నం గరుణింపంగ వలయు • నాయన [illegible] నా
యంగముస్పృశించి నిర్మలు
నింగానొనరించి ముక్తి • నేఁడొసఁగు హరీ.

క. శరవేదనఁ బడఁజాలను
సరగున నడియూడఁదీయు ♦ సర్వజ్ఞ యనన్
గరమున హృదయము నంటియు
శరమూడఁగఁదీసె రామ ♦ చంద్రుఁడు దయతోన్.

వ. అంత.

తో- రామకరస్పర్శమున బునీతుం- డైమహనీయుఁలు గోరే। ధామమునకు గపి-తనువులిడిచి యూ-తారాపతి డాజేరె॥రామ॥

ఉ. అంతట వానరుల్ చని ర ♦ యంబునఁ దారకుఁగాంచి యమ్మనీ
కాంతునిజంపె రాఘవుఁడు - గావున నంగదు రాజుఁ జేయనా
వింతగ, నాల్గు వాకిళుల-వేగ్రియఁగఁబంపుము. సూర్యనందనుం
డింతకు రాకముందె యని ♦ యేర్పడఁబల్కిన నామెచింతతోన్.

వ. మూర్ఛిల్లి భూమిపైఁబడి కొంతవడికిలేచి హస్తంబుచే శిరో వక్షంబులు మోదుకొనుచు వనచరులం గనుంగొని

తార-తో. నానాథుడులే- నప్పుడురాజ్యము, నందనుడును నా కేల। మానకయిపుడే! మగఁడువడిన కడఁ కేనుబోదు నీవేళా॥రామ॥

వ. అని తత్క్షణంబున లేచి రోదనంబుచేయుచు వాలిపడియున్న చోటికిఁ జేరి పదంబులపయిఁబడి.

తార-కీర్తన, తోడిరాగము, ఆదితాళము.

నాప్రాణనాథా! యిక। నాకేదిదిక్కు కటా! పాపిష్టివిధి మనలఁ। బాపె నేమందునిల॥నాప్రా॥ నేనెంతజెప్పినను। నీమదికెక్కదాయె।హీనపు నోమునోచి-నానేమొ పూర్వమున॥నాప్రా॥ శతమఖసుతుడవయి। ప్రతి లేనిశూరుడవై। క్షితిమానవునిచేత। జెడనాయె గడపట॥ నాప్రాణ॥ శ్రీ మోక్షగుండపుర ధాముడే! రాముడని। నేనుముందుజెప్పలేదా! నామాట వినవైతి! ॥నాప్రాణ॥

వ. ఇట్లు విలపించుచుఁ దలయెత్తిన ధనుర్బాణధరుండయిన రాముండు దృష్టిగోచరుండయిన నిష్ఠురంబుగా ననుచున్నది.

క. వాలిని గూల్చిన కోలను
గూలిచి సురపురికినతని ♦ గూడఁగనన్నుఁ
మేలుగ బంపుము వాలికి
నేలేని సుఖంబుసుఖమె! ♦ నిక్కము రామా!.

వ. పత్నీవియోగదుఃఖంబున వేగింపుచున్న నీవిట్టిమేలు చేసిన దత్ఫలంబు శీఘ్రింబునఁ బొందఁగలవు కావున నన్నును నొక్కబాణంబునఁ గూలిచి వాలిచెంతకుఁ జేర్పుము రామా! రణరంగభీమా! అని సుగ్రీవునిఁజూచి॥

తా-తో॥ శ్రీరామునితోఁ-జెప్పియునన్నును-శిక్షింపించియు వెనుక। నా రుమతో సౌ, ఖ్యములొందుమునా। పోరులేకుండును గనుక॥ రామ॥

వ. మీయన్నను బోలె నన్నును రాముని చేతఁ జంపించి నూచికక్కు లేకుండ సమస్త రాజ్యము నేలుచు రుమాదేవితోఁగూడి సుఖింపుమా! సుగ్రీవా! దుష్టస్వభావా! యని యిట్లు పెక్కుదోచక విలపించు తారకు వివేకంబుఁ గలుఁగ జేయఁబూని శ్రీరాముండు.

క. నావిభుఁడని విలపించెదు
జీవుఁడో! దేహంబో! తెలుపు ♦ చెలివిభుఁడనఁగా
భావింప భూతధాతుమ
యావిర్భవమును జడ! మ్ము ♦ నగు దేహమిలన్.

రా-తో॥ జీవుఁడాత్మమయుఁడై వినువిధమున- నీవిశ్వమునంటకను। దావెలయును శుద్ధంబుగ దేనికి-నీవువగచెదవుతగను ॥రామ॥

వ. దేహంబు సప్తధాతుమయము, పంచభూతాత్మకము, జడస్వభావము, దుఃఖరూపము, నశించుచున్నది. జీవుఁడన్ననో! నిరామయుఁడు, నాత్మరూపుఁడు, లింగవిహీనుఁడు, నంతఃప్రకాశకుండు, దేనిని నంటువాఁడు కాఁడు. ఈదేహజీవుల రెంటిలో! నీభర్త యెవఁడు! నీవుచింతించుట దేనినిగూర్చి తెలుపుము కాంతా! నిర్మలస్వాంతా! యనిన దార కొంత యెఱుకగలిగి.

క. జీవుఁడు చిన్మయుఁడాయెను
దేవర జడసంవృతంబు ♦ దేహంబాయెన్
గావున సుఖదుఃఖంబులు
గేవలముగ దేనిబొందుఁ ♦ గృపఁదెలుపఁగదే!.

గీ. నన్నుఁదెలుపుమనుచు ♦ నాతండ్రియడిగితి
నేనుఁ దెలుపునంత ♦ దాసనే! క
టాక్షముంచి నిశ్చయంబు ♦ నిరూపించి
నాకనుగ్రహించి ♦ నన్నుఁబ్రోవు.

వ. అనిన దయార్ద్రచిత్తుండై రాముండు తారనువీక్షించి.

రా- కీర్తన, ఆరభిరాగము, ఆదితాళము.

తరుణి! తెలిపెదవినుమా! నీవ్రశ్నకునే॥ దరుణీ॥ ధరను జీవుఁడే। వరకు నహంకృతిఁబోరయునో! యంతకుఁ,దఱుగదు సంస్కృతి ॥ తరుణి॥

తాత్పర్యము- జీవుఁడెంతపర్యంతంబు నభిమానముతోఁ గూడి యుండుచున్నాఁడో! యంతపర్యంతమును సంసారముతరగిపోదు తారా!

కీర్తన॥ విషయాసక్తిని- విడువజాలకను। మృషయగు సంస్కృతి- మెలఁగును జీవుఁడు॥ తరుణి॥

తాత్పర్యము- జీవుండనాది సంబంధముచేత విషయంబులయం దాసక్తివిడువలేక యసారమగు సంసారమందు నిశ్చయత్వబుద్ధితో మెలఁగుచుండును కాంతాశిరోమణీ!

కీర్తన- అఖిలేంద్రియముల- నభిమానింపుచు। సుఖదుఃఖంబులఁ। జొక్కుచునుండును॥దరుణి! తెలి॥

తాత్పర్యము॥ చతుర్దశేంద్రియములలోఁగలసి పరమార్థముగా భోగింపుచు నావ్యాపారముచేత రాఁబడిన సుఖదుఃఖములకుఁ దాను బాధ్యుఁడయిజీవుండు సంతోషా సంతోషము లనుభవింపుచుండును యువతీలలామా!

కీర్తన॥ మానుగ జగదభి-మానము వదలిన। దానె! మోక్షగుం

డ, ధవుడయి వెలయును॥తర॥

తాత్పర్యము॥ ఈప్రకారమున సంసార వ్యామోహితుండయి యుండు జీవుండొకానొక కాలమునకు నీప్రపంచసుఖము లస్థిరమని సద్గురుకటాక్షమువలనఁ దెలిసి నిజము విచారించినపుడా దేహేంద్రియ. ములుదాఁగొని మోక్షగుండమను సుషుమ్నా నాడీశిఖా మధ్యమందుఁ గోటిసూర్యప్రభాభాసితుఁడయి ప్రకాశించు ముఖ్యబింబమైన పరమాత్మయం దైక్యంబునొంది తానే! పరమాత్ముడై ముక్తుడగును భామా! సద్గుణస్తోమా!

సీ. తారా! నేదెలిపిన ♦ తత్వవిచారంబు
శుద్ధమనంబుతోఁ ♦ జూడుమబల!
దుఃఖంబులెల్లను ♦ దొలగును సంసార
కర్మబంధములెల్లఁ ♦ గ్రాగిపోవు
నీపూర్వభవమున ♦ నిర్మలభక్తినా
యందునుంచితివి నీ ♦ వందువలన
దర్శనమిచ్చి య ♦ థార్థంబుఁగరపితి
నాస్వరూపంబు మా ♦ నసమునందు
గీ. ధ్యానమొనరింపుచును సంత ♦ తము ముదుక్త
మానితజ్ఞానధర్మంబు ♦ మఱువకుండు
బహుళ భవబంధ భయమును ♦ బాయజేసి
శాశ్వతబ్రహ్మపదవి నా ♦ సంగువాడ.

వ. అని రాముండు బోధించిన తార శోకంబుమాని మహానందభరితురాలయి శ్రీరాముని జగన్నాథునిగా భావించి కరంబులుమోడ్చి నుతింపఁదొడంగె.

తార-కీర్తన, రూపకతాళము, కమాసురాగము.

అంతు దెలియనెంతదానను। భువనాధిప! నీ ॥యంతు॥ అంతర్బాహ్యములందున- నంతంబుగ నలరెడు నీ॥యంతు॥ హర సురాదులరయ

జాలరు। సనకాదిమౌని। వరులునైన నెఱుఁగనేరరు। తరుణిని విద్యార హితను। గురుతెరుగను-గుణహీనను॥అంతు॥ మానిత నారాయణార్చిత! శ్రీమోక్షగుండ। శ్రీనివాస! లోకవందితా! మానవుఁడని-మదినెంచితిఁ గాని నిజము-గననైతిని॥యంతు॥

వ. అనియిట్లు స్తుతించిన సంతోషించి యాదరంబునఁ జూచెన ప్పుడు రామబోధితమయిన జ్ఞానవాక్యములను సుగ్రీవుండువిని నిర్మలాం తఃకరణుండయి రాముని సమీపించినంగాంచి.

రా-తో. అంగదుచేమీ, యన్నకుసంస్కా। రాదులువిధివంతము గ। సాంగంబగునటు। సలిపింపుము వెల, యంగనీవుశీఘ్రముగ॥ రామ॥

వ. అనియిట్లు రాముండాజ్ఞయిచ్చిన మంచిదని సుగ్రీవుండు వాలికళేబరంబు నలంకరించి విమానంబుపయినుంచుకొని వానరులచేత మోయించుకొని యంగద తారా సహితంబుగఁజని యగ్నిసంస్కారాది కర్మంబులు సాంగముగానెరవేర్చి స్నానంబుజేసి మరల రామసన్నిధానం బునకువచ్చి నమస్కరించి.

తో. పాదసేవకుఁడ। భటుఁడనునేమీ। సోదరునంతటివాఁడఁగా। ఏది! చేయుమని-యెదరో! చేసెద। నెఱిగింపుడుదయతోడఁగ॥ రా॥

రాము-కీర్తన, ఉసేనిరాగము-ఆదితాళము.

పోవోయీ యినజా! కీవిగకిష్కింధనునేలఁగ॥ పోవోయీ॥ నీవి రోధుని। జావనేసితి। నేవి. లేవువిఘ్నములదరక॥ పోవో॥ వాలిసుతునకు, మేలుగలుగగ। జాల,యువరా। జ్యంబునుగట్టుము॥పో॥వానలడిగిన। వాన రులతో। జానకినిగన। గానరుదెమ్మిక॥పో॥ ఈమహాద్రిని।పేర్మినుందు ము। రాము-మేము। గ్రామంబులకు॥ పో॥ వృక్షచరసౌ-మిత్రివచ్చును। మోక్ష-గుండ రిక్షకుదలచుచు॥ పో॥

వ. అనిపలికి సౌమిత్రిని తోడఁబంపిన వారిని కిష్కింధకు జేర్చి యొక్క శుభలగ్నంబున సుగ్రీవునకు వానరరాజ్యాభిషేకం బొనర్చి యంగదునకు యువరాజ్యంబుఁగట్టి వారివల్ల విశేష సత్కారంబులువడసి

లక్ష్మణుండు తిరిగి యన్నను జేరి నమస్కరించిన రాముం డిట్లను చున్నాఁడు.

౧౪. ... రా-కీర్తన, శహానరాగము-ఆదితాళము.

వర్షాగమన వేళ-వచ్చెనులక్ష్మణా! హర్షము తోడ మనమీ, యద్రిగుహనుందాము॥ వర్షా॥ ఎల్లెడలనువాన, జల్లులు బిక్కటిల్లె। మెల్లన గొండలపై। మేఘము లావరించె॥ వర్షా॥ పగవారిపైనఁబోవు, పనిగాదీ రెండునెలలు। దగనిందు మోటుగుండ। ధవుగనుచుందుదాము॥ వర్షా॥

వ. ఇట్లిరువురునాలోచించి మంచియుదకములు మంచిఫలములు గల యొక్కచో గుహయొక్కటియుండ వర్షబాధానివృత్తికొఱకు నాగుహను శుభ్రముఁజేసికొని రామలక్ష్మణులు మునులఁబోలి యందు నివసించి తత్త్వవిచారంబుఁ జేయుచుండిరి. అక్కడసుగ్రీవుండు రుమాకాంతా తారలతోఁగలసి కామోపభోగంబుల విఱ్ఱవీగుచుఁ బ్రమాదముగా నుండె. నదిగని యాంజనేయుండు.

క. రామునకుఁ జెప్పివచ్చిన
దేమీ! యది మఱచియుండు ♦ టేమీ యిటునీ
వేమఱియుండిన మనపయి
నామహానియ్యనకురాదె! ♦ యాగ్రహ మినజా!

వ. వారికిఁ గోపంబువచ్చిన భరించువారెవ్వరో! చూడుమని పవనజుండుపలుకఁ దెలివొంది సుగ్రీవుండు.

తో॥ సకలదిశలకును। జనుదెంచిన తరు, చరులను బిల్వగబంపు। మికరామునిపని-కేగుదమన్నియు। నేర్పాటులుగావింపు॥ రా॥

వ. అని యుత్తరువిచ్చిన హనుమంతుండు సమాచారమంపి డెబ్బదిరెండు వెల్వల వానరసైన్యమును బోగుచేయుచుండె నక్కడ రాముండు.

రాము-కీర్తన, రూపకతాళము, నాటకురంజిరాగము.

సీతజాడ, బ్రీతితోడ। నాతోజెప్ప, వా రేరల। పాతకుని, చేత

వంత! బాధనొంది_బడలినదోర!॥సీత॥ నాతిని కిం చుకొనక। శేతగాక భో
నెనుక। యేతెరంగునను వలపు! దోత్రుమెయుల పై తోడుక।సీత। మోక
కుండా-ధ్యక్షుతనయు-డిక్షుధనువు-నెత్తెను । యుక్తమ్ము కుము, మా త్ర
ములు। వక్షమందునాటనేసెను ॥సీత॥

వ. నాయంగనను దొంగిలించిన దనుజపుంగవుని సింగంబు
మాతంగంబుపయికిఁ జెంగున లంఘించుభంగిఁ జెలంగుచు గదిసి హం
గడంగఁజేయంగవలెనని క్రోధంబంతరంగంబున నుప్పొంగుచున్నది. దం
గుమీారనాజాడ నెఱుంగజేయుపంగడికాడు లేఁడాయెఁగదా! తమ్ముఁడా!
సౌమిత్రి! కనుగొంటివిగదా! శతపత్రమిత్రి పుత్రునిమైత్రి.

పంచచామరము.

స్వకార్య మైనమీాఁద సూర్య ♦ సంభవుండహంకృతిన్ । ఒకింత
యైనఁదొంగిచూడ ♦ కున్న వాఁడుకంటివా!। యిఁకన్ సహింప రాదువా
ని♦యేపురూపుమాపి వా। లికిం బ్రియంబొనర్తు నేఁడు♦లీలతోడలక్ష్మణా!

వ. అనిన లక్ష్మణుండు.

లక్ష్మ-పంచచామరము.

భటుండనై ననేను వెంట♦బాయకుండ నుండ మా। ర్కటాధముణ్
జయింప మీారు♦రాగనేమిపంపి నంతటన్ దటాననేనుఁబోయి♦తాఁకివాని
గూల్చి మిక్కుటంబుగాఁ బురంబునెల్లఁ♦గొల్లఁబెట్టివచ్చెదన్.

సం-వ. అనిన రాముండలరి లక్ష్మఁణునిగాంచి.

రా-కీర్తన, కేదార, రూపకతాళము.

సోదర! పోగదరా! మోదముతో। నాదినిమర్యాదగనీ। వాదర
మున నాతనిగను ॥సోద॥ మునుమనుంచుగనతనిన్। జనకకుమాూ। మనమే
లును మెఱిచినగతి। కనబడినను దనుమాడుము ॥ సోద ॥ అభయమిడితి
గాన న్। ఉభయులకున్। శుభముగలుగ మోక్షపుర, ప్రభువుకరుణబడ
యగవలె ॥సోద॥

తో॥ పోలఁగ సుగ్రీవుని రమ్మనియను।చాలనతఁడు రాకున్నన్।

వాలిఁగూల్చిన-బాణముగలదని-వచియించియురమ్మనర॥ రా॥

క. కాలాగ్నిరుద్రుఁబోలియుఁ
గేలధనుశ్శరములూని ♦ కిష్కింధకు న
వ్వేళఁ జనిపురమువెలుపటఁ
జాలనిలచి చేసెనపుడు ♦ జ్యానినదంబుర్.

వ. అమ్మహాధ్వనికి విభ్రాంతులై కపిసైన్యంబులు కిచకిచ ధ్వనులతోఁ జని చూచి లక్ష్మణునిగా నెరింగిపోయి యంగదున కెరింగించిన నతండు సత్వరంబుగాఁ జని పాదంబులకు నమస్కరించిన నిట్లనియె.

ల-తో॥ నీపినతండ్రికిఁ - గోపముతోడను-నేను వచ్చినటుపలికి। ప్రాపుమీరనా-పజ్జకుఁదోడ్కొని-రమ్మన నంగదుఁడులికి ॥రామ॥

వ. వేగంబునఁజని సుగ్రీవునింగని యక్షీణరోషతామ్రాక్షుఁడై లక్ష్మణస్వామివచ్చి తనసముఖంబున క్షణంబున నిన్ను బిలుచుకొని రమ్మన్నాఁడు వృక్షచరాధ్యక్షా! విపక్షకుంజరహర్యక్షా! యనుపలుకులకు నులికిపడి సుగ్రీవుండు హనుమంతునిఁగని.

సం-తో. అంగదుండు నీ, పుంగడువడి రఘు-పుంగవుతమ్మునిఁ జేరె। పొంగుచుమొక్కి-యు-బురములోనికి జే, ర్పంగవలయు మదిగోరి ॥ రామ ॥

వ. అనిపంపిన వారుచని లక్ష్మణుఁగని నమస్కరించి దేవా! రాజభవనంబునకు దయసేయవలయు రాజకాంతలు తమ దర్శనము కొఱకు వేచియున్నారు. సుగ్రీవుని యిష్టంబిదియనుచు వల్లెయనివచ్చునప్పుడు మధ్యకక్ష్యాంతరంబునఁ దారయెదుర్కొని మ్రొక్కి,

తార-కీర్తన, శ్రీరాగం, రూపకతాళము.

రామానుజ! రక్షింపుము। మిామిత్రుని మిత్రసుతుని ॥రామ॥ మిామదిఁగనిసించి యతఁడు । క్షేమంబని చేయునుగద! ॥రామా॥ వనచరులకు-వార్త బంపె। వత్తురు రేపో! మాపో! పనులన్నియు మోక్షగుం

డ-ఘనునాజ్ఞను సమకూరును ॥రామా॥

వ. ఇట్లు పొగడిన హర్షించుచు సుగ్రీవుని భవనద్వారము సమీపించిన నప్పటికి రుమాకాంత చెంతనుండి లేచి రాకున్నఁగోపించి లక్ష్మణుండు.

ల-తో॥చాలగనినజుఁడు-స్వామిద్రోహుడు-సంపన్న మదాంధుం డు। వాలిని గూల్చిన। వరశరమెక్కడ। బోలేదున్నదిజుండు ॥రా॥

వ. అనులక్ష్మణుని ఘర్షణవాక్యంబులువిని కంపంబునొందుచు నర్ఘ్య పాద్యంబులుఁగొని సుగ్రీవుండు సౌమిత్రికెదురేగిపూజించి నమస్కరించి తోడ్కొనిపోయి సింహాసనాసీనుంజేసి కరంబులుముకుళించి.

క. వనచరసేనల నెల్లను
నొనగూర్చుచునున్నవాఁడ ♦ నోగిరానున్నా
రనఘా! రామునిదర్శన
మున కేగుదమింకమనము ♦ మోదముతోడన్.

వ. అనిలక్ష్మణున కనురాగంబుగాఁబలికి యంగద హనుమంత సుషేణ నల నీల జాంబవంతాదులు వెంటరా సుగ్రీవుఁడు లక్ష్మణసహితంబుగా రామదర్శనార్థమై మాల్యవంతంబునకరిగి రాముని పదంబులకుమ్రొక్కి.

సుగ్రీ-కీర్తన, ఆదితాళము, కళ్యాణిరాగము. పల్లవి

దండము రవికులచంద్రమానీకు ॥దండ॥ కొండలవనముల, నుండిన కోతులు। పిండునఁ గూర్చుచునుంటి ॥దండము॥ వానలువోయిన-వత్తామనుచును । నేనుంటిని గరుణించు॥ దండము॥ తడసితినని కోప, పడకు మోక్షపుర యొడయుఁడదాసుఁడనౌదు ॥దండము॥

వ. అను వినయోక్తులకు నలరి లేవనెత్తి గాఢాలింగనంబుఁ జేసికొని రాఘవుండిట్లనియె.

గీ॥ నాకుదాసుఁడవును ♦ నాకార్యపరుఁడవు
నను చుఁ గాదెనిన్ను ♦ నెనసినాఁడ

నిప్పటికిఁ బ్రియత్న ♦ మేమి చేసితివయ్యా !
తెలియఁజెప్పు మనకుఁ ♦ బలికె నతఁడు॥

సు-మధుగరతి రగడ.

పల్లవి॥ వచ్చిరిమీసేవ, కొఱకై। వనచరులో దేవ। పవనకుమారుఁడు బనసుఁ డంగదుఁడు। గవయుఁడు నీలుడు, గంధమాదనుఁడు। సుముఖుఁడు గేసరి-జ్యోతిర్ముఖుఁడును। విముఖుఁడు దారుఁడు-వినతుఁడు గజుఁడును। నలఘుఁడు ద్వివిదుఁడు-నాగవాక్షుఁడును। నలుఁడును బావక, నయునుఁడు హరుఁడును। సంబురాశినుతు, డయిన సుషేణుఁడు। జాంబవంతుఁడును-శతబలి శరభుఁడు। మైందుఁడు, మొదలగుమర్కటనాథులు।సుందరవంతులు, శూరులు యోధులు। తమతమహితులును-దమ్ములుఁదనయులుఁ। దమబంధువులును-దమతమ మనుమలుఁ। దగ వెంబడిరా-ధరణిఁ బట్టకను। నగణితసంఖ్యల-నార్భటింపుచును ॥వచ్చిరి॥

శ్లో. వీరలేమి గా, వినవగవలెనో। వివరింపుము రఘువర్యా ! సారెకుమీయా, జ్ఞానసారముగ। సలిపెద సుందరధైర్యా ! ॥రామ॥

వ. అనిన రాఘవుండు.

క. సీతను వెదుకఁగవీరిని
బ్రీతిగఁ బంపించుమో క ♦ పిప్రవరయునన్
జేతంబున ముద మొందుచు
ఖ్యాతిగ నాతండుపంపెఁ ♦ గపిసైన్యములన్.

క. ప్రాచిఁ బ్రతీచి నుదీచిని
జూచుటకై వినతు నబ్ధి ♦ సుతుని సుషేణున్
ధీచతురుని శతబలినిటు
వేచనుఁడని లక్షలక్ష ♦ వీరులతోడన్.

తో. గజుని గవాక్షుని। గంధమాదనుని। గవయునంగదునిదారు। విజయునిభల్లుక। విభుని మైందునలు, ద్వివిదుని బవనకుమారు ॥నా॥

కని మీరలు ద, క్షిణమున కేగుడు। జనకజపోబడిజూడ। బనివడి

నెలలో, పలను జూచి రా, వలయును దప్పినసీడ ॥రా॥

వ. మిమ్ము మన్నించుటలేము. రాముపిసముఖంబున శిక్షింతు ముబొండని సెలవిచ్చిన సుగ్రీవుని శాసనంబున వనచరులు ప్రయాణం బులయి రామునకు నమస్కరించి.

వాన-కీర్తన, ఆదితాళము, బ్యాంపు.

పోదుమా మేము-పోదుమా మేము-మీ దేవినిజూడ। నో రామ! ద్వీ పములెల్లను-దిరిగిచూచెదము। దేశములన్ని-దిమ్మరికాంచేము ॥ శ్రీప తిమోక్ష-గుండ పురీశ। భూపుత్రిజూడ కొ, ప్పాగ నూరక రాకు ॥పో॥

వ. అనిచెప్పి ప్రయాణంబులగుచుండ నందరిలో హనుమంతుని స్వకార్య నిర్వాహక ప్రసిద్ధునిగా బుద్ధినెంచి యొద్దకుబిలిచి ముద్దుటుంగ రమిచ్చి రాముండిట్లనుచున్నాఁడు.

క. ఈయుంగరమును గొనిచని
వాయుజ! జనకజకునిచ్చి ♦ వచ్చును రాముం
డీయెడకు యుద్ధయత్నముఁ
జేయుచునున్నాఁడటంచుఁ ♦ జెప్పుము శుభముల్.

వ. నీకు మేలు గలుగుఁగాక. శీఘ్రంబున నమువుమన నాంజనే యుండంజలిచేసి గంతులువైచుచు నంగుళ్యంబు సిరసా నహించియుంగా దాదులతోఁగలసి దక్షిణ దిశకుఁ బోవనుద్యోగించి.

తో. భానుజునాజ్ఞను। బటుతరవింధ్య। ప్రాంతంబుల వెతకుచును। వానరులుండగ। వారియెదుటనొక। దానవుడగుపడియెను ॥రామా॥

వ. మారీచుని కుమారుండ బౌరుషశాలిని మీరెవ్వరో! కాని నావనంబున కేలదూరివచ్చెదరు. మిమ్ము మ్రింగుదునన నంగదుండాగ్ర హించి పిడికిటనడఁచిన నొక్కగుద్దునకే! పెద్దనిద్దురంజెందె. అంతివారు వనంబునఁ దిరిగితిరిగి దప్పి దాహంబుఁగొని యెక్కడ నీరుగానక.

వాన-కీర్తన, ఆదితాళము, ఫీలు రాగము.

దాహమాయె! నయ్యో! తాళగలమేయిక। దేహములుడస్సెనై,

దేహ నెట్లుగాం చెదము. ॥దాహ॥ నీరుఁజూపుపుణ్యు। లేరు లేరుగా నిట। దారిదోఁచదాయెను। నోరులెండి పోయెఁ గటా! ॥దాహ॥ భూమిఁమోక్ష గుండ। స్వామికార్యమునకు। బ్రేమవచ్చినారము । విఘ్నములుగలుగనే ల ॥ దాహ ॥

వ. అని నీరువట్టుచేత మేనులుసుడివడవచ్చుచు జని వింధ్యపర్వ తతీరమందొక బిలముంగని జలపక్షులు తిరుగుచున్నందున నుదకముం డుననియెంచి యంధకారమ్మగనుండు నాగుహాలోనికి ధైర్యంబునఁబో వఁబోవ నాచీఁకటివిరిసి ప్రకాశమైన యొకపురంబు గనుపడిన నంతఁ జొచ్చి చిత్రంబుగాఁ గనుచు.

క. ఈగుహాయం దీనగరం
   బేగతి రచియింపఁబడెను! యిదియెవ్వరిదో!
   భోగవతీనగరంబో!
   బాగుగనున్నయది దీని ♦ పనితన మహాహా!

వ. అని వర్ణింపుచు నాపురంబులోఁ దిరుగుచుండ నొక్కచో మిగుల రమణీయంబయిన సౌధంబు గనఁబడిన నచ్చెరువంది.

హాన-కీర్తన, రూపకతాళము, కమానురాగము.

అందమైన-యీమేడ । నిందుగట్టి, నట్టి, ఘనులెవరో!-యెందు జూడ మిట్టి। పనితనమును। ముందెవరుగ। బొందుగనన-చినము బలే!॥ యంద॥ ఇంపుకాంత। వేదులు। గుందనంపుగోడ, లకు నిలిపిన । నుంద రంపు-నిల్వుటద్దములకు। నందుగనగ। విందగు జూ, పులకుబలే! ॥యం॥ దీక్షతోఁ ది। క్కులుర। దివ్యమైన-మాను, వులకీడగు । మోక్షగుండ। రక్ష। ఘనకెరుకగు। నీక్షితి నిం। కెవ్వరికెరుకగును బలే! ॥యంద॥

వ. ఇట్లాశ్చర్యపడుచు నామేడలోఁబ్రవేశించి యందు దపంబు జేయుచున్న యొక్కకన్నియంగని మ్రొక్కి వారిలో హనుమంతుం డిట్లనియె.

హ-తొ. ఎవరమ్మా! నీ, విచ్చటనొంటిగ। నేలదపముఁజేసెదవు।

ప్రివిమలాంగి! యీ, భవనమెవ్వరిది, వివరింపుము సొంపొదవ్ర॥ రామ॥

వ. అనిన నాతపస్విని యిట్లనియె.

తో. మయుఁడనువాఁడీ, మందిరమును ని, ర్మాణము జేసియునిం డు। ప్రియమున హేమా, బిఖ్యాతరుణితో। వెలయుచునూడియుందుం చు॥ రా॥

వ. ఇట్లుండ దేవేంద్రుండువచ్చి వానింజంపి హేమనుగొనిపోయి యామెతండ్రియగు విశ్వకర్మకునిచ్చె వినుము.

క. హేమకుఁ జెలికత్తెను నే
నేమంబున దపమొనర్తు ♦ నిరతంబిచటన్
భూమండలిని స్వయంప్రభ
నామముగల దానవిదియె ♦ నా తెఱఁగరయన్.

వ. మీరెవ్వరిందేల వచ్చితిరి నావల్లగాఁదగిన ప్రయోజనంబే మనిన హనుమంతుండామె కిట్లనియె.

క. దశరథ తనయులుఁ బాండుర
యశులును నగు రామలక్ష్మ ♦ ణాఖ్యులడవికిన్
విశదంబుగ వచ్చిన చో
దశకంఠుడుఁ రాము తరుణి ♦ దాఁగొనిపోవన్.

వ. సుగ్రీవుండను వానరరాజుతో సఖ్యంబుఁ జేసిన నతండుఁ ద నబంటుల మగు మమ్ముసీతను వెదకుటకయి పంపిన వచ్చి దాహంబుగొ ని నీరుగానక యీబిలంబు లోనయిన నుదకంబు దొరకునేమో! యని వచ్చినాము. మాదాహంబుఁదీర్చి వెలువటికిఁ బోవు త్రోవఁజూపుము తల్లీ! సజ్జనకల్పవల్లీ!

గీ. అనినఫలములిచ్చి ♦ యాఁకలిదప్పులుఁ
బాయఁ జేసి కనులు ♦ మూయఁ జేసి
బిలము బయటఁ జేర్చి ♦ ప్రియమున రాముని
జూడబోయెనామె ♦ వేడుకలర.

వ. ఇట్లుచని రామునిసందర్శించి నమస్కరించి యిట్లనిప్రార్థింపుచున్నది.

స్వయం-కీర్తన, ఆదితాళము.

రామభూమిజామనఃకామా! సామజనుతనామా!॥రా॥రామ! జగదధి రామ! దనుజవి రామ! నుతసుత్రామ! నిరతము।నామనోబ్జ-సీమనీవు తారక। నామ-మేమారకదపము। వేమరుజేసితి॥ రామ ॥ హృన్నభంబున నిన్నుఁజిన్మయు। నెన్నఁగనుఁగొన। కున్నసద్గతి। సున్నయనుచు నెన్నుశ్రుతులనిబుధులు। లన్నవిన్నఁగన్నతండ్రి। నన్నికఁబ్రోవవే॥ రామ॥ మోక్షగుండా। ధ్యక్షసజ్జన । పక్షసురముని । రక్షణమునకు । రాక్షసులను శిక్ష జేయుటకునీ। వీక్షితి మానుషదేహ-మెత్తితివోజయ॥ రామ॥

వ. అనిన.

క. మానిని నీభక్తికి నే
మానసమున మెచ్చినాఁడ ♦ మఱియే! వరముల్
మానుగఁ గోరెదవో! యను
మానము లేకుండనడుగు ♦ మా! యవియిత్తుఁ.

వ. అనిన నామె యిట్లనుచున్నది.

స్వ-తోహార. దాసురాలిపై । దయగలిగికృతా, ర్థతజేయగమది నెంచి। నీసుదర్శనము, నేటికిచ్చితివి। నిశ్చలతపముఫలించి॥ రామ॥

స్వ-కీర్తన, కమాసురాగము-ఆదితాళము.

ఏవరంబులేలనో! దేవ! రాఘవ! యీవరంబుచాలు మోక్ష-మీవెరాఘవా! కేవలాత్మమయుఁడవైన, నీవుసీతవ్యునితో। దేవితోనత్రాంతమును। భావమందుఁదోఁచవే! ॥ఏవరంబు॥ ఈక్షితినీ మీాదజన్మ-మెత్త జాలగావునఁ। మోక్షగుండమందునీవ, మక్షమునఁజేర్చవే! ॥ఏవరంబు॥

గీ. అనుచుఁ బ్రార్థింప సంతోష ♦ మందిరాముఁ
డనియెయోగిని బదరికా ♦ వనమునకును
జేరినానామ జపమును ♦ జేయుచుండు
మంత్యమందైక్య మగుదు ♦ నాయందు నిజము.

వ. అని సెలవు కటాక్షించి నంతఁదత్క్షణంబున నామె బదరికా

వనంబునకరిగి యచట రామనామస్మరణంబుచేయుచుఁ గొంతకాలంబుం డి ప్రారబ్ధ విమోచన సమయంబున శరీరంబు దొరఁగి స్వయంప్రభ రామునియం దైక్యంబయ్యె. నిక్కడ నంగదుఁడు దక్కిన మర్కటులతోఁ ననుచున్నాడు.

అంగ-కీర్తన, వసంత రాగము-అట తాళము.

ఎందుబోవుదుము। సీతనుగన॥ నెందు॥ ఎందుబోయిన గార్య। మేమిలేదు మన, మందరమిచట మృతి। బొందినమేలగు॥ నెందు॥ అటుగాక నూరక। నటుబోనగాను మ, ర్కటరాజుశిక్షించు। గటగటా! యికమీద॥ నెందు॥ గురుతరముగ మోకుగుండనివానుని। కరుణలేకగట్ట। కాలము వచ్చెను॥ ఎందు॥

వ. అనినఁ గొందఱు వానరు లిట్లనిరి.

క. సీత కనుపించలేదని
పోతిమయే నతఁడుచంపుఁ ♦ బోవఁగ నేలా!
యాతరుణి యున్న బిలమున
ఖ్యాతిగ నివసింతమదియు ♦ నతిగోప్యముగన్.

వ. స్వయంప్రభయుండిన యీబిలంబులోఁ బ్రవేశింప హరిపారాదులకైన నగోచరంబు గాన నందుదాఁగియుందుదము. రండని యత్నింపుచున్న వనచరుల కాంజనేయుం డిట్లనియె.

తో. రాముండనగా। సామాన్యుండని। మీమనముల నెంచితిరో! కామజనకుడగు। గమలజజానకి। భూమినయోధ్యాపురిలో॥రా॥ అవతరించినా-రమరులఁబ్రోవను। నసురుల ద్రుంపనుమనము। భువిదదాజ్ఞచే। బుట్టితిమమరుల, పూర్ణాంశంబులనిజము॥ రామ॥

వ. ఆయనకుఁ దోడుపడఁ బుట్టిన మనమిట్లు దాఁగవచ్చునా! అమ్మహానియ్యని ప్రభావంబెఱుంగరా! మనకు వాలిమరణంబే! సాక్షి.

హ-కీర్తన, ఆదితాళము.

రాము నివీరున, రాక్రమ మెఱుంగక। యీమాడ్కి బలుకుట మేలా!

యామేటికి-భూమండలి! దేమాత్రమంటక-మేమున్నది॥ రాముని॥ కొండ బిలములోను! నుండుటకాదుబ్రీ, హ్మాండములోనెం, దుండినను। దండ గనా, తంతుగన, కుంతునా! శ్రీమోతుకుండేశుడా॥ రాముని॥

వ. ఆమహానియ్యుని కార్యంబు నెఱవేర్చకున్న మనకు నరకంబు దప్పదు, స్వామికార్యంబునందు మెలంగుచు దుర్ఘటమయినచో మర ణించిన వైకుంఠపదవికలదు. ప్రాణములేల! దాచవలె రండని ధైర్యవ చనంబులాడిన నందఱులేచి క్రమముగా సీతపోబడి విచారించుకొనుచుఁ గొన్నిదినంబులకు దక్షిణ సముద్రతీరంబుననున్న మహేంద్రాద్రికి జేరి సముద్రంబును దిలకించి.

వాన-కీర్తన, హిందుస్తాని, భైరవి-అటతాళము.

ఇదిదాటుటకు నిం! దెవ్వరితరమగు! నేమితోచకయున్నది! యంతు లేదు॥ ముదమునమనమీా యు, దధిదాటగాదా! చే, రుదుము లంకకు గనుడీ! యంతులేదు॥ఇది॥ ఏమో! సులభముగ! నెంచిభానుజుండంప! నే తెంచితిమిచటికి! శ్రీమోతుకుండేశు-భామిని సాధింప। లేము సాగరమర సిన! నంతులేదు॥ యిది॥

వ. ఇట్లాలోచించి యధైర్యంబునొంది నిర్విణ్ణులయియున్న వన చరులకు హనుమంతుం డిట్లనియె.

క. నెలదాఁటిన సుగ్రీవుఁడు
నెలకొని శిక్షించుమనము ♦ నెలలోపలనే!
జలజాక్షి దొరకలేదని
మలయుచుఁజని చెప్పనతఁడు ♦ మన్నించుజూఁడీ!

వ. అనిన నంగదుం డిట్లనియె.

గీ. తగినవారలనెల్లను ♦ దక్షిణమున
కంపియున్నాఁడు చేతగా ♦ దనుచు మనముఁ
బోయిచెప్పిన నప్పుడే! ♦ పొలియఁజూచుఁ
గాన మన్నింపఁబోడు ని ♦ క్కంబు వినుము.

వ. రాముని కార్యంబు నెరవేతునని పలికియున్నాఁడు. గాన మనమీఁదఁ గనికరము కలుగదు. వానియొక్క మనోధర్మంబుఁ జెప్పెద వినుము.

తో. తనయన్ననుజం, పినరామునకును। దాసహాయపడునటుల। పనిచని రాజ్యము, దాంధత్వంబున। నదియుమఱువడే! యవల॥ రామ॥

వ. లక్ష్మణుండు యుద్ధంబునకు వచ్చినప్పుడుగదా! లేచివచ్చినాడు. ఎంతకృతఘ్నుఁడో! చూడుము మారుతీ!

అంగ-తో. వాలినిజంపియు-వాని రాజ్యమును-వనితనుగూడనుకొనియు। నేలుచునున్నా-డిట్టిదురాత్మున-కేమికరుణ రావలయు॥ రా॥

వ. కాఁబట్టి నానిశ్చయము మీరందఱు వినుఁడు,

అంగ-కీర్తన, ఆదితాళము-బేహగ్.

నేరాను। నేరాను। పొండిక। మీరు॥ నేరాను॥ నారీమణిజాడగన నేరకయూరకనటకు॥ నేరాను॥ పోయివానిచేత శిక్షబొందు దానికంటెనిచట। బ్రాయోపవేశముచేతఁ। బ్రాణముఁబాసిన మేలు। శ్రీయుతముగ మోక్షగుండ। నాయకునిపాదమాన॥ నేరాను॥

వ. అప్పుడు యువరాజు మనోనిశ్చయంబున కందఱు మంచిదని యొక్కచోఁ దర్భశయనంబు లేర్పఱచుకొని వానియందుఁ జేరి ప్రాయోపవిష్టులుగాఁ దలంచి యున్నంత మహేంద్రగిరి గుహలో నుంచి ఱెక్కలులేని యొక్కగ్రద్ద వికృతాకారంబుగా వెడలివచ్చి వారినిఁజూచి.

సంపా-తో. నా కెరదొరికె యీ, నాటికినికగొ, న్నాళ్ళకుభీతియె లేదు। చేకొని నేభ, క్షించెదనసియుది। పైకిరాగనామీద॥ రా॥

వ. వానరులు భీతచిత్తులగుచు.

వా-ద్వి. అక్కటాదీనికి-నాహారముగను। జిక్కుఁడటంచువ్రా-సెనో! బ్రహ్మమనకు। లేకున్ననిట్టిబ, లిష్టపుగ్రద్ద। నేకాలమందైన-నెరిగియున్నామె। మరణంబుఁగో రెడు-మనకో ర్కెఁదీర్ప। వరఖగంబై మిత్తివచ్చె

నేమోను ! అద్దిరే! బలవంతు, లనుపేరుగాంచి । గ్రద్దకులోఁబడఁ-గానా యెదురకుఁ। గాకుత్స్థకులమును-గడపటమనలఁ । గై కవరంబిల్లు-కాల్చుచు న్నయది । యనియిట్లువగచెడు-నా వానరులకు । వనిమె ధైర్యమునొంది-యంగదుండపుడు.

అంగ-కీర్తన, ఆదితాళము-శంకరాభరణరాగము.

ఇక వగపుజెందఁగవలదు। కపులార! యిక॥ వగ॥ తగజావునకు। బ్రియ, త్నమువలదనియా। భగవంతుఁడె! దీనిఁబంపెమేలాయెనిక॥వగ॥ రామకార్యార్థమై। రావణుతోఁ(బోరి, భూమిఁజటాయువు। బొలియ లేదే! యిక॥ వగపు॥ వినుఁడు మోక్షగుండ। విభునికార్యములో।మనము నుజచ్చిన మంచిదిగాదే! యిక॥ వగ॥

వ. ఇట్లు ప్రస్తావముగా జటాయువును బ్రశంసించిన నాలించి యాగృధ్రపతి వనచరులఁ డగ్గరి యిట్లనియె.

సీ. ఆజటాయువుతమ్ముఁ ♦ డగునాకు నాతని
నెల్లెరుంగుదురు మీ ♦ రెవ్వరయ్య!
బహుకాలమునకు మ ♦ (ద్భాతృవార్తనువింటి
ఘనసుదినంబు ని ♦ క్కంబునేఁడు
హితులార తన్మృతి ♦ హేతువుఁజెప్ప డఁగఁ
జెప్పఁదొడంగె ♦ నంగదుండు
విహగేంద్రదశరథ ♦ విభునిసూనులురామ
లక్ష్మణులనువారు ♦ లలనతోడ

గీ. దండకాటవులరాఁగ ♦ దశముఖుండు
వారెవంచించి కొనిపోయె ♦ వనితనంత
దారిలోన జటాయువు ♦ దాకిపోరి
డస్సిరావణుచేత న ♦ డంగెనతఁడు.

వ. తర్వాత నవ్వార్తయెఱింగి రాముండువచ్చి యతనిదహనం బుఁ జేసిన నతఁడు కృతార్థుండయ్యె. నంతమీఁద రాముండు సుగ్రీ

వునితో సఖ్యంబుఁజేసి వాలినిజంపి కపిరాజ్యంబు సుగ్రీవునకిచ్చిన నతం డు రామునిభార్యయగు సీతాదేవిజాడఁ దీయుటకు వానరులమయిన మమ్ముఁ బంపిన వచ్చితిమి.

తొ. ఎక్కడజూచిన-వింతిజాడమూ-కెఱుకపడదు గావునను । జ క్కఁగలంకకు-జనవలెననిమే, మిక్కడఁజేరియుండగను॥ రా ॥

వ. లంక యెక్కడనున్నదియు నెఱుఁగక సముద్రంబు దాఁటు నదుపాయంబు దొరకక తిరిగిపోయి యధిపతిచే శిక్షింపఁబడుటకంటె! నిక్కడనే! ప్రాయోపవిష్టులము కాఁబోవుచున్నాము. దయానిధీ!మీరెఱి గియుండిన సీతపోబడి సెలవియ్యవలయునన జటాయు మరణవార్తవిని సంపాతినెమ్మనంబున.

సం- కీర్తన, ఆదితాళము, హిం॥ కాపి.

సోదర! నిన్నిక।మీదఁజూడరా। యకటా! ॥సోదరా॥ పోదుగాబ్ర హ్మవాత్రి। పూర్వమందుమనమే।కోదరులముకూడి। యుండిబాసితిమిహా!॥ సోదర॥ అక్కట। స్వయంకృత।మైనకర్మముచేత। ఇక్కలుగమిలినే। నిక్క డజిక్కితిహా! ॥సోద॥ అహరహామును న్నిన్నను కొనుచుంటిని। మహానీ య్యులచే। మరణవార్త వింటి॥సోద॥ రాక్షసవిభునిచే। రణమునఁ దెగితివి। మోక్షగుండపతి। ముఖ్యపదముగలిగె॥సోదర॥

వ. ఇట్లుకొంతవరకు దుఃఖించి పిమ్మట ధైర్యంబు దెచ్చుకొని వానరులతో నిట్లనియె.

సం-తొ. అన్నదమ్ములము-అరుణనందనుల,మూజటాయువునునే ను। నన్నునీటిచెం-తకు గొనిపోయినస్నానముగావించెదను॥రా॥

వ. అనంతరము మీరుకోరిన సంగతులకు బ్రత్యుత్తరముఁజెప్పె దననవుడు మంచిదని వారందఱతనిమోచుకొనిపోయి సముద్రములోని కిఁ జేర్చిన స్నానంబుజేసి జటాయువునకు జలంబువిడచి తీరంబుఁజేరి.

గీ. నూఱుయోజనముల ♦ దూరంబువార్ధిలోఁ

బోవ లంకగలదు ♦ రావణుండు

జనకసుత నశోక ♦ వనమందు నుంచియు

న్నాఁడు దూరదృష్టి ♦ నాకుఁగలదు.

తొ॥- కాన నంతయును- గనబడుచున్నది- నేను బోవఁగాఁగలను। మానుగ రావణు- మర్దించియునే- మానినిఁగొనిరాఁగలను॥ రా॥

వ. నాకుఱెక్కలులేనందునఁ గొంచముఁ జిక్కినాఁడ. మీరీయుదధిదాఁటి సీతనువీక్షించి వచ్చుటకు సమర్థులే! కాని వ్యర్థులుగారు. పోయిరందు రామునిచే రావణుండు దునియఁగలఁడు. వానరులారా!యనిన నంగదుండిట్లనియె.

క. చక్కఁగఁ బక్షులకెల్లను

ఱెక్కలె యుండంగవలయు ♦ ఱెక్కలు లేకన్

జిక్కువడినట్టి కారణ

మక్కజముగఁ దెలుపవలయు ♦ నని యడుగుటయున్.

సం- కీర్తన, కళ్యాణిరాగము, అటతాళము.

నాపూర్వవృత్తాంత- మూపట్లదెలిపెద- నాపేరుసంపాతి। నగచరవర్యా! యేపుచేనాతమ్ముఁడును నేను। పౌరుషముచేఁబై కెగసి వినువీధికిఁబారగను। పోను,పోను, రవి, దాపుగలుగుటచేత ఱెక్కలు। దగ్ధమై వింధ్యాద్రిఁబడితి॥నాపూర్వ॥ మోక్షగుండేశుని। సాక్షిగనేమూర్ఛ।మునిగితెలివొందితి, మూఁడునాళ్ళకును। బక్షములులేనందువలనను। నెగురంగజాలక నీక్షితిని దొర్లాడుకొనుచును వోయి,వోయి కడు,దీక్షతో, జంద్రముఁడు నామునిఁ। దివ్యమగు నాశ్రమముఁజేరితి॥నాపూర్వ॥

వ. అప్పుడమ్ముని వల్లభుండు నన్నుఁజూచి యిట్లనియె.

తొ॥. ఎందుకునీకీ। వికృతాకారం। బేర్పడెనో! సంపాతి! కిందట నిన్నెరిఁగిన కతమున నడిగితిదెలుపరుణునిమాతి॥ రామ॥

వ. అనియడిగిన నమ్మునికి నాస్వయంకృతాపరాధం బంతయుఁ దెలిపి దుఃఖింపుచు నిట్లంటి.

తొ॥- అనఘా! యీవికృ,తాకారముతో। మనియుండగ నేఁజాల।

మునివర యికనీ। తనువును గాలచి। ననుగడ తేర్చు మీవేళా॥ రామ॥

వ. అని శోకింపుచున్న దయామయుండయిన యమ్మునివరుం డి ట్లనుచున్నాఁడు.

చంద్రి, కీర్తన, బేహాగ్ రాగము, రూపక తాళము.

ఏలజాలినొందెదవు- కాలగతికి మాయము। చాలదుఃఖమునకు మే ను, మూలమును దాళుము॥ యేల॥ కర్మము దేహంబునకు-గారణము నీ మెఱుగుము। కర్మకహంకారమును। గారణము తెలియుము॥ యేల॥ ఆయహం కారంబవిద్య। యందు వేగగలిగెను। బాయకందు మోకుగుండ-ప్రభుపు చాయనిలిచెను॥ యేల॥

గీ. ఇట్లు తోఁచినట్టి ♦ యీశ్వరచ్ఛాయను
జీవుఁడనుచు బుధులు ♦ సెప్పుచుంద్రు
దినదినంబతండు ♦ దేహాత్మబుద్ధిచే
సకలకర్మములను ♦ సలుపుచుండు.

వ. తనమూలంబు గుర్తెఱుంగక విషయాసక్తుండయి పుణ్యపా పకర్మంబుల నంతంబుగా నాచరించి, యూర్ధ్వాధోలోకంబులకు నెడతె గకదిరుగుచు, నందువల్లఁ బ్రాప్తించు, సుఖదుఃఖంబులకు బద్ధుండయి యనుభవింపుచుండు నెట్లనిన.

క. క్రతువులు మొదలగుసత్క్రియ
లతిభక్తిని నాచరించి ♦ యంతంబున స
ద్గతి కరిగియచట సౌఖ్యము
లతులితముగఁ బొందిపుణ్య ♦ మడఁగినమీఁదన్.

తో. ఇంద్రమండలము-నందు జేరిహిమ-బిందుప్రోజతగలిసి।క్రిం దనుబడియీ। క్షితివ్రీహ్యాదుల। యందుజొచ్చికను వెలసి॥ రామ॥

చం- కీర్తన, ఆదితాళము.

అరుణసుతాతరువాతన్। ఇదియన్నముగా మారున్। బురుషుని గర్భముజేరున్। వరరేతంబై యలరున్। సుతులన్-బతులన్-సురతంబు

నందుగూడగాజారుచు॥అరు॥ ఋతురక్తములోఁగలియచు। హితవుగనొక దినమునకుచు। క్షితిగలలమువలెఁబొలుచుచు। ధృతిబంచాహ్నంబులకుచు దిరుగచు।సరగచు। మితమయిన బుద్బుదాకృతిని నిలుచు॥ అరుణ॥ పదునైదవదినమునకుచు। మృదుమాంసపుబిండమగుచు। ముదమునననె యల రారుచు। మోక్షపురీశునికరుణచు। దలపచు।బిరసచు। బదివాళ్ళకంకురంబు బ్రిభవించుచు॥అరుణ॥

సీ. మెడయును దలయును ♦ మెడవంపులును వెన్ను
నుదరంబుఁగలుగును ♦ నొక్క నెలకుఁ
బాణిపాదంబులు ♦ పార్శ్వముల్ కటిజాను
వులు మాసయుగమున ♦ కెలమిఁబొడము
మూడవనెలయందు ♦ మొలచును దనుసంధు
లలరునాల్గవ నెల ♦ యందువేళ్ళు
ముక్కువీనులు నేత్ర ♦ ములుగల్గు నైదవ
నెలను జీవుండంను ♦ నిలిచియుంను

గీ. దంతపఙ్క్తి నఖంబులుఁ ♦ దగజనించు
నాభిగుదగుహ్యములకు రం ♦ ధ్రంబులాఱు
నెలలకేర్పడుఁ దలవెంత్రు ♦ కలును రోమ
ములును నేడవనెలయందు ♦ మొలుచునవల.

వ. ఎనిమిదవమాసంబునకు సర్వావయవంబులు సంపూర్ణంబగును. పిమ్మట మాతృభుక్తాన్నసారంబు నాభిసూత్రాల్ప రంధ్రంబునఁ బరిగ్రహించి యభివృద్ధినొందుచు గర్భస్థజీవుండు జఠరానలతప్తుండయి స్వకృతకర్మంబును గుఱించి యిట్లని చింతింపుచుండు.

జీవుని-కీర్తన, ఆదితాళము, కమానురాగము.

కడ, తేరేదెన్నడో! దరి, జేరేదెన్నడో ॥కడ॥ ఘోరమయిన యీ కూపములోపల। జేరితివెడలగ। దారిదొరికికడ ॥తేరే॥ స్వకృతకర్మమున సకలయోనులం। దకటా! పుట్టుచు। నడుగుచుంటెగడ ॥తేరే॥ న్యాయము

దప్పి ధ,నంబుగూర్చినిజ- జాయాసుతులకొ,సంగుచుంటి గడ॥తేరే॥ అస్థి రమగుదే- హాదిప్రపంచము। సుస్థిరముగగని। చొక్కుచుంటి ॥గడతేరే॥ మోక్షగుండపతి-ముఖ్యచింతనా। పేక్షవదలినే-పెరిలుచుంటి॥గడతేరే॥

తొ. కావున నేనీ గర్భనరకమున గదువడిబడియున్నాను। దొరవ దొరికియుం। దుండి వెడలితే। నావెనుకను మఱువకను॥రామ॥

సర్వేశునిసం, స్మరణజేయుచును। సంసారంబుధిబడక। నిర్వాణం బున। కుర్వడిజనినే, నిలిచియుందునిక జెడక॥రామ॥

వ. అని చింతింపుచుండ నంతలో నవమాసంబులునిండి ప్రసవ సమయంబుఁ దటస్థించిన.

గీ. భువిని దుర్గంధయుతమైన ♦ పుంటినుండి
క్రింద నరగునఁ బడునట్టి ♦ క్రిమివిధమున
యోనియంత్ర ప్రపీతుఁ ♦ డయిన దేహి
మావితోఁ గూడి గ్రక్కున ♦ మహినిబడును.

వ. ఇట్లుదయించి మాయగప్పటచేఁ బూర్వజ్ఞానంబు మరచి బా ల్యాదిదుఃఖంబులు సర్వంబు గుడుచుచు దేహామే! నేనను భ్రమచేజిక్కి వ్యర్థంబుగాఁ గాలంబుఁ బుచ్చుచుఁ, బలుమాఱుఁబుట్టి చచ్చుచు; గ ర్భనరకాద్యవస్థలు సారెసారె కనుభవించుచు,నుండు, నిట్టిదుఃఖభాజనం బగు దేహంబు రాకుండఁ జేసికొనవలయునది యెట్లులనిన.

చం-కీర్తన, ఆదితాళము. శహానరాగము. పురమునలం-అనునట్లు,

పుట్టుక లేనట్టివిధం। బిట్టిదియెఱుగదగున్। నే,నీ,పట్టునఁ దెలిపెద॥ పు॥ ఇట్టిదట్టిదింతంతనియనరా। నట్టిదానిబూ,ర్ణముగను గాంచుటె॥పు॥ శ్రీగురుని। వేగగని। సాగిలిమొ్రక్కిలిడి। యోగమతత్వర-హస్యార్థము విని। యోగమోగ భో,గాదులయందు వి।రాగచిత్తుడై యాత్మను దెలిసి న॥బు॥ క్షీరంబున్-క్షీరమునన్- నీరమునీరమునన్। జేరుపనొకటిగ-జెలగి నవిధమున। వేరుగాక శ్రీమోక్షగుండ రఘు। వీరునితో దావెలయగలి యుటే॥ పుట్టుక॥

వ. ఈవిషయంబిట్లుండనిమ్ము ముందు జరుగఁబోవు కార్యంబు వివరించెద.

క. వగవఁబనిలేదు త్రేతా
యుగమున హరి రాముఁడై య ♦ యోధ్యను బుట్టన్
దగనతఁ డడవులకును రాఁ
బగఁగొని రావణుఁడు వాని ♦ పత్నిని గొనిపోన్.

గీ. అంతసుగ్రీవుతోఁ జేరి ♦ యతనిభటులఁ
గపులఁబంపించు వెదుకనో ♦ ఖగవరేణ్య!
తెరువువారికిఁ జూపించి ♦ తేనినీకుఁ
బక్షములువచ్చు నిజమని ♦ పల్కుటయును.

వ. అమ్మహానుభావునకి మ్రొక్కి మెల్లఁగా నిమ్మహేంద్రగిరి గహ్వరంబుఁజేరి బహుకాలమునుండి వాసముఁజేయుచు సంపాతిప్రభోజ నుండనై మీరాకఁగోరుచున్నాఁడ నిందుకు దృష్టాంతముగ.

తో. ఇవిగోనాకును- నెఱకలువచ్చెను। నికనేనెగిరెదననుచు। దివికినినెగిరియు। దివ్యవాక్యములు। దెలిపెను హరివిగనుచు॥రామ॥

సంపాతి-కీర్తన, ఆదితాళము.

వినుఁడికవానర-విభులారా! వినిపించెదనో ఘనులారా! ఘనముగ వారిధి- గడిచిలంకకును। జనిరాలేమని- సంశయపడకుఁడు॥విను॥ శ్రీమహిళాపతి- నామమునిరతము। భామరులైనను-బఠియింప, క్షేమంబుగ సంసృతిసాగరమును! దాముధరించి కృతార్థులగుదురిల॥విను॥ మోక్షగుండపతి-ముఖ్యభక్తులై। యీక్షితిలో జరియించెడు మీ, కక్షయబలులకు నంబుధిదాటుట- లక్ష్యమెయువలీలగ-దాటెదరు॥విను॥

వ- అనితెలిపి సంపాతియుథేచ్ఛంజనియె నంతవానరు లధైర్యంబులువదలి శతయోజన విస్తీర్ణమయిన సముద్రముదాఁటి లంకకుఁబోవుటకు నిశ్చయించి యక్కడఁగూర్చున్నంత నంగదుండు వానరులంగని యిట్లనియె.

తో- ఎంతదూరమును-నెవరెగుదురో! యెఱిగింపుడు నాతోడ। వింతగమీజవ-విధమును వినినే-సంతోషింతునుజూడ॥ రామ॥

వ. అనవిని గజ, గవాక్ష, గవయ, శరభ, గంధమాదన, మైంద, ద్వివిద, తారులు గ్రమంబుగఁ బది, యిరువది, ముప్పది, నలువది, ఏబది, యరువది, డెబ్బది, యెనుబదియామడల దూరముఁబోఁగలమని తమసత్వంబులు నిజముగాఁ బలికిరి అంత జాంబవంతుండు.

జా-కీర్తన, రూపకతాళము-హిం, కాపి.

అంగద! వినుమా! పొంగుచునాబలముగనుమ! ॥యంగ॥చెంగున సప్తాంబుధులెగు, రంగలఁబూర్వంబుననే॥ నంగ॥ తిరిగితినిట్లు దివిక్రము దేవునిచుట్టు॥ దిరిగితి। యిరువదియొకమారుగిరులు-విరిగినొచ్చె జరణంబులు॥ అంగ॥ అదిమొదలుగను। నలసితిముదుసలినేను। నది। అయినను నిప్పటికిదొంబ। దామడదాటంగగలను॥ నంగద॥ ధారుణిలోన। నారాయణకవిమనమున॥ ధారుణి॥ గూరిమివిహరించు మోక్ష, గుండవిభుని పాదమాన॥ యంగ॥

వ. అంతనలుండు తొంబదియేడామటదాట జవంబు దనకు గలదని పలికె నప్పుడంగదుండు,

క. శతయోజనమెగురుసమ
ర్థతనాకునుగలదు మరల ♦ రాలేనేమో!
యతిసంశయంబు గలిగెడు
గతియేమని పలుకభల్లు ♦ క ప్రభువనియెన్.

క. నీవుయువరాజవగుదువు
కావున సుగ్రీవుసమము ♦ గాదే! మాకున్
సేవకులము మేముండఁగ
నీవేగఁగవలెనె! వలదు ♦ నిక్కముసుపత్నా!

వ. అనియిట్లువారు మథనచేయుచుండిన నేమియు-జెప్పక యూరకగూరుచుండిన యాంజనేయునిడగ్గరి జాంబవంతుం డిట్లనియె.

జాం-కీర్తన, ఆదితాళము, బేహాగ్.

పవ, మానసనందనుడవు। నీవు। నన, మానబలుడవన। దగినావు। అను, మాన నేటికి లేచిరావు। మాన, మూన-నౌనా- లేలెన్ము॥పవమాన॥ చిన్న-నాడేఫలమని భ్రమచెంది। కలువ, నూడునుమ్రింగబోంతు కంది। నిలువ, నోడీయిలపైనబడిరుంది। చూడ, జూడ, వాడీ, జెడవు ॥ పవ మాన॥ నీ, వంతు శ్రీమోటుగుండకాంతు । కార్య, మంత, దీర్ఘగనని వచింతు । హను, మంత నీచెంత మాకుప్పిగంతు । లెంత-వింత, సంత, సమున ॥బవమాన॥

వ. అనినను ప్పొంగి బలివిధ్వంసనకాలంబున వామనమూర్తి వి జృంభించినట్లు పర్వతాకారుండయి మహాట్టహాసంబున బ్రహ్మాండంబు భేదిల్ల సింహనాదంబుఁ జేసి హనుమంతుండు శ్రీరామకార్యధురంధ రుఁడై యిట్లనియె.

హను- పంచచామరము.

హాళాహాళిన్ ధరాత్మజాత ♦ నట్టెచూచి రావణున్
గళత్రపుత్రబాంధవాది ♦ గా వధింతు లేనిచో
గళంబులందుఁ దాళ్ళుగట్టి ♦ గట్టిగానునీడ్చుచున్
జెలంగి లంకతోడ వానిఁ ♦ జేర్తు రాము ముందటన్.

తో. ఈలవణాంబుధి-గాలువబోలియు- నేలంఘించెదజూడు। మా లంకాపురి-నాద్యంతంబును-గాలిచి వేసెదనేడు ॥రామ॥

పంచ. సురాసురుల్ సమైత్రితోడఁ ♦ జొచ్చి యుద్ధిచేసినన్
హరాజముఖ్యులెల్లవచ్చి ♦ యాజ్ఞచేయఁబూనినన్
జరాచర ప్రపంచమొక్క ♦ సారివచ్చి తాఁకినన్
ధరిత్రిపుత్రిఁజూడకే వ ♦ ధాగరాను గ్రిమ్మరన్.

వ. అనిన మహానందంబున జాంబవంతుం డనుచున్నాఁడు.

క. నీవంత చేయువాఁడవు

గావా! నీకడ్డమేమి ♦ గలదు ధరిత్రిన్

వేవేగమె భూపుత్రిని
భావించియుఁ గాంచిరమ్మ ♦ పవనతనూజా!

వ. అనంతరము శ్రీరామచంద్ర మహాప్రభువే! సమస్త కార్యం బులు దీర్పఁగలరు. నీకు శుభంబు గలుఁగుఁగాక. పొమ్మిరమ్మని జాంబ వంతాదులు దీవింపఁగైకొని లంకాపుర ప్రయాణోన్ముఖుఁడై.

క. అంతట హనుమంతుఁడుఁ గడు
సంతోషముతో మహేంద్ర ♦ శైలాగ్రముపై
కెంతయు నెక్కియు నప్పుడు
వింతగ దాఁటంగఁ దలఁచె ♦ విపులాంభోధిన్.

ఆశ్వాసాంతోహార.

అని తాళ్ళూరినా-రాయణకవి రా-మాయణమును హరికథను। ఘనముగఁ జెప్పెను, గద గిష్కింధా। కాండము జిలుకును సుధను ॥రా॥ ఇదివినువారల-కిహసౌఖ్యంబులు-గొదవలేక చేకురును। ముదమున దు దకును-ముక్తి లభించును-మోక్షగుండ హరికృపను ॥రామ॥

క. నాచేతనైన కొలఁదిని
జూచిరచించితినిదీని ♦ సుజనులు నెఱసుల్
దోఁచినయెడ దిద్దుమురని
నాచిత్తములోననమ్మి ♦ నా నసయంబున్.

మోక్షగుండరామాయణమునందలి

కిష్కింధాకాండము

సంపూర్ణము.



శ్రీరస్తు.

# మోచర్లగుండరామాయణము-హరికథ.

## సుందరకాండము.

క. శ్రీరాముని కార్యార్థము
మారుతిచనునపుడు తనకు ♦ మంగళమగున
ట్లారూఢిఁ దలఁచిమంగళ
హారతులను బాడెవేడ్క ♦ నారామునకున్.

హాను-మంగళహారతి, కమాస్, రూపకము.

స్వామి! సీతా, రామ! మంగళం। నిటలాక్షవినుత। నామ! దివ్యధామ! మంగళం। నేమంబున-నీనామము। గామించితి। నామనమున ॥స్వామి॥ భూతకోశాతీత! మంగళం। శ్రీమోచర్లగుండ। నేత! భక్తోపేత! మంగళం ఖ్యాతిగనారాయణకవి। చేతోయుత! జ్యోతిర్మయ! ॥స్వామి॥

వ. ఇట్లు మంగళంబులు పాడి తన తండ్రికి నమస్కరించి రాముని చరణారవిందంబులు దన హృదయారవిందంబున నిలుపుకొని వానరులంగని యిట్లనియె.

ఉ. వానరులార! రాఘవుని ♦ బాణమటంకము లేకపోవు న
ట్లేను వియత్పథంబున యు ♦ ధేచ్ఛసముద్రము దాఁటిపోయి యా
జానకిఁగాంచి క్రమ్మఱను ♦ స్వామిని జేరఁగవత్తు మీరలున్
బూనికతోడఁ జూడుడిఁకఁ ♦ బోయెద నేను గృతార్థుఁడనై జుమీ.

ఉ. ఏమహనీయుఁ పేరు స్మరి ♦ యింపుచుఁ బ్రాణముఁబాసినన్నరుం
డామహనీయుఁ జేరును భ ♦ వాబ్ధిదాఁటి తదీయదూతనై

ధీమతినాతఁడంపఁ జను ♦ దెంచితిఁ దత్తరుణీఁ గనంగనా
కీమితవార్ధి దాటుఁ పని ♦ యెంతది నేనవలీల దాఁటెదన్.

వ. అని పలికి తత్క్షణంబున హనుమంతుండు.

చ. అడుగులు నద్రిపై నిలిపి ♦ యంగముఁ గుఱ్ఱంగఁగఁ జేసి కన్బొమల్
గడునడి నెత్తి నిక్కి నటు ♦ గణస్ యుగంబును లేపి వార్ధిన
య్యెడఁ గలయంగఁ జూచి మెడ♦యెత్తియుఁ దోఁకఁగదల్చి నెమ్మదిన్
వడిబెడనీక మారుతి జ ♦ వంబున దాఁటె సముద్రమత్తఱిన్.

వ. ఇట్లు వియన్మార్గంబున వాయువేగంబున సముద్రంబు దాఁటఁ జనుచుండ దేవతలందఱు.

గీ. ఆంజనేయుని ధైర్యంబు ♦ నరయఁగోరి
యురగులకుఁ దల్లియైనట్టి ♦ సురసఁ గాంచి
పవనజున కడ్డపడి వాని ♦ బలముఁ దెలిసి
రమ్మనీవన్న వికృత దే ♦ హమ్ముతోడ.

తో. అడ్డముగాజని-యహాహా! నేనిపు, డాకలిగొనియున్నాను। గుఱ్ఱరీతిగా। గుటుకున మ్రింగుదు। గోరచిన్న నేచనను ॥రా॥

హను-కీర్తన, హిందు, తోడి, రూపక.

అమ్మ! నేను-రాముని కా-ర్యమునకును-బోవుచుంటి । గ్రమ్మరనీ తమ్మనరసి। నమ్మకముగను నేతెంతు ॥నమ్మ॥ ధారుణి శ్రీమోక్షుగుండ। ధామునకీవార్త దెలిపి। జేరవచ్చి నీకునేనా, హారముగుదుదరలాక్షి!॥య॥

వ. అనివేఁడికొనిన సురసవినక.

సురస, కీర్తన, కమాసురాగము, ఆది.

సీ, మాటవినను। మో, మాటమేలను। మాటికినీవి। బూటకములు నా, తోటిపలికెదవు। పాటిగాదు ॥సీమాట॥ సామాన్యులవలె-జపుకగజూచితి। వేమో! చిక్కితి-వికనువిడువ ॥సీమాట॥ ఆకలిగొంటిని। నారగించెదను। గాక వచ్చునం, దాక నిలువ ॥సీమాట॥ మోక్షుగుండపతి। సాక్షిగ వినుని। నిక్షణమునునే, భక్షించెద ॥సీమాట॥

వ. అని ఖండితంబుగఁ బలికిన.

సీ. వనితరో నేను బో ♦ వలెఁగాన నీనోరు
దెరువుము దూరి నే ♦ సరగఁబోదు
వనిశరీరంబొక్క ♦ యామడ పెంచిన
నైదామడలువిప్పె ♦ నదియునోరు
పదియామడలు పెంచెఁ ♦ బవనుజుఁడంగంబు
నిరువది యామడల్ ♦ దెఱచెనదియు
ముప్పదిరెట్లుగా ♦ మొనయ నాతఁడు పెంప
నేబదియామడ ♦ లింతిదెఱచె

గీ. నంతనంగుష్ఠమాత్రుఁడై ♦ యందుఁదూరి
వెలువలికి వచ్చినిలచిన ♦ వెలదిమెచ్చి
నినుఁబరీక్షింప ♦ దేవతలనుపవచ్చి
నాను నాపేరు సురస వి ♦ నంగవలయు.

తో॰. రాముని దేవిని-రయముననగనుగొని-రాగలవిక ద్వరగాను । నోమారుతి! నే, బోయెదనని యా, భామిని వేగమెచనెను ॥రామ॥

వ. అంత హనుమంతుండరుగుచున్నఁగని సముద్రుంను మైనాకునితో నిట్లనియె.

సము-కీర్తన, ఆదితాళము, ఝంఝూటి.

మారుతి లంకాపురమునకు । జేరబోవుచు నుండెనున్। సారెకు నీవేగి కడువి, శాంతిఁజేయుము లెమ్మికఁ ॥మారుతి॥ సాగరము చేవృద్ధి వొందిరి। సగరు లెల్లను గ్రిందటన్। బాగుగదత్కులజుఁడగురఘు। వరుని కార్యముఁజేయఁగ ॥మారుతి॥ మోంకుగుండపురీసుకరుణా, వీక్షణంబున జేరువ। ఈక్షణంబుననీవుజేయుము । దీక్షతో సత్కారము ॥మారుతి॥

వ. అనియిట్లుసముద్రుంను సెప్పిన మైనాకుండు నరాకృతితోఁ బయికిఁ బెరిగి యాంజనేయునింగని.

తో॰. వారధిపనుపున-వచ్చినాఁడనా । పేరిదె మైనాకుండు । మా

రుతికొంచెము-మార్గాయాసము-దీరిన పిమ్మటబొందు ॥రామ॥

వ. సమస్తవస్తువులు ఫలములును దెచ్చినాఁడ నివి గ్రహించి కొంచెము విశ్రమించి పోవలయునని కోరిననతండు.

క. వారధి మధ్యమునిలువక
బారెదనని శపథముగను ♦ బలికితినటమా
వారలతో నటుగావునఁ
గూరిమితో విశ్రమింపఁ ♦ గూడునె! నాకున్.

వ. నీయిష్టప్రకారము వచ్చి నాహస్తమును మాత్రము శిఖరం బుననుంచెద హస్తస్పర్శముచేత సంతోషింపుము. మైనాకా! యని దశయోజనంబుల వెడల్పు సహస్ర యోజనముల నిడుపుగలయటుచేసి యవతలఁబోవ సింహికయను ఛాయాగ్రహంబువచ్చి యాంజనేయుని మ్రింగుచుండిన.

క. జంతువులు పైనఁబోవఁగఁ
బంతంబున ఛాయపట్టి ♦ భక్షించియుదా
నంతట వారిని మ్రింగున
దంతయు దానెఱిఁగి మారు ♦ తాత్మజుడలుకన్.

తో. అకటా! యిదియొక, టడ్డమువచ్చెను! నాశ్చర్యంబుగనను చు। బ్రకటితము గ। గ్రిందికి జనిదానిబ, దముసఁదన్నెనుగనుచు॥రామ॥

చ. ఇటువలెదానిఁదన్ని మడి ♦ యింని వియత్పథగామియై సము
త్కటబలుఁడౌచు దక్షిణపు ♦ దట్టుగ మళ్ళియు బోయిపోయి యం
తటను ద్రికూటపర్వతము ♦ దానిపయిన్ జెలువొందు లంకయున్
దటుకునఁగాంచెమారుతి ము ♦ దంబున డెందము పొంగుచుండగన్.

వ. ఇట్లుగాంచి పగటిపూట లంకాపురప్రవేశముఁ జేయగూడదని సువేలాద్రిపై నివసించి రాత్రికాలంబున నుత్తరద్వారంబున సూక్ష్మరూపుండై ప్రవేశింపఁబోయిన లంకిణి యడ్డమువచ్చి.

లం-కీర్తన, పూరికళ్యాణి-ఆది.

నీవెవ్వడవురా! నీపేరదేరా! వేషేగఁజేర। ఈవేళరాకుపోర! ॥నీవె॥ ననుగెల్చిలంక। గనబొమ్ముబింక। మణగింతునింక। హరియింతుగింకకుంక॥ నీవె॥ లంకిణినేను। లంకగాచేను। బొంకముగానినుబోనీనుమానుమాను ॥ నీవె॥ ధరమోటుగుండ, పురహరియుండ। జొరబోనీకుండ। గొరుకుదుగండ కండ ॥ నీవె ॥

వ. అనిపలికి కాలితోఁదన్ని పోనీక యాగినఁ బొడగునఁ బెటిగి గుద్దెట్టజేసి యాంజనేయుండు.

తొ. వెడదవక్షమున। నెడమపిడికిటను। బొడిచినరక్తముగ్రక్క। పుడమిమీఁదబడి। పొరలిలేచియా। పడతిపలికెదామొక్కి॥ రా॥

వ. ఓమహానుభావా! జగదేకవీరా! నీకు జయమగుఁగాక; నీవు లంకలోనికిఁబోవలసినది. పూర్వమొకపరి బ్రహ్మనాకుఁ జెప్పినది యేమనఁగా నిఁక నిరువదియెనిమిదవ పర్యాయము త్రేతాయుగము వచ్చినప్పుడు శ్రీమన్నారాయణుండు రాముఁడన రఘుకులంబునఁ బుట్టఁగలఁడతనిభార్యయగు సీతను రావణుండు తెచ్చి లంకలో నుంచునప్పుడు రాముని ప్రేరణమువల్ల వెదకుచు నొక్కవనచరుండు రాత్రికాలంబునవచ్చి నీచేత నాపఁబడి నిన్ను దండించఁగలండు నీవెప్పుడు పరిభవమునుబొందుచున్నావో! యప్పుడే! లంకయు నందున్న రక్కసులును జిక్కువడి నశింతురని చెప్పియున్నాడు. గాన నదినిజంబయ్యె వినుము.

తొ. రావణుడుండిన। రమ్యసౌధమున। కావలగలదొకవనము। నావనమునఘు। మైనశింశుపం। బనుచెట్టున్నదికనుము॥ రా॥

అందుఘోర దనుజాంగనలలజడి నొందింపగ దైన్యమున। గుందుచునారదు, కూలంబునసీత। యుందికనుము వేగమున ॥రా॥

చ. జనకజవార్తరాముసకుఁ ♦ జయ్యనఁజెప్ప దర యానర్పహా
ఘనుసిటు తోడదెచ్చి దశ ♦ కంఠుని గూలఁగఁజేసి లోకముల్
మనుపుము డెందముందునను ♦ మానముసొందకు నన్నుఁగూల్చితే

దనుజులు గుర్రింగిరంచుఁ గ్రిమ్మత్తఁ దలపోయుము వాయునందనా!

వ. అనిపలికి యతని వీడ్కొని రామధ్యానంబుచేయుచు లంకిణి యడ్డగించుటజని మారుతి యంత హనుమంతుండు సూక్ష్మతనుండయి లంకలోఁ బ్రవేశించి.

హను-కీర్తన, రూపకతాళము-కేదార.

దీనిసొంపు-గానగను। ఆనిలింపు। లైన। భ్రమపడరే! మానసంబు లోన, ముదమొందవేడు। శ్రీనిధియై చెలగుచున్న దియపురా॥దీని॥మానుషు లోక, ములయందు। జూడదీని। జోడుపురికలదే! నాడెమైన-మాడువులు జత్రియు। వేడుకతో। వెలయుచున్న దియపురా! ॥దీని॥ మోకగుండా, ధ్వజునితో। గడుగట్టిగాన-నీనగరము। రాకుసుండు-దీకుగను నేలుచు। నీ క్షితిపై-నిక సుఖపడగాజాలడు॥ దీని॥

వ. ఇటువలె పురంబభివర్ణింపుచు గూఢచారుండయి చని.

మధురగతి రగడ.

వెదకెఁబవనసుతుఁడు। లంకను। క్షితికుమారినపుడు। వరరథశాలలు-వైద్యశాలలును,। హరికరిశాలలు-నస్త్రశాలలును,। వీరభటులుగల-విపులగేహములు। శూరులు నిలిచిన-సుందరగృహములు। వీధులుదిన్నెలు-విపణిమార్గములు। సౌధంబులు ర-చ్చలు గోపురములు। దేవాలయములు-దెలియనిగొందులు। సావడులును దు, స్తరమగు నందులు॥ వె॥ వందిమాగధుల-వరగేహంబులు। నందములగు గా, యకులగృహంబులు। వారకామినుల। వరమందిరములు। పౌరాణికసుం, భన్మందిరములు। మంత్రివరుల ని, ర్మలమందిరములు। తంత్రిజ్ఞుల సుం, దర మందిరములు। గదిసినమాలా, కారులయిండ్లును। వదలకచని దై, వజ్ఞులయిండ్లును॥ వె॥ కుంభశ్రవణుని-గోప్యపు నెలవును। గుంభనికుంభుల-గురు వాసములును। అతికాయుని ది, వ్యంపు సౌధమును। బ్రతిలేని యకం, పనుని సౌధమును। గంపనునగరును-ఖరసుతుభవనము। దెంపునఁజనియా-త్రిశిరునిభవనము। నతియకుమారుని-యమలమందిరము। నతియమగుధూ, మ్రాక్షు

మందిరము। దూరి యింద్రజి,త్తుని గేహంబును। దారుచు దేవాం-తకు గేహంబును। నామహోదరుని-యుతుల మందిరము। నామహాంగుడు-న్నట్టిమందిరము। సారది మహాపా-ర్శ్వని వాసంబును। వరుసను పాశ్వని-వంనిలయంబును। గడమ పెక్కు రా-క్షసుల సదనములు। అడకు లేకది, వ్యాంతఃపురములు॥ వెదకె బవనసుతుండు॥

వ. ఇట్లు వెదకి యెక్కడను గానక గ్రమంబున రావణుని దివ్య సౌధంబు జేరి యందలి వనితనంబునకు నచ్చెరువొందుచుఁ గావలియున్న వారల బరిశీలింపుచున్నఁ దిన్నని నడకలతో నంతఃపురంబుఁ జేరి యచ్చట.

తో. చెలగి రావణుడు-చెఱదెచ్చిన యా-స్త్రీలు వానితో గలసి। పలువిధసుఖముల-వడసియు నిద్రా, పరవశులగుచును సొలసి॥ రా॥

వ. కోకములు బిగించుకొనకయు గంచుకంబులు మరలధరించకయు విమానంబుమీఁదనే యొరిగి నిద్రింపుచుండువారలఁ గని యాశ్చర్యకలితచిత్తుండయి హనుమంతుండు.

క. ఇట్టి నెరకాంతలుండఁగఁ
గట్టా! దశకంధరుండు ♦ కాకుత్స్థుసతిన్
నెట్టన జెఱవట్టెనుసరి
చెట్టతనంబుననుచాను ♦ జెడిపోవుటకై

వ. అని కొంతవరకు చింతించి.

తో. స్వామికార్యమును-సలుపవచ్చి యిజ, వ్వనులమర్మములగంటి। రామునింతి వీ, రలలో! వెదుకగ-రాదు కలుషమును గొంటి॥ రామ॥

వ. ఇందుండఁ దగదని యెంచి యువతులఁబోయి యొక్కరత్న వేదికపైఁ బుష్పపానుపుఁ బవ్వళించి నిద్రపోవుచున్న రావణునిఁ గనుంగొని యతని యుభయపార్శ్వంబుల.

తో. ఆసియు బాడియు-నడపముఁగట్టియు-నాలవట్టములువట్టి। వేడుక తోడుత। వింజామరములు। వేసియు నిద్రలుమట్టి॥ రామ॥

వ. దేవగంధర్వ దైత్యకాంతలు వాఁడు నిద్రించిన పిమ్మటఁ దమచేతి సాధనంబులు గౌఁగిలించుకొని మయిమఱచి నిద్రింపుచుండ నద్భుతంబుగా రావణుని విభవంబుఁజూచి తలయూచి యింతలో.

తో. అతనిగౌగిటను, నలరిసౌఖ్యముల, నందినుప్తిజేఁజొక్కి। మతిచెడియుండిన-రతిఁబోలినయా-మందోదరిఁగనినిక్కి॥ రామ॥

వ. సీతనుగంటినని యానందించి గంతులువైచి వాలాగ్రంబు జుంబించి కంబంబుల కెగబ్రాకి కొంతవడకు జాతివికారంబు లగుపఱచి యనంతరంబ.

హను-కీర్తన, త్రిశ్రజాతి-జంఝూటి.

నేనెంతమోసపోతి। నేనెంత వెఱ్ఱినయితి। యీసీచుతరుణినిఁజూచి। జానకియనితోఁచి। భ్రమసి। నేననుకొంటిగాని। యాపతివ్రతా,తిలకమన్య్య గవయగోరునే। మదిదోఁచదాయెను॥ నేనెం॥ కను మోఱుగుండ విభుని। విడనాడియారావణుని। కొడబడియీరీతిని। బుడమిజనుధువాని। చెనునా! తడబడి యెంచితిని। పరమ మూఢుఁడ। బాపకర్మకిటులలొంగితి। నేరమ్ము జేసితి॥ నేనెంత॥

వ. అనియిట్లు చింతించి యనంతరము మధుమాంసయుక్తం బగు పానీయశాల లరయుచుండెనని చెప్పిన విని శాంకరిదేవి శంకరుని కిట్లనియె.

క. జానకి పతివ్రతగఁద న
మానసమున నెఱిఁగియుండి ♦ మందోదరినా
వానరుడు గాంచినప్పుడు
చానేల! భ్రమించెమదిని ♦ ధరణిజయనుచున్.

వ. ఆకారణంబేమో వివరంబుగ నాకు సెలవిమ్మని ప్రార్థించిన శర్వాణి కీశ్వరుం డిట్లనియె.

తో. సిరిరూపము వలె-హరిచేమందో। దరిసృష్టింపఁగఁబడియెఁ। సిరియంశంబున-సీతయువతరిం-చినదికాన సరిపడియెఁ॥ రామ॥

వ. అది యెటులనిన రమాంశ సంభూత సీతగదా! మండోదరి జన్మకథ వినుము.

గీ. ఘనగుణోపేత మాల్యవ ♦ ద్గర్భజాత
పరిణుత కాంతాసమేత రా ♦ వణునిమాత
వీతపాతక దుఃఖంబు ♦ చేతజిత్త
మందుఁ బొగలుచుఁ దనయున ♦ కనియెనిట్లు.

కైకేసి-కీర్తన, ధన్యాసి-ఆదితాళము.

ఓతనయా! విను। యొకదుఃఖమునా। కొనగూడెనునేడు। ఆ తెఱఁగేమని। యడిగెదవేమో! యీతెరినే వచి, యించెదసర్వము॥ వో॥ శేషోచ్ఛ్వాసము, చే నాలింగము। చేరెరసాతలము। శేషభూషణు భ, జింపుచునుందును। నేసతతంబది। నిలిచిపోయెనిక॥నో॥ ఇమ్మహి మోటకు గుం, డేశునిఁగూర్చితి। పమ్ముగఁజేసినీవు। గ్రిమ్మఱనొకలిం గమ్మునడిగికొని। రమ్మదానినా, కిమ్ముధరించెద ॥నోతనయా॥

వ. అనినఁ దల్లివాక్యంబులకు వల్లెయని రావణుండు వెండికొండకు దత్క్షణంబునవచ్చి.

ఉ. ఉల్లమునమోదమందనను ♦ నొప్పుగఁజేరి నుతించి నేఁడుమా
తల్లికి నాత్మలింగము ము ♦ దంబున నివ్వుము నాకు నీమనో
వల్లభయైనపార్వతిని ♦ బత్నిగ నివ్వుమటంచు వాంఛితం
బల్లనఁదెల్పఁగాఁవిని ద ♦ శాననుతో నిటులంటిపార్వతీ!

శి-కీర్తన, ఆదితాళము, ఓన్న మోనారా.

రావణా! నిమానసంబు-రంజిలజేతు। నీవుగోరినవరములు-నేహొసంగుదు ॥రా॥ ఆత్మలింగమిచ్చెద మీయమ్మకు నిడుము। ఆత్మపత్నినిచ్చెద నీ-వల్లకై కొనుము॥ రావ॥ ఈవరలింగము మరి-నేమరినీవు, పోవుచో భూమిని నుంచ, బోకుకొనలేవు॥ రావ॥ ఎందిడస్థాపితమానో! యందువసింతు। నందముగ మోటకుగుండ। మంచుభావింతు॥ రావ॥

వ. అని తెలిపిన మఱఁచదనిదశవదనుఁడు నిన్నును లింగంబుగొని,

చ. చనునెడనీవు విష్ణుమది ♦ సంస్మరియించినఁ దానెరింగి చం
దమున లక్ష్మిబోలువని ♦ తీఱ రచియించి మయాఖ్యనొప్పనా
తనికినొసంగఁ బుత్రిగన ♦ తండు దలంచి రసాతలంబుబా
వనముగఁజేర్చె తానుఁ దన ♦ భార్యయు నక్కలి నద్దుముద్దుగన్.

వ. సాకుచుండిరి పిమ్మట నచ్యుతుఁడొక్క విప్రరూపంబున రావణున కెదురుగవచ్చి యిట్లనియె.

తో. ఎందుబోయిదను| జేరద్రి! వచ్చెదవో! యింతియెవ్వరనియడుగ| నిందుమాళసతి-యీమెవిభుఁడునా, కిచ్చెననుచుదానుడువ|| రామ||

వ. కపటవిప్రుఁడు నవ్వుచు నిట్లు పలుకుచున్నాఁడు.

విప్ర-కీర్తన, రూపకము. ఎందుబోతివయ్యా.

మంచిచెడ్డలిందు నీవు, గాంచవైతివి! రావణ! ||మంచి||వంచనగావించనీశు-డెంచవైతివి! యేమాత్రము||మంచిచెడ్డ|| శైలసుతను దాచెనుర, పాతలమునను| మయునియింట| బోలఁగ గపటంబు సతిని-జాలనొసఁగెను| నినుగొనుమని||మంచి|| దేవమర్త్యలోకములు-నీ వెఱుంగుట| గాంచెదవని| తావడిబాతాళమందు| దాచెమరుగుగ| నిశ్చయముగ ||మంచి|| ఈక్షణమున మయునియింటి| కేగిచూడుము| కనపడుసతి| మోక్షగుండదేవుసాక్షి| మోసపోకుము ||దశకంధర||

వ. అనిన నామాటనమ్మి రావణుఁడు దిరిగి కైలాసంబునకువచ్చి.

క. శంకరకపటంబుననీ| పంకజముఖి నాకునిచ్చి ♦ పాతాళమునన్
శాంకరిని దాచితివినే| గొంకకనట కేగి తెచ్చి ♦ కొనెదను గనుమా!

వ. ఈకృత్రిమకాంతను నీవేకొనుమని పార్వతీ! నిన్ను నాకర్పించి లింగముఁగొని చనుచు ముందువచ్చియున్న విప్రునితోఁగలసి.

తో. అల్పశంక కే| నరిగివచ్చెదను| నంతవరకులింగమును| నిల్పుము నీకర, నీరజమునవవ| నీసురయనిపలుకగను ||రా||

వ. బ్రాహ్మణుం డిట్లనియె.

విప్రి-కీర్తన, ఆదితాళము, వగవేటికి॥ అన్నట్లు.

కడువడిగను రావలెను । గ్రక్కున నేజనవలెనుఁ। దడవయినను లింగమును। ధరమీఁదనుఁవై చెదను । వినుము, చనుము। చెడిపోవుగాదె కార్యమావలను ॥కడు॥ ఘటికాద్వయ మగుదనుక। గనిపింతును నావెను కయిటనుండను నేగనుక। నటుపయినాగ్రహపడక। రమ్ము, పొమ్ము। త్రుటిలోన మోక్షగుండ పతిక్రృపను॥ కడువడిగను॥

వ. అనిస్పష్టముగాఁ బలికినసమ్మతించి లింగంబు విప్రునిచేతికిచ్చి మూత్రనివృత్తికొఱకు రావణుండావలఁజని.

క. మూత్రము విడుచుటముగియక। రాత్రించరుఁ డనివరీతి ♦ రాకుండినా । ధాత్రీసురుండులింగము।ధాత్రినిడెఁ బశ్చిమాబ్ధి♦తటమునసప్తముఁ.

వ. ఇట్లుంచి నారాయణుండు స్వీయలోకంబునకుఁ జనియె.

సీ. రావణుండంతయు ♦ థావిధి మూత్రవిసర్జనజేసి య ♦ చ్చటికి వచ్చి విప్రుండు లేకున్న। వెదకిలింగంబును గదలింపనేమియుఁ ♦ గదలకావు చెవిఁబోలుగర్ణంబు♦శిరమున నేర్పడగోకర్ణమను పేరు♦ప్రకటముగఁ గలిగెనాస్థలమున♦కెలమి ఖిన్న మనస్కుఁడయి దశాననుఁడు నే♦య్యముప గదిలి

గీ చెలఁగి పాతాళలోకంబుఁ ♦ జేరియుచట
మయగృహంబుననున్నట్టి ♦ మగువనరసి
డెందమందున మెచ్చి యా ♦ నందమొంది
యతనితో నిట్లు పల్కె న్నె ♦ హంబు గదుర.

రావ-కీర్తన, ఆది. ముఖారి. వలదచటికి.

మయ! తనయ నిమ్మయా! దయజూడుమయా!॥మయ॥నయమైన సద, న్వయుఁడ రావణా, హ్వయుఁడ లంకాధీశుఁడ, బ్రఖ్యాతిపరుఁడ ॥మయ॥ నాకునీడగు చెలి। నాకమర్త్యన[illegible]లోకములలో లేకయె। నిటువచ్చినాను॥మయ॥ లక్షణమైనది। లగ్నము నందే । మోక్షగుండేశుకృపను మదితలిసెదగును ॥మయ॥

వ. అనిప్రార్థించిన హరివలన సర్వము ముందే! యెఱింగి యున్నవాఁడు కావున మయుండు మంచిదని కన్యనిచ్చి పెండ్లి చేసి.

తో. అరిభయంకరంబగు నొకశక్తిని-వరణంబుగనర్పించి। తరుణిని దశకం, ధరుని వెంటబా సరగబంపె మోదించి ॥రా॥

క. మందోదరమ్మున నొప్పుట। మందోదరియనుచుజనులు♦మహిఁబిల్వఁగనా। సుందరిరెప్పొరావణుఁ। డందంబుగఁజేరెలంక ♦ కతివయుదారున్.

గీ. ఇట్లులంకఁజేరె ♦ యిల్లుప్రవేశించి
తల్లికడకుబోయి ♦ దండమొసఁగి
యెల్లసంగతులను ♦ జెల్లంబుగాఁ దెల్ప
నాలకించి యామె ♦ యాగ్రహించి.

వ. అంగజ విభంగునిఁ జుడిగి లింగంబుఁ దెమ్మని యెఱుఁగఁ జెప్పి పంప నాసంగతి భంగపఱచి దొంగ జాడలఁజని యాత్మలింగనను దెచ్చి ప్రసంగంబుఁ జేయవచ్చితివి. బంగారువంటి వంగడమున వెంగలి పుట్టితివి. బేలా! నీకీయుద్ధైర్యంబేలా! అని తృణీకరించిన రావణుండు లజ్జించి.

తో. గోకర్ణమ్మున, కు నరిగిపద్మజు । గూర్చితపము జేయగను। ఆకమలజుడత్యంతప్రేమ బ్రి, త్యక్షమైన మొప్రక్కుచును ॥రామ॥

రావ-కీర్తన, పూరికళ్యాణి, అటతాళము.

కంజోద్భవా! కావవే! ॥కం॥ అంజలిజేసి భక్తి, రంజిల్లగ మ్రొక్కెదను ॥కంజో॥ నాకుదిక్పాలకవ। శీకరణైక బ, లాకృతిని-గైకొనగ-లోకేశ్వర, చేకూర్చుము ॥కంజో॥ పోలగనేజిర-కాలములంకను। నేలగ మోక్షపుర-పాలసుత! వరమీయుము ॥కంజో॥

వ. అని వేఁడి వరంబులు వడసివచ్చి దిగ్విజయంబుచేసి సర్వసుఖంబులనుభవింపుచుండె నదికారణంబున.

క. వైదేహియనుచునామం। దోదరిఁగనిభ్రమసె! దైవ♦మొనరిచెనిదియా। మీాదహనుమంతుడోకపని । మోదంబునజేసిచనియె♦ మోసవిధముగన్.

వ. అదియేమియనిన మయునకు బంధువుఁడగు గయుఁడను రాక్షసుండు బ్రహ్మనుదపంబున మెప్పించి వరంబువడసి పరాక్రమవం తుఁడయివచ్చి.

క. రావణుననుమతమున లం। కావర నగరంబునందుఁ♦గాపురముండెన్।
గావున నాతనివస్త్రము। పావని రావణుని శయ్య♦పైఁబడవైచెన్.

సం-తో హర. దశవదనునివ, స్త్రము విభీషణుని। తల్పముపైఁ దానుంచెన్। విశదంబుగ గపి, వీసుఁడిది యొక, వింతచేసెయురుదెంచెన్.

క. రావణునగళ్ళు మొదలుగ ।దేవాలయియింళ్లుగలయఁ♦దిరిగినసీతా।
దేవి కనఁబడకయుండిన। బావనిచనె నయ్యశోక♦వనమున కపుడున్.

వ. లంకలో నంతటఁదిరిగి యెందునుగానక లంకిణిచెప్పిన గుర్తు ప్రకార మశోకవనంబుకరిగి.

శా. నానాపక్షిమృగాకులంబునవర ♦ త్నస్థాపితామూల్య సో
పానభ్రాజిత వాపియుక్తమును స ♦ త్ప్రాసాద రమ్యంబు నా
నానూనద్రుమరంజితంబగు నశో ♦ కారణ్యమున్ జొచ్చి ని
త్యానందంబున వాయుజుండు వెదకెన్ ♦ హర్షంబునన్ జానకిన్.

వ. ఇట్లు ప్రతివృక్షమూలంబున వెతకుచుఁబోయి మణిమయ శత స్తంభ సంభరితంబయిన భర్మహర్మ్యంబును గని యాశ్చర్యంబు నొంది యచ్చటను సీతనుగానక నెమ్మదిని నధైర్యంబుదోఁచి.

హను-కీర్తన, చాపుతాళము. ఎంత జన్మము

సీతజాడనాకు నెందు,జిక్కదాయెను। భూతలేంద్రు చెంతకెట్లుపో వువాడను॥ దానవేంద్రమందిరంబు, లోనజూచితి। వానిపుత్రులున్నయిం డ్లు-పూనిచూచితి॥ సీత॥ సందుగొందులందుబోయి-చాలజూచితి ।బొం దుగ వనంబునందు,బొంచిచూచితి॥ సీత॥ చక్కగ శ్రీమోక్షగుండ-స్వా మికామినీ। యెక్కడగన్పించదన్ని-యెడలగంటిని॥ సీత॥

తో. వనచరావళిని - వదలినన్ను శూరునిగా రాముడు మెచ్చె। జనకజనోబడి-గనజాలుదునే ।పనుచునానవాలిచ్చె॥ రామ॥ కానవచ్చితి

ని-కార్యముదీర్చెదు- వానిరీతినేడిచట । మానినిపోబడి- గానరాదు వే-
మఱువెదకితి నేడకటా!॥ రామ॥

వ. లంకిణిచెప్పిన విధంబున నీయశోకవనంబున నెంతవెదకినను
సీతయుండుతావు దొరకదయ్యె దైవమా!

హను-కీర్తన, ఫీల్‌రాగము, అటతాళము.

ఇకనేమిచేయుదు-నెక్కడలేదు । ఇకనెందువెదకుదు- నింతికన రా
దు॥ యి॥ విసికిప్రాణములు-విడిచెనో కాక । యసురునిచేదప్పి-యబ్ధినిబడె
నో!॥ యి॥ తనమాటవినకున్న-దానవవిభుడు । దునిమెనో! దనుజులుదిని
నారో కాక॥ యి॥ ఒరులకుగానరాకుండ రావణుడు । బరదేశములనుం
చ,బంపెనోవీడు॥ యి॥ భూమిజజూడక । శ్రీమోక్షగుండ। ధాముసికడ
కెట్లు-దగఁజేరువాడ॥ యి॥

వ. నేను వృథాగజని సీత దొరకలేదని చెప్పిన భార్యావియోగ
దుఃఖంబుచేఁ బాగిలి తత్క్షణంబున.

తో. చచ్చునురాముడు-జచ్చులక్ష్మణుడు- సరగునసదివిన్నంత ।
జచ్చునుభరతుడు-శత్రుఘ్నుండును, జత్తురుబంధువులంత॥ రామ॥ఇనకుల
మడగును-నిటువలెనదిగని- యినజుడు జచ్చును పిదప । వనచరులందఱు
వరసగజత్తురు-వనితలేదనుచుదెలుప॥ రా॥

వ. ఉభయకులంబుల వ్యర్థంబుగ నీరుజేయుటకయి నేనచటికిఁ
బోవుటకన్నను.

క. వానప్రస్థుని విధమునఁ । గానలకును జేరి తపముఁ◆గావింతును గా।
దేని జలనిధినిదుముకుదుఁ।గాని యొడల్ వహ్నిజొచ్చి◆కడువడిఁజత్తున్.

వ. అంతేకాని ప్రాణంబుల పయి యాసవడి తిరిగిపోయి అంత
మందిని జెరుపఁదగదని కొంతవడుకుఁ జింతించి పిమ్మటఁ దనంతటఁ దా
ను ధైర్యంబు దెచ్చుకొని.

హ- కీర్తన, రూపక, కమాసు.

నేమానుదునా। కనక। నేమానుదునా॥ రాముని కరుణాసారము।

నామీదను బ్రసరింపక । నీము-ల్లోకంబులలో,నెందుండిన బరికింపక॥ నే॥ స్పష్టంబుగ భూజాతను। దృష్టికి జూపించుడనుచు । నష్టదిశా పతులను నే-నల్లాడించెదనుగాక॥ నేమూ॥ కుమ్మరసారెవిధంబున, నిమ్మహి గులగిరియుతముగ। దిమ్మదిరగ గిరగిరమని। త్రిప్పియుదిప్పలుపెట్టక॥ నేమూ। నాలావును మోతుకుండ। నాథునువిని సైయనగను। నీలంకాపురినసురులతో లవణాంబుధి ముంచక॥ నేమూ॥

వ. ఏదోయొక విధంబుగ సీతనుగాంచి మఱిపోదును గాని యులతింబోలె నూరక పోదునా! యని నిశ్చయించి యతిలాఘవంబున నామేడపై కెగిరి యువతుల నిదానంబుగా నుపలక్షించిన నచ్చట.

తో. ఎండచొచ్చుటకు-నెడము లేకగను- మెండుగ నాకులుబలిసి । దండిగగుబురై -యుండినశింశుప_తరుమూలంబున సొలసి॥ రా॥

క. దానవతగుణుల మధ్యను। దానునుమలినాంబరంబు♦ధరియించిమదిన్ ।
దీనత్వంబున రాము।ధ్యానమునొనరించుభూసు♦తన్ గనుఁగొనియెన్.

వ. ఇట్లు కనుఁగొని యావృక్షంబుపైకి నెగిరి యాకుల నడుమ స్వల్పరూపంబునఁ గూర్చుండి చూచుచు.

హను. కీర్తన, ఆదితాళము.

ఆనందంహృద।యానందం,పర।మానందం నిత్యానందం। జానకిగంటిని। జయముచేకొంటిని। నేనుకృతార్థుడ। నిశ్చయముగను॥ ఆనం॥ సీత కుశలమును। శ్రీరాములతో। జేతమలరగను। జెప్పుటకు। ఖ్యాతిగనాభా-గ్యంబునగలిగెను। నాతపమెల్ల నీ,నాడెఫలించెను॥ఆనం॥ వృక్షచరులు వే-వేలుండగవారి। వీక్షింపకను గ,టాక్షమున। మోతుకుండపతి। ముద్రికనాకును। దక్షతనిచ్చెను । ధన్యుడనైతిని॥ ఆనందం॥

వ. ఇట్లానందంబునొంది జనకతనయతో భాషించుటకుఁ దరుణంబు వేచియున్నంతలో రాముని యాజ్ఞచేత నొక్క వనచరుండు వచ్చి సూక్ష్మరూపంబున వృక్షాగ్రంబుననుండఁ జూచినట్లు రావణుండు గలఁగని తత్క్షణంబున లేచి.

తో. కొన్ని కలలు ని,శ్చ,యమగుచుండును। కొన్ని యబద్ధంబగును, నిన్ని టెకినిది-యెటులగునో! కని-యెదనని తీవ్రింబునను॥ రా॥

తో. రాక్షసాంగనలు-రయమున గొలువగ । రాముఁడవనిజఁ గనను। దక్షుఁడగుచు । దశవదనంబులు । దగనిరువది భుజములును॥ రా॥

క. కాటుకకొండనుబోలుని । శాటునిగనివాయుతనయుఁడాశ్చర్యమునఁ ।
జాటగునటులాకులలో । మాటియుఁగనుచుండెవాని మాయాచేష్టల్.

వ. అంతరావణుండు సీతను దగ్గరి భయంకర వాక్కులతో బెదరింపుచు.

రావ-కీర్తన, ఘరజు, ఆదితాళము.

నామాటను మీరకు-నలినాక్షి । యింక॥నామా॥ వేమఱు గాన న,సీమల దిరిగె। రాముఁడులంకకు। రాఁగలఁడా! యిక॥ నామా॥ మూఁడు లోకముల। నోడక నాకెదు। రాడువారు లే,రనిచూఁడుసీవు॥ నా॥ దానవ కులనే,తను బలవంతుఁడ। నైనసన్ను బో,నాడకుము।యింక॥ నామా॥ రమ ణి మోక్షగుండ। రమణునిపై నింత । భ్రమనొందిన దాన,ఫలమేమి । యిక॥ నామా॥

వ. నిరంతరము నితాంతానంత శ్రీమంతుఁడనై దిగంతంబుల వంతనొందించి సాధించిన బలవంతుని నన్ను నావంతయైన మంతనంబునఁ జింతింపక యెంతయు డస్సిన యొక్క బక్కమానవుని పయి నింత భ్రాంతినొందెదవు పంతమా ? ఇంతటనైన నాయుదంతంబు విని కంతు కేళియందు నాయంతరంగంబును సంతసింపఁజేయుము. కాంతా! నీకేల యింతచింత! యెంతమాత్రముంచకుము కోరంతా-నిర్మలస్వాంతా!

తో. బాళిమీర ది,క్పాలురనెల్లను, బంటులజేసెదనీకు। దాలిమి తోఁ ద,త్కాంతలు దాసీ। తనమున ర్చెదరు నీకు ॥రామ॥

తో. ఈరాక్షస రాజ్య,మిచ్చి నీకు నీ-యిష్టముచొప్పున నడుతు। దీరుగ బట్టపుదేవివినీవని । పేరుబెట్టి పిలిపింతు॥ రామ॥

వ. అని యానిర్భాగ్యుండు గర్భ నిర్భేదములగు దుర్భాషలాడి

న దుర్భరంబనక నిర్భయంబున రత్నగర్భార్భక తృణంబు చేబూని వా
నిఁ దృణప్రాయంబుగ నెంచుచు నధోముఖియై ప్రత్యుత్తరంబిచ్చు
చున్నది.

సీత-కీర్తన, కళ్యాణి, అటతాళము.

ఓరి రావణ! యూను,వారిసుందర విట్టి,పౌరుషములుపలుక!ఫలమే
మిచూడు॥ శూరుఁడవునీవయిన రామునితో। నెదిరించినన్ను। జేరితేనా।
నీవుధీరతితో। ఘనము,వినుము। రఘు,వీరుఁడేమరియున్న దొంగిలి। పారి
వచ్చుట బంటుతనమా॥ యోరి॥ సాగరశయనుని। సాగిరాకుండనీ। సాగ
రమేమాత్ర,మూగును వినుమా। వేగ శరవహ్నులనునింకించు। లేకున్న
నడ్డము,గాగ నేతువు వేడ్కగట్టించు।వచ్చు-జొచ్చు। నీ,భోగములు నీపుర
ము నిన్నున। బుత్రమిత్రులతోడ గూలుచు॥ నోరి రావణ। ధారుణీఁదా
ర్భారి। నారాయణాత్మ వి,హారుఁడౌ మోక్షగుం,డాధీశ్వరుండు। గోరి
తమ్మునితోడ నినుగదిసి। తలలన్నియిలపై। గూలజేయునాడుగా తెలిసి।
మొగ్గు,తగ్గు,గనువారికే యెరుకౌనిరువుర। తారతమ్యము చెప్పవలెనా!॥
యోరిరావణ॥

చ. అనికఠినంబుగాఁ బలికి ♦ నట్టి ధరాత్మజ వాక్యముల్ దశా
ననుఁడిటులాలకించి వద ♦ నంబుల నాగ్రహ ముప్పతిల్లఁగాఁ
గనులను గెంపులొల్కఁగను ♦ ఖడ్గముఁ గేలధరించి జానకిన్
దునిమెదనంచు నాతురము ♦ తోఁ జనవద్దని యడ్డగింపుచున్.

వ. వానిభార్యయగు మందోదరి యిట్లనియె.

మందో - ఆదితాళము.

ఇ-దేమీపరాక్రమము। నిదానించియోచింపుము॥ఇదేమీ॥ అదే-
మియూ,డుదా,నిపై। కిదూ,రిపో,యెదా,భళా! సహామం-చిబానె,మ్మదిన్
దెల్పెదన్॥ఇదేమి॥ సురా,స్సరా,ది రా,మలన్-వరిం,చిపొం,దర్భా,దయూ,
నరేంద్రీ-వరాక్షిన్-జెరన్-బెట్టగా॥నిదేమీ॥ కరం,బుమో,క్షగుం,డస,త్ప్ర
రా,ధిపుం,డు రా,ముడౌ। బరాకా। చిరాకా। పరంబెంచవా॥ ఇదేమీ॥

తో అల్పభోగమున-కై చెడనేటికి-నతివలు నీకికలేరా! తెల్పుము మరియొక-తెతో నీకామము-తీరదేమొ! యిదిమేరా॥ రామా॥

వ. నీయందు బ్రియంబులేక విముఖురాలయి యున్న యీపతి వ్రతను బలాత్కారము చేయుట మర్యాదకాదు. పరాంగనాసంగమం బు పాపంబుగ నీవెఱుంగవా! నిన్నుఁగామించియున్న మావల్లనెల్ల సౌ ఖ్యంబులు దెల్లంబుగఁ బొందరాదా? చాలదా? ప్రాణనాయకా మానుము. స్త్రీహత్యచేయక, యింటికిరమ్ము నామాటఁ ద్రోయక.

వ. అనినమండోదరి వాక్యంబువిని సీతనుజంపుటుడిగి యిరువది కన్నులనగ్నికణంబు లురులనురిమిచూచి అయోముఖి, హేమాస్య, హా రిజట, త్రిజట, మహాదర్యాది రాక్షసాంగనలఁ దక్షణంబున బిలిచి.

రాగ- కీర్తన, ఆదితాళము, బేహాగ్.

మీరు,గంటిరా! వింటిరా! చెలులారా! కల,కంఠిమాట యెంతకఠి నమారా। వెంట,నంటి భయనయనములుమీరి।వాలు,గంటిని దోడ్తెండు నన్నుజేర ॥మీరు॥ ఇక, రెండునెలలుజెప్పినను గాని। విన, కుండెనేని పి ప్పటదీని। గోసి, కండలుదినుచు పంచుకొని। మోక్ష-గుండహారి యడ్డప డినగాని ॥మీ॥

క. రావణుఁడసురాంగనలకు। నీవిధమున నాజ్ఞయిచ్చి♦యింటికిఁజనఁగా। నా వెలఁదులు భీకరముగ। భూవరసుతఁజేరి తెలుపఁ♦ బూనిరిబుద్ధుల్.

పంచ:- అరణ్యమందునిన్ను రావ♦ణాసురుండు దెచ్చెనో। దిరంబుగా నెఱుంగకున్న♦దీనమానవుండునీ। వసుండువానిమీఁద నింక♦ వాంఛమాని రాక్షసే। శ్వరుణ్ వరింపుమెల్ల భోగ♦శాలివాడు వంగనా!

వ. తమ్ముండు రాజ్యంబపహరింప ననదంబోలె నీమగండు వనం బులఁ గృశింపుచున్నాఁడు. మా రావణునియొక్క ప్రతాపంబువినుము.

స్త్రీల-కీర్తన, హిం, కాఫీ, అటతాళము.

జగ-దేకవీరుడు పద్మ, జాతకుల సంభవుడు। నగజాపతి సేవకు డు। నవమన్మథ సుందరుడు॥జగదేక॥ మించిదిగ్విజయము' గాంచి యున్ని

టినిసా, ధించి యీలంకనుబా, లించి గీతిఁగాంచినట్టి ॥జగదేక॥ ఎందు జావులేకుండగ। ముందేబ్రహ్మచేత వర, మందినాడు వీనిగూడు । సుందారిదైవె భోగము ॥జగదేక॥ భూమిలోన మోక్షగుండ, ధాముడగు రాముపయి। ప్రేమమూనిరావణుని। గామింపుము కాంతామణి ॥జగ॥

తో. మా మాటలు విం-టేమంచిదినీకు । మేము సేవచేసెదము। కోమలి! వినకుంటే! మతినిలువుకు । గోయుచుభక్షించెదము ॥రామా॥ రామాయనవే.

వ. అని యిట్లు చుట్టుకొని బాధింపుచున్న రాక్షసాంగనల నిర్లక్ష్యముగ వీక్షించి సీతాంగన దీనత్వంబున.

సీత-కీర్తన, ఆదితాళము, హిందూస్తానికాఫీ, రాగము.

ఇంతపంతమేలనమ్మ। యింతులారమానరమ్మ। చింతద్రోయమేలటమ్మ। చెలగికరుణజూడరమ్మ ॥యింత॥ బలములేని మనుజుడైన । బధిరుడైన నంధుడైన। దెలివిలేని వాడునయిన। జెలువునివిడనాడనోన॥ యింత॥ భూమిలోన మోక్షగుండ, ధాముడైన శ్రీకోదండ। రాముడే! విభుడనుచునుండ। నామదివేరొనెపొండ ॥యింత॥

వ. అనివేడుకొనిన దీనాలాపంబులాలింపక భీకరంబుగఁ గేకలు వేయుచు.

తో. చెప్పినవినదీ। చేడెమనమాటకియు । నిప్పుడెరక్తముబీల్చి । చప్పరింతమా! సరగునగండలు-చవిచూతామా! నిల్చి॥రా॥ ఇకగొన్నాళ్ళూరక బోధింపుచు। నిటులనె బెదరింతామా! యొకటరెంటగని। యొర్పుగలిగిమన-మొప్పనటులజేతామా ॥రామా॥

వ. ఈప్రకారంబున మనఃక్షోభంబు జేయుచు నీరుండఁ త్రిజటమాత్రమది సహింపక వేఱొక్కచో శయనించి నిదురించి కలఁగని లేచి రాక్షసస్త్రీలను బిలచి యనుచున్నది.

త్రిజట-కీర్తన, నవరోజు, ఆదితాళము.

కలఁగంటినేనొక్క-కలఁగంటిని। కలలో న నేకములు గనుఁగొంటి

సీ॥కల॥ రాముడేనుగునెక్కి-రాఁగఁగంటినీ । సౌమిత్రివచ్చినయట్టి - జాడఁ గంటిని॥కల॥ లంకజొచ్చి రావణుఁగూ, ల్చఁగఁగంటిని, లంకను విభీషణుఁడే లంగఁగంటిని ॥కల॥ రావణునిపుత్రులెల్ల-జావఁగంటిని । వేవేగదక్షిణ దిశకు-నేగఁగంటిని॥కల॥ భూమిజ నయోధ్యకుగొం, పోవఁగంటిని। శ్రీమోక్షగుండేశ్వరుని-జెలఁగఁగంటిని ॥కల॥

వ. అనితన స్వప్నవృత్తాంతంబుఁ జెప్పిన నాలించి భీతచిత్తలై సీతమ్మనువదిలి యొక్కచో నందఱుఁబడి నిదురించుచుండిన సీతాదేవి విలాపంబున.

క. రావణుఁడు రెండునెలలకు। నావశమగునట్లుగా ఘ ♦ నంబుగఁజేయుం।
డీవెలదుక వినకున్నను। దీవరమునఁదీనిఁజంపి ♦ తినుఁడని పలికెన్.

వ. కావునవీరిట్లు క్రౌర్యంబుఁజూపుచున్నారు. దైవమా! దిక్కులేనిదాననైతిని. ఈకష్టంబెటుల భరింపనగును.

సీత-కీర్తన, జంఝూటి, రూపక.

అంతవానిభార్యనేనై-నడలవలసెను । జంతతోడ వీరిచేత-జిక్కవలసెను॥ నేనెంత॥ తెల్లవార నన్నుబట్టి-తిందురిందరు। భీల్లిబిలుక చందమాయె। భీతిచేతురు ॥అంత॥ మోక్షగుండరాఘవుఁడు-పేక్షజేసెను। రాక్షసుల బోనులోను-రహింఁద్రోసెను ॥అంత॥

క. అనిశోకావేశంబున । గనుగవలను నీరువరద ♦ గాఁ గాఱఁగనా।
వనజాక్షిశింశుపాతరు। ఘనశాఖను జేతనూత ♦ గాఁగొని లేచెన్.

వ. ఇట్లులేచి నిలువంబడి దిక్కులు పరికించిచూచుచు.

సీత-కీర్తన, వసంతరాగము, అటతాళము.

వీరిసేతలకు। బడజాలనే, వీరిబాధలకు। క్రూరరాక్షసులచేఁ, గూలుటకన్నను। సారెకు నాకైనే। జచ్చుటమేలగు ॥వీరి॥ వేవేగమెడకునా, వేణియురివెట్టి। నీవేళ నిచ్చట-జీవమువిడిచెద ॥వీరి॥ భూమిమోక్షగుండ । ధాముడనునుగాని। యీామేను నిలచిన, నేమి పోయిననేమి ॥వీరి॥

వ. అని మరణంబునొంద నిశ్చయించి తనజడను గంఠంబున

కు నురి వెట్టుకొన నిశ్చయించియుండిన జానకివిపత్తును దీర్చుట కిదియు కదా! తరుణంబని యెంచి మరున్నందనుండు సీతవినునట్లు సూక్ష్మ స్వరంబుతో నిట్లనుచున్నాఁడు.

ద్వి॥ అవనిలోపల నయోధ్యాపురినున్న, రవికులుండగు దశరధరాజమణికి, వరరామలక్ష్మణ-భరతశత్రుఘ్న, సురుచిర నావులు-సుతులుదయించి। రందుజ్యేష్ఠుండగు రా, మాఖ్యుడుతమ్ముఁ। డుం దరుణియును దోడ, దుగ రాగఁ దండ్రి।పనుపున దాడకా, వనికరుదేర।దనుజాధనుండగు-దశవదనుండు । చని రాముఁడట లేని-సమయంబునందె । జనకజగొని పోవ, జాడదీయుచును। ఘనజటాయువు సెప్పఁ, గాజాడఁదెలసి । యనువొందబుష్యమూ, కాద్రికిఁజేరి। వాలిసుగ్రీవులు-వడిగలహింప। వాలిని జంపి తీ, వ్రమున సుగ్రీవుఁ। గపిరాజ్యమున కధి, కారికాఁజేయుఁ। గపిపతియాజ్ఞచే-గదలి మర్కటులు। దిక్కుదిక్కులకు వై-దేహినిజూడ। గ్రక్కునఁబోయి రి, క్కడికి నేనొకఁడ। శతయోజనమ్ములు. సాగరమెగిరి । ప్రతిలేని లంకాపు, రంబునఁజొచ్చి। పురమెల్ల వెతకి గొ, బ్బున వనమందు । బరువడినొకశింశు, పా మూలమునను । సురదుఃఖకలితయై, యున్న సీతమ్మ। నరసితి ధన్యుండ, నైతి నేనవిన.

వ. అవ్వాక్యంబులు శ్రవణానందంబులైనఁ దన యుద్యమంబు మాని చెట్టుపైనఁజూచి యెవ్వరుఁ గనబడనందున నెమ్మనంబున.

సీతకీర్తన, జంఝూటి, అటతాళము.

ఔరౌర యిదియెంతో ! వితత । కారణమెఱుగను-గానిసుమంత। లేరెవ్వరితరులీచెంత। వారకనాకాశ। వాణిపలికెను! లేక। ఘోరరాక్షసులే! యిట్లూరక యనిరో! నే॥ఔరౌర॥ కలయేనో! చిత్తవికలమో! కలయెక్కడిది నిద్ర-గాన నిశ్చయమో । తెలివిలో భ్రమరాదిదేమో! యిలనారాయణకవినేలు మోటుగుండ । నిలయు । కనుకగు, నిశ్చయమెఱుగ। నే ॥ఔ॥

వ అనియిట్లు డోలాయమాన మానసయై యిట్లనియె.

క. శ్రీవణానందముగా రా
ఘవుకథ వాకుచ్చినట్టి ♦ ఘనులెవ్వారో!
పవిమలముగ దర్శనమిడి
వివరింపగరాదెయెల్ల ♦ వృత్తాంతంబుల్.

వ. అనిమనోభావంబు వెల్లడిచేసిన నానందించి జిట్టెను పొడుగు గల వానరాకృతితో హనుమంతుండు చెట్టుదిగివచ్చి సీతాదేవియెదుట నంజలి బద్ధుండయి నిలచిన జానకి భీతినొంది.

తో. వనచర రూపం, బున దానవు డె, వ్వాడో! రావణు డను ప। జనుదెంచెను రాక్ష, సమాయలటం। చునుదలచియు గనుగొనక॥రా॥

వ. అధోముఖియై యూరకుండిన నాంజనేయుండిట్లనుచున్నాడు.

హ-కీర్తన, అటతాళం. కాఫీ.

వాయుతనూజుడ। వానరవర్యుడ। మాయలుగావివి-మానుము శంక ॥వా॥ ఖ్యాతిగ సుగ్రీవుదూతను సచివుడ। మాతరో! నేహను-మం తుడధీరుడ ॥వా॥ దండిగ శ్రీమోక్ష, గుండేశుడైన కో। దండరామునకు ను। దాసుడ నిక్కము ॥వా॥

వ. అనిన సీతాదేవి యనుచున్నది.

తో. మీరువానరులు। వారుమానవులు। మీకును వారికినెటుల। చేరువదొరికెనో! స్నేహముగలిగెను! చెప్పుము తెలిసెను నటుల॥రా॥

వ. అనిన హనుమంతుం డిట్లనియె.

సీ. నినుఁబాసివెదకుచు ♦ నీభర్త ఋశ్యమూ
కాద్రిచెంతకురాఁగ ♦ నర్కసుతుడు
సుగ్రీవుడనువాఁడు ♦ చూచియచ్చెరువంది
చేరువకునుజేరి ♦ చెలిమిచేయ
వానిభార్యనుగొన్న ♦ వాలిని వధియించి
కిష్కింధనిచ్చె ను ♦గ్రీవునకును

నతఁడు బ్రిత్యుపకృతి ♦ నాచరింపఁగఁబూని
నినుజూడ బంపించె ♦ వనచరులను
గీ. వారిలోనన్నుఁ బిలచినీ ♦ వల్లభుండు
ముద్దుటుంగరమిచ్చి సు ♦ ముద్రిగాను
నీకునిమ్మన్న గైకొని ♦ నెమకికొనుచు
వచ్చినిన్నిందుఁ గంటినో ♦ వనజనయన

వ. అనిచెప్పిన మఱియు.

**హ-కీర్తన, ఆదితాళము.**

రామముద్రిక। గొనుము। రామముద్రిక। రామనామాక్షరములు న్న। రమ్యముద్రిక॥ రామ॥ నిన్ను నెనగెడు, నాడు। నీదుజనకుడు। పన్నగ నల్లునకునిచ్చిన। భద్రముద్రిక॥ రామ॥ భానుతనయుడు। మము, బంపున ప్పుడు। నానవాలురాముడిచ్చి, నట్టిముద్రిక॥ రా॥ అక్షయంబుగ। గడున, నర్ఘ్యతమైన। మోతుగుండ దేవువేల్పు। మురియు ముద్రిక॥ రామముద్రిక॥

వ. అని యర్పించిన నయ్యంగుళీయకమును గైకొని కన్నులన ద్దుకొని యానందభాష్పములురాల నిట్లనుచున్నది.

తో. మానుగబ్రాణ। దానముఁజేసితి। మారుతినాకునువినుము। ఏనీకునుబ్రితి। యేమిచేతునిక। నిలపయిస్థిరముగ మనుము॥ రా॥

వ. అనిదీవించి మఱియును.

సీత-తోహ. బుద్ధిమంతుఁడవు-పుణ్యపురుషుడవు -బుద్ధినిదెలసితినన ఘా! యిద్ధచరిత్రి! నాయిడుమలెల్లనీ-విపుడు గంటికద సరిగ॥ రామ॥

సీత-కీర్తన, ఆదితాళము-హిం,

మారుతీ! శ్రీరామునకు నా, మాట గావచింపుమా। జేరిదనుజులు బాధచేయగ్ర, శించెనని వచియింపుమా॥మా॥ రెండునెలలగు నంతకును మని-యుందునని యెఱిగింపుమా । ఖండితముగా రాని-చో రా, ణ్ములు విందురు దెలుపుమా॥ మా॥ వేగమునగపిసేనతోడను-వెడలిరమ్మని చెప్పుమా। బాగుగా నీరావణునిపై, భోగమెల్లను బల్కుమా॥ మా॥ రాక

సేందుృని తలలుధరబడ। రాల్చుమనివాకుృచ్చుమా। మోాకుగుండపురీశ నీకును-మొృక్కెనని పృకటింపుమా॥ మారుతీ॥

గీ. నేర్చినేరక యొగ్గులు ♦ నిన్ను బలికి
యనుభవించితి తత్ఫలం ♦ బది యుమఱచి
యన్న తోఁగూడివచ్చి న ♦ న్నాదరింపు
మనుచు నాముద్దుమఱదితో ♦ ననుముపత్స.

వ. అని కడువినయంబున నుడివిన పుడమికుమారి నుడువులకలరి యాంజనేయుండు.

హ-కీర్తన, బేగడ-చాపు.

సంశయుంపకు । స్వాంతములో నీవు॥ సంశ ॥ వింశతిబాహువి-వి కృమమదిమెంత॥సంశ॥ నిన్నెగ్గులాడుట-విన్నానేనప్పుడె । తన్ను దామను కొని। తాళితిగానిక॥ సం ॥ ముల్లోకములకు। దల్లివౌనిన్ దెచ్చు । బెల్ల ప్పుడీలంక। యేలేటందు కేన॥ సం॥ శ్రీమోాకుగుండ శ్రీ, రామునిలక్ష్మణు। వామాక్షితో డ్తెచ్చి-వానిజంపించెద॥ సం॥

తొ. పుతృపౌతృలతో-బొలియగలడురా, మునిచేతనుదశాననుడు। ధాతృనయోధ్యకు-ధపుడునునీవును-ద్వరలోజేరుదు రనుడు॥ రా ॥

సీత-తొ. మంచిదిరాముడు-మఱిలక్ష్మణుడును-మర్కటసైన్యము లెల్ల। నెంచకవారిధి। నెటులదాటగల । రెఱిగింపుము విలసిల్ల॥ రా ॥

వ. అనిన.

హ-క. రాముని సైన్యయుతంబుగ
నామూపున మోచికొని ఘ ♦ నంబుగనుదధిన్
భామిని యవలీలఁగనే
ధీమతి దాటింపఁగలను ♦ దివిజులు మెచ్చన్.

వ. ఇంకను గార్యంబులెల్లను స్వల్పకాలంబున నెరవేర్పఁబడును. ముద్దుటుంగర మిచ్చితిఁగదా! తిరిగి గామునకొసంగుటకొక్క యానవాలిమ్ము తల్లీ! భక్తజన కల్పవల్లీ.

క. అనిపలికిన ముదమందియుఁ
దనజడలో నిమిడియున్న ♦ తలమానికముక్
హనుమంతుని చేతికినిడి
జనకజ శ్రీమ్మరనుపలికె ♦ సంశయపడుచుక్.

వ. అనంత బలసంపన్నులగు రాక్షసుల నింత స్వల్పశరీరంబుగల మీ రెట్లు జయింతు రదియొక గొప్ప సంశయంబనిన జనకనందనతోఁ బవమాననందనుం డిట్లనియె.

తో. పూర్వరూపమున-బాడకట్టెదనో! పొలతిరో! కనుగొనుమ నుచు। బర్వతాకృతిగ-బవనజుడుండిన-బరికించిభయం పడును॥ రా॥

వ. జానకమ్మ కనులుమూసికొనిన నతం డెప్పటివలె సూక్ష్మరూపంబుననుండె నప్పుడు కనులుదెరచి.

సీత-కీర్తన, రూపకము-కళ్యాణి.

పవనతనయ-రాముజేర బదుము పదుమిక వివరంబుగనావార్తను। వినిపింపుము దయతోడను॥ పవన॥ నీజవంబువింటి। నేడు, నీబలంబు గంటి। ఆజికిజాలిన మేటివి। యపురాసరియతివేగమె॥ పవన॥ మోక్షగుండ పతికి। నీవు। ముఖ్యబంటవైతి। వీక్షణమున మాణిక్యము - యినకులపతి కర్పింపుము॥ పవన॥

వ. ఇదిగాక యింకొక సమాచారంబు చెప్పెదవినుము.

సీ. శ్రీరాముడునునేను ♦ జిత్రకూటాద్రియం దుండఁగ వంచించి ♦ యొక్కకాకి। నన్నంటనలిగి తృ ♦ ణంబొండువైచిన బ్రహ్మాస్త్రమై వెం ట ♦ బడిజగత్రి। యంబుదిప్పిన శర ♦ ణంబెందుఁగానక కావుకావుమ టంచుఁ ♦ గాకిమరల। వచ్చియుధనపాద్రిపుఁ ♦ జొచ్చిన దయగల్గి యొకక న్ననస్త్రంబు ♦ నకునొసంగు। మనుచు రక్షించెనట్టి ద ♦ యాంబుగాశి। రావణుండిట్టి కూరకా ♦ ర్యంబొనర్ప!। నూరకుండుట కిపుడువా ♦ నేర మేమొ। చాల వినిపింపవ య్యవా ♦ తూలతనయ!

వ. అవిన హనుమంతుం డిట్లనియె.

క. అమ్మా! యింక ద్వరలోఁ గా। ర్యమ్ములు సకలంబుఁదీస్తు • నాకలిగొంటిన్। నెమ్మది నీవనమందు ఫ। లమ్ములుదిని పోవఁగా సెలవు నాకిడుమా.

వ. అనిన మంచి దటులఁజేసి త్వరగఁబొమ్మన వల్లెయని జానకికి వందనంబొనర్చి కదలితానువచ్చి పోవుటరావణున కెఱుకపఱచువాడై.

తో. ఆయశోకవన, మందుసీతయు, న్నట్టిచెట్టుదక్కగను । బాయకనన్నియు-వాయుతనూజుఁడు-పడద్రోసెను మేలుగను॥ రామ॥

వ. ఇట్లు చుట్టుముట్టి వనంబంతయుఁ జెకలించి యార్చి పేర్చి యెదిరించిన వనపాలకుల నెనిమిదివేలమందిని యొక్కపెట్టునఁ గూల్చిన రాక్షసస్త్రీలు నివ్వెరగంది సీతను కనుంగొని.

స్త్రీల-కీర్తన, ఆది-కమాస్.

అత-డెవరో! జానకీ! ॥యత॥ వివిధవృక్షముల-విఱిచివేసెయు॥నత॥ వనచరునిరూపము। గేసరిపుత్రాపము। ఉరుబలవీరుల। నుక్కడంచె॥ నత॥ నిను, గాంచిపలికెను। యిట, నుంచిపోయెను। యెంచ మోక్షగుం, డేను నిచెలి॥ యితడెవరో॥

వ. అనిన నామె యిట్లనియె.

త్రి. శోకము చేతను-నుస్కుచుంటినిట- నాకెటు తెలియును నది యు। బాకటముగమీ, రాక్షసమాయలు-మీకే తెలియఁగవలయు॥రా॥

వ. అనిపలికిన నారు భయంబునుబొందుచుఁ ద్వరగాఁజని రావణుగని మొక్కి యిట్లనుచున్నారు.

స్త్రీల-కీర్తన, ఆదితాళము.

మీరుగృహము జేరిన । మీదచటజరిగిన। కారుబారు లిప్పుడు। గరుణచి త్తగింపుడు॥ మీరు॥ కోతియొకటివచ్చెను । సీతతోభాషించెను । ప్రీతిమేను బెంచెను। బిట్టువనముద్రుంచెను॥ మీరు ॥ రాక్షసులను గూల్చెను । రమ్యహర్మ్యమెక్కెను । మోక్షగుండహరికిని । ముఖ్యుడేమొ ధరణిని॥ మీరు॥

వ. అనిపలికిన రావణుం డు మహాశ్చర్య కోపంబులు పెనఁగొన, నేను బదివేల రాక్షసదళంబుల బలవంతులఁ బంపిన వారు చని రంతలో సూర్యోదయంబగుటయు.

సీ. పంక్తికంఠుఁ డుదర ♦ పర్యంకమున నున్న కటిబంధనముఁ గని ♦ గయుని దిగను। గుర్తించి భార్యను ♦ గూడినాఁడని యెంచి ఖడ్గంబు గొని చంపఁ ♦ గవిసినంత। స్త్రీహత్య వలదని ♦ చెలులు నివారింప నుడిగి యూఁగ యునింటి ♦ కొనరఁ బోయి। వీని చే మృతివిధి ♦ వానికి లిఖియించెఁ గాన నిద్రితుని ఖ ♦ డ్గమునఁ దునిమె। నంతఁ దనపాన్పుపై నున్న ♦ యంబరంబు। గని విభీషణుఁ డన్నది ♦ గా నెఱింగి। సరమను వధింపఁ జంద్రహా ♦ సంబుఁ బూన। వలదు స్త్రీహత్య యని స్త్రీలు ♦ దెలుపమాని॥

వ. అదిమొదలు రావణుని సాంగత్యంబు వదలి యెటకేని యుఁ బోవ సంకల్పించుచుండె. నిక్కడ రావణ ప్రేరిత రాక్షస దళంబులు చనుదెంచి.

తో. తోరణకంబము-తుదఁ గూర్చుండిన-మారుతిపై బాణములు। సారెకు బరపినఁ-సరకుగొనక దా-సరగ జేసె శకలములు॥ రామ॥

వ. ఇట్లు శకలంబులు జేసి వారిపయికిఁ గుప్పించి దుమికి క్షణమాత్రములో నందఱను ముష్టిఘట్టనలచే మ్రిందించిన హతశేషులచే నవ్వార్తఁ దెలిసి యచ్చెరువొంది రావణుఁడు వక్రనాసుఁడు, బింగళాక్షుఁడు, దీర్ఘజిహ్వుఁడు, నశ్మవక్షుఁడు, శార్దూలముఖుఁడు నను పేరులుఁగల యైదుగురు సేనాధిపతులఁ బంపిన వారు చని.

తో. కేకలు వేయుచు-మూఁకలుగట్టియుఁ దాకి బాణములు వ్రేయ। భీరకరముగ గపి-వీరుడు బెదరక-తోకతోడఁ బొడిచేయ॥ రామ॥

వ. వారును బోక చుట్టుకొనినఁ దోరణ స్తంభంబు చేత నొక్కొక్కని మోది చక్కాడిన నది తెలిసి దశకంఠుండు రక్తరోమ, శతజిహ్వ, రుధిరలోచన, స్తనితహస్త, శూలదంష్ట్ర, దుర్ముఖ, వ్యాఘ్రకబళులను నేడుగురు బలశాలురఁ బంప వారుం జని.

రాక్షస-కీర్తన, ఆదితాళము.

ఎక్కడికోతివి-యెటకేగింపు,నీ। డొక్క చించెదము-స్థైరింపు। మిక్కిలినీమెర-మెచ్చులుసూపక ॥ యెక్కడి ॥ త్రొక్కిన త్రొక్కుకు-మొక్కిన నోట। గ్రక్కున నెత్తురు-గ్రక్కెదవు॥ యె॥ కండలు బేవులు-గుండెలుచీలిచి। వండితిందుము-వబ్బిడిగ॥ యె॥ మోక్షగుండపతి-రక్షించినను రాక్షసులనుజే-రగదరమూ॥ యెక్కడి॥

వ. ఇట్లు ప్రగల్భంబులాడుచు బాణపరంపరల నుంచిన హనుమంతుం డట్టహాసంబున.

తో. ఉరగంబులపై। కురికెడుగరుడుని। కరణినిబై బడదూకి। కరిరథహయముల। నురుముచేసియమ। పురిజేరగ వారినూకి॥ రామ॥

వ. భుజాస్ఫాలనంబుజేసి నిలిచిన నదివిని ప్రహస్తుని సుతుండనంత ప్రతాప నిర్జితాంశుమాలియగు జంబుమాలి రావణానుజ్ఞచే వెడలివచ్చి. వేదండతుండ నిభంబగు నుద్దండభుజాదండంబున బ్రహ్మాండంబుననుండిన కొండలయినఁ బిండిపిండిగఁ జేయఁజాలిన దండిమగండనగు నాదండకురాఁగ బుండరీకాక్షుండైన నోపఁడు. నీకండలొక కుండకయినఁజాలవే! మంచిదుండుము. భండనంబున నీగుండెలు ఖండించి దండధరుని యండకుఁబంపెద. మొండీ! నామాటబహుళకరాఖండీ. యని న వినియాంజనేయుండు. ఖండేందుమౌళి కోదండంబుఁ బిండిచేసిన కోదండపాణిభటుండ. చండాంశసుతుని సచివుండ. నాంజనేయుండ. భండనభీముండ. గుండెగలశూరుండవయిన నిండువేడ్కతో రారారండా! ఇప్పుడే! మాయింతునీముండ చేసెదమరలమాట్లాడకుండ ననినప్పుడు.

తో. జంబుమాలిరోషంబున బటుబాణంబులు పైబడవైవ। డంబుచెడక సాలంబుచేత ఖండంబుజేసికదుజేవ॥ రామ॥

వ. పయిఁబడఁదుమికి రథరథ్యంబులఁ జూర్ణంబుచేసిన.

తో. అడిదముఁబలకయు-నతఁడుఁబూనిపై -కడరిననంతటిలోన। బిడికిటఁబొడచిన-బీరము చెడిపడి-బడియెనాలడిలపైన ॥రా॥

వ. ఇట్లు జంబుమాలియాలిగిన నావార్తవిని కొంతవడికు జింతించి రావణుండు విరూపాక్ష, భాసకర్ణ, దీర్ఘజిహ్వ, ప్రఘసాదయు లను - పంచసేనాగ్రనాయకుల ననికిఁబంపినవారు బ్రతాపంబినుమడిం పఁజని.

రాక్షసుల-పకతాళము, బ్యాండు.

మావనంబుబీకితివై వ-నీవెవండవు ॥ పోవా ॥ లేవా । యీవిధిగ- జావగల-దేవుఁడునుదుటల । శివిగవాసెన్-గావునఁ దెగువల॥ మా ॥ లేరా-రారా! చేరగల-బోరగల। శూరుఁడవైనల। ఘోరశరములుల। సారెకువెడలెల॥మావనంబు॥ చుట్టు, ముట్టు-పట్టగల-నెట్టిలాగగల జుట్ట ములెవరు తట్టునబాపల॥మావనంబు॥ మోక్ష, గుండా-ధ్యక్షుని-పక్షమై రాక్షసులపయి। దక్షుడవగుచుల-దండువెడలితో ॥మావనంబు॥

వ. అనిన నాంజనేయుండు తగ్గుమొగ్గుదెలియక నెగ్గులాడుచు నాదగ్గిరఁజేరిన రక్కసులునుగ్గునూచమయిరి. మీరు సిగ్గులేక పెగ్గెలు దీయుచు నగ్గలంబుగఁ జుట్టుముట్టితిరి చప్పట్టున మీపొట్టలుపగులఁగొట్టి తట్టునఁ బ్రొద్దుపట్టి పట్టణంబునకు నెట్టకున్న నేజెట్టినేనా ! వట్టిదిగాదట్ట ట్టుబోక దిట్టంబుగనిలువుడు రాక్షసాధములారా! అనిపలికి.

తో. వారిపై నగడు-వడిబడదుమికియు- వారిబాణములుగొనక । దోరణకంబము, తో నొక్కొక్కని-మారిచంపెనటువెనుక ॥ రామ॥

వ. ఆసమాచారంబువిని రావణుండక్ష కుమారునింజూచి.

తో. వనచరమొక్కటి, వచ్చియుమనదగు-వనమెల్లను బెకలించి। దనుజులజంపెను-దగజనిగూల్చుము-దానిపయిననెదిరించి ॥రామ॥

వ. అనినమంచిదని యక్షకుమారుఁడు బహుసైన్యయుతంబుగ రథారూఢుండయి నడచి తోరణస్తంభంబుపయి బ్రళయార్కునిపగిది నున్న హనుమంతునిఁగని.

పంచచా॥ దురంబునందు నెంతవానినైతఁ డన్నైన బోరిబల్ । ప రాక్రమంబుఁజూపునట్టి పంక్తికంఠ పుత్రుడల। బరాకుమానియుందు

నిల్వ ♦ పారిపోకు వచ్చెనా । శరంబులక్షయంబుగా వ ♦ శంబు గాదు చూడుమా !

వ. అని పెక్కుమ్ము లొక్కుమ్మడివైచిన.

హా. పంచచామరము.

పరాత్ముఁడైన రామువేవిఁ ♦ బట్టితెచ్చినట్టియా । దురాత్మునకు జెట్టుంచుతెంపు ♦ తోడతెవచ్చినావునీ। శిరంబుదుంచినేను వింద ♦ సేతుభూత పాళికిన్। దరంబుగాదు నన్నువీఁక ♦ దాఁకి మళ్ళిపోవఁగన్.

వ. అనిపలికి పైకిలంఘించి యతండు వయిచిన బాణంబులు చూర్ణంబుజేసి.

తో. హుంకరించి వాని, యురమునరామునిl కింకరుండు పోడువగను । బింకముచెడి-విల, విలదన్నుకొనుచు । విడిచెను దనప్రాణము ను ॥ రా ॥

వ. పిమ్మటఁ గాలఁజేత మట్టియతనిసైన్యమును బిలుకుమార్చి నక్కుమారుని మరణవార్త హతశేషుల వలనవిని రావణుండు నిర్విణ్ణుండయి.

రా-కీర్తన, పున్నాగవరాళి, ఆదితాళము.

ననుబాసిపోతివా! నినుగోలు పోతిరా! యక్షతనయ! నను॥ వనచరుడెవ్వడో! చనుదెంచెమృత్యువై। యక్షతనయ! నను॥ బలశాలివనుచును। బరికించిచూతును। యక్షతనయ! ॥నను॥ శ్రీమోహగుండ శ్రీరాముడుపంపెనో! యక్షతనయ!॥ నను॥

వ. ఇట్లువిలపించుతండ్రికి ఇంద్రజిత్తుమ్రొక్కి యిట్లనియె.

క. నీతనయునిచావునకై । యీతీరునదుఃఖపడిన♦ నిదిమేలగునా। నాతండ్రి! శెలవిచ్చిన। నాతనినేఁబట్టితెత్తునశిజునిసుమనన్.

వ. అనిన ధయిర్యంబునొంది.

తో. సురపతిఁగెలిచిన- జోదుప్రసివతి- శూరుడనగుదుప్ర కాన । సరగుననావన-చరునిబట్టెనా-నన్నధికిక దెమ్మనిన॥ రాము॥

వ. ప్రళయకాలాభీల జాజ్వల్యమాన మహానలంబు చందంబున మండిపడుచు దండిభటు లనేకులు గొలువ రథారూఢుండై చని తోరణస్తంభాగ్రంబున నుండిన మారుతిఁగని కోపాటోపంబున.

ఇందిరా- కీర్తన, ఆదితాళము.

ఉండుండుముండుమురా! కోతివాడ! యుండు॥ ఉండుండుబహుళర ణ,పాండిత్యమున్నట్లు। మెండుగ దిరిగేవు। తుండెములుగ జేతు॥ నుండుం॥ శ్రీమోక్షగుండేశుని। సంతతము। సేవించువాడవని। నామదికినిదోచె। న న్నెదిరించుము। నేమేఘనాథుడ। నీజిడ్డువదిలింతు॥ నుండుండు॥

వ. అనిపలికిన హనుమంతుండు.

తో. రామునిదూతను-రాక్షసవినరా-భూమిజఁ బొడగన వచ్చి। వేసులు నిచ్చట-విహరించితి నా,విక్రమంబు గనబరచి॥ రా॥

వ. ఇదివఱకు వచ్చిన మీవారలలతో నినుఁగలిపెద రారమ్మను డు మేఘనాథుండతని శరీరంబుపై బాణవర్షంబుగురిపించిన లక్ష్యపె ట్టక దక్షిణంబునఁ గ్రిందికివచ్చి తనలావుమెఱయ.

తో. అతనిరథంబును - నవనిగూల్చి మఱి-యశ్వములను మడియించి। ధృతిశోభటుల వ,ధించినమఱియొక- తేరునెక్కియెదిరించి॥ బ్రహ్మాస్త్రంబును-బరువడివైచియు-బవనతనయు బంధించి। బ్రహ్మాదులు వి,భ్రమపడ రావణ-బ్రహ్మ చెంగటికిమించి॥ రా॥

వ. అనేక విధంబులఁ గొట్టుచుఁ దిట్టుచు బాధింపుచు దోడుకొనివచ్చి రావణుని యెదుట నిలిపిరి. బ్రహ్మాస్త్రంబుచే బాధ లేకుండు నట్లు బ్రహ్మచే మున్ను వరముఁ గొనియున్నాఁడు కాన హనుమంతుని బ్రహ్మాస్త్రమేమియుఁ జేయదయ్యె నప్పుడు రావణునియాజ్ఞచేఁ బ్రహస్తుండిట్లనియె.

ప్రహా-కీర్తన, దర్బారు, అటతాళము.

ఎవ్వరివాడవురా। యెఱిగింపు రాజుతోడ। నివ్వీటి కెందు కొరా। కేతెంచినావురా॥ యెవ్వరి॥ వనమెల్ల జెరుపగ। దనుజులదునుమగ। బనియే

మి నిక్కముగ। బలుకు నీవేరేమిర॥ యెవ్వరి॥ శుభముగ నీలంక,జొచ్చి చూచుటకును। ద్రిభువనముల లోను। ధీరుడెవ్వాడు లేడు॥ యెవ్వరి॥ ధారుణిమోహుగుండ,ధాతుడా! శంకరుడా! పారసగర్భుడేనె! సరగున బంపినది॥ యెవ్వరివాడవుర॥

వ. అనియడిగిన నాంజనేయుండు రావణునదిక్కు నభిముఖుండయి యిట్లనియె.

క. ఓరీరావణ! వినరా! యీ రేడుజగంబులెల్ల♦నేలుచునుండే! నారాయణాంశభవుడగు। శ్రీరాముని దూతనగుదు♦జిత్తంబలరన్.

ఉ. సీతనుదెచ్చినీవిచటఁ। జేర్చినపిమ్మట రాఘవుండు వి। ఖ్యాతిగ బుశ్యమూకమను♦నద్రికిఁజేరెదివాకరాత్మజున్। బ్రీతిగఁగూడివాలినొక♦ వ్రేటునద్రుంచిననాట రాజ్యమున్। ఆతనికియ్యసంతసము♦నందును జానకిజాడఁ జూడఁగన్.

తొ. దశదిక్కులకును- దరణినందనుడు-దరిమెను గపిసైన్యముల। విశదంబుగ। నేవెడలి జానకినివెదకుచు సత్వమునిగుల ॥ రాము॥

వ. సముద్రంబునొక్క కాలువంబోలెదాఁటి నీనగరంబుఁ బ్రవేశించి వెదకుచు నశోకవనంబుఁజొచ్చి శింశుపావృక్షంబుక్రిందఁ గూర్చుండిన.

తొ. సీతనుగని రాము-క్షేమముజెప్పియు-బ్రీతిగనుంగరమిచ్చి। నీతిగఁజనకను-నాతెఱగంతయు- నీకుదెలుపగావలచి॥ రాము॥

గీ. వనముద్రుంచి వేగ♦వన పాలకులఁజంపి।నీదుసేన నెల్ల ♦ నీరుచేసి। పరగనింద్రజిత్తు ♦ బ్రహ్మాస్త్రమునకును। జిక్కినీదుకడకుఁ ♦ జేరినాఁడ.

తొ. చావనుబ్రహ్మాస్త్రంబుచేతనటు-గావున జిక్కితినేను। వే వేగంబున-వినుహనుమంతుడ-రావణ వాయుసుతుడను॥ రాము॥

హ-కీర్తన, అటతాళము, కాపిరాగము.

దానవరామ ప్రతాపమునీమది- గానవునీవటు-గావునఁ ద్రెల్లెదు। నేనెఱిగించెద। నిన్నుజయించిన।వానిని వాలిని,వధియించెజూడుము॥ దానవ॥ ఖండేందుధరునికో-దండము విరిచెను। దండిగ భృగురాము। ద

ర్పమడంచెను । ఖండించెగరకర । ఖరముఖులను మోక్ష,గుండవిభుని ప
యి, గూ్రరము మానవు॥ దానవ॥

ఉ. ఉత్తమభూసురుండవయి ♦ యుత్తరదిక్పతి సోదరుండవై
చిత్తజవైరిబంటవయి ♦ చిత్తము సత్యము సత్వసద్గుణా
యత్తముఁజేయలేక యస ♦ యంబు దమోగుణమందునిల్పి మ
ర్త్యాత్తినిమించి కానక చ ♦ రించెదవే మదియోందశాననా!.

ఉ. అందఱునిన్నుఁగాంచి భయ ♦ మందుచురింతియె కానినీకు నీ
తిందగఁదెల్పలేరు కుమ ♦ తీ! స్వయమీవు నెఱుంగఁజాలవే
మందు గళత్రపుత్రసచి ♦ వాగ్ధశరీరము లస్థిరంబుగా
నెందుకునెంచలేవు చెడ ♦ నేటికిఁ దెల్పెద నాలకింపుమా.

హను-కీర్తన, ఏకతాళము.

మాయానిర్మితమగును గాయము। న,పాయంబందు ధాతుమయ
ము హేయము॥ నిజమాయా॥ వనితలుఁ-దనయులుఁ- దనువులుఁ- ధ
నములుఁ- దనవియనుచు-గనుజీవుడు॥ నిజమాయా॥ జల,మందుగలు
గుబుగ్గల,రీతిఁ-బ్రీతిఁ- దోచియడగును॥ నిజమాయా॥ ఎన్నెన్నితనువు
లు। మున్నెత్తియుంటిమో! యికనెన్నితనువు। లిల-నెన్నగ- దిన్నగ-బన్న
గ-నెత్తునుమో! ॥నిజమాయా॥ లేకుండు నుండు-లేకుండు । బ్రాకటకా
ముదిపగిదిగను ॥ నిజమాయా ॥ కలలోననేక దేహచయము - గానుపిం
చుచుఁ। ఆ,లోనఁ మెటు,బోనో యదృశ్యము-లై నటు-గానెంచుము॥
నిజమాయా॥ ధర-మోకుగుండ వరపురాధ్యక్షుడీ- తనువులుఁ- సాక్షియై
దీక్షతోడ । గనుగొనున్ ॥ నిజమాయా ॥

తో. ఆకాశమువలె-నంతటనిండిన-యచలుడు పరమాత్ముండు ।
బ్రాకృతతనువుల-బటుజీవుండనఁ బరగిసూక్ష్మముగనుండు॥ రామ ॥

గీ. అట్టిజీవాత్ముఁడీ శరీ♦రాభిమాన। మునను దేహంబె! యాత్మ
గా ♦ బుద్ధినెంచి ♦ దనరసంసారవార్ధిలో ♦ మునిగి స్వకృత । కర్మఫలమును
గుడుచుచు ♦ గడగియుండు.

వ. ఇట్లుండి కాలాంతరంబున.

తో. తనువింకొక్కటి-దాఁ ధరించును-తృణజలూకమునుబోలి।
కనుగొన నెన్నటి-కినియాద్యంతము-గనబడకుండును బాళి॥ రామ॥

వ కాఁబట్టి వివేకవంతుఁడు నిత్యానిత్యవస్తువుల విచారించి యనిత్యంబులయం దాసఁరోసి నిత్యమయిన యాత్మనెఱింగి యాత్మయందుఁ గలసినఁగదా! జన్మరాహిత్యంబు. రావణా! యట్టి యాత్మస్వరూపుండీ రాముండని కనరాదా!

హు-కీర్తన, ఆదితాళము.

ప్ర-ధానపురుషుడవ్యయుండు, రాముఁడు,। మానిమానసాబ్జసంస్థాన ధాముడు। తానే, తానై, తనరునాతడు॥ ప్రిధా॥ అనంత నామరూపములు, నీయంతయై। సంతతంబుజేసితాను, నంతరాత్మయై,। శాంతి, దాంతివంతుడయితగు ॥ ప్రిధా ॥ అజాండకోట్లయందుదానఖండుఁడై, చండకిరణు। రీతి మోంకుగుండనిలయుఁడై, దండి, నిండి, యుండునచలుఁడై॥ ప్రిధానపురు॥

వ. అట్టిపురాణపురుషుడు దుష్టనిగ్రహ శిష్టపరిపాలన కొఱకుఁ బ్రితియుగంబున నేదోయొక రూపంబున నవతరించుఁ గాన నట్టి యవతారమూర్తి యీరాముండని తెలియుము దశకంఠా! నేను విశదంబుగఁ దెలిపితిని గాన నెఱుకగలిఁగి.

గీ. ఇంతటనున్నైన యమ్మాల్యవంతమందు। రామలక్ష్మణులున్నారు•రాకసేంద్రి। సీతఁగొనిపోయియిచ్చి తత్సేవచేసి। కులమునెల్లను రక్షించు•కొనుముసరగ.

వ. అటులొనర్పక గర్వించితేని వినుము.

హు-కీర్తన- హిం, కాఫి, అటతాళము.

భండనభీముండడగుకో-దండపాణి యేతెంచును। నిండు ధయిర్యముతోడ। నీదుపురిముట్టడించు॥ భండన॥ ధాత్రిగనువాకన్నను। మేటియగుకపిసేన। కోటానకోటులుదనుగొల్చుచుచు వెంటరాగ॥ భండన॥ ఖండి

తముగనుమోక్ష। గుండపతిసీతలలు। చెందువానుగాదానీకు। జెచ్చెరనుదె
లిపెడిని॥ భండన॥

వ. అని ఖండితంబుగఁ బలికినఁ వానరేంద్రుని వాక్యంబులువిని
కోపోద్దీపితమానసుండయి కన్నులయందు నిప్పులుప్పతిల్లఁ బ్రహస్తాది
మంత్రులదిక్కు చూచి.

తో. వింటిరెమీరలు వీనిప్రతాము- వీనిప్రగల్భములెల్ల। నొం
టిగనుండియు- నోడక నాకెదు,రొడ్డినూసెడిక జెల్ల॥ దిక్కులగెలిచితి- ది
క్పాలకులును- దేరిచూడవెఱచెదరు। చక్కగమనుజుని- శరణుజొచ్చుమ
ని- సరిగావీడీటు వదరు॥రామ॥

వ. కాఁబట్టి వీనిని గట్టిగాఁబట్టి పొట్టకొవ్వు రాలఁగొట్టి దిట్టత
నంబున మట్టివేర్పయుఁడు మంత్రులారా ! సమస్తకార్య స్వతంత్రులా
రా ! అనిన వారందుకు సన్నద్ధులగుచుండ బుద్ధిశాలియగు విభీషణుండ
న్నసన్నిధికివచ్చి నమస్కరించి యిట్లనియె.

విభీ-కీర్తన, నవరోజు, ఆదితాళము.

సరిగాదీపని రావణా॥ నీకు॥ సరిగాదీపని॥ సరగునదూతల। దరు
ణులబాలుర। ధరణీసురలనుజంప॥ సరి॥ దూతలుదమతము। దొరలను మ
నునది। ఖ్యాతిగనందురుగాదే॥సరి॥ ఊరకవిడుచుట- కొప్పకున్ననొక-తీరు
గ దండనజేయు॥ సరి॥ గుండెగలుగు శూ,రుండవైన మోక్షగుండ వి
భునిపై కేగు॥ సరి॥

వ. ఇట్లు బోధించిన విభీషణుని వాక్యంబుల కామోదించి హను
మంతునిజంపుమనిచెప్పిన తలంపువదలి మంత్రులకు మరల నిట్లనియె.

తో. వానరులకు ధర,వాలమె। మూలముఁ గాన వీనితోకకును।
నూనెగుడ్డలను-మానుగఁజుట్టియు- బూనికాల్చి విడుడనెను॥రామ॥

వ. ఇట్లు ఖండితంబుగ నాజ్ఞయిచ్చిన రావణుని శాసనంబునరా
క్షసులు చెలరేగి యాంజనేయుని బాశబద్ధునిచేసి ప్రతియింటఁగల గు
డ్డలన్నియుఁదెచ్చి నూనెతోఁదడపి తోఁకకుఁజుట్టి నిప్పంటించి వాద్యం

బులతోఁగూడ సపహాస్యంబు చేయుచు.

తో. దనుజులనందరి, దరిమియుగఱచిన। వనచర కీటకమిదిగో। మనకును దొఱకెను- మర్దింపుండని-మట్టుచు గొట్టుచు బగతో॥రామ॥

వ. పురవీధులెల్లఁ గలయఁదిప్పి పశ్చిమద్వారంబుకడకుఁ జేర్చి రింతలోఁ గొందఱు రాక్షసాంగన లావార్త సీత కెఱిఁగించిన నామె వగచుచు.

సీత-కీర్తన, హిం, తోడి, అటతాళము.

ఎంతకష్టమువచ్చెను। నేమిచేయగవచ్చునా। ఎంతయని విలపింతును। జింతయెటువలెదీర్తును॥ఎంత॥ మాయావాదిదైవము। మాకు నీవు సహాయము। జేయనోరువడాయెను। జిక్కులేకలిగించెను ॥ఎంత॥ సాక్షియై నారాయణ। శర్మను రక్షించిన। మోక్షగుండ దేవుని। ముఖ్యభక్తుడవయిననీ ॥ కెంతకష్టము॥

వ. అని కొంతవఱకు జింతించి యనంతరంబు ధైర్యంబున వగ్నినిగూర్చి నమస్కరించి.

క. నేను బతివ్రతనైనను। క్షోణినినావిభుఁడుసత్య•శోభితుఁడయినఁ।వానరు దేహముఁగాల్పక।దానతిసీతలమునొందు• దహనుండిపుడున్.

వ. అని నియతురాలై యగ్నినిబ్రార్థింప నమ్మహాపతివ్రత నియతవాక్కులకలరి జాతవేదసుండు శీతలుండయి యాంజనేయుని బాధింపకుండె. నిక్కడ హనుమంతుండు.

తో. ఔరానన్ని- యగ్నిదహింపక- యూరకుండుటకేమో। కారణమగు జన,కపిత్రియుడగుటనో! మనరామానుగ్రహమో॥రామ॥

వ. ఇవి యన్నియుఁగావు. పతివ్రతాశిరోమణియగు సీతాదేవి యొక్క యుపారకృపమైయుండవచ్చు. సత్యంబు సత్యంబు. నాకుఁగొదువలేదని సీతారాములకు నమస్కరించి బ్రహ్మమంత్రంబు పఠియించిన మాత్రంబున బ్రహ్మాస్త్రంబు వదలిపోయె. నింతలో నినుండ స్తమించుటయు.

గీ. పర్వతాకృతిగను వాయు♦పట్టి పెరిగి। చుట్టుకొన్నట్టి దనుజుల♦
సుక్కు(జేసి। క్షణములోపల నాకాశ♦మునకు నెగిరి। పక్షికంఠుని మే
డపై(♦ బర(గ దుమికె.

వ. ఇట్లు దుమికి.

తో. అతనినగళ్ళను- జతికిలదోర్చియుచు- నగ్నిని నంటింపగను।
నతివడిగాలగ। నదిమొదలుగబుర, మంతయు(గాల్చెను తగను॥రామ॥

వ. ఇట్లంజనాపుత్రుండు విజృంభించి వాలంబు పెంచి లంకానగ
రంబు విభీషణగృహంబుదక్క( దక్కిన దేదియు(బోకుండ( గాల్చిన( బ
లాయనము గుటకు శక్తి లేని స్త్రీ బాల వృద్ధాదులు దేహంబులు గాలు
చుండ నొకరి నొకరు కౌ(గిలించుకొని.

పౌరుల-కీర్తన, ఆదితాళము, శంకరాభరణము.

అయ్యయ్యో! చూడరే!యెంత!యన్యాయముగూడెన :బయ్యోన
రావణునకు-జావేమైనమూడెనో! ॥అయ్య॥ పరకాంతను బతివ్రతను, జెర
బట్టితాదెచ్చెను। బురముగాలే(దత్ఫలము। బొందు వేళవచ్చెను॥ అయ్య॥
సుతులన్నదమ్ములుహితులు- బతులు సతులు ననుచును। వెతకులాడేవ్వ
వధిలేదు। బ్రతుకుదూరమాయెను॥అయ్య॥ మోక్షగుండ రాఘువునిపై।
గక్షకట్టకుండిన। రాక్షసవరులకాపు,రములకు( కీటాదవునే॥అయ్య॥

వ. ఇట్లు పురజనులెల్ల( జీకాకుపడ(జేసి సముద్రంబునందు వా
లంబు చల్లార్చుకొని హేమవర్ణంబుగ నలరారు లంకానగర భూమినిగ
ని హనుమంతుం డాశ్చర్యంబు నొందెనని చెప్పిన శివునకు భవాని
యిట్లనియె.

తో. హేమవర్ణముగ-నేటికిలంకా। భూమియులరె వినియెదను।
స్వామిచెప్పుమన- హైమవతినిగని। సోమ శేఖరుండనెను॥ రా॥

క. ఉరగులకమృతము(దెచ్చుట। కరుగు గరుడుండు( గడు
క్షు♦ధాతుర(డై శ్రీ। హరినిగని మ్రొక్కియాకలి। దొర(గు తెలుంగడు
గ నాయ(ధోక్షజు(డనియె.

విష్ణు-కీర్తన, ఆదితాళము, శహాన, వనమునుజూడఁగ.

వినువినతా పుత్రి! నీకు-విస్తరించి దెల్పెదన్। మునుకరి మకరము లెనసి బోరగరి। ననువేడగ మక-రినినే దునిమితి॥విను॥ కరీంద్రుడపుడా। శరీరమునుదా। దొరంగిశాపముదీరగ। దిరంబుగనుజనె। ధరిత్రినవియొక సరోవరముకడ।జాలనున్నయవి॥విను॥ ఘనంబుగను ద,త్కళేబరంబులు। దినంగనాకలిదీరును। చనంగనగు మో- క్షుగుండపతి యా,జ్ఞనచ్చటికి వీ క్షణంబులోనిక॥విను॥

వ. ఇట్లుతెలిపిన హరియనుమతి వడసి తార్క్ష్యుండు తత్క్షణంబున నాపుణ్యసరోవరంబుకడకుఁ జేరువచ్చెను.

క. గజనక్ర కళేబరములఁ। భుజియింపఁగ వచ్చియున్న భూభ్రిభం గునిద। ద్గజ నక్రంబులఁ గైకొని। భుజగారి వియత్పథమునఁ- బోయె యథేచ్ఛన్.

వ. భూభ్రిభంగనామ గృధ్రపతిని గరిమకరములను రెండుపాద ములఁ దగిలించుకొని భక్షించుటకు విశాలస్థలం బరయుచుఁ జని క్షీర సముద్రతీరంబుననున్న జాంబూనద వృక్షముయొక్క సహస్రయోజన పరిమితిగల యొక్క శాఖమీఁదఁ గూర్చుండిన.

తో. గరుడునిభారము- కడుదుస్సహమై- తరుశాఖవిరుంగగను। ధరబడకుండగ। దానిముక్కునను। దగగొని నెమ్మనమునను॥రామ॥

గరుడుని-కీర్తన, ఏకతాళము, హిం, తోడి.

ఏమితోచదెందుబోయెద! నిది। యెచ్చోట పారవైచెద॥ నేమి॥ దీని। భూమిపై నుంచిన భూతకోటులకు। వేమరుగీడౌదవ్వ॥యేమి॥ అందు మునీంద్రులు, యెందరోగలరు॥ ఇక॥ బొందునుగవారిత- పోభంగమైన నే మందురో! శపియింతురో! ॥యేమి॥ ఆకలినిల్వ। లేకహరిదెల్ప।వీని,చేకొని పోయి భుజింపగబోయిన। నీకొమ్మవిరిగెనయో!॥యేమి॥ శ్రీమోక్షుగుండ। స్వామియెండ। లే,దేమోకో! యాపద- లేతెంచె- బాపగ- నెవ్వరగు పడరు॥యేమి॥

వ. అనియిట్లు విచారంబు నొందుచుఁ బోయి యొక్కచోఁ ద
పంబుచేయుచున్న కశ్యప మహర్షినిఁగని వినయంబున నిట్లనియె.

మ. జనకా! యీతరుశాఖ నొందిడుము నీ॰జంతుత్రయంబెచ్చ
టఁగ । దినినేఁబోదు ననంగసర్వముఁ దపో॰దృష్టిన్విలోకించి యా। యన
వత్సా! విను నూరుయోజనములీ॰ యంబోధి లంఘించినఁగ । గనుపట్టు
న్విజన ప్రదేశమగు లం॰ కాద్వీపమం దొప్పఁగఁగ.

వ. వీనిని భక్షించి యీకొమ్మయం దుంచిపొమ్మని దీవించి
పంపిన వేగంబున నచ్చటికేతెంచి.

ద్విపద. ఆజంతువులఁదీని, యస్థిచయంబు।రాజితముగ మూఁడు,
రాసులుచేసి । యామీఁదదరుశాఖ-నమరంగనిలిపి । ధీమతితో వైన, తే
యుండు చనియె। నదిత్రికూటాచల, మననలరారెఁ। బదపడియందు ద,
పంబొనరించు। వాలఖిల్యాదు ల, ర్వదివేలఋషులు । పోలంగదపములు-
పూర్ణమైముక్తి। పొందిరియంతజం, బూఫలసార । మందుఖనీభ-మైపాచి
పట్టి। యుండెనాపైబురం, బొందునిర్మించి । యుండిరి రాక్షను, లోగిగా
పురముగ। హనుమంతుఁడదికాల్చ-నారాక్ష్యకరగి । కనఁబడెనాభూమి, క
నక మయముగ.

వ. అంతట హనుమంతుండు తిరిగి సీతాంబసన్నిధికేగి యిట్లను
చున్నాఁడు.

తో. తల్లినేనువన, మెల్లను బెరికితి-దగులబెట్టితిని పురిని। అల్లా
డించితి-నసురుల సెలవి, మ్మరిగెదనే నిత్తరిని॥ రామ॥

వ. నీభర్తను సుగ్రీవాది వనచర యుతంబుగాఁ దోడితెచ్చి నీ
యిడుములు నివారింపఁజేసెద. ధైర్యంబున నుండుమని చెప్పిన సీత
యిట్లనియె.

తో. రాము వాతఁడాక, ఈదాహమ్మాతముగనీ, చేసూరుతి! నేవింటి।నీ
మీఁదను నే-నిక్కడవగపున-నెటులనుండె దనుకొంటి॥ రామ॥

వ. అనిన హనుమంతుం డిట్లనియె.

తో. నినునాభుజమున-నెక్కఁజేసికొని వనధిదాటిశీఘ్రమున। ఘ
నముగరాముని, కడకుఁజేర్తుర-మ్మనుమపలికె నెయ్యముననా॥ రామ॥

సీత-కీర్తన, ఆదితాళము-బ్యాఁడుస్వరము.

మారుతీ! యీరీతి-ధీరత-జేయగశూరుడవగుదువు, సుమ్మీ నీవు
నీరావణు। శ్రీరాముడు। జేరివధించె, దికనెన్నడు॥ మారు॥ శ్రీమోక్షగుండ
వు, రీశునికీర్తి-యీ। భూమినిస్థిరముగ। బొదలవద్దా! యీమాన్యుని సౌ
మిత్రిని। శ్రీమీాఆదోడ్తెమ్ము-శీఘ్రముగ॥ మారు॥

వ. రాముండవతరించి రావణవధ చేసినాఁడను యశస్సు భూమి
యందు స్థిరముగ నుండవలయును గాన నీవు ద్వరగాఁ జని వారధిదాఁటి
రామలక్ష్మణులు వచ్చు సనుపాయంబులు జేయుము వాయుకుమారా!
రణరంగశూరా! రాక్షసవిదారా!

తో. ఈముద్రికశ్రీ, రామచంద్రునకుఁ। బ్రేమమలరనిమ్మనుచు।
భూమిజయిడె ముక। బొమ్మనమారుత। పుత్రుడామెవీడ్కొనుచు॥ రామ॥

వ. వేగంబున వెడలి సువేలాద్రిపయి కెక్కి యీవలిదరికి నెగుఱఁ
బోవునంత.

క. హనుమంతుఁడులంకాపుర। మునజరిపిన నటనసర్వ♦ మునువ్రాసి
ముదం। బున రామునకిమ్మనిపా। వనిచేతికినిచ్చెబ్రహ్మ ♦ పరమప్రీతిన్.

వ. ఆకమ్మగైకొని యానందించి బ్రహ్మసెలవుఁబొంది మారు
తికుప్పించి యెగసి యుదధిఁమీాద వచ్చుచుండ ముప్పదియామడలదూరం
బుననుండి వినంబడెడు ధ్వని విని యీాగట్టుననున్న యంగదాదు లు
ప్పొంగుచు.

తో. కృతకార్యుండై। కేసరిపుత్రుడు। క్షేమంబుగవచ్చెడిని। ధృ
తితోనటుగా-దేనియింతధ్వని। జేనివలన గలిగెడిని॥ రామ॥

వ. అని నిశ్చయించుచుండిరంతలో నాంజనేయుండు స్వకృత
కార్యనిర్వాహక పరిభావంబున భావంబునఁ గించిద్గర్వసమావేశుండై
వారిని లక్షింపక వేగంబునఁ గొంతదూర ముత్తరదిశకుఁజని యందుఁ

దపంబొనర్చి మునివరేణ్యుని పురోభాగంబున ధరాతలం బదరదుమికి నమస్కరించి యనుచున్నాఁడు.

హా కీర్తన, కేదారరాగము, రూపకతాళము.

మునివరేణ్యావినుమా! ననుగృపార్ద్రదృష్టినిగనుమా॥ ముని॥ జనకాత్మజయుండిన-జాడనునేగని। చనుదెంచితి॥ మునివ॥ ఆహా-దాహం। బాపగజాలను॥ మునివ॥ నీరంబున్-గ్రోలంగన్-జారుజలాశయమిం। చేరువనుండిన-జూపుము॥ ము॥ ఆలస్యమువలదు। చాలాశ్రమపడుదు। బాలింపగదగుదు। నేలాగునజనుదు। యేలవే-దయాలవాల॥ ము॥ శ్రీమీరన్ మోక్షపుర-స్వామిసిగన నేజనవలె॥ మునివరేణ్యా॥

వ. అనివేడిన సమ్మౌని మౌనమూనినవానివలె సరోవరమున్న దిక్కు-తర్జనితోఁ జూపిన నెఱింగి యుంగరమును గమ్మయు శిరోమణియు నచ్చటనుంచి దాహంబుదీర్చుకొని వచ్చులోపల.

గీ. ఒక్కకపివచ్చి రాముని ♦ యుంగరంబు। మునికమండల మందుంచి ♦ చనియెనంత। నాంజనేయుండు గ్రమ్మఱ ♦ నరుగుదెంచి! యంగుళీయకమెందున్న ♦ దనుచు నడుగ.

వ. మునీంద్రుండు భ్రూసంజ్ఞచేఁ గమండలముఁజూపిన.

తో. అందుగన్న రామాంగుళీయకము లగణితముగ గనబడిన। నిందలి ముద్రిక-లెవరివినాయుది-యందున్నది యిమ్మనిన॥ రామ॥

వ. మునీంద్రుండు చిఱునగవుగదుర నిట్లనియె.

ముని-కీర్తన, రూపకము, ఘోరసా, బిలాహరి.

వినుముదెల్పెదను। వనచరోత్తమా! సర్వంబును॥ వినుము॥ ఇంతకుమును-నెంతమందియొ!వింతగహనుమంతులుసీత। నెంతయుఁజూచి-యేతెంచుచునా। చెంతజేరుదు॥ వినుము॥ అచ్చటసీత। యిచ్చిన ముద్రి। యిచ్చటనుంచి। నింకొకకపి। మచ్చికనీక। మండలమున। హెచ్చిత్రావైచును॥ వినుము॥ దీక్షతో నీవు। దెచ్చి యుంచిన। మోక్షగుండేశు। ముద్రికయేదో! వీక్షించిదాని। వేగగైకొను। వృక్షచరాగ్రణి॥వినుము॥

వ. అని తెలిపిన నాశ్చర్యంబుతో నాంజనేయుండు.

చ. మునివర సీతనాకిడిన ♦ ముద్రిక యిక్కడఁ బారవైచి రా
మునికడ కెట్లుఁబోనగును ♦ మోదముతో వివరింపుమన్న నో
వనచర యీకమండలము ♦ వశ్యము శోధనచేసినీవు దె
చ్చిన మొహరుంగరమ్ముఁ దగఁ ♦ జేకొని రాముని జేరఁబోవుమా!

వ. అనిన మంచిదని హనుమంతుం డంజలితోఁ గమండలము నందున్న యుంగరంబు వెలుపటికి తీయుటకారంభించిన నంతము లేకుండ వచ్చుచుండె నప్పుడు.

తో. అన్నిటినరసిన। నపుడురామునా। మాతురసహితములగుచు। నున్నగనుంగొని। యన్నియందులో, నుంచి యిట్లనుచుదలచు॥ రామ॥

హ-కీర్తన, కన్నడరాగము, చాపుతాళము.

ఎందరైరో! ముందునావంటివా॥ రెంద॥ సందియముదీరె డెందమునకు॥ మున్నెందరై॥ ఎందరోహనుమంతు లేతెంచియుండగ నిందులో నిపుడునా-దేమిగణనయగు॥ నెంద॥ నేనుయిాదురభి। మానముతో నుంటిఁ। గానిస్వతంత్రాధి। కారములేదా॥ యెం॥ మోక్షగుండేనని, ముద్రికలెన్నగ। నక్షయమగుటయో। సాక్షియానీవార॥ కెంద॥

వ. అనియాలోచించి గర్వంబు సర్వంబు విడిచి మునికి నమస్కరించి వీడ్కొని శిరోరత్న లేఖనముల మాత్రముగొని.

గీ. తత్క్షణంబుననచటికి ♦ దక్షిణమున। ఘనమహేంద్రగిరిప్రాంత ♦ మునవశించి। యాంజనేయునిరాకకు ♦ నరయుచున్న। యంగదాదులకడకు నె ♦ య్యమునఁజనియె.

వ. అట్లరుదెంచిన యాంజనేయున కెదురుగఁజని యంగదాదులు గాఢాలింగనంబుచేసికొని సుఖాసీనుం జేసి.

వనచరుల-కీర్తన, జంఝూటి, ఆదితాళము.

వాయుజా। పోయినకార్యము। కాయెా! పండో! కడువడిదెల్పుము॥ వా॥ చేయగనీ। చేతగానీ। దీయువనినేమికలదు। పాయక బలవంతుఁ

డవు॥ వా॥ ధారుణీ! తనయనుగనుగొని। జేరిమిగుల భా, షించితివా! నీ వు॥ వా॥ శూరతను । జూపితివా। కోరికతో మోటుగుండ, శ్రీరాముని జేరుదాము॥ వాయు॥

వ. అని యడుగుడు.

తొ. కాంచితిసీతను। దుంచితివనముభా, షించితి రావణుతోడ। మించితిలంక ద-హించితి నిటకరు-దెంచితిరామునిజూడ॥ రా॥

వ. అనిచెప్పి యందఱుం గలసి రామదర్శనార్థముం జనువారయి యుత్సాహంబుతోఁ గదిలిపోయి కొండొక దూరంబుననున్న సుగ్రీవుని మధువనంబునకుఁ జేరిన నప్పుడు.

తొ. ఆకలిదప్పులు, నడగఫలంబులు-నారగించి తేనియలు। జేకొని పానము-జేతుము సెలవిచ్చిననని యవ్వనచరులు॥ రా॥

క. అంగద హనుమంతులనడు । గంగానే వారునటులఁ ♦ గాని మ్మనుడుర్। బొంగుచువనమున వానర। పుంగవులటుచొచ్చి కొల్ల ♦ వుచ్చిరికడిమిర్.

వ. ఇట్లు ఫలంబులుతిని తేనెలుద్రావి కొమ్మలువిరిచి కొలకుల మునింగి యిచ్ఛావిహారంబుగ వానరులు వర్తింప వనపాలుఁడగు దధిముఖుండు కోపోద్దీపితుండై.

తొ. ఎవ్వరి యాజ్ఞను-నివ్వనమునకును-నిపుడుజొచ్చితిరిమీరు కొవ్వుసెడగనే-గొట్టెననడ్డం-బెవ్వరనుచు బలుమారు॥ రా॥

వ. వానిని మర్దించిన వారుపోయి మనవిచేయ హనుమదంగదాదులు దధిముఖుని గుండెలవియునట్లు నులిమిన భయపడి వాపోవుచు సుగ్రీవునిఁజేరి నమస్కరించి.

దధి-కీర్తన, ఫీల్ రాగము,ఆదితాళము.

కపికులనాథా! కపికులనాథా! కృపజూడుమునను। గపికులనాథా॥ కపి॥ అంగదుండును-హనుమంతుండును-పొంగుచు గొల్ల, వుచ్చిరివనము॥ కపి॥ వద్దని నేను-వారిని నాగ। గుద్దిరినన్ను-గుద్దెల్లగాను॥ కపి॥ శ్రీమోటు

గుండ-ధామునియాన। నేమీకు దెలుప। నేతెంచినాను॥ కపి॥

వ. అనిన నతండు మహానందభరితుండయి శ్రీరామునిడగ్గఱి.

స్రగ్విణి. జానకిఁ గాంచియుఁ ♦ సంతసంబందుచుఁ। వానరుల్ గ్రమ్మఱఁ ♦ వచ్చునట్లున్నదా। కాని-చోగేళికా ♦ కాననంబందు నెం। తేని వర్తింతురే ♦ ధీరులై దేవరా!

వ. సీతజాడ దొరకకుండిన దీనులై వత్తురుగాని ధీరులై వత్తురా! మధువనంబంతయు నిర్మూలంబుచేయుదురా! దాశరథీ! సత్కృపాశరధీ! యనిన రాముండట్లయిన వారిసద్వరగాఁ బిలిపించుమనుడు దధిముఖునిఁ గాంచి సుగ్రీవుం డిట్లనియె.

తో. రామునికార్య ధు, రంధరులై చని-శ్రీమపడి వచ్చిరికాన। నేమనగూడదు-ఇకజనివారల-నిటకుదోడితెమ్మనిన॥ రా॥

వ. అతివేగంబునం దధిముఖుండరిగి హనుమదాదులకుమ్రొక్కి-సుగ్రీవుండు వేగంబున రమ్మనినాఁడన నందఱుఁ గదిలి మహానందంబునం బోయి సుగ్రీవలక్ష్మణయుతంబుగ వసించియున్న శ్రీరామప్రభువునుజేరి సాష్టాంగ నమస్కారనుచేసి వారియనుమతంబున నందఱునాసీనులయిరి. యప్పుడు రాఘవుండు వారలంగని.

క. మీరేగిన కార్యము నెఱ। వేరినదా! యనుచురామ ♦ విభుడడుగుటయుఁ। ఊరకయుండిరి యందఱు। మారుతి యిట్లనుచుఁ బలికె ♦ మనమలరంగఁ.

హు-కీర్తన, ఏకతాళము, కేదారి.

కాంచివచ్చితి। గనులారా॥ గాంచి॥ మించి సంపాతి యెఱి-గించి పంపవార్ధి లంఘించి। యెంచి లంకశో-ధించి వివరించి భావించి సేవించి॥ కాంచివ॥ భూరిమలినాంబర ధారఁ-మోకగుండ-విహారఁ బొగడెటికృశశరీరఁ-సువి చారఁ-గత ధీరఁ-శ్రీమీరఁ॥ గాంచివ॥

వ. అని విన్నవించిన శ్రీరామమూర్తి యాదరంబునఁ గాంచి యిట్లనియె.

తో. ఎటువలెబోతివి। యెటువలెగంటివి। యెటులనుభాషించితివి। కుటిలాలకనీ। కునుదెల్పినను, చ్చటలుదెల్పు హితమతివి॥ రామ॥

వ. అని యడిగిన నాంజనేయమూర్తి యిట్లనియె.

గీ. స్వామిమీయాజ్ఞచేతను ♦ జనినమేము। ఘనుకుసంపాతితెలుపమా ♦ ర్గంబుదెలిసి। వరుసనూరామడలుగల ♦ వార్ధినీను। దయనుపవనచరులరయంగ ♦ దాటినాడ.

వ. ఇటులదాటి రాత్రికాలంబున లంకబ్రవేశించి రావణకుంభకర్ణాదియోధుల గృహంబులెల్లనరసి మీదేవిని గానక యిశోకారామంబులోనికిజని పరిశీలించిన నొక్కశింశుపావృక్షంబుక్రింద.

తో. దీనాననయై, దివ్యముగారామ। ధ్యానంబొనరింపుచును। దానవకాంతలు-దనజుట్టునుజల- మూనినిలువనొప్పచును॥ రామ॥

వ. ఉండగాంగాంచి సీతగానెఱింగి తదీయావృక్షంబుపై సూక్ష్మరూపంబున నిలిచి తలవేచి.

తో. తమకథ యాద్యంతమునుడివిన వివి - ప్రమదంబున నను జేరి। క్రమమున నంతయు- గ్రణానందను-గావవింపుమనజేరి॥ రామ॥

వ. మీకును మాకును గలిగిన సాంగత్యవివరంబును మీవలనం బంపంబడినేం జనుటయు లోనుగా సర్వంబుం దెలిపి తమ ముద్దుటుంగరమిచ్చిన.

క. కనులనుబలుమఱునద్దుచుం। దనతల మానికము నిచ్చి♦తగంబొమ్మనుచున్। ననుబంపించెనుమీతో। ననుమనె నొకకొన్నిమాట ♦ లాశ్రిత వరదా!

హ-కీర్తన, జంఝూటి, అటతాళము.

పదినెలలాయెను-బలిబొసియనెను। మదిలోన నికదనను- మరువవద్దనెను॥ పది॥ రెండునెలలకు రాక్షుండెడినరి। ఖండించుసీదశ- గళుడనియనెను॥ పది॥ కూరిరులపాల్ చేసి-యూరకుండినను। వీరధర్మముగాదు వినిపింపుమనెను॥ పది॥ రాక్షసులనుజంపి - రక్షింపుమనెను। మోక్షగుం

దేశ్వర, మొ్రిక్కితి ననెను॥ పది॥

తో. కడువడితోనను-గాకముజీరిన । గరమలిగెనుగదమునుపు । ఎడబాపెనునను । నీరక్కసుపై । నేలగనియువని తెలుపు॥ రా॥ ఆలక్ష్మణు తో,ననుమనియెనుబర్ణ। శాలచెంతఁదాననిన । బాలవాక్యములు-భావింపకదను-బాలింపగవేగమున॥ రామ॥

వ. అన్నతోఁగలిసివచ్చి పుత్రమిత్రాదులతోఁగూడ దశకంఠుని నులిమి తనచెఱబాపుమన్నది. సుగ్రీవునితోఁ దనకష్టంబుదెలిపి చాల యడిగితినని చెప్పుమన్నది. యాతనామెచే దీవనలంది సెలవుబొంది.

క. నేవచ్చిపోవుసంగతి। రావణునకుఁ దెలుపఁగోరి•రయమున వనముల్। వేవేగమెపెకలించితి। దేవారులఁగొందఱను వ•ధించితినలుకన్.

వ. అంత రావణుండింద్రజిత్తుచేత నన్నుఁబట్టి తెప్పించి యడిగిన నాసంగతియంతయు స్పష్టముగఁ జెప్పినవిని యలిగి నావాలంబునకు నూనెగుడ్డలుజుట్టించి కాలిపించిన వాలంబుఁబెంచి లంకాపురమంత యుఁగాల్చివేసి సముద్రములోనుంచి తోకచల్లార్చుకొని.

హ-తో. వారధిదాటియు వానరులనుగూడి వచ్చితిమీసన్నిధికి। వారకయిదియే,వార్తయనుచు దాన,వాలిచ్చిన గొనియులికి॥ రామ॥

వ. సుగ్రీవునిగని రామచంద్రుండిట్లనియె.

రాముని-కీర్తన, కాంభోజి, అటతాళము.

ఈమానికమ్మునే-నెటులనువీక్షింతు- నేమిచేతును భానుజా!- కామించిమాపెండ్లి,కాలంబునందు మా,మామకూతునకిచ్చె। మంగళప్రిదముగ॥ నీమానికమ్ము॥ అప్పటినుంచి తన,కొప్పులో ధరియించె, నిప్పటికిటుబంపెను। యెప్పుడో! మోక్షముగుం,దేశుడ నానేనా । యొప్పులకుప్పను దప్పకగాంచేది॥ యీమానికమ్ము॥

వ. అని వగచుచుండ.

క. వగవబనిలేదురాఘవ । మిగిలినకార్యంబునకును ♦ మీఁరిక ననిలో। బగతురనుజంపి చెఱవా। పగదగుమీదేవి సరవి•భంజనరామా!.

వ. అనిసుగ్రీవుండు దెలిపిన దుఃఖంబువిడిచి ధైర్యంబుఁబూనియాంజనేయుని గాఢాలింగనంబు జేసికొని.

తో. శతయోజనవిస్తారంబగునా, సాగరమెటుదాటితివి। అతిధయిర్యంబున, నాలంకాపుర- మరసియెటులవచ్చితివి॥ రా॥

వ. అనిన నందుకు హనుమంతుండు.

గీ. శాఖపైనుండి మరియొక♦ శాఖపయికి। నెగురుశాఖామృగంబుల♦కెంతశక్తి। తలపనిరుమార్లు నేసముద్రంబుదాఁటి। వచ్చి తెల్లను దమప్రభా♦వంబుగాదె.

వ. అనిన రాముండు.

తో. అంతమందియో, ధానుయోధులా। యసురులుగనుగొనవెచ్చు। చింతింపక గాల్చితివి లంకఁ యది-యెంతధయిర్యమనవచ్చు॥రా॥

వ. అనిన దానికి నాంజనేయుండు.

తో. జానకివిశ్వాసంబున దమకో।పానలమున నాలంక। గానగముందే। కాలిపోయె నేఁ-గాల్చగలనెయకలంక ॥రాము॥

వ. అనువాక్యంబులకు శ్రీరాముండు పరమానంద భరితాంతఃకరణుండై.

గీ. ఎంతకార్యంబుచేసితి ♦ విద్ధచరిత। పరమబంధుఁడ వగుదువు♦ పరఁగమాకు। నరయమత్పదమిచ్చెద ♦నంతకంటె। నన్యమేమున్న దియ్యనీ ♦ కనుచుఁబలికె.

వ. అంత హనుమంతుండు నయ వినయ భయంబులుఁ దోఁప శ్రీరామచంద్రునకు సాష్టాంగ నమస్కారంబు లొనంగి యంజలిబద్ధుండై యనుచున్నాఁడు.

హను-కీర్తన, ఆదితాళము, శహానరాగము.

రామా! భానువంశజలనిధి-సోమ! శుభామలకామాభా॥రా॥ హైమవతీజపిత దివ్య,నామనుతామరక్షేమదా!॥రా॥ నేమది దెలియఁగ। నేరకద నుజవి। రామయొక్కయఁప।రాధమెంచర్చితిరామా॥రా॥ జనకజతమకి, మ్మ

నియిచ్చిన పా,వనముది్రకయొక। మునితాగై కొనె॥రా॥ అమ్మని యెవ్వ
రో! కిీమ్మరయిచ్చక। పొమ్మనిబంపెను। బొసగమోక్షపుర॥రా॥

వ. అనిపలికిన వాక్యంబులువిని రాఘవుండు నవ్వుచునిట్లనియె.

తో. నేనేమునినై। నిలిచితినక్కడ। నీగర్వం బుడుపఁగను। వాన
రవరయె,వ్వరిపనిగాదది।మానుము సంశయమికను॥ రా॥ ఇదిగో జానకి.
యిచ్చిన యుంగర।మిపుడు వేి్రలదాల్చితిని। ముదమున గనుమన! ముద్రి
క గనుగొని। మదిలోఁగర్వముమాని॥రా॥

వ. శ్రీరాముండు సాక్షాన్నారాయణుండని యూత్మనెంచి హ
నుమంతుండిట్లని పొగడుచున్నాడు.

హ-కీర్తన, కీరవాణి, రూపకము.

తపనకులజ! దాశరథీ! యపరాధిని గావుము॥ తపన॥ అపరిమితా
నుపమనచో- నిపుణదీనపాలక॥తపన॥ నిగమజాలమైననునీ- నిజము దెలి
యవనుమ విబుధులగుణులిగాదలపోసి। యఖిలమునను గాంతురు నే।
నగచరుండ మూఢుఁడఁ దెలి। యగనేర్తునె! మోక్షగుండ-నగరసలయు! నా
రాయణ। నామశర్మవినుత రామ॥తపనకులజ దాశరథీ॥యపరాధిని గావ॥

వ. అని యనేకవిధంబులఁ బొగడిన శ్రీరామచంద్ర మహాప్రభు
వానంద వార్ధియందోలలాడి హనుమంతునియందు సంపూర్ణ వాత్స
ల్యత యుంచె.

ఆశ్వాసాంత-తో.

అని తాభ్యూరినా-రాయణకవి రా-మాయణమును హరికథను।
ఘనముగఁజెప్పెను, గదయిదిసుందర-కాండము చిలుకును సుధను॥ రా॥
ఇదివినువారల-కిహసౌఖ్యంబులు-గొదవలేక చేకురును। ముదమున- దు
దకును-ముక్తిలభించును - మోక్షగుండ హరికృపను॥ రామా రామా
యనవే శ్రీరామాయణకథ వినవే.

క. నాచేతనైన కొలఁదిని। జూచిరచించితిని దీని ♦ సుజనులు నెఱసుల్
దోఁచినయెడ దిద్దుదురని।నాచిత్తములోననమ్మి ♦ నా నయంబుగ్.

మోక్షగుండరామాయణ హరికథ యందు సుందరకాండము

సంపూర్ణము.



శ్రీరస్తు.

# మోక్షగుండ రామాయణము-హరికథ.

## యుద్ధకాండము.

క. శ్రీరామమూర్తి యటులన। పారక్యపారసము చిలుకఁ బలికిన పలుకుల్ । ధీరుండై విని వాయుకు। మారుఁడు శోకడంగఁ దొడఁగె మనమలరంగన్.

హను-కీర్తన, రూపకతాళము, తోడిరాగము.

శౌరీకోరీ! భజియింతు। సారసాక్ష ! సేవింతు। మారకోటిమంగళ సుకు।మార! తార-హార! మేరుధీర! ॥శౌరికోరి॥ మోక్షగుండఖేల! పృథు-వక్ష హేమచేల! ప్రతి పక్ష మదవిఘాల! నిట-లాక్షవినుతశీల! గుణజాలా! శ్రితపాలా! బుధ,రక్షక! నా,రాయణకవి-పక్ష! వరకటాక్ష! సమద-రాక్ష సనిచయా ధ్యక్షశిక్షదీక్ష ! మోక్ష దక్ష ! ॥శౌరి॥

క. అని కొనియాడిన రాముఁడు । మనమున నలరారి యపుడు మారుతి వినఁగా । నినజుని గనుఁగొని పలికెను । ననఘా ! యిఁకఁ జేయవలయు నది యెటులొక్కో !

తో. వారిధి మనమెటు, వలెదాటుదుము- క్రూరరాక్షసావళిని-పోరియెటులజం,పుదుమో! మనమెటు-భూసుతగందుమొ ! లలిని॥ రా॥

వ. మహాదుర్ఘటకార్యంబు వచ్చెఁగదా! యిఁక నేదిగతి. యనిన నవ్వుచు నతఁడిట్లనియె.

సుగ్రీ-కీర్తన, ఆదితాళము, బేహాగ్.

రఘు,రామా! నీబోటులుకింత। చేత । బాముగలరీతి- బలుకు టవింత॥ రఘురామా॥ తలపు,గలిగిన మాత్రములోన । సప్త జలధులు

నింకింప,జాలుదుకాన॥ రఘురామా॥ మోక్ష,గుండపురీశ ! మీకెందు ।
భూమండలమునడ్డ-ముండదనందు॥ రఘురామా॥

వ. అనిపొగడిన ధయిర్యంబుబూని యాంజనేయునింగాంచి.

క. ననుమీరిపోవునంతటి। పనులున్న వె! జలధినాటు-బాణాగ్నుల
చే। గనుమిపుడె యింకజేసెద। ననిరావణుతలలుగూలు,నట్టులొనర్తు౯.

వ. అయిన రావణునియొక్క సవిస్తారంబును వానిబలాబలంబు
లును విశదంబుగా నీవుచూచినమట్టుకు వివరింపుమన హనుమంతుం
డిట్లనుచున్నాడు.

క. అలగునులంక త్రికూటా। చలశిఖరము మీఁదలవణ♦జలధికినడు
మ౯। బలువై నకోట లేమును। గలవంబరచుంబిత ములు♦గా జెలువగు మ౯.

తో॥ తేటయుదకముల- దేజరిల్లు చును- గోటయగడ్తలు గలవు ।
కోటనాల్గుది,క్కుల వాకిండ్లును-వాటి చెంత సొంపొదవు॥ రామా॥

వ. పశ్చిమద్వారంబున గజారోహకులును, నుత్తరద్వారంబున
నశ్వారోహకులును, దూర్పుద్వారంబునఁ గాల్బలంబులును, దక్షిణద్వా
రంబున రథారోహకులును, గణనాతీతంబుగా గాచియుందురు. మధ్య
కక్ష్యంబునఁ జతురంగబలంబులవారు లెక్కకు మిక్కుటంబుగాఁ గాచి
యుందురు.

ఉ. బంగరుమంటపంబులును♦ బంగరుగోడలురత్ననిర్మితో। త్తుం
గకవాటముల్విమల ♦ తోరణపంక్తులుఁ జారువేదికల్ । రంగుజెలంగుగే
హములు♦ రమ్యవనంబులు మేటిబావులు౯। బొంగుమనొప్పు లంకకును♦
బోల్పఁగ లేవు పురంబులీయిల౯.

వ. ఇట్టియసాధ్యంబగు లంకానగరంబుఁ దమ కృపా రసంబు
చే సులభంబుగఁ బ్రవేశించిసీతాన్వేషణంబుఁజేసివచ్చితి. రావణునిబలం
బులలోఁ జతుర్థాంశంబునాచేత హతంబయ్యె. ప్రాకార మంటపా
దులఁ గొన్నింటిని గూల్చి పురంబు దగ్ధంబుజేసి వచ్చితి మహాప్రభో !
యాలస్యంబుపలదు.

హను-కీర్తన, ఏకతాళము, జాతిస్వరము.

ఇఁక-దండు వెడలు రాఘవా! కపి-పిండుతోడ రాఘవా! యిఁక-దండరిపుల రాఘవా! నీవు-చెండగలవు రాఘవా! ॥ఇఁకదం॥ ఇఁక, జాగువలదు రాఘవా! సేన రాగఁబంపు రాఘవా! వారి సాగదోలు రాఘవా! కొన-సాగుబనులు రాఘవా! ॥ఇఁకదాడు॥ ధర మోక్షగుండరాఘవా! నీకుమొ్రక్కులిడుదు-రాఘవా! తమ-రీక్షణంబు రాఘవా! న-న్నెక్కికదలు రాఘవా!॥ ఇఁకదండు॥

వ. అని ఆంజనేయుం డుత్సాహంబుగాఁ బ్రోత్సాహంబు చేసిన నుప్పొంగి రాఘవుండు సుగ్రీవునిగని యిట్లనియె.

క. ఇదిమంచి ముహూర్తంబగు। సదయా! యీ లగ్నమందుఁ♦ జని లంకకుఁ జొ। చ్చెద సుతహితబల యుతముగ। విదలించెద రావణాధి ♦ వీరుల నెల్లన్.

వ. కావునఁ ద్వరగా గజ, గవయ, గవాక్ష, గంధమాదన, మైంద, ద్వివిదాది, కపిసైన్యంబులనెల్ల యుద్ధయాత్రకు వెలువరింపుము సుగ్రీవా యని రాముండనుజ్ఞ యిచ్చిన హర్షించి సుగ్రీవుండు సెలవొసంగినమాత్రంబున.

తో. తారకలనుసిక-తంబును వర్షపు-ధారలనైన గణింపఁ। దీరుగానికపి వీరులసేనల। దీరదు ధరలెక్కింప ॥రామ॥

క. పదులును నూర్లును వేలును। బదివేలును లక్షకోటి♦పదికోటులు న। ర్బుదములు న్యర్బుదములుగాఁ। గొదువలు లేకుండ వెడలె ♦ గోఁతులగుంపుల్.

తో. చెట్లులనుండియు-గుట్టలనుండియు-గట్టులనుండియుఁ గదలి। పుట్టబగిలిన-ట్లట్టహాసమునఁ-బొదలుచుఁ జేరెను బ్రబలి॥ రామ॥

వ. ఇట్లువానరసేనలు నేలనింగియు దిశలనుబట్టకుండ ననంఖ్యాతంబుగాఁ గిచకిచ ధ్వనులచే దిగంతరాళంబు భేదిల్లఁజేయుచు వచ్చిన సంతసించి యుద్ధయాత్రకు సాగఁదోలుమని నీలున కాజ్ఞాపించి రా

ముండు హనుమంతుని లక్ష్మణుండంగదునినెక్కి సుగ్రీవుండు దోడరాఁ బ్రవాహంబుప్పొంగి పాఱినట్లు గతిపయ ప్రయాణంబులనచ్చి సముద్ర తీరంబగు మహేంద్రాద్రిఁజేరి రాముండనుచున్నాఁడు.

రా-కీర్తన, రూపక తాళము, కళ్యాణి.

వనధిదాటి లంకజేర-వశమెమనకును । హనుమంతుడెటు బోయె నో! మనమున కాశ్చర్యంబగు ॥వనధి॥ నింగి ముట్టివెడలు। త, రంగంబు లుసుములు। రంగుగవెంబడి వెంబడిబొంగుచు నేతెంచెను నీవననిధి॥ భీక రమకరములు। బలు, శీకగుమీనములు। ప్రకటముగనప్పడపుడుఁ-బైకి నిబొడగట్టి మునుగు ॥వనధి॥ ఎంతదూరమరయ। దీనికంతు లేదు తెలియ । సంతతమును మోక్షగుండ। కాంతుఁడనేనై యుండిన ॥వనధి॥

వ. అని శ్రీరాముండు డోలాయమాన మానసుండగుచుండ లక్ష్మణుండు.

క. శ్రీరామనీదుసేవా । పారీణులె! దాఁటుచుందు్రభవసాగర ముఁ। ఊరక బలికెదు గాకీ।వారధియన నెంతయొక్క!వశమగుమీకున్.

వ. అని పలుకుచుండ నింతలో సూర్యాస్తమయమైన సైన్యం బులెల్ల నియామకస్థలంబుల విడిసిరి. రామ లక్ష్మణ సుగ్రీవులుఁ గా లోచిత కృత్యంబులుదీర్చి యొక్కచోశయనించి జానకిని దలంచుకొని.

రాము-తోడిరాగము, అటతాళము.

ఎన్నడుగాంతునె। నిన్నిఁక జానకి! కన్నులకునుబొడ- గట్టుదువంచ క్కడ ।॥యె॥ ఒంటిగనుంటఁగ। నోపనినీకిటు। వంటివిపద్దశ । వచ్చెనెభామి ని ॥యె॥ బాపురె! మనలను। బాపినకూ్రరుని । నాపగదీరఁగ। రూపడగిం చియు ॥నె॥ మోక్షగుండపురా । ధ్యక్షుడనయ్యును । రాక్షసమాయకు। భ్రమపడిపోతిని ॥ఎన్నడు॥

వ. ఇటుల విలపించుచున్న రామచంద్రునకుపచరించుచు లక్ష్మ ణ సుగ్రీవు లిటులనుచున్నారు.

శా. నిత్యానందమయుండవై తనరు నీ నేర్పాల్ విమర్శింపఁగా

సత్యాధీశునకయిన దీరదనుచో ♦ సర్వేశ మేమెంత నీ
వత్యంతంబును దుఃఖమొందెదవు జా ♦ యాభ్రాంతియున్నట్లుగా
శుత్యంతంబున వెల్లునీచెయువులుగ ♦ జోద్యంబులౌనీశ్వరా !

వ. లోకవిడంబనార్థముగా నవతరించినారు గాన లోకానుసరణపరిహారము నటింపుచున్నారే! కాని యన్యముగాదు. నిదురింపుండని పలికి యందఱు నిద్దురంజెంది రంతనుదయంబయిన నిక్కడ లంకలో రావణాసురుండు గొలువుకూటంబుఁజేరి మంత్రుల నందఱి రావించి యిట్లనుచున్నాఁడు.

గీ. మంత్రులార వినుఁడు♦ మర్కటంబొక్కటి। లంకిణిని జయించిలంకఁజొచ్చి। వనము బెఱికి వైచి ♦ వైదేహిఁబొడగాంచి। పురముఁగాల్చి దనుజ ♦ వరులఁదుంచి.

తో. మనచేఁజిక్కియు-మఱివంచకుఁడై-వనధిదాటి వేఁగమున। జనియురామల, క్ష్మణులఁగపుల జ, య్యనఁదోడ్కొని మోదమున॥రా॥

వ. చనుదెంచి సముద్రతీరంబున విడిసినట్లు చారులవలన నే వింటి నెటులనైన రాముండు వారధినిఁదాఁటి రాకమానడు. దీనికేదే నిసదుపాయంబు యోచించి తెలుపుఁడని పలికిన మంత్రులుద్దండంబున బొబ్బలిడుచు నిట్లులనుచున్నారు.

మంత్రు-కీర్తన, కేదారరాగము, ఆదితాళము.

ఏలసీగతిజాలినొందెదవు। రాక్షసరాజ! ॥యేల॥ చాలగాదిక్పాలురనవ। లీలగెలిచి నట్టిబల, శాలివి శాత్రవగహన। కీలివిసీవు। వేలరీతి బలుకకింక-జాలుమమ్ము బంపిననీ। వేళ బోయిపగతుర, గీలాభీలమొనరింతుము ॥యేల॥ ఖండితముగనుమోక్ష, గుండశ్రీకోదండపాణిదండజేరి। దండికోతి, పిండుతో గూడ। చెండిపంచుకొనిమేము। వండికడుపు నిండదిని। నిండువేడ్కతో డపత్తు, ముండుమునీ డెందమున ॥నేల॥

వ. అని మంత్రులు పలుకునంతలో నింద్రజిత్తు ప్రహస్త శతమాయ, మహాకా, యాతికాయు-మకరాక్ష-యూపాక్ష-విరూపాక్ష-ధూ

మాలిక-శోణితాక్ష-ఖడ్గరోమ-వృశ్చికరోమ-సర్పరోమ-కంపనా - కంపన-కుంభ-నికుంభ-మహోదరా, గ్ని-కోపన-దుర్ముఖ - దేవాంతక-విద్యుజ్జిహ్వాది రాక్షసవీరుల యక్షబలశౌర్య ధైర్యంబు లవార్యంబు లగుచుండ సింహనాద భుజాస్ఫాలనంబులు చేయుచు రావణబ్రహ్మ కనుచున్నారు.

రాక్ష.కీర్తన, బేహాగ్-ఆదితాళము.

ఇక-మానుము మానుమునీవీచింత। యీమానవులు-వానరులనెంత॥ మనము॥ చూచి, చూడకుండ విడనాడు। వాడు, లేచితప్పించుక పోయినాడు। మే-మేచివెంబడిఁ బడినేము। వారి, పీచమడంచివచ్చెదము చూడు॥ మిక॥ పటు, శౌర్యవిక్రమధారులనుచు। నని, వార్యశస్త్రాస్త్రనిపుణులనుచు। గనకా, హార్యధైర్యపరులనుచు, నసురవర్యమాప్రతాపములుగనుచు॥ నింక॥ పెద్ద, కొండలుబిండిచేసెదము-ఆ, ఖండలాదులదోలెదము। కపి, తండములనుగ్గుజేసెదము। మోక్ష, గుండహరినిబట్టి కూల్చెదము॥ ఇకమా॥

వ. ఇంతలోఁ కుంభకర్ణుం డాదినంబున నిద్రలేచియుండి యన్నదర్శనంబునకు విభీషణయుతంబుగావచ్చిన గారవించి వారిని దగిన పీఠంబులనివసింప ననుజ్ఞయిచ్చి రావణుండు కుంభకర్ణున కిట్లనియె.

క. తమ్ముడనీవెఱుగవు చి। త్రిమ్మగు నొకవార్తగలదు ♦ రాముడనంగా । నిమ్మహిఁగల డొకభూపతి । నమ్ముదమున వానిభార్య ♦ జానకియనఁగన్.

వ. దండకావనంబున వారిద్దరుండఁగా నతనినేమఱఁజేసి యాసీతను దెచ్చి కూడ యత్నింపుచున్న నెప్పనందున రాక్షస స్త్రీలఁ గావలిపెట్టి.

తో. మనయశోకవన, మునసుంచినరా-ముని పేరిణమున మొన్న। వనచరుఁడొక్కఁడు। వచ్చిచూచిపుర, మునుగాల్చియు దాజన్న॥ రామ॥

వ. వాఁడుజాడఁజూపించగా ననేకవానరులఁగూడి రామ లక్ష్మ

ణులువచ్చి సముద్రంబున కవ్వాలవిడిసి యున్నారు. దీనికేమి యోచన యన నవ్వి కుంభకర్ణుండు.

కుంభకర్ణుని-కీర్తన, జంఝూటిరాగము-అటతాళము.

రఘు, రాముని సామాన్యనరుఁడని-రావణాయనకు। ఓ। రావణాయనకు। ని, ర్లక్ష్యముగగనకు॥ రఘురాముని ॥ గో-విందుఁడేయతఁడాయె లక్ష్మి-సుందరియేసీతా। శ్రీ, సుందరియేసీతా। వర। సుగుణవిఖ్యాతా॥ రఘురాముని॥ ఆ, ఘనునిసతి జెఱబట్టుటేరా, తసులుచెడిరనుకో! రా,క్ష సులుచెడిరనుకో! ధర-మనుటలేదనుకో॥ రఘు॥ శ్రీ, మోతుకుండపురీశ్వరునితో। గడుయేటికి। బ్రతి,కడుయేటికి। సరిగాదుమాటికి॥రఘురాముని॥

వ. అని కుంభకర్ణుండను నంతలో మహాపార్శ్వుండను రాక్షసుఁడు రావణునితో నిటులనుచున్నాఁడు.

క. సీతనుగూడుటకై నీవీతీరున భీతినొంద ♦ నేలా! బలిమిన్। బ్రీతిగఁబట్టి రమించిన। నా తెఱవమతేమిచేయు ♦ నయ్యా! యనఁగన్.

వ. అమ్మాటకు మనంబున నానందంబునొంది మహాపార్శ్వుని జూచి యినుమంత దీనత్వంబుదోఁప నిట్లనుచున్నాఁడు.

రావ-కీర్తన, జంఝూటిరాగము-అటతాళము.

వినరామహాపార్శ్వ-విశదముగాను। మునుబ్రహ్మసభ కేను-బోవుచుండగను॥ వి॥ పుంజికస్థలయను-పువ్వుబోఁణిని। రంజింపకను బల్మి-రమియించితిని॥వినరా॥ అదివిని మోతుకుం, డాధీశసుతుఁడు। నెదలోఁగినిసిశపి, యించెనాయజుఁడు॥ విన॥

వ. ఇది మొదలుగ మదినొప్పని మదవతులగదిమి మదనకదనంబునఁ బొదలించితివేని నీపదితలలు పదిపదుల తునియలై పుడమిఁబడుఁగాక. యనిపనజభవుండు శపించెఁగాన మునుపటివలె విచ్చలవిడి మచ్చకంటుల జోలికిబోఁజాలరా! యోరీ! యనుచుండునంతలో సుగుణభూషణుండగు విభీషణుండు మృదుభాషణంబుల నన్నకు నభిముఖుండై యిట్లనుచున్నాఁడు.

విభీ-కీర్తన, అటతాళము, హిందూస్థాని, తోడి.

అన్న! నేనొనరించు విన్నప-మాదరింపుము రావణా! తిన్నగాని మంత్రివర్యులు-దెలుపనేరరు రావణా! ॥ అన్న॥ సీతను దెచ్చుట నాశన-హేతువనుకో రావణా! నీతిమాలిజరించుటే! కడు-పాతకంబగు రావణా! అన్న॥ రాక్షసులను నమ్మికమది గర్వంబునొందకు రావణా! మోక్షగుండాధీశు నెదిరి-మోహరింతురె! రావణా! ॥ యన్న॥

వ. అనినదువు విభీషణుని దూషణవాక్యంబులు విని రోషించి భీషణంబుగా నవలోకించి యశేసిపాతి సదృశంబులగు పరుష వాక్యలతో నింద్రజిత్తుగద్దించి కొలువుకూటంబు దద్దరిల్లునట్లుగా నిట్లనియె.

ఇం-కీర్తన, అఠాణరాగము, ఆదితాళము.

నన్ను-బేలగగంటివా! నన్ను।గన్న తండ్రినియంటివా! నీవు॥నన్ను॥ పిన్న యనియూర, కున్నదుగా నిలే-కున్న నోరుతునేసి, వన్న మాటలకు॥ న॥ గిరిజగడముజేయు, గౌరి యేతెంచి సభ। వారి ముందర యేమో! దూరి। తెలిపేవునీవు॥ నన్ను॥ భీమబలమునను, తాత్రిమాదులను గెలిచి। యీామహేంద్రజిత్తు, నామము బాల్చినట్టి॥ నన్ను॥ మోక్షగుండేశ్వరుని, పక్షముగాను నిలిచి, రాక్షసవీరుల ను। పేక్షగానాడెదవు॥ నన్ను॥

ఇంద్రి-దోహా.

వంచుదునా! దిక్పాలకులనువో। ర్లించుదునా! కులగిరులు। దంచుదునా! దిగ్దంతులబట్టిక, లంచుదునా! యంబుధులు॥ రా॥

కొట్టుదునా! యుడు, కోటులురాలఁగ। మట్టుదునా! యురగులను। బట్టుదునా! శశి-భానుబింబముల నెట్టుదునా! పత్రిమధులను॥ రా॥

వ. వీరందఱువినఁగ నాముందర రఘునందనుని వంది బృందంబు చందంబున నభినందించెదవు. తొందరపడకు కపిసందోహంబులఁ జిందరవందరఁ జేసియమ్మనుజుల నుర్గించి మాతండ్రిడెందంబు నానందంబునొందింపకున్న నేనింద్రజిత్తునేనా! విభీషణా! అపృచ్ఛ సంభాషణా! యనిన పలుకులు ములుకులవలెఁ జెవిసోకిన నులికిపడి కనుకొలకులుగెం

పులొలుక నలుకతో విభీషణుండు.

విభీ-కీర్తన, కళ్యాణిరాగము, అటతాళము.

రణభీషణుడైన-రాముని విక్రమ। మణుమాత్రమును నెఱుగ। కాడెదవిటుల। ననిమిషేంద్రు జయించినటుగాదు। దహనాంతకాసుర। వనప పవనుల గెల్చినటుగాదు । ధనదేశులనుబై । కొనిసదా బెదరించినటుగాదు। నీకెరుక లేదు॥ దనుజులనుబొలియింపఁగానా। వనజనాభుడు రఘుకులంబున। జనన మొందెను రాముఁడనఁగా । మనుజమాత్రునిగాదలంచెదో! ॥రణ॥ పుడమినా రావణు । కడుపు జెడబుట్టితివి । కొడుకుపుగావీవు। గులనాపకుడవు। జెడుగుపనులకుఁ జెడ్డవయినావు। నీకూతలకులో। బడెను దశకంధరుఁడు జెడిపోవు। శ్రీమోక్షగుండ । యొడయుఁడెక్కువయను కొనగ లేవు। మీాకిక జావు। తడవుజరుగదు గపులగూడియు। వెడలి రాముఁడు లంక జొచ్చియు। గడియ లోపల మృత్యువాతను । బడగజేయుకయూరకుండదు ॥ రణ ॥

వ. ఇట్లు పలుకుచున్నంత రావణుండు నితాంత కుపిత స్వాంతుండయి దిగంతంబులు ఘూర్ణిల్ల నిట్లనియె.

క. మానవులను వానరులను । బూనికతోఁ బెద్దజేసి ♦ పొగడెద
విచటన్ । మానవభోజనులగునీ । దానవులనుసరకుగొనవు ♦ తగునా!
నీకున్.

ఉ. రాముఁడు దైవమంచు వివ ♦ రంబుగఁ బల్కెదు దైవమైన
దా। భూమిజగూడి కానలకుఁ ♦ బొల్పుగవచ్చునె! నేను వేగమే। ధీమతినే
గి సీతగొని ♦ తేగ నెదిర్చి జయింపకుండునే! నీమదిఁగాన లేక మము ♦ నిం
దయొనర్చెదుగా విభీషణా॥

తో. దాక్షిణ్యంబున-దమ్ముఁడవనియో - తప్పును గాచితిగాని ।
కక్షగట్టిపర। పక్షములాడిన। శిక్షింతునుదయమూని ॥రామ॥

వ. అనినవిభీషణుండు.

తో. ఈ రాక్షసకుల, మెందుకుఁ జెరిచెద( వేలనీవు చెడియెదవు।

శ్రీరామునకును, సీతనిచ్చి ర, క్షింపుమనుము బ్రతికెదవు ॥రా॥

విభీ-కీర్తన, ఆదితాళము, ఫరజురాగము.

రామామణినివ్వవము। రామునకు నిఁక ॥రామా॥ నా మాటలు వినినను బ్రతికెదవు। నీమతము నుమా-నిన మేలు యిఁక ॥రామా॥ రాముడు నీదుశి, రంబులు వడిగా। భూమిని గూల్చక-ముందుగను నీవు ॥రా॥ తరుచరులంబుధి-దాటివచ్చియీ। పురమును జెఱుపక। ముందుగను నీవు ॥ రామా॥ పుడమిమోక్షగుండ, యొడయుని తమ్ముని। కనుగోపాగ్నులు, వెడలకముందే ॥రామా॥

వ. ఇట్లునొక్కిచెప్పిన రాక్షసరాజు క్రోధోద్దీపితుండై దిక్తటంబులటునిటుఁ జలింపఁ బెటపెటఁ బండ్లుదీటుచుఁ గుంభినీ తలంబదురివఁ గుంభీందుర్రిండు మ్రగ్గ నంభోనిధులింకఁ గుంభినీధరంబులు సెదర విజృంభించి యిదియొకవిలయకాలంబో! యని సభాసదులు భయభ్రాంతస్వాంతులగుచుండ దిగ్గున గద్దియడిగ్గనురికి వేగంబ కరవాలంబు జళిపించుచు భీషణంబుగా విభీషణువేర్రియఁబోయి మానివక్షస్థలంబు వయిన నొక్కతన్నుదన్నిన వజ్రనిహతంబగు గిరింబోలె నేలంబడిలేచిన తమ్మునిఁజూచి.

రావ-కీర్తన, ఫీల్, ఆదితాళము.

పోరా! పోరా! యిక లేచిపోరా! చాలునుపోరా! ఛీయటు॥పోరా॥ పోరా! యికమా। పురిలోనుండక। పోసుమానికా, పురము లేచి॥పో॥పట్టగ రాముడు। జుట్టమెననీ। పట్టునజనిమొర। వెట్టుకొనగ లేచి ॥పోరా॥ తమ్ముడవనినిను। నమ్మదగదుచి। త్తమ్మున దెలిసితి। దాయాదివి లేచి ॥ పోరా॥ మోక్షగుండకమ। లాక్షునినిన్నును। శిక్షింపకనే। నిక్షితివిడువను॥ పోరా ॥

వ. అనిఖండితముగాఁ బలికిన విభీషణుండు రోషించియనలుండు, నలుడు, హరుఁడు సంపాతి, యనునలుగురు సచివులతోఁ జెబునూణంబు కాకుత్స్థుని కొలువునకుఁ జనువాఁడయ్యె.

తో. నీకుహితమ్మును-నేనాటిగించినఁ - గైకొనవైతివి నేడు। తాకి వచ్చినం, తటనైనను జిత్తమున దలంతువునాడు ॥రామ॥ ఇదివరకేనిను విడువదలచితినే । నేమో! నిలిచితిగాని। యిదిగోపోయెద, నినకులేశు సే, వించుటకయిమదిబూని॥ రామ॥

వ. ఇట్లుపలికి తత్క్షణంబు లేచి తనతల్లి మందిరంబునకుఁజని నమస్కరించి యిట్లనుచున్నాఁడు.

క. అమ్మారామునితోనస। ఖ్యమ్మునమనుమనుచుఁ బంక్తికంఠునితోనే।
నెమ్మదిబోధించినఁగో। పమ్మునవాఁడదఁదన్ని పరిభవపఱిచెన్.

వ. ఈదురాత్మునిఁగనుచు నేనిందుండఁజాలఁ గరుణాశరధినురుగుఁజేరెద. సెలవిమ్ముమాతా! త్రైలోక్యవిఖ్యాతా! యని యిట్లుపలికిన గైకేసి చింతాక్రాంతురాలయి కొంతవడికి వివేకంబునొందియిట్లనియె.

కైకేసి-కీర్తన, ఆదితాళము, బ్యాండుస్వరము.

పోయిరావిభీషణా! యిక! బొమ్మనుగుణభూషణా! పాయకశ్రీరామ, భద్రుని కృపను, దీర్ఘాయురారోగ్య మ - హైశ్వర్యములు గల్గు ॥పో॥ నిన్నుఁజేరదీయును। శరణన్నవారిగాచును। మున్నుమాతండ్రిచే। విన్నానయోధ్య, లో-వెన్నుడు రాముఁడై - వెలయునటంచును ॥బోయిరా॥ మోంకుగుండవాసుఁడై। ముని, ముఖ్యహృదయ భాసుడై । రాక్షసులనుగూల్చి-రావణునివధియించి-యాక్షితి లంకని, న్నేలించు నిజముగ ॥బోయి॥

వ. ఇట్లుదీవించిపంపిన నామెసెలవు గైకొని మంత్రిలువానును బ్రియాణంబయి.

తో. రావణాసురుని। ప్రాణపంచకం, బీవిధిజనునన్నటుల । వేవేగంబున-నెగిరి వియుత్తల-వీధినిబోయిరి యిటుల ॥రామ॥

క. అంబుధిని దాటిహరలు । నంబరపథమునకు రాఁగనదికని కపిసై। న్యంబులు భానుజునకుదెలు। పంబఁ కించియును రామభద్రునకనియెన్.

సుగ్రీ-కీర్తన, కమానురాగము, ఆదితాళము.

వచ్చేవారెవ్వరో! పరికింపుము రామ! ॥వచ్చే॥ హెచ్చుగను-జె చ్చెరను। నిచ్చటికి। విచ్చలవిడిగా ముచ్చటలాడుచు ॥వచ్చే॥ దనుజపతి యనుమతిచే। మనపయికి। జనుదెంచునరా-శనవర లేనో! ॥వచ్చే॥ మోక్షగుండా, దృక్షమము। యీక్షణమే। దీక్షతోంబంపిన - శిక్షయొనర్తుము ॥ వచ్చే ॥

వ. ఇట్లువీరాలోచింపుచుండ దివినుండి విభీషణుండు.

తో. రావణానుజుండ-రామచంద్ర! విను-నేవిభీషణాఖ్యుడను! దేవరవారికి-దేవివివ్వమని-తెలిపినవినకనుదాను ॥రామ॥

గీ. నన్నునుగ్రదృష్టి౯ గ్రిన్నననారసి। తన్నుంగొలువులోన౯ దానవేశు। డ నంతినతనివిడచి౯యాప్తమంత్రిలం గూడి। వచ్చినాండ౯ నీదు పాద్రిపుంగోరి.

విభీ-కీర్తన, రూపకతాళము, కేదార.

దేవ దేవ! సేవకుండం-గావుమింక। నన్ను। కరుణాకర! నీవు దప్పర క్ష, కులు లేరిక। భావములో। భావింపకు। వేవేరుగ ॥దేవ॥ అక్షయ నారాయణదా, సాక్ష్యమనః। కంజ వరసదనా। మోక్షగుండవాస! శశివదనా! రాక్షసుడ-శిక్షింపకు-రక్షింపుము ॥దేవ॥

వ. అనిపలికిన వాక్యంబులకు రాముం డాలోచింపుచుండ సుగ్రీవుండు గ్రమ్మఱ నిట్లనియె.

తో. అసురులమాయల-కంతులేదుమీ! దెసకువచ్చుచున్నాండు! పసమీఱగంగా, పాడదగున! చంపగదగునా! యనునపుడు ॥రామ॥

క. శరణాగతుండై వచ్చిన। సరగున ప్రత్యర్థి నయినం౯జంపంగందగునా! కరుణనుబ్రోవగవలయును। బిరుదగు నాకిదియెగానం - బ్రియమునం జూతుర్.

వ. అట్లయినవీండు నమ్మకద్రోహముం జేయునేమో! యని భయపడెదవేమో! సుగ్రీవా!

తో. క్షణమాత్రంబున। సకలజగంబులు । కల్పింపఁగఁబోవఁగ
ను। ఘనముగనడపఁగఁ-గర్తనయినను। జెనకగలరె యొరులిలను ॥ రా॥

సం. వ. అనుచుండ నాంజనేయుండిట్లనియె.

హను-కీర్తన, ముఖారి, ఆదితాళము, వలదచ.

తగదువిన్నపైనలుగ । శ్రీరామచంద్ర! ॥తగదు॥ పగవానిగఁదలఁ
పగవలదితఁడు । సుగుణాఢ్యుఁడు ఘనుడు । దగునీతిపరుడు॥ దగదు॥ దూ
తనుజంపిన। దోషమను జ్యేష్ఠ। భ్రాతకుఁదెలిపినాఁడు । విడిపించినాఁడు॥
తగదు॥ మనపక్షమునగు-మాటలుబోధించు । మనుజాశనపతితో । వెరు
వక ధృతితో॥ దగదు॥ మోక్షగుండేశ్వం! మోసమురాదిక । దీక్షగన
భయమిడుము॥ తగదు॥

వ. అని తెలిపిన హనుమంతుని పలుకులకలరి జలజాప్తకులుండు
జలజాప్తనందనున కిట్లనియె.

తో. అభయంబిచ్చెద। నావిభీషణుని। అరసితోడ తెమ్మనఘా! స
భయులనెల్లను-సన్మానించుట। ప్రభువులపనిపొమ్మనగా॥ రా॥

వ. వల్లెయని సుగ్రీవుండుపయి కెగిరి విభీషణుని మంత్రియుక్తం
బుగాఁ గొనివచ్చి రామునింజేర్చి నంత దత్పాదారవిందంబులకు శిరం
బుమోపి సాగిలిపడి.

విభీ-కీర్తన, ఆదితాళము. బిలహరిరాగము.

శరణు దివాకరకులజా! చరణావినిందిత-వరజలజా! ॥శరణు॥ ఇతర
మునే,నెఱుగకను। గతినీవనుచును-గనినాను॥ శర॥ అక్షరనా కభయమిడి-
మోక్షగుండాధిప! బ్రోవుమడి॥ శర॥ శ్రీయుతనా,రాయణదా, సాయుత
హృదయవిహార! సదా॥ శర॥

భుజంగ-నమోనంతరూపా! క-నచ్ఛ[illegible]పా! నమోవేద పాదా!
సు,నాటానుమోదా! నమోలోకనాథా! ఘు,నజ్ఞానబోధా! నమోభూత
రక్షా! స,నందాదిపక్షా!.

విభీ-కీర్తన, ఆదితాళము.

నీమహిమంతయు । రామా ! రామా ! యేమిలేదుగద-రామా ! రామా! ॥నీ॥ సోమసూర్యులును,సురలాదిక్రతువులు।భూమిముఖాఖిల, భూతచయములు॥ నీ॥ మునులునుబుధులు, త్రిమూర్తులు గ్రహములు। దనుజమనుజ మృగ,తరువిహగములు॥ నీ॥ నిగమాగమములు-నిఖిల విద్యలును। నగములువార్ధులు। నదులునునిధులు॥నీ॥ మోక్షగుండమున। సాక్షిగ వెలసిన। యక్షర। నారా,యణకవివినుతా! ॥ నీ॥

వ. అనిపొగడిన యానందించి శ్రీరామమూర్తి కృపారసంబొలుక యిట్లనియె.

తో. దానవనీప్రార్థనకును మెచ్చితి। గాననీదుమదిలోను । దేని గోరినను। దానినిచ్చెదను। దెలుపుమనఁగనతఁడనెను॥ రా॥

క. నీవరరూపముఁగంటిని। గావున నావంటి శుచియు♦ఘనుఁడును ధన్యుం। డీవిశ్వంబునఁగలఁడే! యీవేనీధ్యానమును వి ♦ వేకము భక్తిన్.

విభీ-కీర్తన, కాంభోజి, అటతాళము, నిన్నునమ్మి.

కోరనేవేరు-కోరికలుమది । జేరినీదుసేవ-జేయుభక్తిదప్ప॥ కోర॥ ఘోరదు,ర్వారని-స్సారసంసారాబ్ధి । దూరెమునింగెదు । వారిసాంగత్యము॥ కోర॥ నారాయణశర్మా-ధారా ! మోక్షగుండాగార ! నీదు కొల్వకన్న నన్యమేమి॥ కోర॥

వ. అనివేఁడిన రాముండు సంతసించి.

ఉ. నన్నుభజించుభక్తుల మ ♦ నంబుల నేనువసింతు సీతతోఁ
గ్రన్నన నట్టిభక్తుఁడవు ♦ గావున నీకభయంబొసంగితిన్
బన్నుగ రావణాసురుని ♦ బట్టివధించియు లంకనీకు నే
నున్నతి బుద్ధిగట్టెదను ♦ నెంచ్యనేలుము శాశ్వతంబుగన్.

వ. అని తెలిపి హనుమంతునిచేత నిమికతో లంకాపురిని నిర్మింపఁజేసి యందు విభీషణుని గూర్చుండఁబెట్టి లక్ష్మణునివలన సముద్రోదకంబులు దెప్పించి యతని కభిషేకంబుఁ జేసి.

రా-కీర్తన. త్రిశ్రజాతి, సంతతంబున.

ఓవిభీషణా! యోవరభూషణా! ॥ యోవిభీ॥ నీవుమనుముచిరజీవి వగుచునిక నావచనమ్ము ॥ నోవి ॥ ఎందాకరవితార - కేందులు నుందురో! యందాక లంకారా,జ్యంబేలుచుందుదు॥ వో॥ ఎందాకనాకథ-యీయుర్వినుండునో! యందాకలంకారా-జ్యంబేలుచుందుదు॥ వో॥ మోక్షగుండేశుని,ముఖ్యభక్తుడవగు। చక్షయలంకారా,జ్యంబేలుచుందుము॥వో॥

వ. ఇట్లు విభీషణునకుఁ బట్టంబుఁగట్టి దీవనలిచ్చిన పిమ్మట సుగ్రీవుండు విభీషణునితో.

తో. రాముడునీకును-రాజ్యమొసగెగద! రావణవధకును నీవు । స్వామిపనికిబా-సటయయి నిలువగ। వలెననగను సుగ్రీవు॥ రా॥

వ. కనుంగొని విభీషణుండిట్లనుచున్నాఁడు.

విభీ-కీర్తన, రూపక తాళము.

అందరికీదోడగునా- నందమయునకు । నిం । పొందగ దోడ్పడగ శక్తి,యున్నదెమనకు॥ నందరి॥ మీసమానముగను నేను। మెలగనేర్తును। రామ। దాసుడనై యెపుడుసేవ-దవిలిసేతును॥ అందరికి॥ ప్రీతిగను మోక్షగుండ-విభునిపనులలో। నేను । జేతనైనరీతిదిరిగి-జేతునవనిలో॥ నంద॥

వ. అని యిట్లు చెప్పుకొనుచుండ నంతలో రావణుని పనుపున శుకుండను చారుండువచ్చి యాకాశవీధిని నిలిచి యందఱు వినుచుండ సుగ్రీవునికిట్లనియె.

తో. రావణుడెరుకప- రచుమనువాక్యము- లీవిధమగు వినుమినజా! వేవేగమె! కపి,వీరుడవై నరు-సేవింపగనేలయనుజా!॥ రామ॥ నన్నుజేరితే! యన్నివిధంబుల-మన్ననజేసెదనేను। గ్రన్ననసీలం,కకుఁజను దేసుము। కపిసైన్యంబులతోను॥ రామ॥

వ. అని తనమాటలుగాఁ బలుకుచున్నాఁడను నంతలో వనచరులు జుట్టుకొనియొక్కలతన్ను తన్నిన దూతనువధించుట నీతిగాదని రాముండు డిపె. నంత వాఁడుమరల సుగ్రీవునితో రావణునకేమిచెప్పుదునవపుడు,

సుగ్రీ-కీర్తన, ఆదితాళము.

అన్న వాలినాకునతము-మున్న రాముచేతజచ్చె। నన్నను నేననెకు మాట-యధమ! మానరా! ॥యన్న॥ లంకకురమ్మనియక-లంకముగఁగోరి నావు। లంకకేగుదెంచువిధము- లరిని వినుమురా॥ యన్న॥ మోక్షగుం డవిభునిమోస-పుచ్చినావు కానినిన్ను। శిక్షజేయ రాముగూడి - చేర వత్తురా॥ యన్న॥

వ. అని చెప్పుచు పోరా! రాక్షసాధమా! యని పలికినవాఁడు చావుతప్పించుకొని లంకకేగులోపల శార్దూలుండను రక్కసునవలనఁ గపిసైన్యంబుల బలంబును రాముని ప్రతాపంబునువిని కొలువుచాలిం చి రావణుండంతిపురికరిగె నిక్కడ రాముండు సముద్రునింగదిసి.

రా-కీర్తన, పూరికల్యాణి, రూపకతాళము.

దారియొసగరాదా। వారినాథ! నెనరులేద॥ దారి॥ పోరిజగత్కం టకుడగు। క్రూరుని దశకంఠుద్రుంచి। ధారుణిభారంబుబాపఁ। గోరితిలంక కు జేరగ॥ దారి॥ సకలపుణ్యవాహినులును। బ్రికటంబుగనీలోపల। నొక టిగజేరగ గైకొని। యకలంకుడవగుదునాకు॥ దారి॥ వెలయగ నారా యణకవి। వినుతుడయిన మోక్షగుండ। నిలయునకునుగూతునిచ్చి। చెల గిన శాంతాత్మనాకు॥ దారి॥

వ. ఇటువలె రాముండెంత ప్రార్థించినను సముద్రుండు మిన్న కుండిన నాగ్రహించి.

రా-శ్లో. వినులక్ష్మణవీ- డెంతదురాత్ముఁడా! విశ్వసింపడెంతయు ను। ఘనముగనిప్పుడె। గ్రాగించెదను। గానునాదు ప్రతాపమును॥ రా॥

వ. అని పలికి తమ్ముని చేనున్న విల్లమ్ములుచేకొని బ్రహ్మాస్త్రం బుసంధించి.

పంచచామరము. అహోసముద్ర! కొంచెమైన•యాదరంబులే కనీ। వహంకరించి యున్నవాఁడ•వైననేమి యుందువా। మహోగ్రకాం డవహ్ని చేత•మారణంబుచేసెదఁ। సహించుమంతెచాలు ధైర్య•శాలి

వైన నిచ్చుటల్.

వ- అని యస్త్రంబువిడువ నుద్యోగించిన నతనికోపాగ్నికి జగంబులు గడగడవడంకె హద్దుదాంటి సాగరోదకంబులు యోజనమాత్రింబింకె తిమితిమింగలములు జంకె నయ్యవసరంబున.

క. రత్నాకరుండు రవికుల, రత్నమునకు బహుమతులుగ రమణీయములౌ, రత్నంబులు గైకొనుచుఁ బ్రి యత్నంబునవచ్చె దివ్యమగు నాకృతితోన్.

వ. ఇట్లరుదెంచి యాశరధి దాశరధికి నమస్కరించి యుపాయనంబులు సమర్పించి.

సము-కీర్తన, హంసధ్వని, ఆదితాళము.

కళ్యాణగుణగణంనమామి॥ కళ్యాణ॥ కమలదళాంచిత- ఘనమృదుచరణం। కల్మషహరణం। కరుణాభరణం॥ కళ్యా॥ కటితటరంజిత- కాంచనచేలం। కుటిలమదాసుర। కోటివిఫాలం॥ కళ్యా ॥ మోక్షగుండస-త్పురవిభుమఖిలా। ధ్యక్షం నారా, యణకవిరక్షం॥ కళ్యా॥

వ. ఈపగిదిఁ బ్రార్థించిన శాంతుండయి సీతాకాంతుండు సరిత్కాంతున కిట్లనియె-

తో. నేదొడిగినయీా-నిశితసాయకం। బేదిక్కునకునై చెదను। పోదువృధాపా-దోధినాథ తె। ల్పుమునా నతడిట్లనెను॥ రామ॥ ఉత్తరదిక్కున।నున్నకిరాతుల। నుక్కడంచరఘువీరా ! పొత్తుగలిగియె - ప్పుడునను బాధిం-పుచునుందురు రణశూరా!॥ రామ॥

వ. అన మంచిదని సముద్రునిబాధింపుచున్న యాభీరమండలంబుపయి నమ్మహాసీయాస్త్రంబుఁ బ్రియోగించిన నది వారిని దునిమి పోదిఁజేరెఁ బిమ్మట సముద్రుండు.

సము-కీర్తన, జంఝూటిరాగము, ఆదితాళము.

వారధి, గట్టగ నీకపి! వీరులబంపవె। యోరఘుకులవర! వారధి॥ ఓరు పులో। నేరుపులో। భూరుహభూధరములు। జేతురు రపారముగ

వారధి॥ దీనికి। విశ్వకర్మవర। సూనుఁడయిన నలు । డౌను సమర్థుఁడు॥ దీనికి॥ భూనుతమై। మానితమై। కానవచ్చు మోక్షగుండ । శ్రీనాథవానితోఁ గలిసి॥

వ. ఈనలుండు చేతముట్టి వైచిన నెంత భారమైన వస్తువైనను నీటిమీఁదఁ దేలును చిన్ననాఁడు గణ్వమహామునివలన నట్టివరంబు వడసియున్నాఁడు. కాఁబట్టి యతని సేతువు గట్టుటకు నియమింపుఁడు తక్కిన కపులందఱుఁ బర్వతాదులు దెచ్చియిత్తురు. గావున! దేవతాసార్వభౌమా! అని సముద్రుండు.

క. ఈతెఱఁగున వినిపించినఁ। సీతాపతి యలరి నలుని ♦ చేసేటిప యిన్ । సేతువుగట్టింపఁగదాఁ । జేతంబునఁ దలచి యిటులఁ ♦ జెప్పె నతనికిన్॥

వ. ఇట్లునియమించి నవ పాషాణంబులన్ నవగ్రహములఁ బూజించి యచ్చటఁ దనపేర లింగస్థాపనంబు జేయదలంచి హనుమంతున కిట్లనియె.

రా-కీర్తన, ఆదితాళము, కన్నడ, సజరబిర.

పవనతనయ! యికలెమ్మా! జయమునఁ గాశికి జనిరమ్మా॥ పవన॥ లింగద్వయంబును దెమ్మా, శివ, లింగ। మంగళకరముగ- మాకిమ్మా నీవు॥ పవన॥ తడవులేదు లగ్నమ్ము । యిక-దడ ॥ వడివడిగారా, వలెను మ్మునీవు॥ పవన॥ చాలభక్తితోడనుండు। నీవు, జాల। ని, న్నేలు మోక్షగుండేశుండునీవు॥ పవన॥

వ. అని దెలిపిన రామాజ్ఞ శిరసావహించి వాతూలసుతుండు ప్రయాణంబయి.

క. ఆకాశమార్గమునఁ దా । నా కాశికిఁ క్షణములోన ♦ నరుదెంచి యటన్ । ఆకాశకేశు నభవుని । నా కాశీవిశ్వపతిని ♦ నభినుతిచేసెన్.

వ. ఇట్లుపొగడిన సంతసించి యాంజనేయునికిఁ బ్రత్యక్షంబయి యతని యభిమతం బెఱింగి రెండులింగంబులిచ్చి నేసట్లంటె.

క. మునుకుంభజు నకునేని । చ్చినవాగ్దత్తమును దీర్ప ♦ శ్రీరా మునిద । ర్శనమునకును దక్షిణదిశ। కనిసు తావత్తు నింక ♦ నతివేగముగన్.

వ. అనిన హనుమంతుండిట్లనియె.

తో. మునుపిచ్చితిరే, మునివాగ్దానము।మునివర్యునకనియుతుగన్। హనుమంతునకి, ట్లనియాకథ యూ, ద్యంతము దెలిపితివనికన్॥ గా॥

శివు-కీర్తన, ఆది తాళము, పగపేటికి.

విను పూర్వపు వృత్తాంత । మును దెలిపెద హనుమంత - ము నువింధ్యనగము చెంత-కునునారదు డత్యంత వీణా! గాన, మున ధీరుండా చు-జేర-గానంత॥ వినుబూ॥ అమ్మునిచంద్రునిగాంచి। యద్రీశుండు మోదించి । సమ్మతి సన్మానించి, సాష్టాంగములర్పించి । మెంచి - మించి-నె మ్మోమునందు- బాణిజోడించి॥ వినుపూర్వ ॥ మోక్షపురీశుని కరుణన్। మునివరతమరరు దేరన్ । ఈక్షితి బాపములారెన్ । ఇదె శుభములుజే కూరెన్ । మీరీ, దారిలక్షించి వచ్చు-టేల, ననుజేరన్॥ వినుపూర్వ॥

వ. అని వింధ్యాద్రి ప్రశంసించిన.

క. నిటూర్పువిడిచెనారదుం।డట్టియెడన్ గారణంబ ♦హా । యేమొ క్కో!- గట్టులమొకి మీాడనంజూ । పట్టితినే నవనియందు♦ బరికింపంగన్.

వింధ్య-కీర్తన, ఏక తాళము, శహాన రాగము, కామినిసామిని.

ఏధర, ణీ ధర, మీాడగు నా, కీర్ధారుణి ॥ నేధర॥ సాధువరా మీాపద-సాక్షిగనేనాడెద॥ నేధర॥ అల్లశర్వాణీతన-వల్లగలుగుట శివు, డ ల్లుడె రంజిల్లుటను శ్రీ, తాద్రికొంచెము బేర్కొనంబడె॥ నేధర॥ మేరుగి రి స్వర్ణమయ । మైరంజిలునని దేవా । గారమని ప్రఖ్యాతినొందెను। గానినాతో సాటియగునే॥ యేధర॥ కొండలెన్నియొ లెక్క కుండెనవి యేల మోక్ష । గుండపతి కృపనిండ నేనో, క్కండ దండిమగండ డవే॥ ధర॥

సీ. ఉదయుధరాధర ♦ ముద యాశ్రితంబు మందేహాద్రి దేహ సం ♦ దోహమరయ । నిషధాద్రినోషధీ ♦ నిచయంబులే వమ్యోన స్తమి

తపరిభల స్తగిరిని । నీలకాంతులబోల్చు ♦ నీలమహీధరింబు మందాకు సహితంబు మంధరంబు । మలయాచలంబున ♦ వెలయుఁబాముల గుంపు రైవతాచలము ని♦ ర్ధనముగాదె । మాటమాత్రింబు లగును ద్రి♦ కూట హేమ। కూటములుభారమును మోరియ ♦ నోటువడును । సహ్యకిష్కింధకారించాది ♦ శైలములు ము । నీందరియన్నిట మేటినై ♦ యేనుబోల్తు.

వ. ఇట్లుదుర్వార గర్వంబున నప్పర్వతంబు పలికిన నసహ్యంబు నొంది నారదుండు మనంబున.

తో. శిఖరదర్శనము, చేత ముక్తియిడు-శ్రీశైలాదులు నుండ । నఖిలగిరులనిత, డవమానించుట। యాశ్చర్యంబగుఁ జూడ॥ రా॥

వ. అనియెంచి యతని గర్వంబుఁ బాపువాఁడై.

నార-కీర్తన, కన్నడరాగము, రూపకము.

ఏది, నీసాటిశైల-మీాజగంబున । నేగాన ॥ నేది॥ ఆదిత్య ముఖ గ్రహము, లాశ్రియింతురి దనునటంచు । మొదంబున మేరునగము । ముఖ్యంబుగనిక్కగాని॥ యేదీ॥ విన్నానిదె ననుఁబోలదు-వింధ్యశైలమని యెప్పుడు । నిన్నవమానింపుచుండ । నిట్టూర్పందుకెవిడచితి॥ నేదీ॥ మా వంటివారికేల । మదియందున నుండనిమ్ము । పోవలెశ్రీమోక్షుగుండ । దేవుని సేవింపగాను॥ నేదినీ॥

వ. అనియిట్లుపలికి కలహాశనుండు యథేచ్ఛం జనియె. నంత వింధ్యధరాధరంబు.

శా. ఔరా! మేరుధరాధరంబు గమగ♦ర్వాయుత్తచిత్తంబుతో । నీరీతిఁ ననుఁదూలనాడెనట! కా ♦ నిమ్మెంతదో! తప్పితా। పాయూధంబదిగాంతునంతయును సూ ♦ ర్యాదిగ్రహాళుల్ తనుఁ । జేరఁ వచ్చుట డెట్లో! చూతుననుచుఁ ♦ జితింబుగా నత్తఱిఁ.

వ. అని నిశ్చయించి తనశరీరంబు రెండువేల యిన్నూట రెండు యోజనంబుల పొడవుఁబెంచి సూర్యసంచార మార్గంబు నిరోధించిన

నదియొక విలయకాలంబై.

తొ. పూర్వోత్తరముల-బొల్చువారికె-ప్పుడు సంతాపము గలిగె।
పర్వినదిద్రిల-బండగ దక్షిణ, పశ్చిమస్థులకు గలిగె॥ రామ॥

వ. ఇట్లొప్పిన సమస్తయజ్ఞాది క్రియ లభావంబయిన దేవేంద్రాదిదేవతలు బ్రహ్మసహితంబుగా వారాణసికివచ్చి నన్నిట్లు ప్రార్థించిరి.

దేవ-కీర్తన, పీల్ రాగము, ఆదితాళము, కామకుని.

దేవదేవ! రావె! నీవదిక్కు-కావవే! కేవలాంధకారమై। యీావిధం బుదోచనదే॥ దేవ॥ కాలమెరుకలేని, కారణంబుతో జన। పాళిసర్వకర్మలు। జాలమానియుండిరిల॥ దే॥ హవ్యములులేకమే। మకట! యెట్లునిల్తుమో। యవ్యయ శ్రీమోక్షగుం,డా ధినాథమమ్మేలవే॥ దేవదేవ॥

వ. అనిబహుళభంగుల ప్రార్థించిన దయామయ హృదయుండనై వింధ్యాద్రికిగురువగు నగస్త్యమహామునిని వీక్షించి యిట్లంటి.

క. లోకోపకారమునకై। యోకుంభజ! దక్షిణాశ ♦ కరుగవడిజననీ। వాకుధరేంద్రునిగర్వము। బోకార్చుము కాశినుండ ♦ బోలదునీకున్.

వ. అనిన వాక్యంబులువిని దుఃఖాక్రాంతుడగుచు నగస్త్యుం డిట్లనియె.

అగ-కీర్తన, హిం, కాపి- ఆదితాళము, ఈపివరీ.

కాశినిబాసివి-శ్వేశా! పొమ్మన। నగునా! ॥కాశిని॥ ఓశివా! నీదు కడనుండక నాదక్షి। ణాశకుబోవ గా,భ్యాయమనౌనా కిక॥ గాశిని॥ ఇమ్మహాస్థలమున। నెమ్మెను బాసిన। గ్రిమ్మరజన్మము। గలుగదందురు గదా! ॥ కాశిని॥ ఖండితముగ బలుక। గారణమేమిరా! మోక్ష। గుండనాయకు! చెంత। నుండదగనేశివా!॥ కాశిని॥

వ. అని వగచుచుండిన నగస్త్యునకు నేనిట్లంటి.

ఉ. భాసురవారణాశి నెడఁ ♦ బాయుఁగ నాయెఁగదా! యటంచు నీ
వీసుమంతయుంబురన్ వగవ ♦ నేటికె వింధ్యునిఁ శాంతమూర్తిగాఁ
జేసియు నాదెసన్ నిలువు ♦ శ్రీరఘునాథుని పూజఁగైకొనన్

వాసముఁజేయ నేనటకు ♦ వచ్చెద దర్శనమిత్తు నీకటన్.

వ. అని యొడంబఱిచిన మంచిదని యగస్త్యముని లోపాముద్రాయుతంబుగాఁ గాశింబాసి దక్షిణాభిముఖుండై వింధ్యగిరి సమీపించివచ్చిన.

క. ఇనమండల పర్యంతా।బును బెఱిగిన వింధ్యశిఖరి ♦ మునివర్యు నిరా । కనిరీక్షించి యెదుర్కొనె । మనమున భయభక్తులొదవ ♦ మఱి ఖర్వుండై.

వ. ఇట్లు కుఱింగిన రూపంబుతో నమస్కరించి వింధ్యుండిట్లనియె.

నిం-కీర్తన, కళ్యాణి, ఆదితాళం, మనవినిచే । వలె.

శరణుకృపాజలధే! గురువర! ॥శరణు॥ ధరణిని తమసందర్శనము నచే। ధన్యుడనైనాను। గురువర॥ శర॥ మావంశమున జన్మము గేహంబును బావనమాయెనహా! గురు॥ శర॥ ఏమికోరి మీరేతెంచితిరో । స్వామీ! వచియింపు! గురువర! ॥శర॥ మోకుగుండరా- మునిపదాబ్జముల । సాక్షిగ నవరింతు । గురువర! ॥ శర ॥

వ. అనిన విధ్యంగిరికి మునివర్యుండిట్లనియె.

గీ. మరలివచ్చువరకుఁ ♦ మాను గనీరూప
మునను నిలిచియుండు ♦ మనఁక నతఁడు
మంచిదనుచుఁ బలికి ♦ మౌనీందునటనంపి
యతనియాజ్ఞ రీతి ♦ నడగియుండె.

వ. అదిమొదలు గర్వంబులేక వింధ్యుండు గుజ్జురూపంబున నుండి పండ్రెండేండ్లకొక పర్యాయము మునిరాకఁగోరి నిక్కిచూచుచు రాకుండిన యథాస్థితినుండుచుఁ గాలంబు జరుపుచుండె,

తో. అప్పటినుండి ని,రాటంకంబుగ- నర్కుడు విహరింపగను । ఎప్పటివలెఁ బను,లెల్లదీర్చుకొని-రిలలో జనులింపుగను॥ రాము॥

వ. అట్లు లోకోపద్రవంబుఁ బాసి కుంభసంభవుండు దండకావనంబున నిలిచి నారాక నిరీక్షింపుచుఁ దపంబుఁ జేయుచుండెఁగావున.

శివుని- కీర్తన, ఆదితాళము, హుశేని, ఈరాజా.

నేనే తెంచెదను।నీవరిగిన వెను వెంబడిగను॥ నేనే॥ మానివర్యునీ,మా టదీర్పగ। జాన,కీశుమానక జూడగ॥ నేనే తెంచెద॥ లింగములు రఘు,పుం గవునకు జె,లంగ,మంగళంబుగ నొసగను॥ నేనే ॥ మోటకుండా । ధ్య క్షునకు బ్రి,త్యక్ష,మై ని,రీక్షింపగనిక॥ నేనే॥

వ. అనిచెప్పి వీడ్కొలిపిన నాంజనేయుండు లింగంబులుగొనివా యువేగంబునఁ గించిద్దర్వ సమావృతుండయి వచ్చుచుండె. నదియెఱిఁగి రాఘవుండు సుగ్రీవునిఁజూచి.

తో. వాయుసుతుడు రా,డాయె ముహూర్తము । వోయెనటుల గావునను। యీయెడదడయక। నిసుకలింగమును । నెలమిబ్రతిష్ఠించెదను.

వ. అనిచెప్పి సర్వవానరులుఁ గనుచుండ మునులసమక్షంబున సైకతమయులింగంబును బ్రతిష్ఠఁజేసి.

తో. తనకౌస్తుభమును-దలచినవచ్చెను - దపనకోటి తేజమున । మనుకులుండుగని-మనమలరగ న, మ్మణినిదాల్చె గంఠమున॥ రామ॥

వ. ఇట్లు మణినిధరించి తన్మహిమచేఁ గల్పించఁబడిన ధేను ధన వస్త్రాభరణాన్న దానంబులచే సభ్యులఁ దృప్తులంజేసి పంపిన వారు స్వాశ్రమంబులకుఁ బోవునెడ మార్గమధ్యంబున.

తో. మారుతియెదురై -వారినిగని యె,వ్వారివలన బూజితులై। మీరు వచ్చితిరి- చేరి తెలుపుడన-మేదినీసురులు నతులై ॥రామ॥

క. రామేశ్వరమున సీతా
రాముఁడులింగప్రతిష్ఠ ♦ రహిఁజేయుచు మ
హీమణమాడ్కి సత్కరించియు
ధీమతివీడ్కొలుప వచ్చె ♦ తిమి కపివర్యా !

వ. అనువాక్యంబులు విని కోపావిష్టమానసుండయి రాముని యెదుట భూమిపయిఁ బదద్వయ చిహ్నంబులేర్పడ దుమికి యాంజనే యుండిట్లనుచున్నాఁడు.

హనుమకీర్తన, కమాస్, రూపకము, వేటాడకు.

నన్నెఱుగవహో! రామ! ॥నన్నె॥ మున్నులంక కేగి దనుజ । ము
ఖ్యుల నేసరకుగొనక। యెన్నగసీతావార్త న, మున్నతమతి నెఱిగించి
న ॥న॥ వ్యర్థంబుగఁ గాశికేగి। వచ్చితి లింగముగైకొని। సార్థకమే ను న్యూ
వృథా। శ్రమబెట్టితి రఘునందన!॥ నన్నెరు॥ ఒక్కటినీకై తెచ్చితి । ను
క్కటినాకొరకుదెచ్చి। తెక్కడవై చెదను జెప్పు, మి విమోక్షపురాధీశ్వర॥
నన్నెరుగ॥

గీ. ఇంత త్వరపడువాఁడ వి ♦ట్లేలనన్నుఁ
దిరిప్పితివికష్ట తరదూర ♦ దేశమునకుఁ।
జెలఁగి యీరీతిహాస్యంబుఁ ♦ జేయుటకును!
దొరల మాటలకెదురు లే ♦ దో! తలంప.

వ. అని నిష్ఠురంబుగా మాట్లాడిన పవనతనయునకు రవికులభ
వుం డిట్లనియె.

మత్తకో. నీవు పల్కినపల్కులెల్లను ♦ నిశ్చయంబగుఁగావునన్।
బావనీ! యిదిమత్ప్రతిష్ఠిత♦భవ్యలింగము దీనినీ । లావునన్ దొలఁగించి
నీవు చె♦లఁగి తెచ్చిన లింగమున్। ధీవరుల్ మదిలోనమెచ్చఁ బ్ర♦తిష్ఠచే
యుము క్రమ్మఱన్.

వ. అనినయంబున వాకు్రిచ్చిన సమ్మతించి యమ్మెటిలేచిపోయి.

తో. లింగంబును గది,లింపగబోయిన। లేశముగదలకయున్నన్।
లాంగూలముమెల్లగను జుట్టితన-లావున లాగుచునున్నన్॥ రామ॥ వా
లము మూలము,వరకు దునిగిసరి-వారుగనగనాలోన। నేలబోర్లబడి-చా
లమూర్ఛితుం,డై లేవక పడియున్న॥ రామ॥

వ. వానరులు హాహాకారంబులు చేయుచుమూఁగి సేదదీర్చి లే
పిన గొంతవడికి లేచి దురభిమానంబువదలి శ్రీరామభద్రుని బరబ్ర
హ్మంబుగా భావించి సాష్టాంగ నమస్కారంబులనేకంబు లర్పించి కొ
నియాడుచున్నాఁడు.

హను-కీర్తన, పూరికళ్యాణి, ఏకతాళము, జానకీపతి.

మైథిలివరా! మన్నింపుదేవర!॥ మై॥ సాధుజనాధార! సత్యవాక్య సార! ॥మైథిలి॥ మంచిప్రోడ,వంచువేడ-లేకభ్రి, మించినాడ-నెంచితోడక నునను। గొంచెకాడ,టంచువీడ,కికగరు । ణించుజాడ,మించుజూడ,దగు॥ మైథిలీ॥ పిన్నగొప్ప,లన్న చొప్ప,డచినా। యున్నతప్ప-దెన్న జెప్ప,బోల దు। నిన్నుదప్ప,నన్య నెప్ప,టిం నే,నన్నెప్ప, నన్నునొప్పదగు॥ మైథిలీ॥ మోక్షగుండ,రక్షకుండ, వఖిలాధ్యక్షకుండ, వక్షుండ-వనుచును । దీక్ష మెండ। పేక్షయుండ । నిడితి బ,రీక్షనిండ-లక్షదండ,ములు॥ మైథిలీవరా॥

వ. అనియనేకవిధంబులం బ్రార్థించిన నానందించి దయాకలిత హృదయుండై రాముండు.

గీ. వినుమునీవేగితెచ్చిన♦ విశ్వనాథ। లింగమునునిల్పు రామేశ♦ లింగమునకు । నుత్తరంబుననన్న న ♦ ట్లొప్పనిలుపం । గాంచి సంతస మంది రా ♦ ఘవుండువలికె.

రా-కీర్తన, ఆదితాళము, హిందూ, కాఫి, వందనంచతు.

చెప్పెదర్ బవనాత్మజా ! యిప్పటి నుండియు జరిగె । యిచ్చటి యేర్పాటులు॥ జె॥ ముందునీలింగమునకు । పూజింపకనాలింగము,నిందు బూజించినపూజ। లెల్ల నిష్ఫలంబులు॥ చెప్పెదర్॥ నాకుదెచ్చినట్టిలింగ। మీకోవెల యందుండును। గాక కాలాంతరమున । గావింతు సత్ప్రతిష్ఠ॥ చెప్పెదర్॥ ఛిన్నపుచ్ఛగుప్తపాద। చిహ్నమునసీవిగ్రహ । మెన్నటికి జెడ కయుండ। నిమ్మజనులుసూడగ॥ జెప్పెదర్॥

వ. అనియానతిచ్చిన నటులనే తెగినతోకయు గుప్తపాదంబులు నలిగిన హనుమద్విగ్రహమును నిజాంశచే నిర్మించి హనుమంతుండందు నిలిపినం గాంచి.

తో. శ్రీరాముసు ప్రే,రేపగనచ్చట। మారుతితీర్థంబనగ। మారు తి తగస,న్నానముజేసెను-మహనియ్యులుమేలనగ॥ రా॥ రామతీర్థము ను-లక్ష్మణతీర్థము । లామీదనుగావించి। రాముండును ధర-నతిపావన

ములు। నగున నెరా ముడుగాంచి॥ రా॥

గీ. అచట శ్రీరాఘవుండు ని ♦ జాంశచేత। సేతుమాధవుఁడన వెల ♦ సియుఁబ్రసన్న । చిత్తుఁడై వాని శోకన్స్పృ♦శించినంత। పూర్వరీతినె దృఢముగాఁ ♦ బొల్పొసంగె.

వ. రామేశ్వరుని మస్తకంబున హనుమంతుని తోఁకచుట్టిన రీతి చిహ్నంబుగా నిలిచియుండెనంతఁ గాశీవిశ్వేశ్వరుండు శ్రీరామప్రతిష్ఠిత సైకతలింగంబున నావిర్భవించి యిట్లనుచున్నాఁడు.

శివ-కీర్తన, శహాన, ఏకతాళము, పురమునలం.

తరణి కులాభరణ! బుధాదరణ! శుభాచరణా! శ్రీకర ముగ।వినుమిది॥ సరగ విప్రవేషమునబూర్వమొక,పరి భిక్షార్థము- దిరుగుచునుంటని॥ దర॥ మునికాంతల్-ననువింతల్ - గనుపడ మోహించి । వెనువెంబడిగను- విడువడి వెడలిరి॥ మునికాం॥ కనలి తత్పతులు- గని నీలింగము । దునిగి పడు నుధర-ననిశపియించిరి॥ తరణి॥ రంగుగ రత్యంగమును- ల్లింగము దెగి పడియెన్ । అంగనలెల్లను నదిగనితొలగిరి ॥ రంగుగ॥ ముంగలవినుమది మోక్షగుండరఘు। పుంగవ పెరిగెను। భువిదివిబట్టక॥ దరణి॥

వ. ఇట్లుమల్లింగము మహాలింగంబై వెలసిన నది యకాలప్రళయంబై యుండఁగని చతుర్ముఖుండు దానియాద్యంతంబు గనఁగోరి.

తో. కోటివర్షములు-గోరి వెదకి కను,గొనజాలకగ్రమ్మఱను। హాటకగర్భుం,డరుదెంచియు న,న్నరసియెరగి యిట్లనెను॥ రామ॥

క. లోకభయంకరముగనిపు
డేకాకృతి లింగమొకటి ♦ యేర్పడెదీనిన్
బోకార్చి శుభముఁజేయుము
శ్రీకంఠా! యనఁగఁ గరుణ ♦ చేనేనంతన్.

వ. త్రిశూలంబుచే నామహాలింగమును బండ్రెండు భాగములుగా ఖండించిన నవి జ్యోతిర్మయంబులై ఓంకారేశ, సోమానాధ, త్ర్యంబక, మల్లికార్జున, నాగేశ, వైద్యనాధ, విశ్వనాధ, కేదారేశ, మహాకా

శేశ, భీమేశ, ఘుసృణేశ, గంధమాదన, నామంబుల లింగంబులై యొ ప్పెనంత.

శివు-కీర్తన, కమాస్, ఆదితాళము, ఇటురమ్మా.

రఘు,వర్యా! వినుము తెల్పెదా। ఆర్యాప్రియుడని । యంతటన మ్మౌని। వర్యులునానిజ-వార్త దెలిసిరఘు॥ వర్యా॥ క్రిమ్మఱలింగము-గ లుగుననుచుశా। పమ్మును దిప్పిరి,భక్తిచేతరఘు॥ వర్యా॥ అప్పుడు మోక్షపు-రాధిపలింగము। నెప్పటివలెనే-యేర్పడెనోరఘు॥ వర్యా॥

సీ. గంధమాదన మను॥కడపటిలింగంబు కనకాద్రికీశాన్య॥మున నునుండి। ప్రళయవాతముచేతఁ॥బడి ప్రవాహమువల్లదక్షిణాబ్ధికిఁ జేరి॥ద రిని నిలిచె। రామునీనిర్మిత॥ రామేశ్వరునకును నీశాన్యమున గల॥దిదిగో చూడు।మింతపర్యంతంబు॥ నెవ్వరెఱుఁగరు దీనియందలరుమ॥ త్తేజమింక। రామలింగేశు నందుక॥రంబుజేర్చి। యిందువసియింతు జనులు రా॥మే శ్వరమునని। పూజసేయుదురిది మొదల్ ॥ పూజ్యమనుచుఁ। బదియు రెం డవలింగమై ॥ పరఁగునిదియె.

తే. కలశజుననువా-గ్దత్తముజేసితి-గావునగాశినివిడిచి। యెలమిని వచ్చితి-నిందువసించెద-నీలింగంబున వెలసి.

వ. ఈస్థలమునకు నేమనుష్యుఁడువచ్చి మన్మయంబగు నీతేజో లింగంబు నర్చించుచున్నాఁడో! యతండు బ్రహ్మహత్యాది మహాపాప విముక్తుండు కాఁగలఁడు. రామా! నీవును నిమ్మహాస్థలమునకు వరంబులి య్యవలసినదని శివుండు దెలిపిన శ్రీరాముం డిట్లనుచున్నాఁడు.

రా-కీర్తన, రూపకము, మంగళమగు.

వినుశంకర-వినుశంకర-వివరించెదనెంచి । మనుజులు చ, య్యనని చ్చట-మజ్జన మొనరించి ॥ విను ॥ సంకల్పము సలిపియిచటి-సైకతమును గొనియుఁ। బొంకంబుగ బుద్ధినిండఁ । బూరించుకజనియు॥ వి॥ శ్రీయుత కా,శీస్థలమును-సేవించియుమందు। నాయిసుకఁబ్రి, యాగనుండి,యక్క రండమందు॥ విను॥ గంగాంబువు గైకొనియీ-లింగముకడజేరి । యంగం

బున-నభిషేకము, నటుజేసియువారి॥ విను॥ భారంబును-వారిధిలో । బడ
విడిచిననంత। వారుందురు-మోక్షగుఁడ। పరవాసుని చెంత॥ విను॥

వ. ఇదియునుంగాక.

క. ఆయనువున సంకల్పము। జేయక రామేశ్వరంబుఁ ♦ జేరముగం
గా । తోయంబది యొకవేళను । బాయక చేరినను బూర్వ ♦ భవకృత
మనుచున్.

వ. తెలియఁదగు నిది నిశ్చయంబనుచు రామచంద్రుండు పలుకునంతలో నచటికగస్త్యముని యేతెంచి శివరాములకు బ్రణామంబులాచరించి.

తో. నీకటాక్షముచ-నీకాశీశుని-నేఁడుగంటిరఘురామా! నాకొంజింతలీ-నాటికిఁదీరెను-నాకేశ్వరనుత నామా! ॥రామ॥

వ. అని పొగడి శ్రీరామశంకరులచే ననుజ్ఞాతుండయి యగస్త్యేశ్వరమనుపేర నొకలింగంబును రామేశ్వరలింగంబున కాగ్నేయదిక్కున స్థాపించి యందుఁబురాతనముగనున్న గంధమాదనలింగంబును దర్శించి సేవించి వారివీడ్కొని యగస్త్యుండు నిజాశ్రమంబునకరిగె నంత.

క. నలుఁడును రామాజ్ఞనుదన। దలమోచియు వార్ధిగట్టఁ ♦ దల
పడికపులి। చ్చలుదెచ్చెడు కొండలువి। చ్చలవిడిచెనందిగర్వ ♦ సంయుతుఁ
డగుచున్.

వ. కట్టుదిన్నవై ఖరిజూచి శ్రీరామచంద్రుండు దనమనంబున.

తో. తనకొక్కనికీ। పనినియమించితి। ననిగర్వంబునవీడు । వనచరావళుల, గనిలక్ష్యముఁజే, కను మెలగుచునున్నాఁడు॥ రామ॥

వ. కావున నదియుడుపదగునని యెంచినంత.

చ. ఒకశిలనీటనిల్పి మఱి ♦ యొక్కటిదెచ్చెడు నంతలోన వీ
చికలటుఁద్రోయఁబోవు నిద ♦ చేతికిజిక్కక యయ్యవస్థచేఁ
గకవికనొంది యానలుఁడు ♦ గర్వము సర్వముదక్కి రాముచెం
తకుఁజని తత్పదంబులకు ♦ దండముపెట్టి వినీతినిల్చెనున్.

నలుని-కీర్తన, రూపక తాళము, బిలహరిరాగము, ఏమిసేయు.

ఏమికారణమో! కామించికట్ట-బేర్మితోఁగట్ట! స్వామీ!నియమించితి॥ రే॥ శిలలిందువేర్యు। అలలతాకున। నటుఁటుబోవ। నలవియే! కట్టుట॥ కేమి॥ వార్ధిమోసమున। వ్యర్థపుచ్చగ। నర్థినెంచెనో! నిర్ధారణదోచద॥ దేమి॥ తామసించకను। శ్రీమోక్షగుండ। రామ! యుపాయ। మేమైన సెలవొసగుమి॥ దేమికారణమో॥

వ. అని ప్రార్థించిన సంతసించి జానకీపతి యిట్లనుచున్నాఁడు.

తో. రామనామమును-రాతిరాతికిని-వ్రాయుచు నతికించినను। క్షేమంబుగనవి-చెదరకుండునటు-చేయుమనుచు జెప్పగను॥ రా॥

వ. నలుండు రామధ్యాననిష్ఠాగరిష్ఠుండయి రామాజ్ఞ ప్రకారముండెనంత నంగద హనుమంత నీలసుషేణ మైందద్వివిద శరభశతబలి తార గజగవయ గవాక్ష గంధమాదన దధిముఖ జాంబవంతాదులు లగ్గకెక్కినట్లు చెలఁరేగి.

రగడ.

వారిధిగట్టగను-బూనిరివానరులందరును॥ వింధ్య పర్వతము వేదాచలమును, గంధ మాదనము - గరుడా చలమును। గాంచన శైలము గైలాసంబును; క్రౌంచాచలమును రైవతకంబును, శ్రీ గిరివరమును-సింహాచలమును, నాగోవర్ధన-మస్తాచలమును। నరుణపర్వతము, నాహిమవంతము, సురగశైలమును-నుదయపర్వతము। మలయపర్వతము-మాల్యవంతమును, నలరుచున్న దోర్ణి, ణాద్రియంజనము, హేమకూటము మహేంద్రశైలమును, సామజశైలము-సహ్యాభూధరము, మంధరశైలము-మాల్యశైలమును, సుందరముగునా,శోభననగమును, జితకూటమును క్షీరశైలమును, జిత్రపునీల-క్షితిధరవరమును, మొదలగుపర్వత, ములకేతెంచియు, పెదకిశిఖరములు పెపెకలించియు, గొనివచ్చిరికపి - కోటులుకొందఱుఁ। గొనివచ్చిరిమ్రా-కులుమఱికొందరు। గొందఱుమూపులఁ-గొందఱుశిరముల, గొందఱుభుజముల-గొందఱుగరముల,। నెత్తుక నెగుఱు

చు-నెలమినిదెచ్చిరి, మొత్తములగుచును-మోి్రయుచువచ్చిరి, చేరువదిరిగియుఁ-జెచ్చెరదెచ్చిరి, దూసురమునకుఁజని-తోలగకఁదెచ్చిరి, వంతులువేక-వడిగాదెచ్చిరి, గంతులువైచుచు-గ్రిక్కనదెచ్చిరి, యిటువలెతెచ్చిన-యిన్నికొండలును, నిటువలెదెచ్చిన-యిన్నిమ్రాకులును, జేరినలుండును-జేతులనందుక, శ్రీరామునినుతి-జేయుచుదడయక, బారావారము-పైనిపసందుగ, సూరిచికట్టఁగఁ-సూర్మినిబొందుగ, నాపనితనమును-నారసిమెల్లఁగ, జూపదులిదెమెచ్చుచురంజిల్లఁగ॥ వారిధిగట్టగను। బూనిరి। వానరులందఱును.

సీ. మొదటిదినంబున ♦ బదునాలుగామడ యిరువదియామడ ♦ మరుదినంబు। నిరువదియొక్కటి ♦ యెసఁగ మూడవనాఁడు పిదపదినంబిరు ♦ వదియురెండు। పంచాహ్నమునసిరు♦ వదిమూడునిటువలె శతయోజనంబులు ♦ చాపునందు। దశమూంశము వెడల్పుఁ ♦ దగియుండసేతువుఁగట్టినలుండులా ♦ ఘవముమెఱయ। నంతరాఘవు డూర్మిళా ♦ కాంతరావ। ణానుజార్కజ వాయు ♦ సుతాంగదాదు। లనుసరింపుచురాగ ♦ హర్షాబ్ధిదేలి। గట్టపై సంచరించెను ♦ కాలమందు.

తో. ఉడుతయొకటి చిప్పనదేతెంచి మ-హోదధిలోపల మునిగి। తడియారకమును-బొడియిసుకనుదాఁ-బడిపొర్లాడియుజెలగి॥ రా॥

కట్టపయుకిజని- గ్రిక్కనరాల్చియు-గ్రమ్మర నటులనెసలుప। నట్టెకాంచినీ, తాధిపుడారవి-పట్టితోడ నదితెలుప॥ రామ॥

క. ఇంత బలవంతులకునిది। యెంతయు దుర్ఘటపుఁగార్యమిట్లుండగ నీ। జంతువుస్వల్పంబయ్యును। జింతింపఁగభక్తిచేతఁ ♦ జేయుచునుండెన్.

వ. అంతియేకాని యీమహాకార్యంబులో నిదిచేయుసహాయంబెంతలోది దేవరవారియందింత భక్తిదీనికిఁ గలుగుట జన్మాంతర సంస్కారంబుగాదా! శ్రీరామభద్రా! అనంతదయాసముద్రా! యని కొనియాడిన రాముండలరి సుగ్రీవా! దానినిందుఁ గొనిరమ్మనుఁడు.

గీ భానునందనుఁ డరుదెంచి ♦ దానితెచ్చి। రామునకునియ్య దయఁజూచి ♦ ప్రేమతోడ । మూఁడువ్రేళుల దానివీఁ ♦ పునను నిమురరమ్యముగను దిర్రేఖలే ♦ ర్పడియెనంత.

వ. చందనమందార పనసామ్రాది దివ్య తరుశోభితంబగు నొక్క వనమధ్యంబున విడిసించున ట్లాజ్ఞయిచ్చి పిమ్మట శ్రీరాముండు.

క. మునివేషమ్ముల సమర। మ్మునకరుగుట యొప్పదని స ♦ ముదగ్రుఁడు, మణిహా। ర నికర మంబరములునిడ। ఘనముగనవి దాల్చివెడ♦లెఁ గదనంబునకున్.

సంధి-కీర్తన, కాంభోజి- రూపకతాళము, భూమిపాలనము.

దండువెడలె-లంకపయికో-దండరాముడు । సానుజుడయి॥ దండు॥ నిండిడెబ్బది। రెండువెల్లవ। దండికపులు దండములై -తనుగొల్వగ॥దండు॥ భటులచటులార్భటులను ది- కటములదరగ । దశవదనుని । పుటభేదనము నననేక। కుటిలభయో-త్కటవిపరీ, తములుగలుగ॥ దండు॥ శరణుమోతు గుండనిలయ! శరణురాఘవా! జయజయమని । సురకిన్నర వరులంబర । చరులై సుమ, వర్షంబులు వర్షింపగ॥ దండు॥

వ. ఇట్లు సేతువుమీఁదుగానడిచి మనుకులుంటు సువేలాద్రికిఁజేరి సైన్యంబుల నక్కడ విడియించె.

తో. అంతటగపుల మ,హారావముల ది,గంతంబుల భేదించెన్। బంతితలలదొర-బాగుగవినితన - మంత్రులతో యోచించెన్॥ రామ॥ కట్టా! రాముడు-గపికోటులతో-ముట్టడించె మనపురము । నెట్టులచేయుద మికననుచుండగ-నింతలోన వేగిరము॥ రామ॥

వ. రావణునిమాతయగు కైకేశి తనతండ్రియగు మాల్యవంతునితోఁ డఁగూడి రావణుని కొలువుకూటంబునకువచ్చి వానిచే సత్కరింపఁబడి యుచితాసనంబునఁ గూర్చుండి యిటులనుచున్నది.

కైకే-కీర్తన, త్రిశ్రజాతి - జంఝూటి.

నామాటమీరవద్దు। నాపట్టివనుచుబుద్ధి। లీమాడ్కి దెలుపగాను।

నిడెవచ్చియున్నాను। మానను। నీమేలుగోరెదను॥ నామాట॥ రాముని దేవి దెచ్చి। కామించి చెరలోనుంచి। సాహసాన్యులనుచు నెంచి। సాధింపగనుదలచి। నావు। నీమది యోచించి॥ నామాట॥ రాముడు మోక్షగుండ। శ్రీమాధవుడుగాడా! భూమిజకమలగాదా! యేమియెరుక లేదా! వాదా! భామనువిడరాదా! ॥నామాట॥

క. నీదాడికోర్వఁజాలక। యాదేవతలాశ్రయింపఁనభయకరంబా। శ్రీదయితుండాసఁగి నరుండై। మేదినఁజన్మించెనిన్ను ♦ మృతినొందింపన్.

వ. జగదీశుని యానతిచేత దేవతాంశంబులఁ కపిసైన్యంబులు గలిగె లేకున్న నింత బలపరాక్రంబులు గల కోఁతుల నెన్నఁడయినఁ గంటివా! కుమారా!

తో. మనుజుడనుచునీ, మదినిర్లక్ష్యముగనుభావించకు వినుము। నినుగెల్చిన వా,లినిజంపిన శూ, రునిగామది గనుఁగొను సుఁ॥రా॥

వ. ఆమేటిసామర్థ్యంబునకన్న నీమగంటిమే! యెక్కుడయిన నామనుజుని భామినిని దెచ్చుటకు నెదిరించి పోకూడదా! యేమరించి తెచ్చుట భయపడికాదా! పుత్రా! దేవతాజైత్రా! రాక్షసకులపవిత్రా!

తో. ఏటికిజెడియెద వికనయినా నా, మాటనుదోర్యకు నేఁజూ। తాటకహరునకు-దరుణినొసంగుము-దయ-శోఁ బోర్చిచునుజూడు.

వ. ఆదయానిధి శరణాగతులఁగాపాడు బిరుదుగలవాఁడు. గాన నీయం దనూయనొందక జేరఁదీయు నతనిసేవకన్న శుభస్కరములొండు లేవు. పామ్మనుడు నవ్వి యతం డిట్లనియె.

రావ-కీర్తన, కమాన్,రూపకతాళము.

మాటాడకుమూ। నాతో॥మాటా॥ హాటకచేలుడు రాముం, డయ్యెను సేవింపుమనుచు। మాటికిబోధించెదు నీ-చూత్రముననే నెఱుఁగనేమొ!॥ మాటా॥ హేయంబగు నీతనువు। రాయనసర్పింపజాల। బాయక యనిచేసియొడలు। వాసిపరమునందుగోలుతు॥ మాటా॥ ధారుణి గోమో

క్షగుండ, శ్రీరాముని నీపిన్నకు, మారుతో జేరికొలిచి-మనియుండుము చిరకాలము॥ మాటాడ॥

వ. దిగ్విజయుండనయి బహుకాలం బిహలోకసౌఖ్యంబు లను భవించితి నొకరికివెఱచి శరణుజొచ్చుటలేదు. దురంబున నతనిఁబొరిగొన లేకున్న నాశరీరంబుదొఱఁగి పరంబు గాంచెద స్థిరంబుగ ధరాతలంబు విభీషణునిచేత నేలింపుము తల్లీ! తెలుపకు నాతో మళ్ళీమళ్ళీ.

తో. అనవుడువిధికృత-మనుభవింపుమని-చనెగై కేశియధేచ్ఛగ। మనుమనిగనియ-మ్మాల్యవంతుడి-ట్లనిబోధింపగజొచ్చెగ॥ రా ॥ సామాన్యునిగా, రామునిగనిత-ద్భామినిజఱబట్టితివి । నేమముగలరజ,నీచరకులమును, నీరుచేయబూనితివి॥ రామ॥

క. శ్రీరాముడు నారాయణుఁ। డారమసీతాంబయగును ♦ వసురుల నడఁపఁగ। ధారుణి జన్మించిరిగద। యారామునిపైని క్రోధ ♦ మదిచేటునుమీా!

మాల్య-కీర్తన, ఏకతాళము.

నిర్నిమిత్తవైరమేల-నీకురావణా! దుర్నిమిత్తములుజాల, దోచె రావణా! ॥నిర్ని॥ సామజాళిసత్వములు, సమసెరావణా! హోమధూమములుగ్రుంగె-నేమొరావణా! ॥నిర్ని॥ గుంపులై వరభ్లుకవిసి, కూసెరావణా సొంపుపెంపులడగె రాక్ష, సులకురావణా! ॥ నిర్నిమి॥ వేడిమి నెత్తురులు గురిసె-వేగరావణా! చూడనుల్కలెల్లరాల, జొచ్చెరావణా! నిర్ని॥ మోక్షగుండశౌరిమీాద । ముట్టిరావణా ! రాక్షసులు జెదుదురు ది,రంబు రావణా! ॥ నిర్ని॥

గీ. సీతనర్పించిరామునిం ♦ సేవజేసి। లంకబాలింపు మెల్లకా ♦లంబుఁజెలఁగి । యనిన నమ్మాల్యవంతుపై ♦నాగ్రహించి । పటుభయంకర వాక్కులఁ ♦ బలికె నిట్లు.

రావ-కీర్తన, ఆదితాళము.

మాతామహుడనినిన్ను । మర్యాదగ జూచుచుండ । నీతిమాలి

మాటలాడేవు॥ ఓమాల్యవంత॥ భీతిదెల్పి బెదరించేవు॥ హీనమానవునిసే వ। కేనుపోవ్రుదునె కుల,స్థాన పౌరుషములనెంచవు॥ ఓమాల్యవంత॥ కాని పోనివెల్లనెంచేవు॥ నన్నుజంపమోక్షుగుండ । నాథుఁడవతరించి శర,నన్ను నెటుల జంప కుందునూ ॥ నో మాల్యవంత ॥ ఉన్న కర్మ మెటుల మానును॥

వ. కాంబోవునది కాకమానదు క్షణభంగురదేహమును శాశ్వ తముగానమ్మి కానిపోనిపనులకు నేనేల ! చొత్తు జ్ఞానహీనవు. బలుకు లుడుగుతాతా! దానవకుల ప్రసూతా! అనుచుండ.

క. దానవపతి యానతిచే । భానుజుకడ కేగిశుకుఁడు ♦ పరువడి మగుడర్ । దానరుగుదెంచి మ్రొక్కిద । శానుతోనిటులఁ బలికెనతి మోదమునర్.

తో. వినురావణనే-జనిన విభీషణు,డనువుగ దెలుపుటచేత । నను జంపగవా-నరులుయత్నపడ- మనుకులుండు దయచేత॥ రామ॥ దూతను జంపిన-దోషమంచున,న్నాతరి విడిపించగను । భీతిలేకనే,నేతెంచితిగడు-నీ తితోడ నినుగనను॥ రామ॥

వ. అనంతసత్వసంపన్నులగు కపిసైన్యంబులచే వారధిగట్టించి దాని మీఁదుగావచ్చి సువేలాద్రిమీఁద రాముండు సేనాపరివృతుం డై యున్న వాఁడనిన నాశ్చర్యపడి రావణుండు.

క. శుకుఁడును సచివులుగొలువగ । నొకప్రాసాదాగ్రి మెక్కి ♦ యురువడిగని యో! శుక! నీవెఱుఁగుదువుగదా ! । ప్రకటంబుగ దెలుపు శత్రు ♦ బలములవరుసర్.

రావణ శుకసంవాదము, కీర్తన.

రా॥ మేలైన చూపుల-మిరుమిట్లుగొలుపునా। నీలాంగుడె వరు శుకా! శు॥ ఆలలితాంగుడే! యసురేంద్ర! రామభూపాలుడగును దేవ రా ! రా॥ పొందుగానాతని-ముందర నిలిచిన - మగురెవ్వరో యి శు కా! శు॥ విందుగ వినురవి,నందనలక్ష్మణ- విభీషణులుదేవరా! రా॥ మో

కుగుండేశుని-మొసలను బేర్కొని-ముదమునఁ జూపుశుకా! శు॥ అక్షయమైనట్టి- యవియున్నదరమె। బ్రహ్మాదులకును దేవరా!.

వ. అయిన నేనెఱిఁగినమట్టుకుఁ బ్రధానకపులవివరించెదరావణా!

గీ. లక్షమర్కటులెప్పుడుఁజె ♦ లంగికొలువ। ఘనపుళిందా నదీతీర ♦ మున వసించి। యుండుమేటి బలుండుసీ ♦ లుండతండె। యినజుదళవాయిమానవా ♦ శన వరేణ్య.

తొ. వేయికోట్లకపి-వీరులుగొలువగ-వేగవంతుడనువాడు। పాయకయుద్ధము-చేయునుద్యముం,డై యున్నాఁడదెచూడు॥ రామ॥

క. గుకుతరవింధ్య సుదర్శన। గిరులకునాథుండుఘనుఁడు ♦ గీరేశసఖుం। డురురణ కౌతుకవిపులో। గ్రరసనమారంభుఁ డతఁడు ♦ రంభుఁడుగనుమా!.

శు-కీర్తన, అటతాళము, రామునంపిన, హిం, కాపి.

వాడేకనుమంగదుడు । వాలినందనుడల్ల॥ వాడే॥ వీడు వాలికన్నమొన,గాడు పనివాడుగద॥ వాడే॥ ఏకాదశ శతపద్మ- ప్రాకటమర్కటులతిభీకరముగనుగొల్వ, దోకగదిలింపుచున్న॥ వాడే॥ తానొక్కడె మోతుగుండ-ధాముకార్యము దీర్చ। వానివలె నుత్సాహము । బూనియుప్పొంగుచున్న॥ వాడే॥

చ. ఘనముగఁజందనాద్రికిని ♦ గాంతుఁడనందగివేయికోట్లపై
నెనుబదిలక్ష సంఖ్యగల ♦ యెల్లకపుల్ దనునాశ్రయింపఁగాఁ
దనరిఖరారియానతిని ♦ దాఁదగఁగట్టెను నిన్నసేతువుఁ
గనుఁగొనమాతఁడే! నలుడ ♦ ఖండబలుండు సురారిశేఖరా!

తొ. నలుబదిలక్షల-నాల్గువేలవా-నరులు గొల్వగాఁ దెంపు। బలమును జూపుచు-బరగెనుశరభుం-డలవాడే! పరికింపు॥ రామ॥

క. కుముదుని శాత్రవమానస। కుముదుని దశకోటిప్లవగ ♦ గురుసరసరః। కుముదుని రాఘవకార్య। ప్రముదుని సంకోచనాద్రి ♦ పతినిం గనుమా!

తో. కోరియెపుడుబది, కోట్లమర్కటులు । గొలుచుచుండగా । నెగడు। పారియాత్రగిరి - భర్తయగునునా। పనసునిగనుమల్లతడు ॥నా॥

గీ. కోటిభల్లుకవర్యులుఁ ♦ గొలుచుచుండఁ । దమ్ముఁడగుధూముఁడత్యంత ♦ ధైర్యశాలి । తనకుఁ దోడ్పడమనదిక్కు ♦ గనుచునుండి । జాంబవంతుని జూడు రా ♦ క్షసవరేణ్య!

క. డెబ్బదిడెబ్బదిలక్షల। నిబ్బరపుంగవులుగొలువ ♦ నేర్పరులైతా। ముబ్బెడు క్రోధనగవయుల। నబ్బా! కనుగొంటె! రాక్ష ♦ సాధిప! వారిఁ.

వ. మఱియునింద్రజాల, గజ, గంధమాదన, గవాక్ష, శతబలి, మైందం, ద్వివిద, సుషేణ, దధిముఖ, సుముఖ, వినుఖులు లోనుగాఁగ లకపీంద్రులనంత బల సమన్వితులగు మర్కటబలంబుల సంఖ్యాతంబుగాఁగొలువ యుద్ధసన్నద్ధులయి కాలుద్రవ్వుచున్నారు. చూచుమునిశాచరేంద్ర!

శు-కీర్తన, కేదారరాగము, ఆదితాళము, క్రోరియుం.

చూడుమాతనీ। దనుజేశా! చూడుమాతనీ। నాడులంకజొచ్చి । నాడునగరముగాల్చి నాడు యోడకదిరిగి, నాడు చనినాడు-మొనగాడు, గదనేడు ॥చూడు॥ మేరుభూధరసమధీరుఁ-మారుతవరకుమారుఁ-సారపింగాకారుఁ, రణశూరున్, మణిహారుఁ, గపివీరుఁ ॥జూడుమా॥ మోక్షగుండపురాధ్యక్షుఁ దీక్షతో గొలుచుదక్షుఁ - యక్షగజహార్యక్షుఁ బృథువక్షుఁ రిపుశిక్షుఁ ఫలభక్షుఁ॥ జూడు॥

సీ. వేయికోట్లసంఖ్య ♦ వెలయుఁగ నవిలక్షకోట్లుమహాసంఖ్య ♦ కొమరుమిగులు। నవిలక్షయగు బృంద ♦ మ విలక్షయగుపద్మ మవిమహాపద్మాఖ్య ♦ యగునులక్ష । యవిలక్షయగుఖర్వ ♦ మవిక్షయగు మహాఖర్వ మవియులక్ష ♦ కడుసముద్ర। మవిలక్షయు యునను ♦ హాసముద్రంబగున విలక్షయగు మహా ♦ దాఖ్యయవియు। నూరులక్షలుగలవు భా ♦ నుజునిముఖ్య।సేనకడమవిచెప్పఁగాఁ♦జేతఁగాదు । ఇట్టిసేనలఁగూడు

చు ♦ నినకులుండు। లంకపయిదండు వెడలె ని ♦ శ్శంకతోడ.

వ ఇంకొక విధంబు వినుము.

సీ. పదివేలకోట్లప్ప ♦ వంగములొకగంతు గంతులుసాహస్రి ♦ గణనముగమి। యాగమిక్కోటి కో ♦ ట్లగునొకమొత్తంబు శతకోట్లమొత్తంబు ♦ జగతివీడు। వెలయులక్షక్షోణి ♦ వీడులైననుసాదు సాదుద్విసప్త ♦ సంఖ్యమూక। శతకోటిమూకలు ♦ సంగడినాఁజెల్లున ♦ వియును నూరుకో ♦ ట్లగునుదట్టి। దట్టలొకయారుగూడినఁ ♦ దగునువెల్వ। నిండి వెల్వలుడెబ్బది ♦ రెండుగొల్వ। రామచంద్రుండునీలోడ ♦ రణమొనర్ప। నరుగుదెంచినువేలాద్రి ♦ యందువిడిసె.

తో. కావున నాతని, గదిసిపోరశ, క్యముగాదోయసురేంద్రా! నావచనమ్మను-నమ్మితివేనిఘు, నంబుగమనిదుజితేంద్రా! ॥రా॥ శ్రీరాముడురా, జీవాత్ముండగు-సీతలక్ష్మియునినమ్ము। వారివలన స్థావరజంగమరూపకజగములునగుజుమ్మ ॥రామ॥

క. జగములకుఁ దల్లిదండ్రిల। నఁగఁదగువారిపయినలుగ- న్యాయంబగునా! జగతీతనూజనొసఁగియుఁ। దగరాముని శరణుఁజొరుము దయమన్నించున్.

శు-కీర్తన, జంఝూటి, అటతాళము.

దినదినభంగురదేహా, ముసునమ్మబోకు। మనముసింక యే-మఱియుండవాకు ॥దిన॥ మలమూత్రములకొంప। మలినయుతంబు। మజ్జాస్థిశోణిత మాంసపూరంబు ॥దిన॥ మఱియిట్టిదేహాభి, మానమేటికి। మఱచియుండెఱుగక। మఱిసేవిప్పటికి ॥దిన॥ ధరమోక్షగుండేశు। దరిజేరితేను। బరమపదంబిచ్చి-భయముదీర్చును ॥దిన॥

వ. అని శుకచారుఁడు బోధించినఁ గుపితస్వాంతుండయి చుఱచుఱఁజూచుచు.

తో॥ ఓదురితాత్మక-చారుడవనిపను-కోరినేనుపంపగను। భారముగా బర, పక్షపాతములు-వలుకుచు వచ్చితివగును ॥రా॥ నిన్నిప్పుడు మ

న్నించక జంపగ। నేడుమదిని దలచియును । గన్నన నీపూర్వస్థితి దెలియుదు। గానవిడచితినినేను ॥రామ॥

వ. ఇట్లు బ్రాహ్మణుడు నతండు చనియె. పూర్వంబున శుకుండను సుర్వోసురుండు గీర్వాణులు వృద్ధియగుటకుఁ బూర్వ గీర్వాణుల గర్వంబు నశించుటకు సంకల్పించి పెక్కు క్రితువులు చేయుచున్నంత.

తో. వజ్రరాక్షసుడు-వజ్రదంష్ట్రుడను - వాడుమోసగించగను। విచ్చలవిడిగా-విహరింపుచుదరి-వేచియుండుముదమునను ॥రామ॥

వ. కుంభసంభవుండు సనుదెంచియున్నంబడిగి స్నానంబునకరిగిన రాక్షసుం డగస్త్యనిరూపంబునవచ్చి.

మత్తకోకిల. మేకమాంసము బెట్టునాకును ♦ మేదినీసురయన్న నోఁ। గాకనాశుకభార్యరూపము ♦ గ్రక్కునన్ ధరియించియున్। బాక మొప్పగఁ జేసియమ్మని ♦ వచ్చినంతనె పెట్టెదా। జోకతో నరమాంసమన్నము♦ సూపశాక పదార్థముల్.

వ. భుజించి శుకునిపైఁగనలి యయోగ్యంబగు నరమాంసంబు నాకుఁబెట్టించితివి నీవురాక్షసుండవు కమ్మని శపించిన నతండు నేనునిర పరాధినని వేఁడిన దివ్యదృష్టిచేత నదిరాక్షసకృత్యంబని తెలిసి.

అగ-కీర్తన, సురటరాగము, ఆదితాళము.

సరేసరేనిను-శపించితినినిర-పరాధి వనుకోక। మదిలో। బరంబెరుగలేక॥ మదియ్య వాక్యము-వృథాపోదు నె, మ్మదిన్ దెలుసుకొమ్మ ॥ ఇదిత, ప్పదంచుననుకొమ్మ॥

సురారిరూపము। ధరించిదశకం। ధరున్గొలుచు చుండు । మిక ముం, దరన్ మేలుగూడు॥ ధరన్ మోక్షగుం, డరాఘవుని సో, దరాన్వితంబుగను-గాంచిన హరించు శాపమును॥

ఉ. వానరసేనఁగూడి రఘు ♦ వంశ్యుఁడు తమ్మునితో డలంకపైఁ। దానరుదెంచినప్డు సము ♦ దారత వారిని జూచివచ్చియా। దానవభర్తకున్ దెలిపి ♦ తత్వవిచారము బోధచేసినన్ । బోనుద్వదీయశాపమికఁ♦

బొమ్మని కుంభజుఁడానతిచ్చినట్.

వ. ఆప్రకారమాచరించి శుకుండు శాపవిముక్తుండై చనియెఁ బార్వతీ! యంత రావణుం డెప్పటిచోటఁ గొలువుదీరియుండె నక్కడరాముండు లంకచతుర్ద్వారంబులఁ గపులు ముట్టడించునట్లుచేసి యుద్ధమునకు ముందొక్క బుద్ధిమంతుని సంధికిఁబంపిన బాగనియెంచి నీతికుశలుండగు నంగదుని గని యందఱువిన నిట్లనియె.

క. అంగద రయమున రావణు। చెంగటికేతెంచి భీతి ♦ చెందక నీవు । పొంగుచునుగొన్నికొన్ని ప్ర। సంగంబులు జేసిరమ్ము ♦ సత్వరతోడన్.

రా-కీర్తన, అటతాళము, హిం, కాఫి.

ఇనకులుండగు రాముండిదెదం - డెత్తినాడనుమంగదా ! నిను సుత్రామాత్యాళితోడను-దునుముఁగలడనుమంగదా! ॥ఇన॥

ధాతచేఁ గొన్నట్టివరములు - దప్పెననుమోయంగదా! సీతనిచ్చియు శరణుజొచ్చిన-జెరుపు లేదనుమంగదా! ॥ఇనకు॥

పోరితరుమగ దేవమానులు- గారటంచనుమంగదా ! గారవించి విభీషణునకు-గట్టెలంకనుమంగదా! ॥ఇనకు॥

మోక్షగుండపురీశుతో బ్రతి, కకువద్దనుమంగదా! దీక్షతో గార్యాంతమునఁ జింతించవద్దనుమంగదా ॥యినకు॥

అంగద రాయభారము.

వ. ఇట్లు తెల్పినసంగదు డత్యానందభరితుండయి శ్రీరామునకు నమస్కరించి సుగ్రీవాదుల యనుమతంబువడసి పర్వతాకారుండై లంకఁబ్రవేశించి పురశృంగారంబు దిలకింపుచుఁ బోయిపోయి రావణుని గొలువుకూటంబుఁ జేరఁగాంచి.

క. ఎవ్వరివాడవువానర! యెవ్వరుపంపంగవచ్చి ♦ తిప్పుడునీవిం। దెవ్వరితోఁబనియున్నది। యెవ్వరుసీతల్లిదండ్రు ♦ లెఱిగింపుతగన్.

వ. అనిన నతండిట్లనియె.

అంగ, కీర్తన, కళ్యాణిరాగము. రూపకతాళము.

వినరారావణా! రఘు-వీరుఁడంపినట్టి। భటుఁడనే ॥వినర॥ నినుఁజలం బుమీరవాల మునను గట్టి వార్ధులందు। ఘనత ముంచినట్టివాలి, కిని సుతుం డనౌదు। నంగదుఁడను ॥వినర॥ గట్టిగానిర్జరయించి-నట్టికార్తవీర్యు జంపి। నట్టి పరశురాముఁగెల్చి। నట్టిమేటి-శూరు, డగు రఘుపతి ॥వినర॥ మోక్షగుండ దేవునాజ్ఞ। దీక్షనీతో మాటలాడ। రాక్షసుండ వచ్చినాడ। రాజసంబుతోడ ॥దెలుపుదునిక ॥వినర॥

వ. అని పలికిన విని రావణుఁడు దురాగ్రహ విగ్రహుండై యిట్లనియె.

చ. మునుపొక కోఁతివచ్చి తన ♦ ముచ్చట లెల్లనుజూపితాను న। మ్మనుకులదూతనంచు హను ♦ మంతుఁడనంచు వచించిమేముదం। డన మొనరింపసిగ్గువడి ♦ నాటికిఁబోయెనునేఁడు నీవురా। మునకునుదూతనం చు ఘన ♦ మ్మును దలపోయుచువచ్చితో! బళీ.

క. ఆకోఁతికిశుభ-మే! కద! నీకథలేమో! వచింపు ♦ నేర్పుగనిచ టర్ల। జేకొనిదూతలఁజంపగ। రాకునికిఁ బ్రేలెదరు వ ♦ రాకునమీరల్.

వ. అనిననవ్వి యంగదుండిట్లనియె.

తో. రావణునకు నోడి-రయమునవచ్చితి - వివనికోపులందరును। నావనచరునని-యవమానించిన। నతఁడుచనియెఁబంపకును ॥రా॥ వానిని నన్నును, భానువంశజుని- సేనలలోనినజుండు, హీనబలులమని, యెంచి యిట్టిపను, లైనఁజేయుడనుచుండు॥

వ. కాబట్టివచ్చుచున్నాము. తక్కినవిషయము నీకేల! వచ్చిన ముచ్చట యుచ్చరించెదఁ జెచ్చెరవినరా! రావణా!

అంగ-కీర్తన, తోడిరా, ఆదితాళము.

ఓరిరావణా! చూడుమురా। ప్రియమునవాలించరా॥యోరి॥ శ్రీరాముడు లో, కారాధ్యుండగు। నారాయణుడని యాదిలక్ష్మి సీ। తారామామణియంచు నీమదిని - నారెన రెకును దలచగదోచదో ॥యోరి॥

శోకంబులకును దల్లిజనకసుత- నీకుదల్లిగాదటర దురాత్మక! - ప్రకట
ముగ నీకులముజెరుటకయి- చేకొనివచ్చియు చెరలోనుంచితి॥ ఓరి॥ నీదు
పుత్రమిత్రాదిరాక్షసులు। నీల్గకముందే! యెరుకగలిగియు। మేదినిసుత
నిడి మోక్షగుండపతి। పాదపద్మముల ప్రాపునజేరుము॥ ఓ॥

తో. బలవద్వైరము, బాగుగాదుచల- పాదితనంబును మాను।
మలవిభీషణుని-వలెనేరాముని- నాశ్రయింపుమేలౌను॥ రాము॥ వినునాబు
ద్ధిని-వినకుండినసీవు- మనుటయుబద్ధముధరను । గనుగొనుసీసుత- కాంతా
దులనిక-గనజాలవు ముందరను॥ రాము॥

వ. శ్రీరాముని కోపాగ్నికినెదురులేదు. నిర్భయంబున నుండకు రాదారాభాగ్యా! కార్యాంతమునం జంతించి ప్రయోజనములేదు. అనిను డివిన సంగదునివయి నలిగి రావణుండిట్లనియె.

రావ-కీర్తన, ఆటతాళము, కలియుగ.

త్రిజగద్భయంకరుడని, తెలియవేమిరనన్ను ॥త్రిజగ॥
నిజముగ నిర్భయముగ, నిలిచిమాట్లాడెదవు ॥త్రిజగ॥
కైలాసమగలించితి ది, క్పాలకుల జయించితి।
బాలించితి లంకబహు, కాలమెదురేమిలేక ॥త్రిజగ॥
వేధోదత్తవరమున, సాధించితిలోకములు।
బాధించితి మునుల, న, రాధములెంతటివారు ॥త్రిజగ॥
జానుసీతంద్రిపగ, మైనదలపకనీవు ।
వానిగూడినావునిను, నేనటులచేయుదునె! ॥త్రిజగ॥
అంగదుడ నాముందర, బొంగిమోక్షగుండరఘు
పుంగవునిభట్టువలె, పొగడెదవు సిగ్గుమాలి ॥త్రిజగ॥

క. పగవాడు దండువెడలిన
జగడముం జేయంగంబోవ ♦ జనుగాకిటులన్
జగతీశులెల్ల నవ్వంగ
మగటిమిచెడ సంధిచేయ ♦ మతికార్యంబే!

తో. నగుబాటని మె, న్నకనాతమ్ముండు-నాతోనలిగియుంబోయి।
జగతినిరాముని, శరణుజొచ్చెనే। జనుమనె! యింకబోవోయి!॥రా॥ అనిన.

అంగదరావణ సంవాదము.

కీర్తన, సురటరాగము, అటతాళము.

అం-రామపరితాపము। రాక్షస యినుమంత, నీమది । దెలియ। వేమనీ॥
రా-రాముసామర్థ్యము - నాముందువర్ణింపరాకుము - పలుకబోకుము॥
అం-వేమకతోచిన్న-నాడేతాటకజంపి-నాడురా! విడువబోడురా॥
రా-ఆడుదానినిజంపి-నట్టిశూరత్వము-లాడకురా । యిచటవేడకురా॥
అం-నీవెత్త లేనట్టి-నిటలాక్షు విలుద్రుంచె-నేర్పుగ। కనునోర్పుగ॥
రా-ఆవిల్లుమోపెట్టు, టదియెంత । పాతది । యానుగా-విరిగిపోనుగా॥
అం-పరశురాముని-బహు-బలమడగించిన-బంటురా! యేలకంటురా॥
రా-ధరణీసురునిద్రుంచు-దర్పముజెప్పకు-తాళురా । యికజాలురా॥
అం-మోక్షగుండేశుండై -ముదమునననుజంప। బుట్టెను-బడగొట్టును॥
రా-ఈక్షితినటులైన-మోక్షము దప్పదిం-కేటికి-దెలుపమాటికి॥

క. బలవంతుడైనవాలికిఁ
గలిగిననీయంతవాఁడు ♦ కడునీచముగా
బలహీనులయిన నరులను
గొలువఁగఫలమేదిరోరి ♦ కులనాశకుఁడా !

తో. వైరిదప్ప నె, వ్వారు దొరలుభువి-లేరా! కొలువొనరింప । నేరవు రాముని-నేడు విడచియింక-రారా ననుసేవింప ॥ రామ ॥ వచ్చిన నీకును-వానరరాజ్యం । బిచ్చెద వారినిగెలిచి । ఇచ్చలుసుఖముగ। నిరుపురముందము। మెరిగించితి దయ దలిచి ॥రామ॥

వ. అనిన నంగదుండు.

అం-కీర్తన, అటతాళము, రామక్రి.

చాలురచాలుర। చాలురరావణ। మేలుగ నీయును, కూలము నాకిక॥జా॥ కాలముదీరెను-గావుననీవిటు, ప్రేలెదు పిన్నని-పెద్దనుకొనక॥జాలు

ర॥ తల్లియుతండ్రియు, దాతయుదైవము, నెల్లరుశ్రీరఘు। వల్లభుఁడేయు గు ॥జా॥ మోక్షగుండేశుని । వీక్షణమందున । రాక్షసచెడెదవు। రాము న్యూమాటికి ॥జాలుర॥

వ. అనిన రావణుండు క్రోధోద్దీపిత మానసుండయి రాక్షసులం గని యీపరపక్షపాతిని నీక్షణంబున, బట్టికట్టుండని యానతిచ్చిన వా రుజెలరేగి మూఁగిన దనలావు గనబఱచుటకయి యంగదుండు జిక్కి- పిమ్మట.

తో. ఆకాశంబున, కవ్వడె యెగశియు-నటునిటు విదలించగను। వేకూలిరి పది, వేల రాక్షసులు-విగతాసువులై ధరను ॥రామ॥

గీ. పిదప రావణుకొలువు చా ♦ విడిచిగూలఁ। దన్నునది చూర్ణ మైకూలె ♦ ధరణిమీఁద । నలిగిదశకంఠుఁడంపఁగా ♦ నసురవరులు। నగ ణితంబుగముట్టిన ♦ నద్భుతముగ.

వ. వారినందఱిని గ్రమంబుగ జముమందిరమునకుఁజేర్చి వేగం బున రామచంద్రునింజేరి నమస్కరించి యిట్లనియె.

కీర్తన, ఆదితాళము, బేహాగ్ రాగము.

రఘువంశశేఖరా! రణరంగభీకరా! యఘదూర! శ్రీకరా! యమి తకృపాకరా! ॥ర॥ మీయాజ్ఞచేతను। బోయితినాతడు। వేయేలసంధి। చే యనేననెను ॥ర॥ చావుకుదెంపు-గావించిసొంపు। జేవయుజెడదు। చెప్పిన వినడు ॥ర॥ శ్రీమోక్షగుండ। ధామకోదండ। రామాయుతండు। రాజికి రాడు ॥రఘు॥

వ. కావున యుద్ధసన్నాహంబుఁ జేయుచుండ నిక్కడ రాక్షస భటులు రావణునిజూచి.

ఉ. దేవ! పరాకువానరుఁడు ♦ తెంపుగ దానవసేవఁ దుంచితాఁ
బోవఁగనూరకుండితిరి ♦ పొమ్మనిమాకు ననుజ్ఞయిచ్చినన్
లావుజవంబు మీఱఁగవు ♦ లన్ మనువంశ్యులఁగూల్చి వత్తుమో
రావణ! పంపుమంచు వివ ♦ రంబుగఁ బల్కిన నాతఁడంతటన్.

వ. తనవైభవంబు రామునకుఁ గనపరచఁదలఁచి దివ్యవస్త్రాభరణంబులు ధరించి సమస్తపరిచారకు లుపచరించి రాక్షసగణపరివృతుండై చనియుత్తరగోపురంబందుఁ గొలువుదీరినఁగాంచి విభీషణునివల్ల రావణుఁ గానెఱిఁగి రాముండు వానిగర్వంబడంచువాఁడై.

తో. అనుజునిచే వి, ల్లంది దానియం, దర్ధచంద్రబాణమ్ము। ఘనముగ దొడిగియు। గడగివిడువనది। చనికిరీటదశకమ్ము ॥రా॥ క్షితిగూల్చియు బొది-జేరరావణుఁడు-సిగ్గుబొందికడుసోలి । యతివేగంబున - నాత్మభవనమున-కప్పుడేచనె ధృతిదూలి ॥రామ॥

వ. ఇట్లింటికిఁబోయి రావణుండు దిరిగి కొలువుఁదీరి రాక్షసులంగని రామునిబలంబులు నాల్గుద్వారంబులఁగవిసి పురంబులోఁ బ్రవేశించుచున్నవి కాఁబట్టి యీక్షణంబున.

రావ-కీర్తన, పూరికళ్యాణి, ఏకతాళము, అమిత్రోగ్ర.

అసురేంద్రులారా! యాజికిమీరు।లతివేడ్కమీర । నరుగిడింపార జేర ॥నసు॥ అరులనుముట్టి యురికినబట్టి। ధరబడగొట్టి। నురుముడుమట్టిమట్టి॥యసు॥ పగవారిమూక। భయమేమిలేక। దగవచ్చెగాక, తరుమనోగాకవీక ॥యసు॥ ధరమోక్షుగుండ। వరుసికోదండ। హరుని రాకుండ, నాగుడులెండపొండ ॥యసు॥

వ. అని పురికొలిపిన నవక్రపరాక్రమంబులు మీఱువీరావేశంనఁ గ్రూరరాక్షసులు లెక్కకుమిక్కుటంబుగా సమరసన్నాహకుతూహలులయి భేరీభాంకారరవంబులుఁ గరులఘీంకారంబులు, ధనుష్టంకారంబులు, దిగంతంబులు ప్రతిధ్వనులియ్యఁగదిలి భుజాస్ఫాలనంబులు చేయుచు.

## యుద్ధారంభము.

తో. నాలుగువాకిం, డ్లను మూగినయా, నగచరసేనల దగిలి। చాలగయుద్ధము-సలుపగబూనిరి-సమరశూరులై మిగిలి ॥రా॥

వ. మేఘనాథుఁ డంగదుని, బ్రజంఘుఁడు సంపాతిని, అతికా

యుండు వినతరంభులను, మహోదరుఁడు సుషేణుని, మకరాక్షుండు జాంబవంతుని, విద్యుజ్జిహ్వుండు శతబలిని, విక్రమధనుండు గజుని, గుంభుండు ధూమ్రుని, దేవాంతకుండు గవాక్షుని, సారణుండు ఋషభుని, ద్విశిరుండు శరభుని, నరాంతకుండు పనసుని, అకంపనుండు గుముదుని, ధూమ్రాక్షుండు గేసరిని, మహాపార్శ్వుండు గంధమాదనుని, కంపనుండు నలుని, జంబుమాలి హనుమంతుని, మిత్రఘ్నుఁడు విభీషణుని, ప్రహస్తుండు సుగ్రీవుని, వజ్రముష్టి మైందుని, అశనిప్రభుండు ద్వివిదుని, నికుంభుండు నీలుని, విరూపాక్షుండు లక్ష్మణుని, సుప్తఘ్న రశ్మికేతువులు నగ్ని కోపాగ్ని కేతువులు నలుగురు శ్రీరాముని, మఱియు ననేకవానరయోధులతో ననేకదానవదళంబులు దగులువడి ప్రథమయుద్ధంబున శరవర్షంబులు గురిపించుచుఁ దరుశైలపాషాణాదులు వైచికొనుచుఁ ముష్టియుద్ధంబులకుఁజొచ్చుచు ముసల, ముద్గర, ప్రాస, పరశు, భిండివాలతోమరంబులచేత నడచికొనుచు సంకులయుద్ధంబునకుఁ దగుల్పడినఁ బోరుఘోరంబయ్యె నప్పుడు.

తో. రామునిభటుల ప, రాక్రమమునకును-రావణసైన్యములాగి। యేమాత్రము సహి, యింపగజాలక-భూమిని గూలిరిలోగి ॥ రా ॥
కొందఱుదగ్గిరి-కొందఱుఁజచ్చిరి-కొందఱుభయపడిచనిరి। కొందఱుసందుల గొందులదూరిరి-కొందరెదురలేమనిరి ॥ రా॥

వ. తనబలంబులు నశించి పర బలంబులకు జయము గలుగుటఁ గాంచి యింద్రజిత్తు యుద్ధంబునుమాని సవనశాలకరిగి హోమంబుజేసి యజ్ఞేశ్వరునివలన దివ్యరథరథ్యంబులును దివ్యాస్త్రకవచకిరీటాదులును గ్రహించి యుద్ధమునకు వెడలుచుండె నిక్కడరాక్షసకాంతలు.

రాక్షసస్త్రీల-కీర్తన, జంఝూటిరాగము, త్రిశ్రజాతి.

ఇఁక యేమిచేతామమ్మ! యి! దేమికాలమమ్మ! యీపోరుమానరైరి యిలమీఁద మనవారి, బ్రతుకు! లేమోనిజము లేదు । ఎవరుదెలిపిన । నెంతమాత్రమెఱుగజాలడే! యెంతమూర్ఖుఁడే!॥ యి॥ చలపాది

దశకంఠుడు గెలువగదలచినాడు । అలమోక్షుగుండ విభుడు । బలవంతు
డనుకోడు। అకటా! కులనాపకుడు వీడు। నిలుపరైరిగా । జలజమిత్రుఁ డ
స్తమించిన। గానిమానరు ॥యి॥

వ. ఇట్లు చింతించుచునంతలో నస్తమించి చీఁకట్లుగ్రమ్మిన నిం
ద్రజిత్తు మేఘంబుల చాటుననిలచి మాయాయుద్ధంబుఁ జేయుచునెరుల
కగపడకుండనున్న నతనిఁగనుఁగొని యుద్ధంబుజేయ వానరులు సమర్థు
లు గారైరి.

గీ. వానరులనెల్లఁ బటుబాణ ♦ వర్షమునను । ముంచినాగపాశ
ముల బఁ ♦ ధించెనపుడు । రామలక్ష్మణులను బరా ♦ క్రమముమెఱ
య । నింద్రజిత్తుమహాగ్రహం ♦ బినుమడింప.

వ. శరీరంబుధరించినపుడు హరిహరాదులకయినఁ బురాకృతం
బనుభవింపపోవునా! ముందుబలిని బంధించిన కారణంబున రాముండు
నాగపాశబద్ధుండయ్యె. అంత నింద్రజిత్తు తనవిజయంబుఁ దండ్రికెఱి
గించిన సంతసించి రావణుండు త్రిజటను బిలిపించి.

రావ-కీర్తన, త్రిశ్రజాతి, వనమును.

సమరముఁజూపూరమణీ! కమలాక్షీ! సీతకునేడు॥ సమర॥ క్రమము
గఁగపులు। రాక్షసానీకముచేయు॥ సమరము॥ ఒడబడదాయెదరుణే । గ
డువేడ్క నాతోడగూడ। నొడబడ॥ వడినాగపాశ । బద్ధుడై శ్రీరాముడు
న్న॥ సమ॥ ధరమోక్షుగుండవిభుడు । దనుజులగెల్వలేడు । ధరమో॥ వి
రిబోణీయాన । విడుమంచుబోధింపుము॥ సమరము॥

వ. అంతట.

గీ. త్రిజటలోనగు రాక్షస ♦ స్త్రీలుసీత। నెక్కపుష్పక మెక్కిం
చి ♦ యుక్కుమెఱసి। సంగరస్థలిఁజేర్చి ప్ల ♦ వంగవిభుల । రామలక్ష్మణు
లనుజూప ♦ రమణిగాంచి.

సీత-కీర్తన, ముఖారిరాగము, ఆదితాళము.

నీకుబ్రహ్మ యిటులవ్రాసెనేమో! శోకముఁనిలుపజాలను॥ రాఘు

వ! ॥నీకు॥ పాత్రికటతల్పము-పాపమనియుందురు । నీకుబంధకమాయెను । రాఘువ! ॥నీకుబ్రి॥ వెలయగగార్ముక । విద్యయేమాయెదై । త్యులకులో బడవలసెను । రాఘున!॥నీకు॥ దనుజులజంపియు । ననుజెరబాపెద । వని యుంటినదితప్పెను। రాఘువ! ॥నీకు॥ అండయెవరుమోక్ష। గుండనాయక! నే । నకటా ! దురదృష్టరాలను। రాఘువ॥ నీకుబ్రిహ్మ॥

స-వ. అని బహుభంగుల విలపించు సీతనుగాంచి త్రిజట యి ట్లనియె.

చ. భయపడనేల నీపతికిఁ ♦ బ్రాణభయంబిసుమంత లేదు ని
శ్చయముగ రాక్షసాధములఁ ♦ జంపఁగఁ బుట్టిన మేటినెక్క రెం
తయుఁ జెనకంగనోపుదురె! ♦ దానవమాయలు మాపినిన్ను నీ
ప్రియుఁడతివేగఁ జేర్చెడిని ♦ బ్రేమనయోధ్యకు మేలుగల్గెడుఁ౯.

వ. ప్రాణంబులుబాసిన వనచరులింత చింతదక్కియుందురా! కర్మసంచితమిట్లుండ కొంచెము చిక్కుపడిరే! కాని యన్యముకాదు. వెఱప వలదనిచెప్పి సీత నశోకవనమందుఁజేర్చె. నిక్కడరాముండు గొంతవ ఱకు గన్నులుదెఱచి పాశబద్ధుఁడయియున్న తమ్ముని విగతజీవునిగానెంచి.

రా-కీర్తన, అటతాళము, అసావేరిరాగము.

కొమ్మనుసాధించు-కొనివచ్చినుగ్రీవ ! తమ్ముని గోల్పోయితకటా! నేనిచట। సమ్మతినాసేవ। సలుపుచుజనుదెంచె। సౌమిత్రిగుణమెన్న।జాలా యీవేళ॥ కొమ్మను॥ తల్లిసుమిత్రినా। తనయుడేడనియున్న । నల్లననామె కే-మందునెటుగందు । నల్లమోక్షగుండ । వల్లభునాజ్ఞను । వల్లననుచు, ద్రోహియు, వారుధరలేరు॥ కొమ్మను॥

తొ. లక్షణయుతుడగు । లక్ష్మణుబాసియు । రక్షణముండగజాల। దాక్షిణ్యమ్మునఁ దమ్ముని వెంబడి । ధరణిజపోయెదజాల॥ రా॥

వ. అనంతరము రావణుండుమిమ్ము బాధించుఁగాన నంగదయు తంబుగా నీవుకిష్కింధకుఁ జనుమునుగ్రీవా! యనునంతలో.

తొ. వానరులెల్లను - వగవవిభీషణు- డానగచరులను గాంచి ।

మానుగయుద్ధము। మానిచింతిలగ। నౌనధైర్యముమడించి॥ రా॥

వ. యుద్ధకాలంబుగాని శోకకాలంబుగాదు. జయాపజయంబులు దైవాధీనంబులు, తెంపులెంపు. మేఘనాధుండు దిరిగి యుద్ధంబునకు వచ్చి యున్నాఁడ నవుడు వాలిపుత్తు్రిండు.

తో. జానుమిత్రి! నీవన్నమాట సత్యమ్ము రామలక్ష్మణుల। బూని యేముఱక-బోవుదుమేజని-పాలియింతును రాక్షసుల॥ రా॥

వ. రాక్షసులశిక్షించి యాక్షమాపుత్రిని తత్క్షణంబున రామునకుఁదెచ్చి యిచ్చెద నటుగాదేని నాప్రాణంబులు దానవులకేరఁజేసి లక్ష్మణునివెంటఁ బోయెదననుచుండ సుషేణుండు.

క. వెఱవకుఁడు నాగపాశము। లురలఁగదోర్నాదిర్నియందు ♦ నున్నవిమందుల్ । గరువలినుతునంపుడు వే । గిరముననవిదెచ్చుమనకు ♦ గీడుదొలంగుఁ.

వ. అనుచుండ నింతలో విపంచినిధరించి రామధ్యానంబుఁ జేయుచు నారదమౌనివచ్చె నెటులనిన.

కీర్తన, హంసధ్వని, ఆదితాళము.

కోదండధృతకరం భజేహం॥ కో॥ వేదవేద్యం - విరాధహం శ్రీ॥ కో॥ వాగీశహృత్పంకజసదనం। వరశశాంక సన్నిభమృదు వచనం। యోగిపాలనం-భోగిశాయినం। నాగపోషణం- నతజనావనం॥ కో॥ ధారాధరశ్యామలగాత్రిం। నారాయణ కవివినుత చరిత్రిం। సారసనేత్రం సజ్జనమిత్రిం। ధీరస్తోత్రిం-దితిసుతజైత్రిం॥ కోదండ॥ పక్షీంద్ర గమనం సురపాలం। మోక్షగుండసత్పుర వరఖేలం। అక్షరశీలం_ఆశ్రితజాలం। అనుపమఫాలం- అబ్జాలోలం॥ కోదండ॥

ద్విపద. అనియిట్లుచనుదెంచి - యానారదుండు, మనుకుల పతికి న,మస్కృతిఁజేసి, దేవర వారికి- దెలియనిదేమి, రావణుజంపు కా,రణముపధరణి, నరుఁడవై పుట్టిన-నారాయణుఁడవు, కరమర్థినజ్ఞాని, కరణిఁబల్కెదవు, లోకులచిక్కుల,లోపములనుంచు, నీకుఁజిక్కుగల్గు,నే! యేటి

మాట, అదెట్లాడనీ యువ,యువములయందు, పదునాల్గుభువనముల్-ప్ర బలియున్న యవి, సర్వంబునీవె ని,శ్చయముగునుమ్ము, పూర్వపువాహనం బునుస్మరియింపు, వైనతేయుఁడుదాను - వచ్చినంతటనె, యీనాగపా శంబు-లెల్లనువదలు, నటుచేయుమనిచెప్పి - యానారదుండు. పటుమతిదీ వించి-పాటెనుదివికిఁ। బిమ్మట రాముఁడు-వెరుకటిరూపు, నెమ్మది యో చించి-నిక్కంబు దెలిసి.

తో. గరుడునిదలచిన,క్షణమాత్రములో । నరుదెంచియువారగ ను। స్థిరముగబంధిం,చిన యురగంబుల। దరిమిచనియెఁ బిమ్మటను॥ రా॥

క. అంతట వానరులెల్లను । సంతసమున నుండి రదియుఁ ♦ జారు లవలనన్ । వింతగ వినిదశకంఠుఁడు । సంతంబున ధూమ్రనయనుఁ ♦ బంపెను ననికిన్.

వ. రాక్షసభటులు లక్షోప లక్షలు గొలువ ధూమ్రాక్షుండు దక్షిణంబున రావణానుజ్ఞచే యుద్ధంబునకు వెడలి.

౼ధూమ్రాక్షయుద్ధము.౼

తో. పటపటార్భటుల-బటుదిక్తటములు-బెటిలిపడగనరదంబు। ద టుకునఁబరవుచు। బటహాభేరిత। మ్మటమృదంగరావంబు॥ రా॥

వ. చెవులు బీటలువాఱ మ్రోయుచుండ రణభూమికిఁ జేరివాన రులఁబొదివి.

ధూ- కీర్తన, ఆదితాళము, మాతాము.

మానవులగూడిమీరు। మమ్ముగెలువవచ్చినారు। కానిలేచూతా మురండికి। ఓకోతులారా! మానుగనాపైకిలెండిక॥ కొండవనములనుదిరి గి పండ్లుకాయలను దిని । యుండినట్టి పనులుగావివి । ఓ కోతులారా గుండెపగులు యుద్ధభూమిది॥ మోక్షగుండ దేవుడైన । ముట్టడించగల డెమమ్ము। రాక్షసులనుచు దెలియరో । ఓకోతులారా! యీక్షితి గూ లుటగానరో.

వ. అని పలికి శరపరంపరలు పఱపినఁ దరుచరులు సరకుగొనక

దరుగిరులచేనవి విరిగింపుచు వీరువాఁడు బోరుచుండిరంత హనుమంతుం
డు ధూమ్రాక్షునిగదిసి శంకర ధనుష్టంకార మొనర్చిన పంకజాప్తకులు
ని కింకరులగుమావంకకు నిశ్శంకుఁడవయివచ్చి పెంకెతనంపు అంకెలే
లవై చెదవు ఇంకజాలు. బింకంబుమాని లంకకుఁజేరుము. లేక వంకరటిం
కరమాటలాడిన బొంకుగాదు. నీతల పెంకులుపెంకులు చేయుదునురా
కుంక! యాకారనీకింతమంకా. అనియొక్క మొత్తుమొత్తిన జిత్తంబు
నఁ దత్తరంబునొందక.

తో. గదచేమోదిన! జెదరకమారుతి। గరమున నొకగిరి బూని।
గదిసివైరాక్షుసుమస్తకము। పిప్పిదిలికూలెధరపై నిః రా॥

వ. అంతకుముందే! వానిభటులు వానరులచేతఁజచ్చిరి. హతశే
షులవల్ల నీవార్తవిని రావణుం డకంపనుని బంపెను.

అకంపనయుద్ధము.

తో. విలయకాలుఁడో! యితడనివానర-వీరులు గనుచుండగను। బల
ములగూడుక-బరతెంచెనకంపనుడు రణముచేయగను॥ రా॥ వచ్చిననాతని
భటవర్గంబులు-చచ్చిపడగవానరులు। చెచ్చెరమోచుక- వచ్చియువైచిరి-
హెచ్చుగదరువులుగిరులు ॥ రా॥

క. ఉప్పరవీధికి నెగసియు। నప్పు డకంపనునివయికి ♦ హనుమం
తుఁడుదాఁ। గుప్పించిదుమికిపొడిగా। గుప్పనరథ రథ్యములను ♦ గూలిచి
పలికెన్.

వ. నిలింపులగుంపులు గుంపులుగాఁ దరిమినట్టితెంపుఁ జూపింప
అంపులుచేయుచు వచ్చితివి నీసొంపువదిలించి నిన్నుఁజంపి దక్షిణంపు
సామికొంపఁ జేరఁబంపనా! నీదుంపదెంపనా! యోరి యకంపనా! యని
యొక్కకొండతో మోదిన గుండెపగిలి యతండుగూలె. నాసంగతి యె
ఱింగి దశముఖుండు.

మహాకాయునియుద్ధము.

క. తనతనయు మహాకాయుని। నని కేగుమటంచుఁబంప ♦ నాతఁ

దురోషా। ననుఁడగుచు భటులుమంత్రులుఁ। దనవెంబడఁగొలిచిరాను ♦ దగ్రితవెడలెర్.

వ. వట్లు వెడలి మహాకాయుని మంత్రులగు రుధిరాశన, వజ్రనాభ, కాలదంష్ట్ర, కాలకల్ప, పావక, శతమాయు, ధూమ్రమర్ధనరు లనువారు గ్రమంబున బృధు, పనస, మేఘపుష్ప, గవాక్ష, ఋషభ గజ, క్రోధన, శతబలి, తారులపయిఁబోదివి.

తో. శరవర్షంబులు - గురిపించుచుభీ । కరముగ యుద్ధముజేయు। నరిమురియువిల, త్స్యము జేయకదరు, చరులు గరులుగొనివేత్రు॥

వ. రాక్షసమంత్రులు భీకరంబులుసెసి యిలఁగూలిరి. తక్కనభటులు వానరసేనలనెదిరించి హతులయిరి. యదిగని మహాకాయునితమ్ముడు మహానాధుఁ డట్టహాసంబుఁ జేసిన వానిదెబ్బకు వానరులు భీతిల్లిరి. యప్పు డంగదుం డెదిరించి.

అంగ-కీర్తన, కమాన్ రాగము-రూపకతాళము, వేటాడను.

వడిజూపకుమా। సీదు॥ వడి॥ వడిజూపకుమల్లదేమీా । వారలగతి జూచుచుండి। మిడుతలుబావకునిమీాద। నడచినగతిన డెంచితి॥ వడి॥ శిక్షింపగనూ। మిా। చేగాదికను। మోక్షగుండదేవుకృపా। వీక్షణమునసంతతరణ। దక్షులమగుదుముబోరగ। రాక్షససీవెంతర సీ॥ వడి॥

వ. అనిపలికి భీకరమగు నొకమాకుఁజేకొని యొక్కవీకు బీకినం గేకవేసి యతండుగూలె. నంత మహాకాయుండు దమ్మునిచావుగని రోషానల జాజ్వల్యమాన మానసుండయి కపిసేనపయి రథమును బఱపి.

పంచ॥ అరణ్య భూములందుఁ గాయ ♦ లాకు లారగింపుచుర్। జరించువానరుల్ నరుల్ బ్రి ♦ శ స్త్రవీరులట్లుదీ। వరంబుగారణంబుఁజేయ♦ వచ్చినారు మేలునా । శరాళికోర్చి యుండుడంతె! ♦ చాలు మెత్తు మిమ్ముల్.

వ. అనిన వానరులు.

ఉత్సాహ. మిట్టిపడ్డసోదరుండు♦ మృత్యువాతఁజిక్కఁడే! వట్టిపాట్టకొట్టివ్వమాట ♦ వాఁగవీరధర్మమా! గట్టివాఁడవయిననిలువు ♦ కదనరంగమందునిఁక। మట్టివేతుమొక్కసారి ♦ మర్మములఁ గలంచుచుఁన్.

వ. అనినవాఁడు మహోగ్రహసమగ్రనిగ్రహుండయి పెక్కుమ్ములు ప్రయోగించినఁ గొంచెముసేపోర్చియు సయిరించలేనివానరుల నిలువరించి యంగదుండొక్క గుద్దుగుద్ది.

అంగ-కీర్తన, ఆదితాళము-సీవను.

నినుమడియించెద-నిలునిలుము! ఘనముగనావడి,గనుముకనుము॥ నిను॥ దనుజుడమీాతం, డిగ్రివిమాజనకుడు। మునువార్ధులలో-ముంచెనుగదరా॥ నినుమడి॥ అటువలెనావా, లాగ్రింబునని। న్నిటుబంధించియు। నిలపయిమోాది॥నిను॥ మోాకుగుండపతి-ముఖ్యభటులమని। లక్షింపకయే, లరచెడిపోవ॥ నిను॥

వ. అనిన దానవుండాగ్రహించి గదతోఁబొడిచిన గదాయుద్ధంబునఁ గొంతవడుకుఁ దమ లాఘవంబులు సూపి యంతటఁబోక మల్లయుద్ధంబునకుఁజొచ్చి పెనంగుచు దానవుం డెన్నిమాయలు సేసినను లోఁబడక వాలినందనుండు.

తో. కడుబెట్టిదముగ-బిడికిటిబెడతల। నడచినమాత్రమె యుపుడు। దడయకదలబ, ద్దలుగాబగిలిన। బడియెను నారక్కసుడు॥రామ॥

వ. అనంతరము వానరులు జయజయశబ్దంబుల నంగదునగ్గించి రామునిఁజేరి నమస్కరించిన రాముండు గౌఁగిలించుకొనిదీవించె. అంత హతశేషుల వల్లవిని కొడుకులమరణమునకు రావణుండు గొంతచింతించి ధైర్యంబుఁబూని వేగినపిదపఁ బ్రహస్తునిబిలిపించి యిట్లనియె.

రావ-కీర్తన, అటతాళము.

రాముని సేనల-రణమున నెదిరించి-రాత్రైరి మనవారలు। యేమియోచించెద। నికమీాద యుద్ధమున-కేతెంచే దేశూరులు॥ కలన నీవును నేను-ఘట కర్ణుడునుదక్క। నిలిచేవారెవరూ సఖా! నెలకొని తమ్ముడు-

నిద్రలేవడాయె। నీవు నేనున్నామికా॥ దీక్షతో నీవేగు-దెంచెదవో ! నేనే తెంతునో! తెలుపుమిక॥ మోక్ష గుండేశుని-మొనలతో బోనీక-శిక్షించి నత్తామిక.

**ప్రహస్తుని యుద్ధము.**

వ. అనిన నతండిట్లనియె.

శా. నేనే తెంచి విరోధియూథతముల ఖం ♦ డింతున్ విచారంబు వ
ద్దైనన్ నేనొకసీఁతిఁ దెల్పెదను నీ ♦ వాలింపు మేలయ్యె డి
చ్చోనాజానకి నిచ్చితేని గరుణిం ♦ చున్ రాముఁడట్లొప్పదే
నానాతం డదికాదుపొమ్మనఁ బ్రియా ♦ ణంబై బ్రహస్తుండొగిన్.

వ. ప్రచండవేగంబున వేదండ తురంగ కాండంబులతోఁ గదిలి కోదండంబునఁ గాండంబులఖండంబుగాఁ దాల్చి సముద్దండ దండధరుం డు నుంబోలె భండనమండలంబుఁజొచ్చి కపితండంబుల బెండువడ జేయు చుండ నీదండి మగం డెవ్వండనికోదండరాముండడుగవిభీషణుండిట్లనియె.

తో. రావణుమాతులు-డీవచ్చెడివాడు।రామ! ప్రహస్తుం డితడే। వావిరిదద్భట-వర్గమునకుదళ-వాయియగునునీఘనుడే॥ రా॥

వ. అని తెలుపుచుండ నతండు వానరసేనలతో మార్కొనితన మంత్రిలుభటులు మృతినొందుటఁగాంచి యలిగి యందరిపైని గ్రమం బున బాణంబులువరపి పేర్చియార్చుచు.

పంచచా. ఆహారణంబులందు శాత్ర ♦ వాళిఁదాఁకిపోరుచో। స హించలేని పిన్నవారిఁ ♦ జంపిపెంపుజూపుచున్। అహంకరించియున్నవా ర♦ లట్లుగాదు శూరుఁడౌ। ప్రహస్తుఁడీతఁడడ్డగించి ♦ పారిపోకనిల్వుఁడీ.

వ. అనిన నత్యాగ్రహంబున నీలుండెదురించి యిట్లనియె.

పంచచా. అరేప్రహ స్త నిన్ను నీవె ♦ యాత్మమెచ్చుకొంచు భీ
కరంబుగా మొఱంగెదా ను ♦ ఖంబుగా మనంగ నీ
తరంబుగాదు రమ్ము నీప్ర ♦ తాపమెల్లఁగాంచి సు
స్థిరంబుగా యమాంతికంబుఁ ♦ జేర్తు నోర్తునేఁడిటన్.

వ. అనవుడు వాఁడువాడిగల బాణంబులు ప్రయోగించిన వా నిదప్పించుకొని.

తో. నీలుడురక్కసు, నెత్తినబడనొక। శైల మెత్తివేయగను। గూలెనుధరపయి-గూతలుసేయుచు-మేలనిసురలెన్న గను॥ రామ॥ అదివిని రావణు, డద్భుతపడితన। మదిలోవగచియుదెలిసి। కదనమునకునేఁ-గదిలి మానవుల। మదమడగించెద గదిసి॥ రామ॥

వ. అనియిట్లు పలికి సర్వాభరణ భూషితుండయి ప్రయాణం బగుచుండ మండోదరి కొలువుకూటంబునకువచ్చి భర్తకు నమస్కరించి యిట్లనియె.

మండో-కీర్తన, త్రిశ్రజాతి-జంఝూటి, ఎవ్వాడుకాని.

నీకింతపంతమేల। నోకాంత! రఘువరుజాల। శ్రీకాంతుడనుకోవేల। యేకాంతమున మేల, జాన, కీకాంతజెరబట్టుట। యిటుల। నాకొడుకులు దెళ్ళిరక్కటా! భూమిపై-నికనిల్వజాలగా॥నీకింత॥ ప్రకటించిచనినవారు నొకరైనదిరిగిరారు। యికబోయిబ్రతుకువార, లిందెవ్వరునులేరు।చెప్పఁ। టకుభయపడుచుందును। మనసు। వికలము నొందించబోకుము। తిన్నగా। యోచించిచూడుము॥ నీకింత॥ ధరమోక్షగుండవిభుడు। నరుడెన్నటికిగాడు। పరమాత్ముడనుచుజూడు। ధరణిజనిడివేడు। నీవు। శరణన్నరక్షించును। జెడిన, తరువాత బాగానెచాలును। ఇప్పుడే, శోకమార్పుము॥ నీకింత॥

వ. అని బహుభంగులఁ బ్రార్థించినవినక కోపించి రావణుండు.

గీ కోఁతులనుగూడివచ్చిన ♦ రోఁతనరుని। కొలువుగొలువఁబొమ్మని ♦ పలుకుటెంత!। పలుచదనముగునానేర్పు ♦ దెలిసియుండి। పరుల నాముందుగణియించి ♦ పలికెదహహా!.

చ. సురలనుగెల్చినట్టి రణ ♦ శూరుసినన్ బెదిరింపనేల! నా
నరులవిభీషణున్ ధరణి ♦ నందను మర్కటులన్ జయించెదన్
వెఱవకు గెల్వలేనియెడ ♦ వీరరణంబునఁబోరి చచ్చి యా
పరమపదంబుఁబొందెదను ♦ భామిని! చెప్పక లేచిపోగదే!.

వ. అనిన నతని నిశ్చయంబెఱింగి విధికృతంబనియెంచి యింటికి బోవుచుఁ దోడిసఖులతో నిట్లనుచున్నది.

మందో-కీర్తన, హిం॥తోడిరాగము-అటతాళము.

ఏమనిపలుకుదు-నెవ్వరివేడుదు। కామిని! చెడిపోవు। కాలముదచ్చె ను॥ నే। సామజగామిని। సైచజాలతొలి। బాములనోచిన । నోముఫలం బున॥ కేమ॥ తగమోటుగుండ। ధాముని తోడఁ। బగబూనినాఁడు। బ్రతుక గనౌనటే!॥ యే॥

వ. ఇట్లువగచుచు మందోదరి యంతిపురికరిగె. నంత రావణుం డు యుద్ధసన్నద్ధుండయి.

*** రావణప్రథమయుద్ధము. ***

క. పదితలలఁగిరీటంబులు। వొదలఁగశస్త్రాస్త్రసమితి । పొందు గఁదనయిరువదికరములందుఁ దాలిచి। యుదయార్క-ప్రభలవెలుఁగు । నొకరథమెక్కెన్.

వ. ఇటులనెక్కి చతురంగబలసమన్వితుండయి చనునప్పుడు.

తో. కరిబృంహితములు-తురగఘోషములు- నరదంబులరావము లు। మురజపటహభే, రికాహాళరవ-ములుసద్భటరావములు॥ రా॥ కలిసి దిగంతం, బులుభేదించియు। గమలభవాండమువగిలి। చెలగరణస్థలి। జేరి రావణుడు। నిలిచెను ధైర్యముమిగిలి॥ రా॥

వ. అతని విభవంబుఁగని యాశ్చర్యంబున రాముం డెవ్వాండని యడిగిన విభీషణుం డిట్లనుచున్నాఁడు.

విభీ-కీర్తన, రూపకతాళము-హిం॥కాపి, ఇంతిరోవిన.

రావణుఁడతఁడే! రాఘవ! మాయన్నయయిన॥ రావ॥ దేవతలను బాధింపుచు-దిగ్విజయముగావించిన॥ రావ॥ పాతకుఁడతఁడు । నీతియింత యెఱుఁగలేడు। ఖ్యాతిగమిమ్మమరించి-సీతనుచెఱబెట్టినట్టి॥ రావ॥ ఈతని। శిక్షించినవెనుకనుగాని। మోటుగుండవాసలోక। ములకు మేలుగ లుగదయ్య॥ రా॥

వ. అని తెలుపుచుండునంతలో రావణుండు వానరసైన్యంబుల పయిఁ దీక్ష్ణబాణంబులు నెడపక వేసి చిందరవందర చేయుచుండ సుగ్రీవుండు రోషించి.

క. ఒకకొండదయె త్త్రిపె చినఁ। బ్రికటితముగ దానినడుమ ♦ బాణంబులచే। శకలములు చేసి మఱివే। యాకశరమున నినజుమూర్ఛ ♦ నొందఁగఁజేసెన్

వ. అదిగని హనుమంతుండు రోషతామ్రాక్షుండయి రథంబు పయికి లంఘించి.

పంచచామరము. ధరాకుమారిఁజూచి కూ్రరా♦ దానవాళిఁద్రుంచి నీ। పురంబుగాల్చినిన్నుఁ జంపఁ♦ బూనినాడుమానితే। శిరంబులెల్లనుల్ల నేఁడు♦ వ్రేతుబ్రహ్మదత్తమా। వరంబులెల్లనీదినంబె♦ వాఁగుపాలుగావలెన్.

వ. అని బెదరించి పలుతరముష్టిచే వక్షంబున నొక్కపెట్టునఁ బొడిచిన రథంబుపయిమూర్ఛిల్లి వెంటనే తెప్పిరిల్లి చుఱచుఱఁజూచుచు.

తే. కడువడిమెచ్చితి,గదరా! బలవంతుఁడవని దశముఖుఁడడవ। బెడిదంబగునా-పిడికిటిపోటుకు, బడియెనుమూర్ఛిలి దిగువ॥ రా॥

వ. హనుమంతుండు మూర్ఛబోయిన రావణుఁడు నీలునివిరాఁదికి రథంబుఁబోనిచ్చి.

పంచచామరము. తటాననన్ను దాకిపోర♦ దర్పకారికైన మ। ర్కటాధమా! తరంబుగాదు♦ రమ్ము పాఱిపోక నీ।పటుత్వమెల్లగాంచి రామ♦ భద్రుఁజేరఁబోయి దిక్కటంబులార్వనేఁడుమ త్ప్ర♦తాపమెల్లఁజూపెదన్.

వ. అనిన.

తే. నీలుఁడుగోపా,న్వితుఁడయియొకఘన-శైలశృంగమును వ్రేయుఁ। బోలఁగనా దశ,ముఖుఁడునడుమనే। పొలియఁజేసియునడాయు.

వ. పెల్లార్చినీలుండు రావణురథంబుపయి కెగిరి మకుటంబులుజెదరునట్లూచి ఛత్రచామరంబులు మాణంబుఁజేసి హారంబులు దెగదీసి రథంబువిఱుఁగునట్లు గదిలించి యనేక విధంబుల భంగపఱచినఁగోపించి.

తో. అనలబాణలమున-నాతని వైచిన । నదితగిలినమాత్రమున। మునుకొనినీలుడు, మూర్ఛిల్లెనునది-గని లక్ష్మణుఁడురయమున॥ రా॥

లక్ష్మణ-రావణసంవాదము.

ల॥ నన్ను గెలిచిపోవరా! దానవకులాధమా! పన్నగనాబాహు బలము-బరగఁజూడుమా॥ నన్ను॥

రావ॥ పిన్నవాఁడవెదురలేవు-బీర మేలనూ। అన్నమరుగుజేరుము నీ, కంతెచాలును॥ పిన్నవాఁడ॥

ల॥ వాడిగలుగుబాణములు-వచ్చెనిలువుమా । మోడిపోకనిబ్బర ముగ, నుండశక్యమా॥ నన్ను గెలిచి॥

రావ॥ నేమమోక్షగుండవిభుఁడు-గూడడాసెదా। మోడిచేసిబాణ వహ్ని-ముంచివేసెదా॥

వ. అనినఁ గోపోద్దీపితుండయి లక్ష్మణుండు నిలువరింప నశక్యం బులగు బాణంబులు రావణుపయి వైచిన నతఁడు వెఱఁగంది బ్రహ్మ దత్తంబయిన యొక్కబాణం బెక్కువెట్టె.

తో. ఉదరముదాకునటు-గురిగావైచిన- నరిగితగులలక్ష్మణుఁడు। సొరిగిలేచి బిర, బిర రావణువిలునరికి భయదమ్మై నెగడు॥ రా ॥ మూఁడు మ్మూలలఁదశ-ముఖునివక్షము-గాడనేయమూర్ఛిల్లి। వాఁడుదెలిసితీ, వ్రంబు నశక్తినివైచె లక్ష్మణునిమళ్ళి॥ రా॥

గీ. శక్తిదాకిమూర్ఛ ♦ సౌమిత్రిమునిఁగిన। నెత్తఁబూనిదనుజుఁ ♦ డెత్తలేక। యద్భుతంబునొంది♦ యటనున్న హనుమంతుఁ । డంతమూర్ఛ దెలిసి♦యాగ్రహించి.

తో. వచ్చిరావణుని-వక్షముపగులగ-నడిగాగుద్దుటవల్ల। జెచ్చె ఱనటుమూ, ఛిల్లిపడియె సుర, లచ్చెరువందిరిమెల్ల ॥రా॥

వ. ఆంజనేయుండు రామభక్తుండుగానఁ జులకనగా లక్ష్మణు నెత్తుకొనిపోయి రామునిముందటఁ బెట్టె రామునితేజః ప్రభావమునకు బరాజితమై శక్తిదొలంగె లక్ష్మణుఁడు మూర్ఛదేరెనంత.

క. రావణుఁడుమూర్ఛఁదెలసియు । వేవేగమె కపులపైకి - వెడలఁగవారల్। చేవచెడి యురగకని సీ। తావిభుఁడదలించి పలికె ♦ దశముఖుతోఁడన్.

*⁂ రామరావణుల ప్రథమ యుద్ధము ⁂*

రా.-కీర్తన, ఆదితాళము, భీకరగతి.

ఓరోరి రారా। కోరికదీరా । దీనుగనినుబోరా। నేరుపుమీరంగనేటికి సమకూరె! భోరునముట్టి। ధీరతబట్టి। సారెకుగొట్టి, చంపుదుజలపట్టి॥యో॥ భండననిపుణ కో, దండాదిదీక్ష, పండితుండనుమోక్ష, గుండవిభుండను, దండిగనీతలల్। ఖండింతు నసురుల। దండింతు గండలు। జెండింతు రణభూమి। నిండింతురక్తము ॥ఓరోరి॥

వ. అనుచున్న సమయంబున హనుమంతుండు గరంబులు ముకుళించి.

తో. రాఘవ! దనుజుండు, రథమునెక్కియు । రణమొనరింపనురాగ। లాఘవమున గా, ల్నడనుండుట పో, దలను నన్నెక్కుడువేగ ॥రా॥

వ. అనిన హనుమంతునిపై నెక్కి రామరావణులు గోపాటోపంబునఁ బరస్పరబాణ ప్రయోగంబులఁ దమ నేర్పులు గనఁబఱచుచున్నంత.

తో. ఒక్కబాణమున। రక్కసువిల్లు బ, టుక్కునవిరువగ నతడు। దక్కకమఱియొక। ధనువున శరసం, ధానము జేసియునపుడు ॥రా॥ తటుకుననుననిలజు। నిటలముదాకగ। గదవైచిన నదిగాంచి। చటులాగ్రహమున జానకీశుడొక-శరమును వడిసంధించి ॥రా॥

వ. రావణుకోదండంబు ఖండించి రథంబుఁ జూర్ణంబుజేసి రథ్యంబులఁజంపి సారథిని గూల్చి.

తో. అర్ధచంద్రమను-నస్త్రమువేయుగ। నతనిమకుటములువిరిగి। వ్యర్థముగా ధర। బడిన ఖిన్నుడయి। వామునిలచెమదిగలగి ॥రా॥

వ. అప్పుడు రామచంద్రుం డను మన్నాఁడు.

క. రావణ సీవీఁకనింటికిఁ। బోవుము వానరులతోడఁ ♦ బోరి బడలియు। న్నావటు కావునఁజంపక। వేవిడిచితినన్న నతఁడు ♦ విన్నదఁనముననŕ.

వ. పాదచారిస్థయై వానరులు నవ్వుచుండఁ దలలు వంచుకొని గరుడునిచే విడువఁబడిన యురగేంద్రుని వగిది లంకలోనికిఁజని కొలువు కూటంబుఁజేర చింతనొందుచు రాక్షసుల కిట్లనుచున్నాఁడు

రావ-కీర్తన, రూపకతాళము, హిందూస్తానితోడి.

ఏమిచేతును। నకటా! యెటులనోర్తును! రామునినెదిరించి గెలువ రాదు తలపను ॥యేమి॥ వన్నిగాంచితి। బ్రాభ। వమున మించితి। నన్ను నెదురలేరు త్రిభువ, నములు వెతకిన ॥యేమి॥ నాదుశౌర్యము। నేడు, నాదుధయిర్యము। మేదినిబడిపోయె దెలుప-రాదునిక్కము॥యేమి॥ ఒక్క నరునిచే। నయ్యో! చిక్కగవలసె! నెక్కడినరుడు మోక్షగుండా,భీశుడు దెలిసె। నేమి.

వ. బలవంతులయిన ప్రహస్తాదులు మడిసిరి. ఇంకనామానవుల నెదిరించువారెవ్వరు. కుంభకర్ణుండు తొమ్మిది దినంబులవాఁడు లేచినా తోఁ గొంతవ్రసంగించి తిరిగినిదురించినాఁడు. మీరతని లేపుకొనిరండు నాతమ్ముండుగాని వారలజయింపఁడు పొండనవుడు.

తొ. కుంభపుకూళ్ళను । గుసుమ గంధములు । గొనిరాక్షసుల రుదెంచి। కుంభశ్రవణుడు-గూరికియుండిన। గుహలోనఁబ్రవేశించి॥ రా॥

వ గంధపుష్పాక్షతలచే నతనిఁ బూజించి ధూప దీపంబులిచ్చి తాముగొనిపోయిన వరాహమహిషాది మాంసంబులును షడ్రసోపేతాన్నంబును రాసులుగాఁబోసి యింద్రాదులనెల్లఁ బొలియింపుచున్నట్టుగ లగని కలవరింపుచు మహత్తరమైనయుశ్వాసనిశ్వాసంబులతోడ భయంకరాకారుఁడై పడియున్న నతనిగాంచి యక్కటా! యింతబలవంతునకిట్టి నిద్రావస్థచే మునుంగవలసినట్లు విధాతలిఖించెగదా! యెంతయన్యాయమని దూఱుచు జయజయ శబ్దంబుల నగ్గింపుచు నంద ఱొక్కపెట్టున

జగంబులు దల్లడిల్లునంత ధ్వనులు గలుగ నఱచుచు.

రాక్ష-కీర్తన, ఆదితాళము, ఓరామరామ.

లే లెమ్మకుంభకర్ణ-లెమ్ము దేవరా! నిద్రలేలె॥ ఆలమ్ములోపల దేవ, తాళినిబట్టుక మిగుల । సోలించునంతటి మేటి, శూరవరుడవు॥ లేలెమ్ము॥ అన్న రావణుడు బిలువు। మన్నవచ్చినాము లేచి, పన్నుగనాస్థానమునకు బదుము దేవరా! ॥ లేలెమ్ము॥ మోకగుండ స్వామిపురము । ముట్టడించి యున్నవాడు। దక్షుండవై పోయివాని। జరుము దేవరా! ॥ లేలెమ్ము॥

వ. అనివేడిన మిన్నకుండిన.

తో. సారమైన ని । స్సాణపటహములు-భేరులు గడువాయించి। చారుతరంబగు-శంఖంబులును దు-తూరలెలమిబూరించి॥ రా॥

వ. నిద్దుర లేవకుండినఁ బట్టెస భిండివాల గదా ముసల ముద్గరాదులుగొనియందఱు మూఁగి యొక్కపరివిసరివేయుచుఁ ; బదివేలకుంతములచేతఁబరులకుబట్టించి పొడుచుచు; గొప్పకొండలనేకములుఁ దెచ్చి వైచుచు; మీఁదికెక్కి సత్వంబు మెఱయఁ గాళ్ళతోఁద్రొక్కుచు; వేధించియు మేలుకొలుపలేక పిమ్మట.

తో. సింహనాదములు, నేసిబిట్టుగాఁ జెవులుపగులగా నఱచి, సింహగజాముల, చే ద్రొక్కించియు-జందడివందడిబరచి॥ రా॥

వ. కోలాహలంబుగావించిననాధ్వనికి లంకగగ్గోలుపడియె. వానరులందఱదివిని భయాభ్రాంతచిత్తులై యుండిరప్పటికిని లేవకుండిన.

తో. కొందరు గర్ణము, లంటుదూరిచని-గూబలు బండ్లనుగఱచి। కొందఱు గరిముల-గురులువట్టిలా,గుచుగాల్ నేటులువిఱచి॥ రా॥

వ. అమితముగా బాధించిన నెట్టకేలకు గొంచెముకదలి యావులించిన మహాగ్నికణంబు లపరిమితంబుగా వాగ్ద్వారంబున వెడలె. నదిగని రక్కసులొక్కరితో నొక్కరిక్కరణి ననుకొనిరి.

రా-కీర్తన, కమాస్, ఆదితాళము.

చాలించబోకుడు-సైరించి లేవుడు॥

మించిమనముబో- ర్లించిలేపికది - లించుటచే నావ-లించినాడు॥ చాలిం॥ క్రిమ్మరనిద్దుర-గ్రిమ్మినలేప ద-రమ్ముగాదు కా,ర్యమ్మెజెను॥ జాలించ ॥ ఈతనిలేపక - బోతే మనకిక - యాదానవపతి - చేతమాట॥ చాలించ॥ కదనంబునసీ - ఘనుడుమోక్షపుర, । సదనునెదుర । గలఁడిది నిక్కము॥ చాలించ॥

వ. అని చెప్పకొనుచు నలసటలేక యినుపమోకులు దెచ్చి కీళ్ళు కీళ్ళు విఱచికట్టి.

క. వేయిఘటంబులతైలముఁ । బోయక దెరలంగఁగాచి ♦ పటుకారులచే । నాయతబలులై పట్టుక । పోయియుఁ జెవుగూబలందుఁ ♦ బోసి సరగునన్.

వ. ఇనుపగడ్డపారలు దెగఁగాలిచి ముక్కు రంధ్రింబులఁ జొప్పించి యొక్కటేరీతి ధణంధణధ్వనులతో ననేకభేరులువాయించి కల్లోలంబుగావించిన నతండు శేషాహిసమానోగ్రకరంబులు సాచి సీలిగి వికృతంబుగా నోరుఁదెఱచి యావులించి.

క. ఈనిద్రయేల రాముని। నేనెదిరించినను ధీర్ఘ ♦ నిద్దురబోవం । గానగునసుకొనినాఁడే। మోనానవ్వాఁడునిదుర ♦ ముదమున లేచెన్.

వ. ఇట్లులేచి కూర్చొని ప్రళయకాలాగ్నితో సమముగా నేత్రంబులయందుఁ గెంపుగదుర నిట్టూర్పులువిడుచుచు దానవులఁగాంచి.

కుం-కీర్తన, ఆదితాళము, ఏదిరాయొరివలె.

ఎవరులేపిరి। నన్నెవరులేపిరి! దివిభువివగులు। దిక్కులువోగలు। జెవిగూబలగలు। రవములుఘుగులు॥ నెవరు॥ మొన్ననేలేచి,చూ,యన్ననుజూచి। మన్ననవడసి। నురనిద్ర తెలిసి। పన్నుగవచ్చి- పండితిసాలసి॥ యెవరు॥ ఏమికార్యము। మీ। కెంతధైర్యము । (శ్రీ) మోక్షపుర । స్వామితోవైరు। మేమాయెఁజిరి । నేటికిసైరు॥ ఎవరు॥

వ. అనిన రాక్షసులకుంభకర్ణోత్కంఠ రిపుగజ లుంఠనాద్భుత కంఠీరవుండగు దశకంఠుండు దోడుకొనిరమ్మన్న లేపితిమి, కుంభక

ణా! గుణసంతధైర్యసంపూర్ణా! యనిన మంచిదని యాహార కాంక్ష తోఁ బాఱఁజూచిన నాక్షణంబున.

క. ఎనమన్నూరజములమఱి
యెనుబదిమహిషములవేగ ♦ నిరువదియొకరః
మనుజులను వేయివరహా ము
లనునాలుగువేల శశము ♦ లనువేర్వేఱః.

వ. ఖండించి పాకముఁజేసి తెచ్చి రాసులుగాఁబోసిన నమ్మాంసంబుఁ గడుపాఱందిని రెండువేలకుండల మద్యంబుఁ బానంబుజేసి.

తో. పటపటదిక్కులు, బగులునట్లుగా। పండ్లుకొరికితీవ్రమున। ది టవుగజుట్టున, దీర్ఘమీసములు- దీటివికృతరూపమున॥ రా॥

వ. వెడలివచ్చి రావణునికొలువుకూటంబుఁ జేరిన సంతోషించి హేమపీఠంబునఁ గూర్చుండనియమించి యిట్లనియె.

రావ-కీర్తన, రూపకతాళము, శివశివవినుమా, హిం, కాపి.

సోదర,వినుమా। మేదినిశ్రీ। రాముండను-రాజుగలఁడు॥ సోదర॥ సోదరమర్కటయుతముగ। మోదంబునమననగరము। ముట్టడివేసెను నాతఁడు॥ సోదర॥ వారలనెదిరి। వారకమన-వారలు బహుమందిచెడిరి। వారల॥ లేరుపోర నీవుదక్క। శూరులెవరు మోక్షగుండ। శ్రీరాముని నెదిరించఁగ ॥సోదర॥

వ. కాఁబట్టి నిన్ను లేవఁగొట్టించితి యుద్ధయాత్రకు వెడలుమనుడు నవ్వి యతండిట్లనియె.

ఉ. నారదమౌని తెల్ప విని♦నాఁడ రమాపతిరాముఁడై నరా। భారముఁబాప సూర్యకుల ♦ పావనుఁడై యుదయించు నంచునా। తీరుగఁ బుట్టియుండనగు♦దేవమయుండతనిః భరించు వా। రె ! జగత్రియంబున ॥ ♦ యింపఁగ నాతరమౌనె! యగ్రిజా!

తో. మనచేఁగాఁగల। పనిగాదిదినీవు। శ వలెనని తలఁచినను। జనకజనిచ్చియు। శరణుజొచ్చురా, మనికన గనలుచున నేను ॥రా॥

గావ-కీర్తన, రూపకము, కన్నడరాగము.

పోరా। యిారోతకూత। లేరచాలురా! వినవెల్లర!॥పోరా॥ ఆరా ముఁడబ్జనాభు, డైననేమి! మర్కటులను, శూరులైననేమి! వారు। శూరులే! సెబాసు। మనకన్నను ॥బోరాయిా॥ యుద్ధం బొనరింపఁగ స, న్నద్ధుడవై పోకనారు। బుద్ధులుగరపెద వెంతటి। బుద్ధిశాలివంచు । ననవచ్చను॥ బోరా॥ ఈలాగునబగరబాగడి। వేలరీతిలోబడెదవు। నీలావు గణింపలేవు॥ నిద్రపోతుకేటి। రణరంగము ॥పోరా॥ రాముడిలమోక్షగుండ । ధాముడనుచు నేనెఱుగనె! నీమాత్రము వానిచేత। నీల్గితేను ముక్తి । యలవడదే! ॥పోరాయిా॥

వ. అనినవిని యన్నమనోదృఢంబుగాంచి యిదుగో! చనుచున్నానని చెప్పి ప్రళయకాలాభీల విజృంభిత మహాంభోధరంబుచందంబునఁ గుంభకర్ణుండు గర్జింపుచు యుద్ధసన్నద్ధుండై.

** కుంభకర్ణుని యుద్ధము. **

క. శూలితిశూలముకన్నను
మేలగు శూలంబుఁ గేల ♦ మెఱయఁగఁగీలా
భీలముగా నార్చుచు రణ
కేళికిఁదా వెడలెనపుడు ♦ క్షితియదరంగన్.

తో. లెక్కకుమీరిన। రక్కసులెల్లను। నుక్కు మీరగను రాగా। జక్కగ బటుని, స్సాణ పటహాది। స్వారరవంబులు మోగ్రా ॥రా॥ వెడలగ బిడుగులు। బడె నుడుగణములు। బుడమిని జలజల రాలెన్। కడువడి నిప్పలు జరిగురిసెను దిక్కరులు భయంపడి పోలెన్ ॥రా॥

వ. ఇటువలెఁ దిజగద్భయంకరాకారుండై యుద్ధభూమిఁ జొచ్చి వానరసైన్యంబుపైకి నడుచుకుంభకర్ణుని నికృతాకృతికి నివ్వెఱఁ గందిరాముండు విభీషణునితో.

క. దేవారికేమిగావలె। నావచ్చెడి శూరుడెవ్వ ♦ డాశ్చర్యకరం బౌవాని రూపుగాంచిన। వేవేగమెతెలుపుమన వి ♦ భీషణుఁడనియెన్.

విభీ-కీర్తన, జంఝూటిరాగము, ఆటతాళము.

రణరంగశూరుఁడు కుంభకర్ణుఁడు-రామ! యీఘనుఁడు। రఘురామ! యీఘనుఁడు। వల, రావణానుజుఁడు॥ రణ॥ జని, యించినప్పుడే దేవతలను జ, యించితోలెను। జయించి॥ మ, దిఁంచబూనెను ॥రణరంగ॥ అది, గాంచినిద్రిమునుంగునటుశపి-యించెనాయజుఁడు। శపి, యించెనాయజుఁడు। ని, ద్రించునీతండు ॥రణ॥ శ్రీ, మోక్షగుండపురీశయేమర। క్షీతిరిపీని। నీ। వీక్షితిని వీని। బొలియించు దయచూని ॥రణ॥

వ. రావణునికిఁగల బలంబులలో ముఖ్యుండితఁడొక్కండే! ఇతఁడునశించిన వానిబలంబర్ధాంశంబు దెగినట్లగు. నిద్రావ్యాజంబులేనిచో! వీని దాడికి లోకంబులు భరించునా! బాగ్రితస్వామీ! మారి హృదంతర్యామీ!

వ. అనుచుండ.

క. రాక్షసమూకలువడిగా। వృక్షచరులమట్టడించి ♦ విపరీతముగా। లక్షింపుచు శిక్షింపుచుఁ। భక్షింపుచు బెక్కుగతుల ♦ బాధించి రొగిన్.

వ. అప్పుడు వనచరులు తమప్రితాపంబులు వెల్లివిరియ భుజాస్ఫాలనంబులు చేయుచు.

తో. కొండలుదరువులు। గొని తెచ్చియునా। క్రూర రాక్షసులవైచి। వెండియుఁబుణికెలు-బెంకులుగాఁగను, బిడికిటిపోటులబొడిచి ॥రామ॥

వ. మహాద్భుతంబుగాఁ బెనంగుచుండ నప్పటిసమరంబు దేవతలకుగూడఁ దేరిచూడరాదయ్యెనప్పుడు.

తో. కూలెనునేతలు। సోలెనురౌతులు। వ్రాలెనుగజతురగములు। దూలెదువీరులు। దొరలెదుశూరులు। దునిసెదురథరథ్యములు ॥రా॥

వ. ఈరీతిరభసంబయినఁ దదియ్యశోణిత మేదోమాంస మజ్జంబులుదృప్తిగా నారగించి భూతప్రేతపిశాచ . కాకఘూకచయంబులువిఱ్ఱవీగుచుండె నంతగుంభకర్ణుండు వానరులపయికిఁగదిసి

ఖం-కీర్తన, ఆదితాళము.

నన్నోర్చినన్నోర్చి నిలువుడి। మీరు । నన్నోర్చి । నిన్నమొన్నర క్కసుల। నిక్కితొక్కినట్లుగాదు ॥నన్నోర్చి॥ అంభోజసంభవదత్త। ఖం భద్వరబలముచే వి, జృంభించి జంభారిముఖులడంభము సంరంభముడిపి, కుంభిని బేర్కొన్నయట్టి। కుంభకర్ణుడనునేను ॥నన్నోర్చి॥ అక్షీణబల ద ర్పితరణ। దక్షులౌ రాక్షసవర్యు। లక్షయముగఁ గొల్వమిమ్ము। శిక్షింప గవచ్చినాడ। మోక్షగుండస్వామికిమీ। రీక్షితిసేవకులైన ॥నన్నోర్చి॥

వ. అనిన నప్పుడు వానరులు రోషానలనయనులయి.

తొ. పటుసత్వంబున। బారివృక్షములు । పర్వతములుగొని తెచ్చి। కుటిలయుతుండగు। కుంభకర్ణుపయి। దటుకున వైచిరి హెచ్చి ॥రా॥ శూల ముచేతను। సొలయకయాతడు। జూర్ణముగానొనరించి, । కేలనుగదగొని కీశవర్యులను। గిటడంచ లంఘించి ॥రామ॥

క. కోటానకోటివానర। కోటులగదచేత మోది♦ కూలిచిపిదపన్। నోటగబళించిగొందఱ । వాటంబుగ మ్రింగె దనుజ ♦ వల్లభుఁడలుకన్.

వ. ఇట్లువిజృంభించి మ్రింగుచుఁ బెల్లార్చుచుండె వానినాసాకర్ణ రంధ్రంబులనుండియు నోటినుండియు మ్రింగఁబడిన వానరులువెడలివ చ్చిరి. కూలినవానరులును మూర్ఛదేరికవిసిరి. అప్పుడుహనుమంతుండు.

తొ. ఒకమహాద్రిగొని-యురువడివచ్చి మ, హోగ్రంబుగ వ్రే యగను। బ్రికటితముగ నది-పై దాకిన నిల, బడితెప్పిరి సొంపుగను ॥రా॥

వ. కోలాహలంబుగా గాలాననీక గీలాభీలంబుచేసి తాలిమిని దానవపాళిని నవలీలఁదూలించి వాలంబువేలాడింపుచుఁ బ్రేలెదవు. చాలు చాలు; నీలావును నీలాఘవంబును గాలదండాభమగు నాశూలం బుచే నేలపాలుచేసెదరా. రావానరవీరా! యని శూలంబున మోదిన నాతాఁకునకు హనుమంతుండు మూర్ఛిల్లె. బిమ్మట నీల ద్వివిత శరభ గజ గవాక్షాది ప్లవంగంబుల శూలంబు వ్రేసి కసి మసంగుచున్న సుగ్రీ వుండుబైకొని.

సు-కీర్తన, ఏకతాళము, బ్యాండుస్వరము.

నినువధింతుదానవా! యిక, నిలువునిలువుదానవా! యినసుతుం డదానవా! న, న్నెదురలేవుదానవా! మునువాలి మీఁదున్న నొంచెగదా! నినుబట్టినేనిపుడు-విదళించెదా ॥నిను॥ శిక్షచేతుదానవా! నీ, సిగ్గుదీతుదానవా! వీక్షణమునదానవా! నీ, వింటికేగుదానవా! మోక్షమొందేనుని దయచేతను। నీక్షితిభూతాళి। కెరజేతును ॥నినువధింతుదానవా!

వ. అనినఁ గుంభకర్ణుండు.

పంచచామరము. పరాక్రమంబుజూపువారు ♦ ప్రజ్ఞలెల్లముందుగా। మొఱంగుచుందురా! దురాత్మ ♦ మూర్ఖచిత్త! నాదుముం। దఱిఁ బురారియైన నోర్చి ♦ దాఁక నోడుఁగాన సం । గరంబుమాని పాఱిపొమ్ము ♦ కర్మమంచిదయ్యెడున్.

వ. అనిన నాగ్రహించి సుగ్రీవుండు.

గీ. పెద్దకొండ యొకటి ♦ పెకలించుకొనివచ్చి । యెత్తివైచెదనుజు ♦ నెత్తిమీఁద। నదియువాని వక్ష ♦ మటుదాఁకి చూర్ణమై। రా, లెనంత నలిగి ♦ రాక్షసుండు.

తొ. శూలముగొనిచుఱ-చుఱజూచుచునా । సుగ్రీవునివేఁ్రయగను। జాలమంటలు, జ్వాలముగఁ గ్రక్కుచు, జనుదేరఁగఁగనితగను ॥రామ॥

తొ. హనుమంతుఁడు నదు, మనె దానిని వ్రి, య్యాలుగాదు్రించినగనలి। దనుజుఁడు మలయూ, ద్రినిగొని సుగ్రీ, వునిపై వ్రేసినదవిలి॥రా॥

వ. ఆదెబ్బకు సొమ్మసిల్లి సుగ్రీవుండు మూర్ఛ మునింగినఁ గని కుంభకర్ణుండు రావణునకుఁ గనఁబఱచుటకు లంకలోనికిఁ గొనిపోవుచుండ విడిపించుటకు నోపక వానరులు హాహారవంబులు చేయుచుండి రంత సుగ్రీవుండు మూర్ఛదెలిసి వానియకృత్యంబునకుఁ గోపించి.

గీ. పైకినెగబ్రాకి జీకాకు ♦ పఱచిముక్కు। జెవులు దెగఁబీకి రక్తంబుఁ ♦ జిల్కఁజేసి। వికృతరూపునిగావింప ♦ వీఁకనతఁడు। భానుజుని బట్టి నేలపైఁ ♦ బడఁగఁగొట్టె.

వ. అప్పుడు సుగ్రీవుండు క్రిందఁబడక లాఘవంబున రామచంద్రునికడకు నుఱికెఁ బిమ్మట గుంభకర్ణుండు.

కుం-కీర్తన, ఫీల్ రాగము-అటతాళము.

అకటా! నేటికినింత-యాపదలొదవె। వికృతాకారముతోడ-వెలయగవలసె॥ న॥ చెలియలిగతినాకు-సిద్ధించెనోరా। తలపబురాకృతము, తప్పిపోదారా॥ యు॥ ఈరూపమున నన్ను-జేరగఁజాల, బోరికి గ్రమ్మఱఁ-బోదునీవేళ॥ నక॥ వెలయమోక్షగుండ-విభునితోఁబోరి। తగలక దాజెడ దలచెనాకారి॥

వ. ఇట్లు పరిభవపడి కుంభకర్ణుండు లంకలోనికిఁ బోనొల్లక విలయకాలమహాగ్ని చందంబున మండిపడుచు రణరంగంబునకు వచ్చి వీని దెబ్బకుఁ దబ్బిబ్బునొందుచున్న వనచరులఁ జుట్టుకొని.

తో. కొందఱబట్టుక-గుంభినిమోదెను-గొందఱి నదులనుద్రోసె। గొందఱినూకెను। గుధరంబులపైఁ-గొందఱబై కెగవైచె॥ రా॥

కొందఱదిక్కుల-కునుబడమీఱెను। గొందఱిలంకకుబడగ, బొందుగవైచెను। భూరిబలంబున, గొందఱిమ్రింగెను జెడగ॥ రా॥

వ. ఇట్లు భయంకరంబుగా శంకలేక బనిచేయుచున్నంత.

క. కూతలుగూసెడుకపులును। భీతినిబరతెంచుకపులు ♦ భిన్నాంగులునై। రోతపడు కపులుదనుజుని। వాతనుబడు కపులునైవి ♦ పద్దశ గలిగెఁ.

తో. తగ్గెను వినజుఁడు-దగ్గెనంగదుఁడు, దగ్గెగవాక్షుఁడు గజుడు దగ్గెనునీలుఁడు-దగ్గెనుశరభుడు-దగ్గెనుధూమ్రుడునలుడు॥ రా॥

వ. తక్కిన జాంబవదాదులు భయపడి యురుకుచుండ లక్ష్మణుండెదిరి.

తో. కుంభకర్ణునిపై, గొన్నిబాణములు-గోపముతోడను బరప। సంభృతధీరుఁడు, సరకుగొనకదాఁ-జనుచుండగఁ బురికొలుప॥ రా॥

వ. వానరులు హానిపయికి నగణితంబుగా నెగఁబ్రాకి.

తో. తోకలజుట్టియు-గేకలవెట్టియు, దోలువట్టినఖములను। బీకు చుసంధులు, బిగియబట్టుచును-బీడించగజులకగను॥ రా॥

వ. వారినందఱను విదళించిన మేఘమండలమునుండి చుక్కలు రాలినట్లు గ్రిందరాలిరిట్లుసలుపు కుంభకర్ణుని పరాక్రమమునకు నద్భుతంబంది.

క. రాముఁడునిర్జితభార్గవ
రాముఁడు సద్గుణగణాభి ♦ రాముఁడునుత సు
త్రాముఁడుఁ దాటకగర్వ వి
రాముఁడు దానెదిరెనపుడు ♦ రాక్షసుపైకిన్.

వ. ఇటువలెగదిసి రాముండు ధనుష్టంకారంబుఁజేసిన నాధ్వనికిఁ జతుర్దశభువనంబులు గడగడ వడంకె. అప్పుడు విభీషణుఁడు రామునకు ముందుగా నడిచి కుంభకర్ణుని ముందర గదాధరుండయి నిలిచినఁ గాంచి నవ్వుచు.

కుం-కీర్తన, కాపి-అటతాళము, నాయనయో॥

ఓరివిభీషణ। యుక్తమెయౌగదా! పోరొనరింపగ - జేరినవాడవు॥ వో॥ అన్నదమ్ములమని। యెన్నగబోలదు। నిన్నేలువానికి । నెప్పగనుండుము॥ వో॥ చాలగనిన్నిటు। జంపినలంకను। నేలువారెవ్వరు। నికనీవుగాక॥ యో॥ మోక్షగుండేశుని। ముదమునగొల్వుము । రాక్షసరాజ్యము। రయమునసిచ్చును॥ ఓ॥

వ. అనిన విభీషణుండు గుంభకర్ణునకుమొక్కి.

తో. రామునితోవై, రముపలదని నే-రావణునకుఁజెప్పినను । నా మాటలనుము, నంబుననొప్పక-ననుదన్నియుఁ బొమ్మనెను॥ రా॥ కావున రాముని-కరుణకుబాత్రుడ, నైవచ్చితినేననుచు । గేవలముగదుఃఖింపుచుఁదలగియు, నావలబోయెనుగనుచు॥ రా॥

వ. అప్పుడు రాముండు లక్ష్మణ సహితంబుగాఁ గుంభకర్ణుని సమీపించి యిట్లనియె.

రా-కీర్తన, సురటరాగము-ఆదితాళము.

దురంబునను ననుభరింపగనునీ। తరంబుగాదారా! యికను-రైతెంగియిటుబోరా। సరోజసంభవు। వరంబులెల్లను। దొరంగుగనుగొనురా! ఇదేనా। శరాగ్నిగాల్చునురా॥దురం॥త్రిమూర్తులునునీ।కు మేలుగానడ్డ-మైన విడచెదనా! నీవి,క్రిమంబుగనుగొననా॥ దురం॥ జగంబునను మో,క్షగుండపతినేదు,రగన్ ఎవరికైన। బ్రాణము, లగూడిపోనగునా!

వ. అనిన.

ఉ. అంతటవాఁడురౌద్రరస ♦ మావహింపన్ బ్రళయావసాన కాలాంతకుఁబోలె। మండిపడి యార్చుచుఁ ♦ బేర్చుచు బండ్లుగీటుచున్। గంతులువైచి మర్కటులు ♦ గంపమునొందుచుఁ బారఁజేసితాఁ। బంతము మీఱరామనర ♦ పాలునితోఁ ననియెన్ జలంబునన్.

కః౨-కీర్తన, అటతాళము-మేలైన.

మాయలువన్నిన-మాయించిచంపగ। మారీచుగానుసుమా! పాయకబాహులు-భంజించికూల్పఁగ-బంధుడగానుసుమా॥

పోలగవిల్లిచ్చి-భువిభంగపడభృగు-పుత్రుడగానుసుమా ॥ వాలాయముగనొక-కోలనుగూల్పగ-వాలినిగానుసుమా॥ రాక్షసేశ్వరుడ। రావణానుజుడ। రణవిక్రముడనుసుమా। మోక్షగుండేశ్వర-ముల్లోకములయందు-మొనగాడనోదుసుమా!

సీ. ఘనమైనకఱకు ర ♦ క్కసుల పల్కులుగాని సనకాదియోగి సం ♦ స్తవములుగాదు। పటహాతమ్మట భేరి ♦ భాంకారములుగాని నారదపఠితగా ♦ నంబుగాదు। ఆర్చుచుఁ జనుదెంచు ♦ నసురయోధులుగాని యర్చింపవచ్చు ♦ భక్తాళిగాదు। కఠినతరంబగు ♦ కదనరంగముగాని కరమొప్పు క్షీరసా ♦ గరముకాదు। అచటసుఖమును మేలునీ ♦ కేటగలదె। యెందుకుజనియించితివి భూమి ♦ యందునీవు। వెఱ్ఱిబ్రహ్మయు నింద్రుండు ♦ వేడగానె। యయిననను దాకి బ్రతికిపో ♦ మ్మంతెచాలు.

వ. అనిపనికినిఁ గోదండరాముండు గోపాన్వితుండయి యనేక

సహస్రకాండంబు లఖండంబులుగాఁ గోదండంబున నెక్కువెట్టి వేసిన నవి తప్పించుకొని.

తో. గదత్రిప్పుచుభీ, కరముగరాగను। గనివాయువ్యాస్త్రమున। గదతోఁగూడ-కరమునుదునిమెను। కాకుత్‌స్థుడుబీరమున॥ రా॥ కడమచేతరా, క్షుసుడువృక్షమును-గైకొనిమీఁదికిరాగా। దడయకనింద్రాస్త్రమ్మునరాముడు। దానిని దుంచెను వేగ॥ రా॥

వ. రెండుహస్తంబులు దెగి క్రిందబడిన వానిక్రిందబడి కొందఱు వానరులు మడిసిరి. అనంతరంబ కుంభకర్ణుండు వికృతంబుగా నోరు దెఱచుకొని.

కుం-కీర్తన, రూపకతాళము-మంగళమగు.

నినుమ్రింగెద నినుమ్రింగెద నినుమ్రింగెదఁ గనుమా! యినవంశజ! యికనిల్వక। నెంద్రైననుజనుమ॥ నిను॥ నాబాహుల-సలుకంగనె। నేబోదునె కనుమా। నీబంటులదాకియు నినునేనోర్తును నిలుమా॥ నిను॥ నరభోజనులకు వానర। నరులడ్డమెకనుమా। ధరణిశ్రీమోక్షుగుండ పురరాఘవ! నిలుమా॥ నిను॥

వ. ముక్కు సెవులును జేతులును దెగినను సిగ్గులేక వికారంబుగా నోరుదెఱచుకొని పయికిఁ గదిసిన రాముండలుక రెట్టింప.

తో. అగణితబలుడై-యర్ధచంద్రశర-యుగము వింట సంధించి। తగబిగించి త, త్పదయుగ్మంబును-దెగఖండించెను మించి॥ రా॥

క. కరచరణంబులు దెగినను। ధరపైదొర్లాడుకొనుచు ♦ దైత్యుఁడు కవియన్। శరజాలంబులునోటను। జొరవైచెను రాఘవుండు ♦ సురలరుదందన్.

వ. సింహనాదంబుఁ జేయుటకు వీలులేక వికారముగా గేకలు వేయుచు వేడిచూపులఁజూచుచున్న దానవుని వక్షంబున గుఱిగాంచి.

తో. ఇంద్రాస్త్రము సం, ధించివేయనది-యేగియురము భేదించి। సాంద్రంబుగ భూ,స్థలిలోదూరెను। నరగణముడదలించి॥ రా॥

అంతకశర మత్యంతవేగమున - నపుడువేసియ బెల్లడరి । వంత
ముతో గుంభకర్ణుని శిర-మెంతయుద్ధృంచెను దొడరి॥ రా॥

వ. ఇట్లు శ్రీరామకర నిర్ముక్తదివ్యాస్త్రంబుచే గుంభకర్ణుని
తలదెగి లంకలో సగంబును సముద్రంబులో సగంబును బడియె. గోపు
రప్రాకారాదులు చూర్ణంబులయ్యె. దానిక్రిందబడి పదికోట్లవనచరు
లుమృతినొందిరి. జలచరంబులు మగ్గె. గులగిరులు మొగ్గె. దేవతలా
నందించి రాముని నభినందించి పుష్పవృష్టి గురిపించిరి. అనంతరంబు
హతశేషులు కుంభకర్ణుని మరణవృత్తాంతంబు జెప్పిన రావణాసు
రుండు మూర్ఛవోయి కొంతవడికి లేచి విలపింపదొడంగె.

రావ-కీర్తన, ఖీలురాగము, అటతాళము.

అకటా! కుంభకర్ణ! యనిదెళ్ళినావా ! యినగెలుపేదినా-కేది
రతోవ॥ యక॥ కులిశధారకునైన-గూలనిమేను । యిలనరునేటున, నిటు
గూలెనోను॥ య॥ మనవిభీషణుని-మాటగ్గైకొనక । నినుగోలుపోతి
ని-నీబుద్ధివినక॥ యక॥ నీబలమునునమ్మి-నేడింతపనికి। నేబూనితినిక, నేర్పె
దియునికి॥ నక॥ మోటుగుండేశుని-మదమున నెదురి। నీక్షితి నాపని,యిం
తేయాగదర॥ యక॥

వ. కుంభకర్ణునిగూర్చి రావణుండీలీల విలపింపుచున్న నతని
కుమారులగు నతికాయ, దేవాంతక, నరాంతక, త్రిశిరులును, దమ్ము
లగు మహోదర, మహాపార్శ్వులును రావణునితో ననుచున్నారు.

క. మీరేల చింతనొందగ
నోరావణ మమ్ముబంప • నురువడిగపులన్
శ్రీరామ లక్ష్మణులగని
దీరగ వధియించి మేము • తెందుము వారిన్.

వ. కాలముదీరినప్పు డెంతవారయినను జావకుండురా ! యుద్ధకా
లంబున దుఃఖింపుచుండిన జయము కలుగునా! లెమ్ము లెమ్ము. మమ్ము
ప్రయాణమ్ముచేసి పంపుమనవుడు రావణుండు ధయిర్యంబునొంది.

## అతికాయమారుతుల యుద్ధము,

రావణసం, తోహా. మీరాకడ్డంబే! లోకత్రియముగ । భీకర శస్త్రాస్త్రములు । చేకొని యుద్ధముఁ-జేయఁగఁబొమ్మనఁ, జెలఁగి యసుర మొత్తములు॥ రామ॥

వ. అనంతరంబు యుగాంతవేళయందువలె సైన్యము కదిలిరాఁగఁ గాంచనరథంబులెక్కి ధనుర్బాణధరులయి భేరీభాంకారంబులు భూనభోంతరాళంబు నిండవెడలి యుద్ధభూమికిఁ జేరి ముట్టడించిన.

తో. కపులు రుడీకొని కరములఁ బొడుచుచుఁ- గాళ్ళఁ దోఁడఁ దన్నుచును। విపుల శైలములు-వృక్షచయమ్ములు-విఱిచి తెచ్చి వేఁయుచును॥ రా॥ తురగంబులతో। దురగంబులరథ, కరులచేత రథకరుల । స్థిరముగ ననుకుల-చేనసురుల మోదిరిపోడిరైరి ధరనురుల॥ రా॥

వ. మర్కటులు మాఱులేక వైరులహాతంబు సేయుచున్న రాక్షసదళంబులు బెదురువడి యుఱుకుచుండ నిలువరించి నరాంతకుండు వనచరులపయి ననేకబాణంబులువైచి తనలావుఁజూపుచుఁజని యంగదునిదాఁకి యిట్లనుచున్నాఁడు.

నరాం-కీర్తన, కమాస్, రూపకము.

ఇంతగర్వమేల నిల్వరా। ప్లవగాధమ! నీ॥ కింతగర్వ॥ అంతకనిభుఁడనునేను న,రాంతకుఁడను మంతనమున॥ నింత॥ దిక్కులు నేదిరిగినానురా। మానవులబట్టి। చక్కడంచిమట్టినానురా। ఢొక్కదరఁగఁ-వ్రొక్కెద నే,మెక్కదనిఁక,దిక్కెవ్వరు॥ ఇంత॥ శిక్ష జేతునెక్క-వేఁటుకు । బహుగత్తుమిపుడు। మోక్షగుండవిభుని చాటుకు। అక్షయరణ,దక్షులమగు-రాక్షసులకు । రాకెదురుగ॥ నింత॥

వ. అనినవంగదుండు జానకీజాని యానతిచే నేను వచ్చి మీనాయనతో భాషించి నానిపుణత్వంబుమెఱయ ఖరసూనుఁడు లోనగు దానవుల వేనవేలంజంపి మేనుమోదల మానవకుకడకుఁ బూనికతో వచ్చితి. నానాడు నియానవమయినఁ గానరాదయ్యె. నెక్కడమంటివిరా

హీనా ! యీవేళవచ్చితివా ! నాపయిన నిన్నుజంపక విడిచేనా.

వ. అనినవాఁడలిగి.

తో. గదజేకొనియం,గదునిపే్రయగాఁ -గదిసియురమ్మునుదాచి। యదివిరిగినగని- యసురుడుబిడికిట- నడచిన మూర్ఛిలిలేచి॥ గా॥ ఒక్క- గుద్దుతా, గుద్దినగ్రక్కున- నొరిగెనునాతనివాజి। చక్కగనింకొక-సారి గుద్దగను-రక్కసుడీల్గెనునాజి॥ రా॥

వ. అంతనరాంతకుని చావుగనికినిసి మహోదరదేవాంతక త్రి శిరులొక్కసారి యంగదునిపయికినడిచి యనేకశిలీముఖంబుల నొప్పించు చుండిన నతండును వెనుదీయక పర్వతవృక్షాదులచే మోదుచుండెనంత లో నీలుండును హనుమంతుండును నంగదునకు దోడువచ్చిరి. అప్పుడ య్యిరువాగువారును గదిసి.

పంచచా॥ అరేమురాత్ములార! మీరలాహవంబుఁజేయఁగా। బి రానవచ్చినారమీఁదు బింకముల్ గలంచిస।త్వరంబుగా శిరంబులూడఁద న్ని శాత్రదేవతా। పురంబుఁ జేర్తుఁమింకఁ బాటి పోక యిఁదునిల్వుడీ.

వ. అనినఁ గోపించి దేవాంతకుండు హనుమంతుని దూరుచు.

తో. పరిఘుద్రిప్పచును-బైకిదుముకగని - పవనజుడలిగియు హెచ్చి। శిరమునుబిడికిట-జితుకబొడువగా। క్షితిపై గూలెనుజచ్చి ॥రా॥

వ. అదిగని మహోదరుఁడొక్క మదగజమునెక్కి నీలుని జేరి యుద్ధములలో సమర్థులమని యిద్దరిత్రిని సిద్ధంబుగఁ బ్రసిద్ధిని గన్న మాపయికినాటోపంబుఁ జూపవచ్చెదరు సేబాసు - కోపాగ్నిదీపించగనీ పూట నీరూపుమాపి మాపెద్దల ఋణంబుఁ బాపెదఁ బోపోరా నీలా! నీముఖంబుఁజూడఁజాల దుర్గుణాజాల యనియనేక బాణంబులు వైచి న సరకుగొనక నీలుండు.

తో. గిరిజేకొనియం, బరమున కెగిరియు-గురిగావైచినదగిలి। క రియును రాక్షస-వరుడునొక్కపరి-ధరగూలిరితలవగిలి ॥రా॥

వ. పిమ్మటఁ దిృశిరుండు హనుమంతుని పయికిదుమికి.

## త్రిశిరహనుమత్సంవాదము.

కీర్తన, ఆదితాళము, అతడెవరే, కమాస్.

త్రి॥ తలగకురావనరా॥త॥ ప్రకటితముగనా - బాణాగ్నికి॥ దల॥ హా॥ వేగ్రి, లకురాదానవా! । వే॥ ఒకతొగ్రిక్కకనీ-యుక్కడంతు॥ బ్రేల కురాదానవా ॥త్రి॥ మం, చిదిరావానరా! మం। మెదడుసెదరమో। దెద గదతో। దలగ ॥హా॥ గె, ల్చెదవా దానవా !॥ గె॥ యిదిగోమోకుపు, రీశునాన॥ పేలగ్రికురా॥

వ. అంతట.

క. అడిదముఁగొని త్రిశిరుఁడుపై । కడరినహనుమంతుఁడతని ♦ యడిదంబునెతా। నొడిసికొని దానిచేతనె। యడచిననసురుండువచ్చి ♦ యవనింబడియెన్.

వ. అంతట మహాపార్శ్వుఁడు గ్రుండయి హనుమంతునిబైకొని.

భుజంగ. మహాపార్శ్వుడన్ నన్ను ♦ మార్కొన్నశూరుల్ । మహిన్ లేరు నీవెంత ♦ మర్దింతురాగా! ప్రహస్తాదులన్ బట్టి ♦ భంజించినట్లా। దహింతున్ భవద్గర్వ ♦ దర్పంబులెల్లన్.

వ. అని పలుకుచుండ రుషభుండొక్కవృక్షంబు రాకసునిమీద వైచిన సరకుఁగొనక.

తొ. తనగదచేతను-దనుజుఁడువేసిన - దప్పించుక రుషభుండు గనిసితనదుపిడి-కిటబొడిచిన గిజగిజదన్నుక దనుజుండు ॥రా॥

చచ్చిననాతని-చావుజూచి రో, షంబున నతికాయుండు । వచ్చెనువానరు। వర్యులజంపెద। వడిగాననిధీరుండు ॥రామ॥

## అతికాయ యుద్ధము.

వ. సహస్రసూర్య ప్రభాభాసమానమగు రథమెక్కి మహాటోపంబునవచ్చు నతికాయునింగనికుంభకర్ణుండు పునర్జీవితుఁడయి వచ్చుచున్నాఁడేమో! యని వనచరులు భయభ్రాంతులయియుండఁ గని రాముండు వీఁడెవ్వడని యడుగవిభీషణుండు.

గీ. ధాన్యమాలిచుండు ♦ దశకంధరుఁడుగన్న। సుతుఁడు వీఁడు యుద్ధ ♦ శూరుఁడరయ। నతిబలాఢ్యుఁడయ్యె!♦యతికాయుఁ। డనువాఁడు వీనిఁజంపఁదగును ♦ వేగముననుఁ.

వ. అని తెలుపుచుండెనప్పుడు.

క. హనుమంతుఁడు లోనగున।వ్వనచరు లవనీరుహంబులు♦ వసుధాధరములల్। గొనియెదిరించిన నవ్వుచు। దనుజుండిటువల్కె. మిగుల ♦ దర్పోద్ధతుఁడై.

అఠా-॥ కీర్తన॥, ఫీల్ రాగము-॥ ఆదితాళము॥ తల్లిభ.

ఏడీయేడి ! రఘువరుడేడీ ॥ కపులార యేడీ! కనబడ। డేడీ ॥ ఏడియేడీ॥ వాడిశరంబున-వారిరాసి గ, ర్వంబునుబాపియు। బంధించినవా ॥ డేడీ ॥ సురరిపుతనయుడు-జులకగగట్టిన-యురగపాశముల- నూడ్చుకొన్నవా॥డేడీ॥ ఘటకర్ణునినొక-గడియలోన ది। క్తటములు చెదురఁగ-ఖండించినవా॥ డేడీ॥ రావణునిక జూ,ర్ణంబుజేతునని। లావునలంకకుఁ। దావచ్చినవా॥ డేడీ॥ మానుగనాతని-పైనగానినా-మానితశరములు। మరివేసియును రాము॥ డేడీ॥ దక్షుడనై యాతనితమ్మునితో। శిక్షజేతునల। మోక్షగుండవిభు॥ డేడీ॥

వ. అని గర్వంబునఁ బలికిన యతికాయునిపైఁ గోపించి.

శ్లో. కపులుగిరులు వృ,క్షంబులుగొనియతి-కాయునిపై వేసియగను। నపుడువాడు ది,వ్యాంబకములచే। నవియుదుంచి నేర్పుగను॥ రా॥ గురుతరాస్త్రముల-గునుమడు లోనగు-కోతుల బిట్టుగవైచి। స్థిరముగమూర్ఛలఁ-జేసిరాఘవుని-జేరినవ్వుచును జూచి॥ రా॥

వ. ఇట్లనుచున్నాఁడు.

సీ. నీవెంతవాఁడవో! నేనెన్నఁ ♦ డెఱుఁగను నింతటివాఁడని ♦ యెఱుగరెవరు। దిక్పాలకులలోనఁ ♦ దెలియఁగానఁగరావు మానాభిమానముల్ ♦ మహిని లేవు। జాతివర్ణాశ్రమా ♦ చారనీతులు లేవు గుణహీనుడవునిల్వఁ ♦ గొంపలేదు। భువిలోననొంటిగాఁ ♦ బొదలుచుండెడు నీకుఁ

గపికోటిసైన్యంబు ♦ గలిగెనిపుడు। దిక్కులేనట్టినీకును ♦ దిక్కుగాఁగ। నినజుఁడేర్పడె నాతోడ ♦ నెదురలేవు। వనములందును గొండల ♦ మును లయాశ్రి। మములవర్తింపు కాదేని ♦ మఱియువినుము.

అతి-కీర్తన, మధ్యమావతి-ఆదితాళము.

విడిచేనా! రఘురామ! నిన్ను॥ విడి॥ వేడెదమీానమై, జడనిధిఁజొచ్చినఁ। గడుగమఠంబై -గట్టుమోచినను। వడిసూకరమై-పుడమిదూరినను। వడిగ-వెదకెదఁగాని॥ విడిచేనా॥ పందిటికంబమునందుఁ బుట్టినను-విందుగవటువై -భిక్షమెత్తినను। బొందుగరాజుల-మ్రిందజేసినను। నందే! కనుగొందుగాని॥విడిచే॥ రాక్షసవరులతోఁ-గక్షకట్టుకొని। ఈక్షితిఁబోరఁగ-నేతెంచితివిటు। మోక్షగుండస, త్పురవల్లభనిను। దీక్ష-సాధింతునుగాని॥ విడిచేనా॥

తో. అనిజేయుగ రమ్మనియతికాయుం, డగ్రిజుజీరఁగఁగాంచి। వినిలక్ష్మణుఁడతి-వేగగనలి యి, ట్లనిపలికెను నదలించి॥ రా॥

క. ఓరీరాక్షసరాముని। తో రణమొనరించు నంత ♦ దోర్బలుఁడవె నీ। శూరత్వంబును గాంచెద। రారా నేనుండ రాము ♦ రమ్మనవలెనా!.

వ. అని యుద్దండంబుగా నిలిచి గుణధ్వనిచేసినవాఁడు దురాగ్రహ విగ్రహుండయి యొక్క క్రూరాస్త్రంబు వింటసంధించి లక్ష్మణునిదిక్కు నభిముఖుండయి.

అతి-కీర్తన, ఆదితాళము, తంగంమెట్టు.

నీవు బాలుఁడవు। నిలువగజాలవు। పోవోయిపోరుడిగి। లక్ష్మణా! నావాక్యములువిని॥ మీాయన్న రాముఁడు। మేదినిహిమగిరి। యాయమరాద్రిదక్క। యితరులు నాయంబులకునోర్తురా! ॥నీవు॥ మోక్షగుండేశుని।నీక్షణమున॥ బట్టిశిక్షింతునీకేలను।లక్ష్మణా!వీక్షింపుచునునిల్వుము॥నీవు॥

వ. అని తూలనాడిన సౌమిత్రి యిట్లనియె.

తో. దురహంకారము - తో బలికినలే - దురక్రియ-శూరుఁడ వ

యిన । సురలరయఁగనీ-శరలాఘవమును-జూపించరనాపైన॥ రా॥

వ. అనిపలికిన నతికాయుండంత కాకారుండయి యత్యంత వేగంబునఁ బ్రయోగించియున్న పటుసాయకంబు వైచిన లక్ష్మణుం డర్ధచంద్రబాణంబునఁ దుంచి.

తో. ఆగ్నేయాస్త్రము-నసురునివేసిన-నాతఁడు సౌరాస్త్రమున। భగ్నంబయియిలఁ-బడగావ్రేసియు-బదపడిలక్ష్మణుతోన॥ రా॥ ఐషిక బాణంబదిగో! వచ్చెను-నాగెదవాసౌమిత్రి । భాషింపఁగనిఁక - భారిపా మ్మునిను-బడగూల్చును నీధాత్రి॥ రా॥

వ. దోషాచరులపయి ద్వేషించి మానుష వేషంబున దూషింపుచు వచ్చితివి నీరోషంబునకు నీమణ్మాత్రంబు వెఱవ నైషిక బాణంబున నీభీషణంబుబాపెద సౌమిత్రీ! ఇది నిన్నుఁగూల్చును ధాత్రినని వైచినగోపించి.

తో. ఐంద్రబాణమున-నదిపాడిజేసెద-నార్భాటముఁ జాలించు । సాంద్రబలుఁడవై -శౌర్యంబుననీ-శరవిద్యనుజూపించు॥ రా॥

వ. ముమ్మరమ్మగునైంద్రాస్త్రమ్మునసీయమ్మువమ్ముసేసెద. మమ్ము బెదిరించు సామర్థ్యమ్ము నీకుఁ గలదా! రమ్ము. సీతల దిమ్ము నీదినమ్మునఁ బాపెదనతికాయా! అనివాని బాణంబు ద్రుంచిన నతండు మరల.

తో. యామ్యాస్త్రంబును-నదరకవైచితి-నార్చుచు నిదుగో వచ్చె। సౌమ్యంబనుచును-సరగునఁజూడను-చంపునునీయెదజొచ్చె॥ రా॥

వ. పాత్రాపాత్రంబెఱుఁగక శాత్రవుల పయి తూత్రవంతంబుఁ జూపెదు నీగాత్రంబుధరిత్రిగూల్పఁజాలు యామ్యాస్త్రంబువైచితి. సైరించుక్షత్రియాధమా! యసురయోధులతో నాదమా!

వ. అనిన లక్ష్మణుండు.

తో, వచ్చెనుజూడర। వాయవ్యాస్త్రము । వడిగలయామ్యాస్త్రమును। జెచ్చెరసీక్షితి-జీలిచివేయును-జేయుముముఱియుద్ధమును॥ రా॥

వ. వాయవ్యాస్త్రమున నీయాన్వసాయకముఁ బాయఁ జేసెద నేయేయస్త్రంబులువైవగలవో! యవియన్నియువైవుము రా. మాయ కాఁడా! నీయుత్తమాంగంబు ఖీడఁ జేసెదఁజూడరా! యాండ్ర. అనియాబాణమ్మునకతికి మఱికొన్ని దివ్యాస్త్రంబులు లక్ష్మణుండు బ్రయోగించిన నవి వానికవచంబును భేదింపఁజాలకఁ జూర్ణంబులయిన సౌమిత్రియద్భుతంబునొందుచున్న నామర్మంబుఁదెలుపఁగోరి వాయుదేవుండువచ్చి.

గీ. వజ్రకవచంబుఁగొన్నాఁడు ♦ బ్రహ్మవలన। శరములెవ్వియు భేదింపఁ ♦ జాలవయ్య। కడఁగిబ్రహ్మాస్త్రమేసిన ♦ గాని తెగఁడు। చేయుమట్లన మోదించి ♦ శీఘ్రముగను.

సం-కీర్తన, రూపకము, ప్రథనోగ్ర.

విపులాగ్రహోగ్రదగ్రఁడై బ్ర,హ్మాస్త్రముదొడిగి। సమరాగ్ర నిగ్రహమునవై చెనగ్రజునడిగి॥ విపు॥ దశ,దిక్కులుఘ్కదక్క స్రుక్కి-మిక్కిలిసోలెఁ।సుర,లక్కజంబునొందఁజుక్క-లొక్కటరాలెఁ॥విపు॥కుల,పర్వతంబులెల్లడుల్లె-వార్ధులునింకెఁ। రిపు,లార్వయుర్వి వెల్లగిల్లె-నర్కుడుగ్రింకెఁ॥ విపు॥ బ్రహ్మండమెల్ల బెండువడియె-నద్భుతముగను। మోడు। గుండశ్రీకోదండపాణి-కూర్మిజెలగును॥ విపు॥

వ. ఇట్లుబ్రయోగించినబ్రహ్మాస్త్రంబును దప్పించుకొనుటకయి.

తో. పరిఘయుశూలము- బటుశక్తియుగద-సరగ బ్రయోగించినను। సరకుగొనకనది-చనికిరీటయుత-శిరమును దెంచియు జనెను॥ రా॥

వ. ఈలీలబ్రహ్మాస్త్రం బతికాయునివధించి పాదిజేరె. దేవతలు లక్ష్మణుని గొనియాడిరి. లక్ష్మణుండన్నను జేరి నమస్కరించిన దీవించి కౌగిలించుకొనియె. అనంతరంబ.

క. హతశేషులు దశముఖునకు
నతికాయుఁడు లోఁబుగాఁగ ♦ నాగులరిచావుల్
వెతనొందుచుఁజని తెలిపిన
ధృతిదూలియు మూర్ఛనొంది ♦ తెప్పిరివగచెఁ.

రావ-కీర్తన, ఏకతాళము, నలరాజు.

అతికాయ! యేమిరా! గతియేదిచూపరా! బ్రతుకజాల॥ నతికా॥ నరులనుద్ధరింతువు। చిరకాలముందువు। నీవనుకొంటి॥ నతి॥ భయమెట్టు దోల్గును। జయమెట్లుగల్గును। దిక్కులేదు॥ అతికా॥ కడుకష్టదైవము। యెడబాపెమనను। బలుకవేమి॥ అతికా॥ అలమోక్షగుండపురా,ధ్యక్షు నితో। వైర,మింత చేసె॥ నతి॥

క. నాముద్దుతనయుఁద్రుంచిన। రామునితమ్ముని వధించు ♦ రణ శూరుఁడు లేఁ। డేమందువిధికృతంబున। కీమహిఁ బగవారుగెల్చు ♦ టిఁ కసంశయమే.

తే. శ్రీరామునిపటు,శూరత్వమునకు। మేరలేదుతలపోయ। జే రిలంకనిఁక। జెరుతురువోయెడు। వారిగాన ననిజేయ॥ రా॥

వ. అని బహువిధ చింతాక్రాంతుండయి యున్నతండ్రిని జేరి నమస్కరించి యింద్రజిత్తు పలుకుచున్నాఁడు.

ఇం, కీర్తన, తిశ్రజాతి, నామాట, జంఝూటి.

నేనుండశంకింపగ। నీకేలశోకింపగ। మానుగనసల్పగ। నేనేగెద నువేగ।జనక। పూనుముధృతిబాగా॥ నేనుండ॥ వానరులనగనెంత। మాన వులనగనెంత। నేనడుదెంచినంత। నిలుతురేయిసుమంత। చింత। బూనేవు బహువింత॥ నేనుండ॥ ననుదేరిచూడలేడు। నాముందునిలువలేడు। ఘన మోక్షగుండవిభుడు। గావునజనినేడు।చూడు। తునుమదునీతోడు॥నేనుం॥

వ. అని ధయిర్యంబుదెలిపి యతనియనుమతివడసి వేగంబున నింద్రజిత్తు ప్రయాణంబై.

## ఇంద్రజిత్తు రెండవయుద్ధము.

క. చతురంగబలములత్యు। ద్భతవిక్రమమొప్పఁగొలిచి ♦ తోన రుదేరఁగ। బ్రతిపక్ష భయావహముగు। నతులితరణభేరి మొరయ ♦ నని మొనఁజొచ్చెన్.

వ. ఇట్లుచొచ్చి.

గీ. అగ్నిహోత్రుని బ్రార్థించి ♦ యతని వలనఁ। గడఁగి బ్రహ్మాస్త్రరథధనుః ♦ కవచములను। బొందియంబరమున డాగి ♦ భూరిబలుఁడు। బాణవర్షంబులను ముంచె ♦ వానరులను. వ. అప్పుడు.

ఉ. మానులు పెద్దగట్టులును ♦ మానుగఁ జేకొని యుగ్రమూర్తులై। వానరులెల్లఁ బైకొనిరి ♦ వానిఁగనుంగొనలేక శోకిలన్। దీనత నొందరాఁగ బర ♦ తెంచెడువారి శరాళి ముంచుచున్। దానవుఁడట్టుహాసమున ♦ దర్పముఁజూపఁగ లక్ష్మణుండనెన్.

క. అన్నా! బ్రహ్మాస్త్రంబున। నిన్నీమునిఁ ద్రుంచివైతు ♦ నిమ్మానని। తినా,కన్నను నొక్కనికొఱకయి। పన్నుగ లోకములఁ జెఱుపఁ ♦ బాడియె! యనుజా!.

వ. బ్రహ్మాస్త్రంబువాడు కనఁబడకుండిన లోకంబుల భస్మంబు జేయు నొక్కనికొఱకయి లోకబాధ యేలజేసెదవు మానుమని యతని యుద్యోగంబు నివారించెనంత

గీ. ఇంద్రజిత్తుకపుల ♦ ఇనకులజాతుల। బ్రహ్మశరముచేతఁ ♦ బరఁగమూర్ఛ। నొందఁజేసి లంక ♦ కొయ్యనఁజేరెను। నర్కుఁడస్తమించె ♦ నంత మీఁద.

వ. వనచరులకు రామలక్ష్మణులకుఁ గలిగిన విపత్తును గుఱించి విభీషణుండుఁ గొంత యోజించి యిట్లనుచున్నాఁడు.

తో. బ్రహ్మవరముచే-బ్రబలిదనుజుఁడిటు-బ్రజ్ఞజూపరాఘవుఁడు। బ్రహ్మాస్త్రంబును-బరువడిమానిం-పగదగునని యాఘనుఁడు॥ రా॥

వ. ఊరకున్నాఁడుగాని; లేనిచో నీనీచునికి లోఁబడునా! యనిన హనుమంతుండు బ్రహ్మాస్త్రమునఁ జెడకుండ వరము గొనియున్నాఁడు. గాన మూర్ఛవోకుండుటచే లేచి విభీషణునితోఁ గలసి కొరువులు చేకొని రణమందుఁ గూలినవారినిఁ గని చింతింపుచు.

హ-కీర్తన, అటతాళము, వసంతరాగము.

ఇంతవారికిని॥ నీవెతగలిగె॥ నింత॥ పంతమూఁతోజని॥ పటుసత్త్వవం

తులై। యెంతెంతపనులైన। జింతింపకనుజేయు॥ నింత॥ శూరులైన నవ తారములైనను। బ్రారబ్ధకర్మానుభవముదప్పిపోనె॥ నింత॥ మోక్షగుండ మందు। ముదమున వెలసిన। సాక్షొన్నారాయణ। స్వామి యీరాముడు, యింతవారి॥

వ. వీరికిగలుగు నాపదదీర్చు నుపాయంబు మనకు-దోఁచలేదు. జాంబవంతుడున్న దెలుపఁగలఁడు చూతమురమ్మని యొక్కచోనం పశయ్యమీఁద జీవచ్ఛవముగాఁబడియున్న యతనిఁగాంచి.

తో. బ్రతికియుంటివే! భల్లుకోత్తమ। పలుకగలవెమాతోడ। ధృతిమీఱఁగ గు। ర్తించినావెమముఁ। దెలుపుమనగ వగతోడ॥ రా॥ ఎలుగుబట్టి ని,న్నిప్పుడెరింగితి-నింతెకాని నాకనులు। నలువుగశరములు,నాటి గానబడ-వలసితి సంగరఘనులు॥ రా॥

వ. రామలక్ష్మణులు వానరులు నేటికిట్లులైరి. అయిన హనుమంతుఁడు జీవములతో నున్నాఁడే! యనవుడు హనుమంతుఁడు లేచి నమస్కరించి.

తో. నేహనుమంతుడ। నీదయచేతను। నేటికిమనియున్నాడ। సాహసముననే। సలుపఁదగినపని। సెలవిమ్మనధృతితోడ॥ రా॥

వ. జాంబవంతుండు కౌఁగిలించుకొని యిట్లనుచున్నాఁడు.

జాం-కీర్తన, శంకరాభరణము, ఆదితాళము, జానోనుమీ.

హనుమంత నీవుదక్క। వనచరులకుదిక్కు। ఘనముగనెవ్వారు,గలరింక బ్రతికింప॥ హను॥ పాలసముద్రము, పోలఁగదాటిన। మేలుగనటు ద్రోణ। శైలమున్నది యందు॥ హను॥ సంజీవవిశల్య। సంధాన సౌవర్ణ। మంజులకరణులు। మహిమతో నున్నవి॥ హను॥ అవిదెచ్చి యీవానరావళికిచ్చిన। భువిమోక్షగుండరా,ఘువుమ్రోల బ్రతికేరు॥ హను॥

వ. ఇట్లుచెప్పి ద్రోణాద్రికి మార్గంబుజెప్పిన నుప్పొంగి కుప్పించి సముద్రంబుఁదాటి శీఘ్రయానంబున క్షీరాద్రికవలనున్న ద్రోణాద్రిఁకేఁజేరి విమర్శించినఁ గామరూపులయిన యా యౌషధములు గానరా

కున్నఁ బర్వతంబుఁ బెకలి నెత్తిన బెట్టుకొని వాయు వేగంబున వచ్చుచుండిన.

గీ. అమృతౌషధముల ♦ నందుండి వెడలెడు
గాలిసోకి వాన ♦ రాళిలేచి
చచ్చియున్న రాక్షస ♦ వ్రాతములఁ బట్టి
యబ్ధిబడఁగవైచి ♦ రతిముదమున.

వ. అంతలో హనుమంతుండు మందులకొండఁదెచ్చి వానరుల నడుమనుంచె. నప్పుడు సంధానకరణి వల్లవిఱిగిన యవయవము లతుకుకొనియె. విశల్యకరణివల్ల శరీరమున నాటిన యస్త్రంబు లూడిపోయె. సౌవర్ణకరణిచే శరీరములు సువర్ణ కాంతిచే రంజిల్లె. సంజీవకరణిచే శోషించిన ప్రాణములకు స్ఫుటంబు గలిగె. ఇట్లువానరుల బ్రతికించి యాంజనేయుండు.

తో. సరగ రామలక్ష్మణులకు మ్రొక్కిన-సంతసించిదీవించి । యు రువడి గిరియెందున్నదో! యచటనె-యుంచిరమ్మనఁగ మించి॥ రామ॥

వ. ద్రోణాద్రియెప్పటి-చోటనుంచి వచ్చెనంత సూర్యోదయంబాయె. నప్పుడు సుగ్రీవుండు రాఘవునిమతంబునఁ గపులనుగని.

సుగ్రీ-కీర్తన, కాఫిరాగము, ఏకతాళము, ఈశరాసనంబసా.

రావణుండు రణము జేయ। రాగజాలడు। లావుమీఱ దలగ్గ కెక్కి-లంకగాల్చుడు॥ రావ॥ అడ్డమైన దానవుల-నపుడెదృం-ముడు । చెడ్డకార్యమంచుమది-జింత మానుడు॥ రావ॥ అటుల చేయకూరకున్న । నాజ్ఞగొందును నిటుల మోక్షగుండవిభుడె। యిపుడుదెల్పెను॥ రావ॥

వ. అనిఖండితంబుగా సుగ్రీవుండు పలికిన వానరులు మంచిదని సాయంకాలసువటకు వేచియుండి రాత్రికాలము రాఁగానే కొరువులు సేకొని లంకకరుగ ప్రతిగృహంబును గాల్చి మసిచేసిన.

తో. బాలురవృద్ధులఁబట్టిమంటలో,పల బడగా వైచుచును। జాలుగనడ్డము, జనుదెంచినరా। క్షసులబట్టి తుత్రించు చును॥ రామ॥

వ. బహు ఘోరకృత్యంబుఁ జేసినచ్చి రణభూమిని బ్రవేశించి రంత రావణుండు కోపించి.

## ◆ కుంభనికుంభాదుల యుద్ధము. ◆

సం-తో. కుంభనికుంభుల। ఘోరవిక్రములఁ। గుంభకర్ణు కొడుకులను। గంభీరముగా। గదనమునకుదశ-కంఠుఁడుఁ బొమ్మనియనెను॥ రామ॥

వ. మఱియు శోణితాక్ష, యూపాక్ష, కంపన, ప్రజంఘులను గూడ బంపిన నీయార్గురుఁ కదలి రణస్థలిఁ జేరి.

దానవవానర సంవాదము

కీర్తన-ఆదితాళము, మాతము.

దా-యుదమున। మాబలమునీాదు, మదికి దెలియకనుమమ్ము। నెదురవచ్చినారమంచిది। వానరులార! గుదిమిపట్టెదము నిల్వుడి॥

రా-వదరుచు మీావలెనుందు-వచ్చినవారొక్కరైన। సజ్జనములకు మరలఁజేరిరే! దానవులారా! కదనమునఁ జావకుండిరే!

దా-వారివలె గాదుమేము। బేరుగొన్నశూరులము। లోకమును గెలుచుధీరులు। వానరులార! దూరముగఁ బొండుమీారలు॥

వా-ధారుణిమోటకుగుండ। శ్రీరాముఁడు చూచుచుండ। మీా రూపులు నీరుజేతుము। దానవులారా! మృత్యువాత బడఁగఁజేతుము.

వ. అని సింహనాదంబుఁజేసి యార్చిపేర్చి రాక్షసుల లక్ష్యపెట్టక విజృంభించి క్షణమాత్రంబున నంగదుండు కంపనుని, మైందుండు ప్రజంఘయూపాక్షులను, ద్వివిదుడు శోణితాక్షుని,సుగ్రీవుండు కుంభుని, హనుమంతుండు నికుంభుని మడియించి రవ్వార్తవిని రావణుండు మకరాక్షుని బొమ్మన వాఁడుగుగ్రిండయి.

## ✱ మకరాక్ష యుద్ధము. ✱

తో. ఒక్కరథమ్మును। నెక్కియుక్కుగల। రక్కసు లుద్ధతిజూప। నక్కజముగమకర, రాక్షుడు వెడలెను। నాజికి విధిప్రేరేప॥ రా॥

వ. ఖరాసురుని కొడుకగు మకరాక్షుండు యుద్ధభూమికిఁ జేరి

మిన్ను మన్ను వగుల సింహనాద భుజాస్ఫాలనంబులుఁ జేసి యెదిరించిన వానరుల నొప్పించుచు రామమూర్తి సమీపంబునకు నరిగి.

మక-కీర్తన, త్రిశ్రిజాతి-వనమూను.

రణమును జేయుమిపుడు। రఘురామ! నాతోఁ డగదిపి॥ రణ ॥ క్షణ ములోనిన్ను। సమయించి లంకకుఁబోదు॥ రణ॥ ఖరసూనుడను గనుము। ధరమకరాక్షుడవినుము॥ ఖర॥ పరగ మాతండ్రి। పగదీర్ప నేటికిగలిగె॥ రణ॥ కరవాలమునయిన। గదనైన విలుబూనిన్మైన॥ గర॥ వర మోక్షగుండ। వాసుడ యేలీలనయిన॥ రణమును॥

వ. అనిన రాముండు గోపంబు దీపింప.

తో. దబ్బరగాదుర। దైత్యాధమనా। దెబ్బతగిలినంతటను। నిబ్బ రమెడలియు। దబ్బిబ్బునమీ। యబ్బకడకు జనవలెను॥ రా॥

వ. అనిన.

క. మకరాక్షుఁడరిగిపటు సా। యకములు మై గాడనేయ ♦ నవి నడుమనె త। ప్పకదునిమివానిరథర। థ్య కేతుచాపములఁదుంచె ♦ దాశ రథితగఁ.

వ. అప్పుడు.

క. విరథుండయి శూలముగొని। వెఱవక దనుజుండు వేయ ♦ వేగమెదానిఁ। విరుగంగఁ జేయునాతఁడు। కటకగు పిడికిటను బొడువఁ ♦ గానె తేరఁ.

తో. అనలాస్త్రంబున-నతనియురమ్మున। నారాముడు వేయగను। నని మొనసమ్మక। రాక్షసుఁడుద్రెళ్లెను। నమరులెల్లఁజెలగఁగను॥ రా॥

వ. అంత సూర్యోదయంబాయె. మకరాక్షుని మరణవార్త రావణుండు విని దుఃఖకోపంబులు తననుముంప నింద్రజిత్తును బిలిచి యిట్లనియె.

రావ-కీర్తన, కేదారగౌళ- ఆదితాళము.

కుమారకా! వినరా! అయ్యో! విమర్శగను నే-వివరించెదనో॥ కు॥

అతికాయుడు మొదలైనవీరులు। ధృతిగూలిరి యుద్ధములోన। గతి నీవే! యిఁక। గదనముజేయఁగ॥కుమా॥ సురలనుదరిమిన జోదువునీకీ। నరులగెలుచు టెంతపనియూ। దురమునందునీతో సరిగలరా॥ కుమా॥ మోక్షగుండరాముని లక్ష్మణుని। లక్షింపుచుఁ గెల్వఁగనీవు। ఈక్షణమునరథ, మెక్కికదులుము॥ కుమారకా॥

**ఇంద్రజిత్తు మూడవసారియుద్ధము.**

వ. అని వీడ్కొలిపిన నత్యుగ్రమూర్తియైలేచి కాంచన రథారూఢుండయి.

క. అరదములరువదికోట్లును। గరులునుబదమూఁడుకోట్లు ♦ కడువడివడిచే। దురగములు నూఱుకోట్లును। వరభటు లగణితముగాఁగ ♦ వచ్చుచునుండన్.

వ. మఱియు నెక్కకోటి చతుర్దంతదంతావళములు నాలుగుకోట్ల చిలుకవన్నెగల గుఱ్ఱములును బలిసి యేతేజ నిస్సాణాది బహువిధ వాద్యంబులు మ్రోయ నుత్తరద్వారంబున వెడలి యుద్ధభూమిఁ బ్రవేశించి.

గీ. రథముడిగ్గిచుట్టు ♦ రాక్షస దళములఁ। గాపువెట్టి యపుడు గాటినిప్పు। దెచ్చి వేదియొకటి ♦ దీర్చిఁచి యందుంచి। ప్రజ్వలింపజేసి పావకునకు.

వ. సమంత్రపూర్వకంబుగా హోమంబుఁ జేసిన నా యగ్నిలోనుండి.

సంధికీర్తన, ఆఠాణరాగము-ఆదితాళము.

కృత్తియవతరించెను। బెద్దసత్తియవతరించెను। కృత్తియనెడు పెద్దసత్తిలోకములకు। మిత్తియనగమోఁర। యెత్తియార్భటింపుచు॥ కృ॥ చాలభయదమౌ క।పాలపాత్రయునస్థి। మాలలుభీకరక। రాలకేశము లలం॥ కృ॥ మోక్షగుండేశునిపై। గక్షగట్టినయట్టి।రాక్షసవరునకు ప్రత్యక్షమై పనులుసేయు॥ కృ॥

వ. ఇట్లు పరిసన్నయయి కృత్తి యిందరిజిత్తుంగాంచి.

తో. పంపుముననన్నే-పనికైననునా। తెంపుజెంపుఁజూపెదను। సొం పుగననుచును-రంపులుజేయుగ। చూచి సంతసింపుచును.

వ. ఆకృత్తినడిగి దివ్యశస్త్రాస్త్ర రథరథ్యంబులు గయికొని కృత్తి సహితంబుగా నంబరంబున కెగిరి కృత్తిమహాత్తుచే నెవరికిఁ గానరాకుండ నదృశ్యుండయి.

తో. ఉగ్రిబాణములు। నురువడివానర। యోధులపయిఁబరపుచు ను। నాగ్రిహముసబె। ల్లార్చుచుమెలగెను। నంబరమండలమునను॥రా॥

వ. పిమ్మట వాని సైన్యంబును దిరిగి లంకలోనికిఁ జనియె నక్కడ.

తో. గజుడుగవాక్షుడు। గంధమాదనుడు। విజయుడులోనగుకపు లు। గజబిజినొందుచు-గదియుచున్నై చిరి। కడగి గిరులువృక్షములు॥రా॥

సంకీర్తన, సురటరాగము-ఆదితాళము.

వలీముఖులపయి। శిలీముఖంబులు। జలాయించివేసెన్। వారల। బలాయనులజేసెన్॥వలీ॥ పటుత్వమొప్పగ। బదికోటులను, ర్కటోత్తము లగూల్చెన్। గడుమిక్కుటంబుగానార్చెన్॥ వలీ॥ అనంతరమునె। మ్మనం బులనుభయ। మునన్ వడఁకుచును। గపులెల్ల నిక్కిచూచుచును॥వలీ॥ మొరోయిటంచును। మోక్షగుండపతి, మరుంగునకుజనిరి, మమ్ముద్ధరిం పుమనియనిరి॥ వలీ॥

వ. అప్పుడు లక్ష్మణుండన్నకు నమస్కరించి.

ఉ. రామయిదేమి చూచెదరు ♦ రావణిమర్కట సేనఁదుంపఁగా
నేమనకూరకున్న మన ♦ నిచ్చనె? కార్యము తప్పివచ్చెనన్
భీమబలంబుతో నతని ♦ బిట్టుగఁజంపి తెంగ్నిఁగాల్చెదన్
వేమరునాజ్ఞయిమ్మనుచు ♦ వేడినఁదమ్ముని తోడ నిట్లనెన్.

తో. వినుమిదెలక్ష్మణ! వీడనాధ్యుడగు। వనజభవుని వరమునను। ఘనముగఁబ్రబలెను। గనబడకనురణ। మొనరించును నేర్పునను.

వ. కాఁబట్టి వీనిమీఁద బాణంబులువైచిన నాయమ్ములు చెడి పోవునుగాని నిలువవు సైరింపుమనుచుండ నగ్నిహోత్రుండిట్లనియె.

తో. కననాగ్నేయం। బనుమంత్రంబును । మనుకులజపియించు చును। ఘనబాణంబొ, క్కటివేసినదను-జునిబాయును కృత్తియును॥ రా॥

వ. అప్పుడు వాఁడగపడుననిచెప్పి యగ్నిభట్టారకుం డదృశ్యుండ యిన రాముండు శీఘ్రంబున.

గీ. అగ్నిమంత్రంబు జపియించి ♦ యంబువైవఁ । గృత్తిమెడ పాసిపోయినఁ ♦ దత్తఱమున। మేఘనాధుండు పుడమికి ♦ మెఱయవచ్చి। సింహనాదంబుఁ జేయుచుఁ ♦ జెలఁగియార్చె.

తో. వానరులప్పుడు-వడిగాదరువులు-వసుధాధరములుగొనుచు। వానిపైనబడ-వైచిరొక్కసరి । దానవ చావరయనుచు॥ రా॥ రాముఁడు నూరుశ, రంబులుమఱియు। రామునితమ్ముఁడుమూఁడు। భీమశరంబులు వేయఁగనన్ని యు-బిండిజేసియనెవాఁడు॥ రా॥

ఇందర్రి-కీర్తన, ఏకతాళము-పూరికళ్యాణి.

ఎదిరించలేరు। ఇఁకఁజాలుపోరు। అదిలించలేరు । నంతటివారుగా ర ॥యెది॥ అనిమిషులను। అనిగెల్చినాను। నను గెల్వగాను। నరులెంతమా నుడానూ॥యె॥ బలవద్విరోధ। మిలజేటుగాదా! తెలియఁగలేదా! తలగగ రాదవాద॥యె॥ మురిసేరుకాండ। ములమోక్షగుండ। వరు దూరుచుండ। బరపెదనుండకుండ॥ నె॥

వ. అనిపలికి చండకాండంబు లెక్కపెట్టి స్వాతిగత శుక్రుండు వర్షించిన చందంబునఁ గపివరులపై యెడములేక ప్రయోగించి నొ ప్పించి లక్ష్మణునివిల్లువిఱిచి రామునకభిముఖుండయి యనుచున్నాఁడు.

క. నీకుసహాయమువచ్చిన। యీకపులనుగెల్చినాఁడ ♦ నీఁకనన్ని ములన్। దాఁకిజయింతువు తొలఁగుము। నాకడ్డముగలదె త్రిభువ ♦ నం బులలోనన్.

వ. అనిపలికి మఱియు ననేక సాయకంబు లందఱిపయి వైచుచుఁ

దాను గెలిచినట్లూహించి వేగంబున లంకకరిగి యావార్త దండ్రికిఁ దెల్పిన సంతోషించి.

రావ-కీర్తన, త్రిశ్రజాతి-ఇంత్రైన.

నీవంటికొడుకుండఁగ। నావారిపగదీర్పగ। నీవేళకొనగూడెగా। నికమళ్ళీజనువడిగ। నవనిలో। నీవిక్రమమునరగ। కీవిగుల్కగ। దేవపాళి-బెదరిచూడఁగ। జూపిరమ్మిక॥నీవంటి॥ శ్రీమోక్షగుండవిభుని। రాముని లక్ష్మణుని। నామర్కటులనుబూని। యందున్న సోదరుని। ధరణి। మోమాటము మాని। తామసంబునఁ। దలలుద్రించివేసిరమ్మిక। సీతయబ్బును॥నీవంటి॥

వ. అనిన దండ్రిపీడ్కొని మహోత్సాహంబునఁ బురోహిత యుతంబుగా రణభూమిఁజేరి యొక్క హోమంబుఁజేసి హోమాంతంబున నగ్ని దేవుని సహాయంబువలన నాలుగుగుఱ్ఱముల రథమును నమోఘాస్త్రంబులుఁ గైకొని.

*** ఇంద్రజిత్తు వాల్గవయుద్ధము. ***

క. రథమెక్కి యాతడంబర। పథమునకును నెగిరికానఁ ♦ బడకయొకపులగ। వధియించుచు సాయకముల। వ్యధనొందఁగజేయుచును భ♦ యంకరుడగుచున్.

దక్షిణదిక్కునకువచ్చి యిట్లనుచున్నాఁడు.

ఇం-కీర్తన, ఆదితాళము, నీవనువా.

రణమొనరింపుము। రామారామా। రయమునగూల్చెద, రమ్మారామా॥ అణుమాత్రంబున। నసురులద్రుంచిన। రణశూరుడవుగా । రామా రామా! ॥రణమొ॥ కోతులబలగము। గూడివచ్చితివి । యాతుధానులకు మేతగురామా! ॥రణ॥ మోక్షగుండవర। ముఖ్యంబగునీ । పీక్షితివన్నుజయింపుము రామా! ॥రణ॥

వ. అని పలికి.

తో. పడమటిదిక్కున। బలకెనుమీరె, క్కడ బోదురుదిక్కువరు । కడుపడిజిక్కితి। రెడపకమిమ్ముజ । క్కడతులేదు నా కెదురు ॥రామ॥

వ. అని కొన్ని బాణంబులువైచి యింతలో.

తో॰ ఉత్తరదిక్కున। కురికిపలికె మి, మ్ముక్కణంచిమీఁదటను।
ఉత్తరదిక్కున-మోఘ్యకుజనిమీ। కున్న వారిజం పెదను ॥రా॥

వ. అనికొన్ని శరంబులు పఱిపినాఁడేమరించి తూర్పుదిక్కునకేఁగె.

తో॰. ఆదివిభీషణా। మాలుముకన్నులకు మానిద్రోజెక్కెజెక్కెడ
। పానలుముమీరి, ప్పడె యెటకయునను। బోయున మనిదయుండెద
రు ॥ రా ॥

వ. ఈప్రకారంబుగ జతుర్దిక్కులయందుఁ దిరిగి ప్రిగల్భంబులా
డుచు నదృశ్యంబుగా బహుబాణంబులు ప్రయోగించివానరుల నశింపఁ
జేయుచుండినఁ గాంచి కోపించి లక్ష్మణుఁడు రామునకిట్లనియె.

ల-కీర్తన, కేదార, రూపకతాళము, సాటి.

వీనిపైన-గోపమ్ము। రానిహేతు। వేమొ! రఘుకులవర! ॥వీని॥
వానరాళినెల్లఁబొలియించగ। దీనతతో। సీనామము-నేదలతురు ॥వీని॥
మేనులుదాచకవీఁడు। నీనిమిత్త, మింత-పనిచేయఁగ। దానవుని। వాత, దగ
ద్రోయుగ। నానెయిది। మానవపతులకు ధర్మమె ॥వీని॥ దండిగమ, ధ్యం
దిన। చండకిరణు, రీతి-వడిజూపుచు। నుండువీని। మోక్ష, గుండాధిప। కం
డలుగా। జెండగరాదు-సెలవొసగుము ॥వీని॥

వ. అనిన శ్రీరాముండిట్లనియె.

చ. కనఁబడకుండయుద్ధమును ♦ గ్రక్కునఁజేయఁగఁదొరకొనిపవీనికై
కినిసినలోకముల్ చెడవె ♦ నీవ్రతిసద్గుణరాశివైన నీ
తనిజెనకంగఁ జాలరటుఁ ♦ దాఁగొనినాఁడు వరంబుబ్రహ్మచేఁ
గనుకసహించినాఁడనికఁ ♦ గాతునె! కాలముఁగూడివచ్చెడిన్.

తో॰. నేనల్గినయెడ-వీనిప్రతాపము। నీరుగఁజేయనెవినుమా! మా
నుగహారబ్రి, హ్మాదులుగాచిన। నైనవిడుతునే! కనుమా ॥రా॥

వ. అనిపలికిన రామునకుఁ గలిగినయాగ్రహంబు వాఁడెఱిఁగి
యుద్ధంబుఁజేయఁజాలక లంకలోనికిఁజని తండ్రితో నిట్లనియె.

క. కట్టల్కఁ జోదనేఁ జని । పట్టితిఁ గపికోటి నెల్ల ♦ మనుకులవరుల
న్। ధట్టించి మానవులుగొని। నెట్టనఁ జనుదెంచితి నిటు ♦ నీ కెరిగింపన్.

వ. అని యధికప్రసంగంబుఁ జేసిన నింద్రజిత్తుపై రావణుండు
గోపించి.

రాగ-కీర్తన, జంఝూటి, అటతాళము.

ఇది యేమిటిపోక। యిది యేమి రాక । యదరి యేతెంచి యిట్లాడెదు
గాక ॥యి॥ పగవారినెదరించి। పగఁ జేతగాక। మగటిమి జెప్పేవు । మతి
సిగ్గులేక ॥యి॥ దిక్కులజయించి, తిరిగియాదినము, దక్కక నరులకు,
డాగితే! ఘనము ॥యిది॥ మోకగుండేల ద, మ్మునిట్టోడబట్టి। శిక్షిం
పకికనన్ను। జేరకుపట్టి ॥యి॥

వ. అనిన మంచిదని వాఁడు సీతవంటి యాకృతిగల నాతినొకతె
ను దన మాయచేత నిర్మించి రథంబుపయిన నుంచుకొని పడమటిదెస
ను వచ్చుచుండె నప్పుడు.

** ఇంద్రజిత్తు పంచమయుద్ధము. **

క. ఏతట్టువచ్చెనో! యని। నాతని దశదిక్కులందు ♦ నరయుచుఁ
గపులున్। భీతాత్ములగుచు నుండఁగ । నాతఁడు వాతూల తనయుఁ ♦ డ
ద్రిశిఖరమున్

వ. నెత్తిన మోచుకొని పడమటిదిక్కుగాఁ బోవుచు.

తో. అరదముపై మాయాసీతనుగని-యకటా ! పాపాత్ముండు ।
ధరణిజ దెచ్చెను। దానేటు చేయును! తగ విధికృతమగు జూడుము ॥రా॥

వ. దైవమా! యిట్టి దీనదశఁ జూడఁగలిగె నయ్యో! వీని నేమి చే
యుదు. నెటులనోర్తునని కపికోటులఁ గూర్చుకొని యట్టహాసంబునఁ
బయికడరిన హనుమంతునితో నింద్రజిత్తు పలుకుచున్నాఁడు.

తో. ఏటికి వచ్చెద। వీసేనలతో। నిదిగో! సీతను గనరా ! ధాటిగ
నీసతి, తలదరిగద ము, మ్మాటికి నిజము కజనరా! ॥రా॥

వ. ఈసీతకొఱకే కదా! మీరింత శ్రమించుట మీశ్రమ నివారిం

చితిఁబోరా! వాయుకుమారా! అనిన నాంజనేయుండిట్లనియె.

తో. దనుజుడ నయిననుl ధరణి విశ్రవుl మనుమడవగు నీకు దగునా! మునుకొనిసీతనుl ముందలబట్టుకl ఘనముగనీడువనగునా! ॥రా॥

వ. అనిపలుకుచుండ వాఁడత్యుగ్రకర్మమునకు లోఁబడి.

క. మాయాసీతనుబట్టుకl కోయనియార్చినను విడక ♦ కోపము తోడన్l ఆయెడఁగరవాలంబునఁl బాయకఁ దలదిరిగియతఁడు♦ వలికెన్ గడిమిన్.

ఇం-కీర్తన, రూపకము, వేటాడు.

ఇం కేటికిరా! రణము ।యిం॥ పంకజగంధినిసీతను । బట్టుకగరవాలంబునl శంకింపక దలచుంచితి । బింకంబులుబొంకంబులు ॥నిం కే॥ ఈ జానకికొఱకేగద! యాజికినీరేతెంచుటl యీజాడలు నాముందఱ గాజాలవురాజాలవు ॥యిం కే॥ ఈసంగతి మోక్షగుండ। వాసునితో నెఱగించుయు, నాసలుడిగి పొందుండిన। రోషంబున మోసంబగు ॥నిం కేటికిరా॥

ద్విపద. వాఁడిట్లుపలికిన-వాయుసుతుండుl పోడిమిచెడిదుఃఖ, పూరితుండగుచుl వనచరులార దై, వముదప్పదీసె । మనయుద్యమంబేది, మఱిసాగదయ్యె, నేమఱియుండకుఁ-డీతనిమీరుl రాముని కీవార్త-రయమునఁజెప్పిl యమ్మహనీయుని-యాజ్ఞానుసరణిl నెమ్మినెంతోవత్తు, నేఁడంచుఁగదిలిl పోయెనాపిదప ను, ప్పొంగుచుదనుజ । నాయకసుతుఁడును, నంబునఁదలఁచె.

క. ఇక్కడహనుమంతుడులేఁl డొక్కండును జెరుపలేరు ♦ హోమమొనర్తున్l గ్రిక్కుననసనుచుని కుంభిళ । దిక్కునకరుదెంచి యతఁడు దృఢనిశ్చయుఁడై.

తో. కల్లుబాలురు, క్త్రంబు దేవ తెం, కాయలు గంధసుమములు । బల్లులు బిల్లులు- బాణులుమొదలుగ । బహుమృగాళిమాంసములు ॥ రా ॥

వ. అమితంబుగా దెప్పించి కాత్యాయనీదేవిని నిలిపి పైవస్తువు

లచే మంత్రపూర్వకంబుగా నగ్నియందు హోమంబుఁ జేసి తనువుచుం డె. నిక్కడహనుమంతుండు శోకాతురుండగుచు వచ్చి రాఘవునకు నమస్కరించి యిట్లనుచున్నాఁడు.

హ॥ కీర్తన॥ ఆదితాళము॥ ఫీల్ రాగము॥ గురుమహా.

మనుకులవర్యా! మనుకులవర్యా! మన కార్యము జెడె॥ మనుకుల వ॥ రామ! మీరామను। రావణిదెచ్చియు। గోమలిశిరమును। గోసినాడ కట! ॥మనుకుల॥ ఒప్పగనందర। ముండియుసీతను। దప్పించగ శ। క్తతలే దాయెను॥ మ॥ తక్కకనీనిన । దాకగాపాడియు । నక్కకిచ్చిన - చంద్రదం బుగ నాయెను॥ మ॥ మోక్షగుండాధిప । ముందుగమీకును । నీక్షణము నఁదెల్ప-నే తెంచితిని ॥మనుకుల॥

వ. అని వచించిన హనుమంతునిపలుకులు ములుకులై చెవిసోఁ కిన నిశ్చేష్టితుండై॥

క. జనకజనుమదిని దలఁచుచుఁ। బెనుగాలినినేలఁగూలు ♦ వృక్ష మురీతిన్। ఇనకులుఁడుమూర్ఛనొందినఁ । గనివగచిరిచుట్టునున్న ♦ కపి పుంగవులున్ .

వ. అప్పుడు.

తో. కన్నీరేరుగ। గారగ లక్ష్మణు, డన్నకడకు దానరిగి। పన్ను గనూరుల । పయికిజేర్చుకొని । మన్నుదుడిచి మదిగరగి॥ రా॥

ల॥ కీర్తన॥ ముఖారి॥ అటతాళము.

అకటా! రఘువీరా! జానకికింత। యడలవలసెనౌరా॥ ప్రకటము గ దశకంఠుగూల్పఁగ। రాజ్యమునువిడనాడివచ్చితి। మొకటిమనమెంచినను దైవంబొకటినెంచెను విధికృతంబగు ॥నకటా॥ రణశూరుడగు నీవు, గలి గియు ధ।రాకుమారికిజావు। క్షణము లోపలవచ్చెనీశో । కమున కెయ్యది మేర! సురర। క్షణమునకు జనియించితిమి మో। క్షపురనాథ। యదెట్లు జేసెద ॥మకటా!॥

తో. జానకిమరణము -సై చజాలనే। శరవహ్నులముంచెదను। దా

నవులనులం। కానగరంబును దగ్ధముగావించెదను ॥రా॥

వ. అని లక్ష్మణుండు శోకింపుచుఁబలుకు పలుకులువిని విభీష ణుండిట్లనియె.

తో. ఎక్కడిమాటలు-ఇంద్రజిత్తుదా। నిక్కడ గపటము చేత। గ్రిక్కనసీతను, గావించియు మఱి, చక్కాడెనుగసిచేత ॥రా॥

వ. ఇందులకు వగవవలదు. నేను రామునకు సీతనిమ్మని చెప్పిన వినని రావణుండు కొడుకు సీతనుజంపఁబోయిన జంపనిచ్చునా! అమ్మహా పతివ్రతచచ్చిన లోకంబులు నిలిచియుండునా! నేను నిజముగాంచివచ్చె దనని చెప్పియింతలో రాముండు మూర్ఛఁదేరియున్న.

గీ. రామునాజ్ఞనుగైకొని ♦ భ్రమరమగుచు। రావణోద్యాన। వనముఁజే ♦ రంగఁబోయి। శింశుపయిక్రింద నున్నట్టి♦సీతఁగాంచి, మరలి యేతెంచి తెలిపెను ♦ మనుజులులకు.

వ. ఇట్లుసీతాదేవి క్షేమవార్త రామలక్ష్మణులకుఁదెలిపి విభీష ణుండిట్లనుచున్నాఁడు.

తో. రామనికుంభిళ, హోమము జేసిళ, రంబులురథమునుబడ యు। దామదియెంచియు, దరుచరు లదియెం, తయుజెరుతురో! యని తెలియ ॥రా॥

వ. ఇంద్రజిత్తుకపటంబున నదియొక సందడిచేసియుందఱు నిర్వి ణ్ణులయి యుండ నేమ్మదిగా నికుంభిళకుఁ బోయి హోమంబుఁ జేయు చున్నాఁడు॥

క. హోమముసాంగంబయినను। నామేటిని గెలువలేరు ♦ హరిహ రులయినఁ। ధీమతితోఁగపియుతముగ। సౌమిత్రినిబంపుమతనిఁ ♦ జం పుటకొజకై.

వ. పదునాలుగుసంవత్సరములు నిద్రాహారములు వర్జించిన వానిచేఁ జచ్చునట్లతనికి వరమున్నది. అట్టి వ్రతముమనలక్ష్మణుండాచ రించి యున్నాఁడు గావునవానింజంపును. వాఁడుమడిసిన రావణుడును

జచ్చినట్లు గాతలంచుఁ డనిన రాముం డాశ్చర్య చిత్తుఁడై లక్ష్మణునిఁ జూచి.

రా-కీర్తన, త్రిశ్రజాతి, జంఝూటి, ఎవ్వాఁడు.

సౌమిత్రియికను లెమ్ము! సమరముజేయబొమ్ము । ఆమేఘనాథు గమ్ము । అమ్ములబడగుమ్ము । గెలిచి । క్షేమముగను జేరుము! వాని । హోమము విఘ్నము జేయుము, ఆజిలో । మోమోట ముడుగుము॥సౌ॥ మదిమోక్షగుండవిభుని, మరువక దలచుకొని! పద జయమయ్యెడిని! భల్లూక వల్లభుని! వేగ! బవమానవరపుత్రుని! వెంట, బదిలముగాగొల్చి రమ్మని! ప్రీతితో! ధనురస్త్రములబూని ॥సౌమిత్రి॥

వ. అని యిట్లు తెలిపి సముద్రుండిచ్చిన వజ్రకవచంబును ఖడ్గంబును ధనుర్బాణంబులును నిచ్చిదీవించిపంపిన రామునకు నమస్కరించి జాంబవంతుండు కోట్లకొలఁది భల్లూకంబులతోడ వెడలివెంటరాఁగ విభీషణ యుతంబుగా హనుమంతుని నారోహించి యిరువంకల గపిసేనలు గలిసి యేతేరఁగదిలె.

తో. ముప్పదియోజన, ముల దూరంబున-నొప్పు నికుంభిళకేగి! గొప్పబలంబులఁ-గోట్లర్బుదములు! గూడిచుట్టుననుమూగి ॥రామ॥

వ. సందడిలేక నిస్తరంగ సముద్రంబుబోలె నలరుచున్న మేఘనాథునిసేనలంగాంచి లక్ష్మణుడాశ్చర్యంబునొందె నప్పుడు విభీషణుండు-

వి-కీర్తన, అటతాళము, గౌళబంగా.

చూడుమా సేనల! రామానుజ! చూడు॥ ఏడజూచినగాని! యెడమనందులేదు ॥చూడు! సేనలద్భుంచిన, గానిలేవనువాడు॥చూ॥ హోమవిఘ్నము జేయ-నురుబలములబంపు ॥చూడు॥ బాణపరంపర-బఱపి చంపుమువాని ॥జూడు॥ మోక్షగుండేశుని! ముద్దుల తమ్ముడ ॥చూడు॥

వ. అనినసప్పుడు లక్ష్మణుండు రాక్షసదళంబుల రూక్షేక్షణంబుల వీక్షించి బ్రహ్మాండమదరుసట్లు జ్యానినదంబుఁ జేసి శరవర్షంబులు గురిపించుచుండిన నలిగి.

తో. రాక్షససేనలు-నాక్షణమున నా। రామసోదరునిగదిసి। యుక్షీణంబుగ। నలజడిబెట్టిరి। యాంబులు బెక్కులు వేసి ॥రామ॥

వ. అదిగని మహాగ్రహసముగ్రులై.

క. భల్లూకవరులుమర్కట। వల్లభులును గిరులు దరులు ♦ వడివైచుచురం। జిల్లగరాక్షససేనల। నెల్లనుభంజింపుచుండి ♦ రెంతయుదెగువన్.

వ. లక్ష్మణుండును బాణప్రయోగంబుల ననేకుల మడియింపుచుండదదీయ్యాటోపంబునకు సైరింపనోపక రక్కసులుక్కుచెడి హాహామంబు చేయు నింద్రజిత్తు మఱుంగునకుజని బహువిధంబుల మొఱపెట్టుకొసిన నప్పుడు.

క. ఇన్నాటపదియునాహుతు। లున్నతమతివేల్వవలసి ♦ యుండియునందున్। బన్నగనునూటతొమ్మది। యెన్నికతో వ్రేల్చియుండ ♦ నింతటిలోనన్.

క. దనుజులు హాహారవములఁ। దమముగునఁ జేరుటయును ♦ దరుచరులెల్లన్। వెనుకొని తరుముచువచ్చుట। యునుగని సవనంబు మాని ♦ యుగ్రుండగుచున్.

గీ. చేతబట్టినయాహుతుల్ ♦ క్షితినివైచి। రథముపై నెక్కి చాపశ ♦ రంబులూని। దండధరుడునుబోలె ను ♦ ద్దండుడగుచు। బాణములువేసిశోలెను ♦ వానరులను.

వ. ఇట్లతండు వానరుల నొప్పించుచుండిన విభీషణుండు లక్ష్మణునిజూచి యిట్లనియె.

విభీ-కీర్తన, కాంభోజి, అటతాళము, నిన్నునమ్మి.

దానవునిచేత-గానవచ్చెగదా! వానరులగెల్చి। వచ్చునుగ్రమ్మర ॥దాన॥ మానుగనామర్రి, మానుక్రింద హోమ, మానందముగ జేయ, బూనునుసత్యము ॥దా॥ హోమసాంగమైన। నామేటిగెల్వను। త్రిమాదులయినను। దామోపజాలరు ॥దా॥ దండిగ శ్రీమోకుగుండేశ సోదర, చెంపుము వాడిందు। జేరకమునుపే! ॥దాన॥

వ. అనియిట్లు ప్రేరేప లక్ష్మణుండతివేగంబున నాసరుల గసిమసంగు నిందజిత్తునకు నభిముఖుండయిచని యంభోధర సమాన గంభీర వాక్యంబుల నిట్లనియె.

తో. మాయలుచేసిన। మత్తెక్కియుంటేమిర । మగవాఁడవు నీవయిన । నాయెదుటికి ది, న్నగజేరియు గద । ననుజేయుముర బీరాన॥ రా॥ ఆలములోపి-రందఱుఁజూడఁగ। ననురాధమనినుఁజంపి। చాలగనిప్పుడె। జయముగొందునినుఁ। గాలునిపోలుకుఁబంపి॥

వ. అనినవాఁ డదరిపడి యిట్లనుచున్నాఁడు.

ఇం-కీర్తన, కళ్యాణి, రూపకము.

అంతవాఁడవా। నా, యంతవాని, తోడ । ననిసలిపెదు ॥నంత॥ అంతకాభుఁడంచునన్ను। గాంతురాశాకాంతులుగ। వింతగా నిసుంత లేవు। పంతగించివచ్చి। బెదరించెదు ॥నంత॥ మున్నునాగపాశములు। నిన్నుగట్టివచ్చితిగ। నన్నునింతలో నేమరచి। నావెమాన, వుండ । ననుమార్కొను ॥నంత॥ మోకుగుండవాసునిత - మ్ముండవయిననేమిని। స్నీతుణమ్ముశితుజేతు। రాకుసాళి-పైన। వడిజూపెదు ॥నంత॥

వ. అసరోషకషాయితాత్ముండయి విభీషణుని గని యిట్లనియె.

తో. పిన్నతండ్రివని। నిన్నుఁజూడఁదగ । దన్నిటరోసితివీవు । బన్నగశత్రుల, పంచగాచుకొని। తిన్నగఁబడియున్నావు ॥రా॥ ధర్మహీనమా, మర్మంబులుశా। త్రవులకుఁ బ్రచురించితివి । దుర్మతి స్వకుల। ద్రోహముజేయగ। నూర్మితోడఁదలఁచితివి ॥ రా॥

వ. ఎంతనీచుండయినను నెంతమాటవచ్చినను బంధువులవిడనాడి పగవారి శరణుజొచ్చువారు గలరా! నీసహాయంబుచేతనే! రావణుండు దేవతలగెలిచెనా! ఇప్పుడు నీవుతలఁగినమాకుఁలోపమా! యని తూలనాడినఁ గలుషించి విభీషణుండనుచున్నాఁడు.

విభీ-కీర్తన, దర్బారురాగము, రూపకము, వీరసం.

మీమేలు। చాల్చాలు । నామీందరబలుకకుఁడిలు । మీమేలు॥

నామాటలువినరై తిరి, యీమాడ్కిని- మీమూర్ఖమె-మిమ్ముజెరచెను॥ మీ॥ నోరున్నదనుచుజాలు। దూరకుదుశ్చారితుల్। గూరిమిబంధువులై నను। సారజ్ఞులు। దూరముగాదొలగందగు॥మీ॥ నీతండ్రియునునీవు। నీతి లేనినీవారలు। బాతకవిను మోక్షగుండ। నేతచేత। భూతలమునఁ బోలిఁ యుఁగలరు ॥మీమేలు॥

వ. అని విభీషణుంబువలికిన నతండు ప్రళయకాల రుద్రనిభం గ రౌద్రాకారుండయి హనుమంతునిపయి నెక్కివచ్చుచున్న లక్ష్మణుని దిక్కుఁ దనరథంబుబోనిచ్చి పలుకుచున్నాఁడు.

పంచచా. వనాంతరంబులందునుండి ♦ వంటకంబుగానకే। ఘనం బుగాఁగ్రృశించినావు ♦ గానమానవాధమా! ఘనాంగులన్ మమూఁజయిం పఁ ♦ గాఁ దరంబెఁ యీన దీ । రనాజిమానిలేచిపొమ్ము ♦ రాముఁ జేర నుర్వడిన్.

వ. అటులపోక నెదిరించితివేని వినుము.

శ్లో. పటువిశిఖంబుల। పాలుజేసినిను । బడద్రోతునుభూస్థలిని। గలుకటఁచే రా, ఘువ్రుడుబడినని ను। గనునటుజేతునులలిని ॥రా॥

వ. అనిన లక్ష్మణుండిట్లనియె.

పంచచా. అలంచనిర్జరాళిఁ దోలి ♦ నట్లుఁగాదు నిల్చిదో। ర్బలంబుచూపుమిన్ను నీవె ♦ ప్రస్తుతించుకొంటచే। ఫలంబులేదు నాదుబా ణ♦వంజ్త్రి కోర్చినిల్చినన్। బలాబలంబు లెల్లగాన♦వచ్చు జూచువారికిన్.

వ. అనినవాఁడు రోషించి.

ఇంద్రజిత్తు లక్ష్మణ సంవాదము.

ఇం-కీర్తన, జంఝూటి, రూపకము.

వచ్చెనునాబాణములు। వాడిజూడుమా! ॥వచ్చె॥ చెచ్చెరనీరొమ్ము వియగ-గుచ్చునులో । జొచ్చును మెర । మెచ్చులుగా । విచ్చలుగను॥ వచ్చె ॥

వ. అని పెక్కుసాయకమ్ము లెక్కువెట్టి పుంఖానుపుంఖంబుగా

లక్ష్మణుని ముంచియార్చిన నతంను లక్ష్యపెట్టక.

ల-కీర్తన, జంఝూటి, రూపకము.

ముచ్చిలియావరకుబోతి-మూఁడుసారులు। వచ్చితివీ సారిమిడుత। జిచ్చునబడి-చచ్చినగతి-జచ్చెదవిపు-డిచ్చటనే॥ ము॥

వ. అని పలికి యాశరంబులు తననిశిత సాయకమ్ములచే రూపుమాపినవాఁడు గూరిరసారాచఁబులు దొడిగి

ఇ-కీర్తన, జం, రూపకము.

పతమములక్షించినాను - వ్రియ్యలమ్యెహుక । ఈక్షితిబ్రతుకంగ దరమె! యక్షయరణ। దక్షునిగా। నీక్షణమున-వీక్షింపుము'వచ్చెనునాబా॥

వ లక్ష్మణునియురంబు గుఱిజూచివ్రైచిన నవి దునిమివ్రైచి సౌమిత్రికోపోద్రేకంబున భయంకరమగు నొక్క బాణంబుఁ గార్ముకంబున నెక్కువెట్టి.

ల-కీర్తన, జంఝూటి, రూపకము.

మోక్షగుండదేవునిక-టాక్షమున్నను। దీక్షతో నీబాణమునబ, రీక్షగనో! రాక్షసపతి, త్యక్షంబుగ। శిక్షించెద॥ ముచ్చిలియా॥

వ. అని యాకర్ణాంతముఁ దిగిచివ్రైచినఁ నాయేటునకు రాక్షసుండు మూర్ఛల్లి మరలలేచి యెదిరించినఁ గాలూన నియ్యకుండ లక్ష్మణుండు బాణంబులు వేయుచుండఁ దనమనంబున.

తో. అబ్బా! దేవత, లందరిగెల్చితి। నాయాసములేదామె! గొబ్బుననరుచే। గూలుకాల మొన । గూడెనేమొ వడిబోయె ॥రామ॥

వ. పరాక్రమవంతులగు దానవులందఱు వీరిచేత మడిసిరి. నేను బ్రదికి ప్రయోజనమేమి. శరీరముఁ దాఁచక యుద్ధంబుఁ జేయుదమని యెంచి భూకంపంబు గలుగఁగ సింహనాదంబుఁ జేసి.

తో. పిన్నతండ్రిపై-గొన్ని బాణములు-భీకరముగ లక్ష్మణుని।గొన్ని బాణములు। గురుతుగవాయుజు। గొన్ని బాణములు వడిని॥ రా ॥

వ. వేసినొప్పించిన రోషించి విభీషణుండు.

తో. విల్లుగుణధ్వని-వేగచేసిపటు-విశిఖంబులు సంధించి। కొల్లగ నగ్రజు-కొడుకుమేనిపై। గోపంబునదాముంచి॥ రామ॥

వ. మఱియు ననేకమార్గణంబులు రాక్షసానీకంబుపై నైచి బాధింపుచు వానరసేనలంగాంచి విభీషణుం డిట్లనియె.

వి-కీర్తన, ఆదితాళము-బేహాగ్, పోనివ్వ.

మీరు। దగ్గకదగ్గక।గమ్ముడు॥ మీరుదగ్గ॥ నిగ్గుగ బగవారిమూక మొగ్గినచ్చోలగ్గకెక్కి॥ త॥ దీక్షలక్ష్మణునిచేత। నీక్షణమె చంపించెద। రాక్షస మూకలమీరు, శిక్షింపుడు పిమ్మటను। మోక్షగుండవాసునిచే। రక్షోవిభుడీల్గినట్లు॥ తగ్గక॥

వ. అనికవియించిన మహత్తర రోషాయత్తచిత్తులై జాంబవంతాదివీరులు పర్వత వృక్షాదులచేత మోదుచు.

అర్ధకందము. వ్రేటుకువ్రేటుకురాక్షస।కోటులఁబెక్కండ్రనవని♦ గూల్చిరికడిమిన్।

వ. ఇంతలో హనుమంతుండు లక్ష్మణుని దించివచ్చి రాక్షసుల పై బడి.

అర్ధకందము. వాటుకువాటుకనొక్కొక। మాటసురులబెక్కమందిని♦ మహిపయిఁగూల్చెన్.

వ. ఇట్లుపోరు ఘోరంబయిన సహింపలేక ఇంద్రజిత్తుప్రతాపం బిగురొత్తవిభీషణుండు లోనగువీరులపయి దారుణాస్త్రంబులు వ్రేయుచుండఁగని లక్ష్మణుండు గోపించి యాంజనేయునెక్కి యొక్క యర్ధచంద్రబాణంబున.

తో. సారధిగూల్చిన-సారధికమురా। క్షసుఁడుఁదానె సల్పుచును। బోరొనరింప గ-పులుగొందరువాని-తేరుహయులఁగూల్పగను॥ రా॥

వ. విరథుండయ్యువాడు వడిచెడక సింహనాదంబునేసి.

తో. అడరుచునాగ్నే-యాస్త్రమువింటను-దొడగి విభీషణువ్రేయ నడుమవరుణబా, ణమునలక్ష్మణుడు। నడికితుంపులుగజేయు॥ రా॥

వ. రాక్షసుండు లక్ష్మణునకు నభిముఖుండయ్యె నప్పుడు.

సం-కీర్తన, అటతాళము-భైరవి-నమిూలాంవాం.

వారు బ్రియోగసం, హారములతో భోర। బోరు ఘోరంబాయె ను। శూరదురావణ। సుతుడు మోక్షగుండే, శుని ప్రియసోదరుడు॥జూడ జూడ॥ వా॥ ఘననాగశరము రా-వణివేసియసౌమిత్రి।గరుడాస్త్రమున ద్రుంచెను। ధనదాస్త్రము వాడు। ద్ధతివేసియలక్ష్మణు,డును యామ్యమున ద్రుంచెను॥ జూడజూడ॥ వారు॥ అరసివాయువ్యాస్త్ర। మతడేయసౌమిత్రి। యైంద్రాస్త్రమును ద్రుంచెను। సురవైరిగంధర్వ। శరమేయ రామాను, జుడు రౌద్రిమునఁద్రుంచెను। చూడచూడ॥వారు॥

వ. ఇట్లు గొంతవరకుఁ బోరిన పిమ్మట లక్ష్మణుండింక వీనిఁ బరిమార్చుట కర్తవ్యంబని యెంచి దిశాభాగంబులువగులఁ గార్ముకజ్యానినాదంబొనర్చి యుగ్రదృష్టి చేత నింద్రజిత్తు నీక్షించి.

ఇంద్రజిత్తు మరణము.

తో. ఇంద్రాస్త్రంబును-వింటదొడగి రామ। చంద్రుడు ధార్మికుడైన। నింద్రాదులకిది। హితవైనను నా యిలసుతపతి హితవ్యయెన॥ రా॥ ఈయస్త్రముజని। యింద్రజిత్తుతల, యిలఁగూల్చునుగాకనుచు। నాయెడనాక, డ్గాంతముదిగిచిర। యంబున వేసియుగనలుచు॥రా॥ ప్రళయకాలవైశ్వానరుగతి దా। బ్రిబలుచునది యేతెంచెఁ। వలగొని మణికుం-డలయుతముగరా-వణిసుతకమును ద్రుంచెఁ॥ రా॥

వ. అప్పుడు.

క. తుంబురులు పాడిరచ్చరలంబరమున నిలిచివేడ్క • నాడిరి సుమవర్షంబులు గురిపించిరిమో। దంబున లక్ష్మణునిపైన • దగ నిర్జరులున్.

వ. ఇంద్రజిత్తుమరణంబుగాంచి లక్ష్మణుండు శంఖంబు పూరించి సింహనాదంబుఁ జేసెనప్పుడు విభీషణుండు లక్ష్మణుని గౌగిలించుకొని యగ్గించె. వానరులు జయజయ శబ్దంబులఁ బొగడిరి. తరువాత రాము

దున్న యెడకందఱుఁజేరి మ్రొక్కిన నింద్రజిత్తు మరణవార్త రాముండు విని సంతోషించుచు.

రాముని-కీర్తన, ఆదితాళము.

భయముదొలఁగెను। మనకు, జయముగల్గెను। రయముననాయింద్రజిత్తురణమున దెగెను॥ భయ॥ కొడుకులీల్గిరి। హితులు, కూలిపోయిరి।కడకు రావణుండువచ్చు-గదనమునకును॥భయ॥ ధీక్షబూనెద। వాని,శిక్షజేసెద మోక్షగుండమందు వెలసి। మోదమందెద॥ భయ॥

వ. అనిపలుకుచు బహుభంగుల దమ్ముని శ్లాఘించె ననంతరంబ.

ద్వి. ఇంద్రజిత్తిటువలె-నిలగూలుటయును, దంద్రనొందుచు లేచి దానవభటులు, దరుచరుల్ దమ్మును, దగుల్రైదరుమ, బరువడినురుకుచు బలహీనులగుచు। గొందరుపాఱిరి-కొండలపయికి। గొందరుదూరిరి-గుహలలోపలికి। గొందఱువనధిలో-గొబ్బునబడిరి। గొందఱులంకగ్రి - క్కునఁబ్రవేశించి। వదనంబులనుదీన-భావంబుదోప, బదములగడుదొట్రు-పాటుజనింప। రావణుకొలువు చే-రంగవచ్చిమ్రొక్కి । దేవపరాకుతా-దిగ్విజయంబు। చేసినమనయింద్ర, జిత్తుయుద్ధంబు।చేసిరామానుజు, చేతనుగూలె। నని తెల్పనాలించి, యధికశోకమున। మునిఁగి కొండొకసేపు - మూర్ఛిల్లితెలిసి.

రావ-కీర్తన, హిం-తోడి-అటతాళము, దేహికే.

హాకుమార! గుణాకరా! యేర। హాకదనపటుభీకరా! నాకుదిక్కిక నెవరురా। యీశోకమార్పగజాలరా॥హా॥ గరుడఖేచరకిన్నరాప్సర।సురగణంబులగెలిచిన। వరబలంబేమాయెనో ! యొక-నరునిచే బడుటాయెనా॥ హా॥ మోక్షగుండపురీశుని వెను-ముట్టిచంపుమువనుకొని। యీక్షణంబున బంపితినదె। యంతపోయెను జెడితివి॥హాకుమార॥

తేహారము. కొడుకు లందరిని బాసితిక ... సునిన్ను జూచి। యెడల బ్రాణములునిలిచి యున్న విపుడీవు బొలిసి। తిరములవసేనులోగి ... తికను బ్రతికేమిసాగి। చెడెను నాకీర్తియెల్ల, జిక్కితినినరులవల్ల.

తో. నాకునీవుపర-లోకకృత్యకములు। నయముగఁజేయఁగవలయు।
నోకుమార! యది-వోయినేనుడఁగ-నీకుఁజేయఁగావలయు॥ రా॥

వ. ఇట్టికాలవిపర్యాసమున కేమిచేయుదురా! కుమారా!కుమారా! యని బహుభంగులవగచి యెట్టకేలకు ధైర్యంబునొంది కోపాగ్ని మానసంబున నవులుకొని వృద్ధిపొంద.

తో. అటునిటుజూచుచు, నగ్నికణంబులు। బొటపొటగన్నులరాల। బటపటబటపట-బండ్లుదీటుచు, బలికెమంత్రులకుఁజాల॥ రా॥ మున్ను బ్రహ్మవర। మున నేఁగొన్నము, హోన్నతధనురస్త్రముల, బన్నుగఁదెండిక, బవరమునఁగుజని-పరిమార్తును శత్రువుల॥ రా॥

వ. అనిపలికి బ్రహ్మాండంబుఁబగుల భుజాస్ఫాలనంబుచేసి.

తో. నాతమ్ముల బాం-ధవులభటులమరి-నాతనయుల రాముండు। సీతకొఱకుఁగద-చీల్చెను నేజని-సీతనుజంపెదనుండు॥ రా॥

వ. అని కరవాలంబుఁగొని కోలాహలంబుగా నార్చుచుఁ ద్రిపురంబులు గాల్పంబోవు శంకరునివలెఁ దీవ్రింబుఁ జూపుచు నశోకవనంబుఁజేరి చంపఁబైకొనివచ్చు రావణుని తెంపుఁగని కంపంబు నొందుచు సీత విలపించుచున్నది.

సీత-కీర్తన, హిందూస్థానిరాగము-అటతాళము, పాణినాథునేట్సు.

వీనిచేతఁజావునాకు। విధిలిఖించెనేమొకో! పాణియందుఁ-గత్తిఁ బూని-పయికివచ్చెనేమొకో॥ వీని॥ ఇంద్రజిత్తుచచ్చియున్న-యీసుచేతనూ। ఇంద్రవైరినన్నుజంప। నిపుడువచ్చెనేమొకో॥వీని॥ మోఁకుగుండెనో నిజయించి। మోదమందుచు। నీక్షణంబునన్నుజంప - నిటకువచ్చెనేమొకో॥ వీని॥

వ. అని విలపించి రామమూర్తిని తన హృదయారవిందంబున నిలుపుకొని మూర్ఛిల్లి ధరణిజ ధరణిపయినొరిగె. అప్పుడతని రాదగ్రసంబునుగని సుపార్శ్వుండనువాఁడు హితంబుఁ దెలుపఁగోరి.

క. నీపైకినెత్తివచ్చిన। యాపగతురజంపుటహాఁ మగునదిగాకీ।

పాపమునకు నొడిగట్టుకు। యీపడతి నిజంపుటహా ♦ మే! దనుజేశా.

వ. బ్రహ్మవంశభవుండవయి నీతివిడిచి స్త్రీహత్యచేయ నుచితించేనా! చేతనయిన రామలక్ష్మణులంజంపు పొమ్మన నియ్యకొని తిరిగి వచ్చి యాస్థానంబుజేరి కొలువుదీరె.

తో. తనయునిశౌర్యము-తన్మృతివిధమును । దనవారికిఁ జెప్పుచును। మనమునశోకన, మగ్నిండె యా। దనుజుడుండె సంతతము॥ రామా రామాయనవే శ్రీరామాయణకథవినవే॥ పార్వతి॥

వ ఇంద్రజిత్తు మరణసమాచార మంతఃపుర కాంతలు చింతతోఁ జెప్పుకొనుచుండవిని యతనిభార్యసులోచన లోచనంబుల నీరుగార మూర్ఛనొంది చెలులుబోధింపఁ గొంతవడికిఁ దెలిసి నాథునిఁగూర్చి.

సులో-కీర్తన, ఆదితాళము-ముఖారిరాగము.

నాకునీకు ఋణముదీరెగదా! ప్రాణకటముగ నేటితోఁ। ప్రాణేశ! నాకులగెలిచిన। భీకరశాలివి। నరుఁడెటుగూల్చె నయ్యయ్యో! ప్రాణేశ॥ నాకునీకు॥ ఎప్పటికినాతో । జెప్పిపోవుదు నేడు । చెప్పకపోతివయ్యయ్యో! ప్రాణేశ॥నాకునీకు॥ కొడుకులగాకుల। కొల్లజేసియునీవు। విడిచిపోతి వయ్యయో! ప్రాణేశ॥నాకు॥ ఈక్షితిమోక్షగుం। డేశుఁడుమనపై। నిటు దయ తప్పెనయ్యయో! ప్రాణేశ॥నాకు॥

క. ఉరగేశుఁడు సుజనుఁడు। సరగున నన్నిచ్చిపెండ్లి ♦ సలిపెడి వేళన్। వరరత్న మొకటి ప్రాణే। శ్వరనాకిడి యిట్లు పలికెఁ ♦ బ్రాభవ మొప్పన్.

తో. జనకకాంతునునీ, ప్రియుఁడని కేగెను। సమయంబునఁ దల యందు। నయముగనీర, త్నమును నివాళిం-చియుఁ బంపుము జయమొందు॥రా॥ మఱువకుమనుచును। మఱినీతోనె । దురమున కేగెడువేళ । స్థిరముగభార్యకుఁ। జెప్పిపొమ్మనుచు। జెప్పియుండెనావేళ॥ రా ॥

వ. మీమామమాటలు మఱచితివే! నాతోఁ జెప్పిపోయిననిట్టిమ రణంబుసంభవించునా! మనోనాయకా! అనికొంతవడుకు దుఃఖించి పిమ్మ

టఁ దనతనయులఁజూచి యిట్లనియె.

సులోచన సహగమనము.

సులో-కీర్తన, ముఖారి-అటతాళము.

ఏలయీలీలనగవ। దనయులారా! ॥యేలా॥ ఏలనగచిఫల । మే మిరా! కాలముగడవ। నెంతవారికిజాలును। దనయులారా! ॥ఏల॥ భీతినొం దకుఁడు విభీషణుకున్నాఁడు। ప్రీతిలోమన్నింపును। దనయులారా॥యేల॥ ఘనమోక్షగుండేశు। కరుణచేనేసహా। గమనముజేసెదను। దనయులారా!॥ యేల ॥

వ. అనియూరార్చి విన్నదనంబుతో దశకంఠుని యాస్థానంబున కుఁజేరి పతివియోగదుఃఖంబునఁ గన్నీరుమున్నీరుగాఁగార నగచి మామ గారితో నిట్లనియె

తేవారము. పతివియోగంబుగలిగె♦ బ్రతికియుం కేమిఫలము। పతి నివెన్నంటిచనుట ♦ పరమధర్మంబుగాన । బతిశరీరంబుమామా!♦పరగదె ప్పించి యిమ్మా । సతులుమెచ్చఁగవేగ♦సహగమనమేనుజేతు.

వ. అనినవతండు దుఃఖాక్రాంతుండై.

తో. ఆహావమునఁబడినట్టినీమగని యడిగినవారిచ్చెదరా । ఆహో నాచే-నదిగాదనఁగా- నామెవలికెమదిచెదర॥ రా॥

సులో-కీర్తన, హిం, తోడిరాగము, అటతాళము.

ఎక్కడికాలము।గ్రిక్కునవచ్చెను। నక్కట! నామది। కద్భుతమా యెను॥యె॥ గాలిసిమట్టిన। కీలికిగొట్టిన। కైలాసమెత్తిన, నీలావుదూలెనె॥ యె॥ సురపతిగెల్చిన। శూరునకిప్పుడు,నరులకువానర, వరులకులోగుట॥ కె॥ మోక్షగుండేశుని। మోహిలకునేనేగి దీకలో నావిభుదెచ్చుకొనెదనిక॥నెక్క-

వ. అనినిశ్చయించి మామకునమస్కరించి యతనిసమ్మతంబున.

చ. అదరమునెక్కితోడి చెలు ♦ లందఱు నద్భుతమందుచుండఁ గా। బరువడి దీనభావమున ♦ భండనభూమికిఁ జేరితేకుఁడీ। వరమునడిగి♦ కాల్నడను ♦ వచ్చిమహాభయుభక్తిదోఁపవా । నరులరుదందిహూడరఘు

నందనుజేరి నమస్కరింపుచుండె.

వ. సులోచనకరకమలంబులు ముకుళించి వినుతింపుచున్నది.

సులో, కీర్తన, శంకరాభరణము, రూపకతాళము

రామ! కదనభీమా ! జయ॥ రామ॥ ప్రేమతో॥ నామనంబు-నం దునగోలుతు॥ రా॥ సామనుత । స్మరారిహిత । సురారిహాత॥ రామకదన॥ కామన మాంచితకాయా ! సామజసన్నుతభార్గవ । రామగర్వభంగ ! పూర్ణ, సోమదివ్యవదనా! తామసాదిగుణవర్జిత । భూమిజవర ! మోక్ష గుండ । ధామ! శుభదనారాయణ-నామకవిస్తుత! సుందర॥ రామ॥

వ. అనిపొగడిన రామునానతిచే సుగ్రీవుండుత్తరమిట్లొసంగెను.

తో. ఎవ్వరిదానవో ! యెవరుతండ్రినీ, వెందుకువచ్చితివివుకు। ఎవ్వడునీపతి- యెఱిగింపుముమా । కన్విధమనననెనపుడు॥ రా॥ వెలయను లోచన-యిందజిత్తునా।విభుడగు శేషునిసుతను। నలరగరావణు-ననుగుగోడ లను ననిరామునితోసనెను॥ రా॥

క. రామదయాకరపటురణ। భీముండగునాదుమగనిం ♦ బృధివిని మూల్పం। గామించిదగునె ! యకటా! భూమినివైధవ్యమేను ♦ బొందగ గలనే.

సులో-కీర్తన, ఏకతాళము, పున్నాగవరాళి.

రఘురామచంద్రమా! యఘుహర! బ్రోవుమా! మొక్కెదను॥ ర॥ పతిభిక్షబెట్టుమా! వెతలెల్లబాపుమా! పరమపురుష!॥ ర॥ నీపాద్రపు జొచ్చితి-గాపాడవేడితి। దీనురాల॥ ర॥ విడనాడబోకుము। చెడజూడబోకు ము। మోక్షగుండ॥ రఘురామ॥

వ. అని ప్రార్థించిన రాముండు పరమదయాపరమూర్తిగానం గరుణించి తిరుగమేఘనాధుని బ్రతికించ మనంబునెంచె నదియూహిం చి హనుమంతుం డిట్లనియె.

తో. ఏమిరామమిా-రెఱుగనిదున్నదె । హేమగర్భ వరములను। నీమదిలోనూ,నింపదగదెయన-నెలతకురాముండనెను॥ రా॥

క. భామినియింకొక భవమున। నీమగఁడును నీవుఁగలిసి ♦ నిత్యసుఖంబుల్ । ధీమతులై భోగింతురు । కామింతురు మత్పదంబు ♦ గాంతురు పిదపన్.

వ. అనిపలికిన నానందించి యామె యిట్లనియె.

తో. దీనదయాపర! దేవదేవ! యుల్లైనను నాపతిమేను।బూనిక నిప్పింపుమునేఁ జేతును । మానుగసహగమనమును॥ రా॥

వ. అనునంతలో సుగ్రీవుండు నీవుపతివ్రతవేని నీపతితోఁ గొంతముచ్చటింపుమన మంచిదని రణమధ్యమందుఁ బడియున్న యాధిపతిశరీరంబును చూచి దుఃఖించి.

తో. పతియద్దైవముని-ప్రతిదినమునునే । వ్రతముగ సలుపుదునేని। క్షితిపయినాపతి। జీవసహితుఁడై । చెలగిపలికెడునుబూని॥ రా॥

వ. అమ్మహాపతివ్రత యిట్లనఁగనె యింద్రజిత్తు గనులువిచ్చి చూచి యందలువిన సులోచన కిట్లనియె.

౩౦-కీర్తన, ఆదితాళము, కరిరాజ, హిం, తోడి.

అనబోణి! వగవగకు । బని లేదుసోగదే,ననుబాకిపోరువాడు । నహిజగమునమాడు॥ మన॥ అతండు శేషుడగు! నీతండ్రియుగునుగాన। నాతోడగెల్చినాడు। నాతిరో! యిచటనేను॥ ననబో॥ వడిగను మోక్షగుండ,వరపుత్రినానతి। గడువగశక్యమె! కాలముదీరెను॥ ననబోణి॥

వ. ఇట్లు పలికి యింద్రజిత్తుకనులుమూసి పలుకకున్న దుఃఖించి లేచివచ్చి రాముని కెఱిఁగిన సంతసించి రాముండానతియ్య నంగదుండింద్రజిత్తుకళేబరంబు సులోచనకుఁ దెచ్చియిచ్చిన నదితేరిమీఁద నుంచుకొని రామునివీడ్కొని కదలి.

తో. కాంచనాంగి లం,కాపురికేని వే,గంబున నపుడసుదెంచి । యుంచదగినతా-వున బతిదేహము-నుంచి భటులగాపుంచి॥ రా॥

శ్లో॥ మామనుజేరి మ్రొక్కి రణ ♦ మధ్యముఁజేరఁగ వేగఁబోయి శ్రీరామునినాశ్రయించి సుక ♦ రంబుగ భర్తృకళేబరంబుఁదా

ధీమతిఁ దెచ్చుకొన్న యది ♦ తెల్లముగా వివరించినేఁడు నే
నామగఁడేగుతోవను ఘ ♦ నంబుగ నేగుదు నాజ్ఞ యిమ్మనన్.

వ. రావణుండు మిగులఁ జింతాక్రాంతుండయి కోడలిస్థైర్యసుగుణంబులకు నద్భుతంబంది కొండొకకాలంబునకు నిట్లనియె-

క. భామిని నీవెఱుఁగనిపని। యేమున్నది దుఃఖవార్ధి నీ ♦ గడునాకున్। ఏమిటకునుదోఁచదాయెను। నీమదిదోఁచినటుచేయు ♦ నీరజగంధీ !.

వ. అనిన నతనివీడ్కొని స్వగృహంబునకరిగి చింతగూరియున్న తన తనయులంగుర్చి లేవనెత్తి శిరంబుమూర్కొని యిట్లనుచున్నది,

సులో-కీర్తన, ఫీల్ రాగము, అటతాళము.

నాముద్దుసుతులార! నాయన్నలారా ! భూమినినాకేల । బుట్టితిరార॥ నా॥ మీముద్దుజూడనే। నోమునైతి। నేమరివిధికృత । మెఱుగకపోతి॥ నా॥ మహిమీఁదనుండధర్మముగాదునేను। సహగమనముచేతు,క్షణమాత్రమునను॥ నా॥ ఇంటనుండకను మీర,లివ్వడేలెందు। ముందుగబాతాళ। మునకునుబోందు॥ నా॥ వాసిమోక్షగుండ। హాసునిదయను। శేషునియింటను జేరుడు తగను॥ నా॥

వ. ఇట్లు కుమారులను శేషునియింటికిఁ బంపి సులోచన యిహవిషయములయందు విరక్తిఁజెంది.

ఉ. తానునుభర్తృదేహ సహి ♦ తంబుగ స్నానమొనర్చి నిత్యక
ళ్యాణముగా నలంకరణ ♦ మప్పుడొనర్చి విమానమందునా
సీనునిజేసి యుత్సవముఁ ♦ సువాద్యము లుప్పతిల్లఁగా
దానములిచ్చుచున్ జనియు ♦ దశయందు నిల్పియంతటన్.

తో. చితిచేర్పించియు- జితిపయినాథుని-జేర్చి కౌగిలించుకొని । సతితనపతితో। సహగమనంబును। సలిపెనుగడు నమ్మతిని॥ రా॥

వ. అంత దానవులనలంబు రవులుకొలిపి యిండ్లకుఁజనిరి. తదనంతరంబ.

తో. సతిపతులిద్దరు। సంతోషముతో । సౌరవిమానము నెక్కి । యతులితముగ సద్గతికిజేరి సౌఖ్యంబుగనుండిరి చొక్కి॥ రామ॥

## మూ ల బ ల యు ద్ధ ము.

ద్విపద-అప్పుడు రావణు - డధికరోషమున । నిప్పులుగన్నుల-ని లువకరాల। మూలబలంబుల-ముదమునఁబిలిచి । యాలంబునకునేగి-యు గచరాధముల। రామలక్ష్మణులను-రయమునఁజంపి। ధీమతితో డమీ, తె గువనుచూపి। వేగంబుననురంను- వెడలిపొండనిన । రాగంబునను బొంగి- రాక్షసభటులు। పరిధన కేళికి నేగఁ-బంతంబు మెఱసి । రథములుఁదురగ వా- రణములుభటులు। లెక్కకుమీరిబ-ల్మిని కేకలిడుచు । ఢక్కాదివాద్యము- ల్దమ్మనిమోగ। సింహనాదంబులు- సేయుచు వెడలి। రంహాసరంభులై, రణభూమిజేరి.

క. కేకలగొట్టుచు వానర। మూకలపై బెల్లుగవిసి ♦ మూలబలం బుల్। లోకంబులుఁగంపింపఁగ। జీకాకుగ నంపవాన ♦ చేయుంచిరొగిన్.

తో. అప్పుడువానరు-లధికాగ్రహమున-నదురిలు మార్రికులుగొ నుచు। నుప్పలుగా ధర-గూలునట్లుగా-గుద్దిమ్మిరి యసురులగనుచు॥ రా॥

వ. ఇట్టిరువాగువారును బౌరుషంబుచే పెల్లురేఁగి విడువక పో రుచుండిరప్పుడు. వానరబలంబులు రాక్షసబలంబుల లక్ష్యపెట్టక.

తో. కరులనుదోలిన-గరులచేతనే। గరులమోదిచంపుచును। దు రగంబులపై - దోల వానిచేఁ - దురగంబుల మోదుచును॥ రామ॥ ప టుతరరథములు, వరబవానిచే- బటురథములు గూల్చుచును । భటులుగ దిసినను-భటులచేతనే। భటులమోది చంపుచును॥ రా॥ కాలగొందఱిని, గేలగొందఱిని- వాలంబులగొందఱిని । కూలిచివేసిరి-కోయని దనుజులు- గూలిడగ నత్తఱిని॥ రా॥

వ. ఇట్టిభయంకరరణంబునఁ బెక్కండ్రురక్కసుల నోర్చి వాన రులు పేర్చియార్చుచుండిన నారభసంబు గని సహింపక.

రగడ. మూలబలములడరి। కోతుల। మూకపయినఁబడిరి॥ విక్ర

తగాత్రులును, వికృతనేత్రులును,వికృతహాసులును। వికృతనాసులును,వి
కృతవక్షులును-వికృతకర్ణులును, వికృతపాదులును॥ వికృతనాదులును, వి
కృతపుకరులును, వికృతాధరులును॥ మూ॥ కరపత్రింబులు-గ్రకచముస
లములు । గరవాలంబులు, గదలుజక్రములు । పరిఘలుశూలలు-బ్రాస
పట్టసలు । పరశుముద్గరలు-బటుతోమరములు । మొదలగు నాయుధ-ము
లుగడుబూనుచు । సదరక బెదరక-ననికిని మూనక॥ మూ॥ కడువడి జగము
లు, గడగడవణకగ। సుడివడిజలజల-జుక్కలురాలగ। జలనిధులింకగఁ-గు
లగిరులదరగ। గలవరమున దిగ్గజములుబెదరగ। బలువడి శేషుడు-ఫణము
లుముడువగ। బలుమఱుగ్రహములుఁ-బథములు దప్పఁగ॥ మూలబలము
ల,డరి, క్రోతుల మూకపయినబడిరి॥

వ. ఇట్లుక్రమ్ముకొని నిలుపోవనీక వానరుల జెల్లాచెదరు చేసిన వారిదాడికి భయభ్రాంతులై వానరులుఁ దరులుగిరులుఁ గ్రిందవైచి తమలోఁ దామిట్లనుకొనిరి.

వానర-కీర్తన, చాపుతాళము, సీతారా.

రాము,డేలా! యనుజు,డేలా! యుద్ధ,మేల! జాలును । అలమును
మానిపోవు-టదియెపోలును॥ రాము॥ కడుపు,నిండగాయ-పండాకులు గొం
డవనములు। దండిగదినుచుండక-దరలిరానేల॥ రాము॥ పెక్కు,రాక్షసులు
యీక్షణమె-శిక్ష సేయుగ । మోక్షగుండా । ధ్వక్షుడిదియే - మోకనడా
యెగా॥ రాము॥

వ. అప్పుడు వీరిచేత జావనేవ నూపిరియుండిన నుప్పుమ్ముకొని చ్రితుకుదుము రండని సేతువుమీదుగాఁ బోవు కపులనడ్డగించి నీలహనుమంతాంగదులు మరలించిన వచ్చి భయభ్రాంతచిత్తులై రాముని ముఱుంగునకుఁ జనినఁ దమూరసంబునఁ గని రాముండు.

తో. దానవులదరగ-వానరులలరగ। ధనుర్గుణధ్వనిజేసి । బాణ
వర్షమున - బరువడినసురుల- పయిగురిపించెనుడాసి॥ రా॥ దనుజులువోవ
గదారిగానకను - రణములోన దిరుగుచును । వెనుకొని రాముడు-విశిఖం

బులువడి-వ్రేయదాకి కూలుచును॥ రామ॥

వ. ఉండుటగని రాముండు మఱియు.

క. చరణంబులు వదనంబులు । గరములు శిరములును వ్రేళ్లు ♦ గాత్రంబులునై । త్తురులురులఁగఁ దెగవ్రేసిన । ధరఁ ద్రుళ్లిరి పెక్కుమంది ♦ దానవవీరుల్.

వ. అంతమిగిలిన రక్కసులు భయభ్రాంతులయి.

తో॥ అదిగో రాముం । డదిగో వ్రేసెను । యిదిగో రాముడు వ్రేసె । నదిగో వ్రేసెను । నిదిగో వ్రేసెను । యు దెపా సెనుని దెఢా సె॥ రా॥

వ. అని తిరిగితిరిగి చూచుచుఁ బొఱుచుండిన నప్పుడు రాముం డలుకరెట్టింప.

తో. సమ్మోహనమును, శరమును ధనువున-సంధిచియు వ్రేయగను । దమ్ముదామెఱుఁగక । దనుజులుభ్రమపడి । తబ్బిబ్బగదిరుగగను॥ రా॥ ఒక్కరాముఁడే, పెక్కురాములయి-యెక్కడఁజూచినఁదోఁచి । అక్కజమునగఁగన, నంతారామము, యంబై యుండెను వేచి॥ రామ॥

వ. ఇట్లాజిమధ్యంబున ననంతరూపులుగాఁదోఁచి రాముండు గసిమసంగిన నెక్కడివారక్కడనే సొలసిరి. చావఁగాఁజిక్కినవారు తప్పించుకొని లంకలోనికరిగిరి.

క. పదివేలుగరులుహరులిరు
పదివేలును భటులునొక్క ♦ పద్మమురథముల్
బదిపదులుఁగూలెనేనియుఁ
బదపడియొకయట్టలేచి ♦ పరువడినాడున్.

ఉ. అట్టలు నూరుకోట్లెగసి ♦ యాడినమస్తక మొండునార్చుచున్
దట్టనలేచుఁ గోటియుపి ♦ తప్పకలేచిన రాముపింటికిన్
గట్టినగంట మ్రోగుఁబదు ♦ నాలుగుగంటలు నర్ధయామమున్
గట్టిగమ్రోగెనార దశ ♦ కంఠుని మూలబలంబుగూలఁగన్.

వ. ఇట్లు కోదండదీక్షాగురుండగు రాముండు దేవతల కభేద్యం

బయిన రావణుమూలబలంబుల భేదించి సుగ్రీవవిభీషణుల దిక్కుజూచి యిట్లనియె.

రా-కీర్తన- ఆదితాళము-కనలి.

ఇలలోఁ,గలబాణ, ములకిదిమేటిగా। అలగాధినందనుడు।దెలియ నాకిచ్చినాడు। బలమైన,కలహమున। బరపమేలౌనుగా॥యిల॥ రిపులనుద్రే యు। నుపశాంతిజేయ। ద్రిపురారినేనుదక్కఁ। దెలియరన్యులునిక్క। మిపు డెం,తనిపుణత్వ-మిదిజూపెఁగంటిరే॥యిల॥ సమ్మోహనమను।శరమిదియౌ ను। అమ్మోక్షగుండపతి-నై ననాయనుమతి-సమ్మోహి, తులజేసె-నిమ్మూ లబలమును॥ యిల॥

వ. అనిన వారు సంతోషించి శ్రీరాముని గీర్తించి రపుడు విభీషణుండు.

తో. దేవతలనుదోలి, దేవతలనుభే, దింపలేనిసైన్యమును। దేవ దేవసా, ధించితివిక దెగు। గావణుండురణమునను॥ రా॥

వ. అనిపొగడుచుండె నయంతరము మూలబలంబు మల్లినవార్త విని రావణుండు.

క. కోపాగ్ని జ్వాలలకడు
దీపించఁగ గోలుపుసెదర ♦ దీక్షబలంబుం
జూపుచుయుద్ధోన్నత్త వి
రూపాక్షాదులకనియె♦ రోషముతోడన్.

రావ-కీర్తన, బేహాగ్-ఆదితాళము, పోనివ్వ.

పోదముపోదమురండిక। మనముబోదము ॥ మోదమునఁగపులన్ని పుల। ముట్టడించిచంపఁగను॥బోదము॥ అక్షయరణదక్షులయూ। పాక్షశో ణితాక్షమక। రాక్షవరథూమ్రాక్షముఖ। రాక్షసయోధులబట్టి। శిక్షజేసి వెలయుదన్న। మోక్షగుండనిలయుపయికి॥ బోదము॥

రావణుని రెండవసారియుద్ధము.

వ. అని వారినిగూడుకొని రథారూఢుండయి యుత్తరద్వారంబు

నంజని యుద్ధభూమికి జేరినపిమ్మట ముందు విరూపాక్ష యుద్ధోన్మత్తసుపార్శ్వులు బహురాక్షసానీకంబులతో నార్భటింపుచు వానరానీకంబుల పయికిం దొడరి.

తో. పరిఘఖడ్గగద। పరశుకుంతతో, మురముసలాదులచేత । నరిమురిమోదుచు। నార్భటించవా। నరులతికోపమునుచేత॥ రా॥ క్షితిజాతంబులు। క్షితిధరంబులును, సిరములమోసుకవచ్చి। ధృతితోవైచుచు। దేవాగులబా, ధింపఁదొడగిరటుహెచ్చి॥ రాను॥

వ. ఇట్లుక్షణమాత్రింబున సుగ్రీవాది వానరయోధులు విరూపాక్షాద్యసురయోధులఁ బిలుకుమార్చిన నదిగని రావణుండుఁ గోపోద్దీపితుండయి సారధికి యిట్లనియె.

రావ-కీర్తన, ఆది తాళము- మూతాము.

రామలక్ష్మణులపయికి-రథమునుబోనిమ్ము నేను, భీమశరమువేడదగుల్చెద। సారధివినర। బిలుకుమార్చిమరలివచ్చెద ॥ రా ॥ వారుగాలినంతమీరద। వానరులుచెట్లపాలై । పారిపోదురింకదప్పదు। సారధివినర। వీరితిప్పలిపుడెచెప్పదు॥ రా॥ రాక్షసాద్యతులనెల్ల। శిక్షజేసి యుప్పొంగెదు। మోక్షగుండెశులనుట్టుము। సారధివినరా। యీక్షితినిబడగొట్టుదు॥ రా ॥

వ. అనిపలికి తేరుఁబఱపించి గుణధ్వనిజేసి తనపయి నెదిరించిన కపిపుంగవులం బఱికించి.

తో. అవలీలగనా, యుకవృష్టినియా। ప్లవగవల్లభులముంచి। దివిభువియదురగ। దినకరకులుపై । దేరువేగఁబఱపించి॥ రా॥

వ. రావణుండుఁ దనయుద్దండంబుజూపుచుఁ గోదండపాణితో భండనంబొనర్ప నెదిరిన యడ్డంబుదూరి లక్ష్మణుండు.

క. కొన్నిశరంబులువైచిన। నన్నియుఁదనబాణ నిహతి • నడరించి యుదాఁ । గొన్నిశరంబులనాతనిఁ । బన్నుగఁ జిక్కంగఁజేసి • పట్టిగఖుందుర్.

వ. రాముసిపయికి నెదిరిన రాముండును నెపరించి.

తో. రామరావణులు। రయమున నుభయులు। రణరంగంబునదగిలి। భీమబలంబుల। బెనగజొచ్చిరు, ధ్ధామప్రజ్ఞలనుమిగిలి॥ రా॥ కరలాఘవమున, శరలాఘవమున। సరిసమానముగఁ బెనగ। సురలెల్లనునం, బరమునన్నిలిచియుఁ-జూచుచుండిరదిసరగ॥ రా॥

సం-కీర్తన, అటతాళము, మేలైన.

రౌద్రిబాణంబును। రావణుడేయగ। రయమున బై కిరాగ। రౌద్రిబాణము చేత। రాముడుదానిని, రంజిల్లద్రుంచె వేగ॥రా॥ ఘనతమిస్రబాణమునదశకంఠుఁడు। గనజీకటులుజేయగ। గనుగొనిరాముఁడు। గరముగ్రమగుబాణ। గణములచేఁబాపెగా ॥రా॥ అక్షయబలుడగు-నసురవల్లభుడు నహిశరములువేయగా। మోక్షగుండేశుఁడొ, వ్వాగఁ బెక్కు-శరముల, దీక్షణోద్రించెగద ॥రా॥

తో. అసురసాయక-మసురుడువేయుగ-నదియునుష్ట్రి శార్దూల। కేసరికిటికరి। గృధ్రోరగసమ। భాసురముఖములజాల ॥రా॥

వ. బహుసాయకంబులయి కవిసిన రాముండలుకరెట్టింపఁ దన విలువిద్యా ప్రౌఢిమ చేఁ బటాపంచలు సేసి.

తో. దహనాస్త్రముభూ-ధవుడేయురవి, గ్రహతటిదుల్కలభాతి। బహుబాణములయి। పయికిరాగవే। భంజించెనురారాతి ॥రా॥

తో. మయదత్తంబగు। మాయాశరమును। మఱియురావణుఁడు బరప। రయమున గాంధ, ర్వంబనుశరమున। రాముడుదానినిఁజెరుప ॥రా॥

వ. ఇట్లులతిఘోర యిరువురుఁ బోరునవసరంబున లక్ష్మణుండెదురఁజొచ్చి.

తో. ఏడమ్ములదను। జేశునిపడగయు। విల్లునుసారధినడచి। వాడి గల్గుశర। పంచకమాతని। వక్షమునొవ్వగవిడిచి ॥రా॥

వ. సింహనాదంబుజేసిన నంతలో విభీషణుండు.

తో. తురగంబులదు, త్తునియలుసేసిన। విరథుండై రావణుడు। ధరణికి దుమికియుఁ-దగశక్తిఁగొని-తమ్మునిపై వైచెను నపుడు ॥రామ॥

గీ. నడుమడాని లక్ష్మ ♦ ణస్వామి మూర్ఛమున్ను। లేసితు ప్రెంచెదాన ♦ వేసుఁడంత। మయునిచేతఁగొన్న ♦ మహితశక్తి విభీషణాఖ్యుమీఁదవైవ ♦ నడరుటయును.

తో. రాముని తమ్ముఁడు, రావణు తమ్ముని । బ్రేమతో వెనుకకు ద్రోసి। రాముందరబం। తమున నిలువనగి-దశకంఠుండ నెడాసి ॥రా॥

రాగ-కీర్తన, అటతాళము, బాళాబం.

ఓర్చియుండుమిక। వచ్చెను శక్తి ॥యో॥ కార్చిచ్చువలె మంట గ్రక్కుచు వచ్చెను ॥యో॥ విభీషణుని నీవు - వెనుకను ంచుకొంటివి ॥వో॥ మయుని చేకొన్నట్టి-మహనీయ్యశక్తిది॥యో॥ఉరగేంద్రనిభమైన-యుగ్రింపు శక్తిది ॥యో॥ మోఁకు గుండెకుడు। ముదమున మెచ్చును ॥నోర్చి॥

లక్ష్మణుని మూర్ఛ.

సం-తో. ఘనముగ నదిచిరు-గంటల చప్పుడు । గణగణ యని మొరయగను। వనధులుగలగగ। వడిగ గులాద్రులు। వడకగ దిశలార్వగను॥రా॥ పిడుగులు రాలగఁ - బుడమిజలింపగ। మడుపంక్తులు జెదరగను । గడువడిజనిల, క్ష్మణునివక్షమున। గాడినధరపయి బడెను ॥రామ॥

వ. కాలావసాన సమయంబునఁ జెంపుదక్కు కూలుమహామేరువుచందంబున రావణప్రయోగ శక్తిచే లక్ష్మణుండిలఁ బడియున్నఁగాంచి శోకవ్యాకులిత చిత్తుండయ్యెను.

క. సౌమిత్రియురము గాడియు। భూమికిదిగియున్న శక్తి ♦ బుచ్చఁగఁగపులుణ్। దామోపరెరి యొకరును। రాముండును బెరికెఁగడుబ ♦ రాకృమ మొదవణ్.

వ. ఇట్లు పెరికివైచి సుగ్రీవ హనుమంతాది కపులను గాంచి రాముండిట్లనియె.

రా-కీర్తన, అటతాళము, కాఫి.

ఈదశకంఠుని-నేమనుమూడను - గాదెజనించుట। కష్టములొందుట। మేదినిపుత్రిని। నేదగబాయుట। గాదిలితమ్ముని । గడనుగోల్పోవుట॥

ఈ॥ చాలబరాక్రిమ, శాలినివాలిని! గూలిచియీకపి, కోట్లనుగూడుట! యీలవణాంబుధి । నటువలెగట్టుట । పోలగమోక్షగుండ । పురపతినగు నాకు॥ సీద ॥

తో. శౌర్యముజూపెడు-సమయముగానిది - కార్యముజెడవగచు చును! ధైర్యముదూలెడు - తరిగాదికనా । తమ్మునిగాపాడుచును ॥రా॥

వ. మీరేమరక యుండుడింకఁ దెలిపెద.

రాము-కీర్తన, త్రిశ్రిజాతి, వనమును.

ప్రతినదప్పదువినుడు । ప్రతి లేదుకపులార నేను॥బ్రతిన॥ క్షితిబం ణ్త్రికంఠు! బ్రతుకుతోఁబోనీను నేను ॥బ్రతి॥ సురవైరిపోకనిలిచి । సరిగను బోరినజాలు ॥సుర॥ యిరువురు తెంపు! నెరిగేరుచూ చేటివారు ॥బ్రతి॥ ధర ణిదూరినవిడువ! దగవార్ధిజొచ్చినవిడువ ॥ధర॥ సురులచాటుకు - జొరబా ఱిదాగినవిడువ ॥బ్రతిన॥ తరణివంశజుడ నేని । దశరథతనయుడనేని । తరు ణి॥ వరమోక్షగుండ! వాసుడనే నైతినేని ॥ప్రతిన॥

వ. అని ప్రతిజ్ఞగాఁబలికికనుల గెంపులొలుక ధనుష్టంకారంబుఁ జేసిరావణుదిక్కున కభిముఖుండయి తండోపతండంబులుగాఁ గాండంబు లుపఱిపిన.

క. ప్రతిసాయకంబు లేయుచు । నతులితగతిఁగొంతవఱకు ♦ నశు రేశ్వరుఁడు! ద్ధతిబోరిరామబాణ! క్షతుఁడయి సమరంబుమాని ♦ చయ్యు నబొసెక్॥

వ. సింగంబునుగని మాతంగంబు పరుంగుపాఱుభంగి రాముని చేభంగపడి యసురపుంగవుండు సంగరరంగంబుమాని ప్లవంగవిభులుం దఱుమలంకజొచ్చి యంతఃపురికిఁ జేరి మందోదరితో నిట్లనియె.

రావ, కీర్తన, హిం, తోడి, అటతాళము.

రామునివిక్రమము । రమణిరో! నిర్వక్రిము । ఏమిచెప్పదుభామి నీ! యెటులగెలుతునుగామినీ! ॥రాముని॥ నామదినిభావించిన । రామురూ పమే! తోచును । లేమరో యెందున్నది! రామమయముగనున్నది ॥రాము

ని॥ మోక్షగుండేశ్వరుని। నుట్టడింపగజాలను। దశ్రీకుని సేవింతును, దప్ప క జయమొందును ॥రాముని॥

వ. అనిపలికి తత్క్షణంబున.

క. మానుగస్వాతికవృత్తిని। బూనిశివాలయముఁజేరి ♦ పూజించి మదిఁ। ధ్యానముఁ జేయుచునుండిన। దానవపతిఁ జేరిపలికెఁ ♦ దత్సతి తెగువన్.

తో. ఇదివరకందరి-నెదిరిజయించితి-వెనలేరెవ్వరునీకు। దుదకిటు మగటిమి దూలిపలుకుటిది-త్రోవయానెయనబోకు ॥రామ॥

మ, కీర్తన, కళ్యాణి-ఆదితాళము.

నీ, కింత భయము నే, డేలను॥నీకు॥పంతము జెడిభయ-పడువాడవు పర। కాంతనపుడు దేనేలను। దేనేలను, దేనేలను॥నీకింత॥తాతయుదమ్ము లు। దల్లియునేనును। నీతిదెలుపవిన గూడదా। విన ॥ నీకిం ॥ పుత్రులు మిత్రులు, బొలిసినపిమ్మట। శత్రులకునులొంగవచ్చునా॥ లో॥ ఈక్షితి శూరుఁడ। వేనిమోక్షగుం,డేశుని నెదురుము చాలును॥ అంతేచాలు॥నీ॥

వ. అనితూలనాడిన సిగ్గునఁదలలువంచుకొని కొంతవడికి భార్య దిక్కుఁజూచి నిట్టూర్పుఁబుచ్చుచు నిటులనుచున్నాఁడు.

తో. అలివేణిరో! నీవన్నదినిజమె! యయినరామునకువెరువ। జె లగిహోమమును। జేసిపోయినే, గెలిచెదఁబొమ్మిఁక తెరవ॥ రామ॥

అనియిట్లు ధయిర్యంబుగఁబలికి మందోదరనిబంపి తానునుహో మంబుఁజాలించి గృహంబునకరిగి శయనించె నిక్కడరాముండు.

క. నెత్తుటదోఁగినతనువున। నొత్తిగిలంబడినతమ్ము ♦ నురువడిఁ గని। తా,జిత్తంబుగఁఅగికన్నుల। నత్తరిభాష్పములుదొరఁగ ♦ హాయ నియేడ్చెన్.

రా-కీర్తన, ఝంపతాళము, ఫిల్‌రాగము.

అయ్యోనాతమ్ముడ! యయ్యో! లక్ష్మణ! చయ్యననను బాసి-చ నినావదిశకి॥ న॥ అడవులమాతోడ। నిడుములుగుడిచి। కడకుదైత్యునిచే

త। బడితివియిచట॥ న॥ కావలెనన్న రాం-గలదట్టిభార్య। నీవంటితమ్ముని। నేనెందుఁదెత్తు। నయ్యో॥ అ॥ పలుమాఱునేనింత। పలవించిపిలువ। నెలుగెత్తియో! యన। వేమిరాయనుజా!॥ అ॥ ఎలమిని మోక్షగుం,డేశుడవను చు। బలుకుచుసేవలు। సలుపుదునాకు॥ నయ్యో॥

తేవారము. నాకుయుద్ధంబింకేల!♦నాకు రాజ్యంబింకేల! నాకుజయమింకనేల!♦నాకునాసీతయేల! నాకునీసౌఖ్యమేల!♦ నాకుబ్రాణంబులేల! నాకునీతోడిదైవ♦ లోకమేయగును జాల.

తో. నాతోఁగూడి వ,నంబులకును ది,న్నగవచ్చితివీవపుడు । నీతోఁగూడా। నేనుదివంబున। కేతెంచెదమఱియిపుడు॥ రా॥ ఇంతే! కాని ని,న్నెడబాసియునే।నెంతయునుండఁగఁజాల। బంతంబుననిఁకఁ-బ్రత్యర్థులపై। బడిచంపుట నాకేల॥ రా॥

వ. అనియనేకవిధంబుల సౌమిత్రి సుగుణంబులు దలఁచుకొని శోకింపుచున్న రామచంద్రునిఁ జేరఁబోయి సుషేణుండు ధయిర్యవచనంబులాడుచు నిట్లనియె.

సుషేణ-కీర్తన, కళ్యాణి, రూపకతా.

శోకమేలనయ్యా! నిను। నీకుమేలుగాదుమాను ప్రాకటముగనీతనికి। బ్రాణభయము లేదికను॥ శోక॥ మేనుఁబ్రాణముఁబాసిన। నాననమునఁగళలున్నె! మానుగనిందీవరములు। మాడ్కిగనులు జెన్నొందునె॥ శోక॥ అందములై చురచేతులు । గెంబామరలటులున్నె ! తొందరేల ! మోక్షగుండ-మందిర ! నీడెందంబున॥ శోక॥

వ. అనిపలికి రామునిశోకంబాప్చి హనుమంతునిఁజూచి సుషేణుండిట్లనియె.

క. మనుజాంబవంతువల్లను। వినియుంటెవని మూలికలను ♦ వివరింపంగా। హనుమంత ద్రోణగిరి ద। క్షిణపు[illegible]ంబునందుఁ ♦ గేవలరుచులన్.

వ. ఒప్పియున్నవిశల్యకరణి, సౌవర్ణకరణి, సంధానకరణి, సంజీ

వకరణి, యనునాలుగౌషధ లతలుగలవవి వెదకితీసుకొని వచ్చితివయిన నీలక్ష్మణుని ప్రాణంబులు మరలింపవచ్చును. లేకున్న నొండుసదుపాయంబులేదు.

సుషేణ-కీర్తన, కేదార, చాపుతాళము, కోరియుం.

హోయిరమ్మిక! హనుమంత॥ హోయి॥ వాయునందన లేవ, హోయి వేగముతోఁబో! హోయి మందులుగొనిరా! హోయితేవోయీ యీ, హోయీ కావోయీ॥ హోయి॥ మించిదోర్గిణాద్రినిశో-ధించిగంధర్వలజ, యించి రాక్షసులను, ద్రుంచిసా,ధించి ల,క్షించి కు,ప్పించి॥ హోయి॥ చండకిరణుఁడు పొడువ,కుండరావలె మోక్షగుండరఘుపతిగను! చండప్రద్యుండయే-దండ నిల,కుండ॥ హోయి॥

వ. ఇక్కడికి నాలుగులక్షల యిరువదివేల యిన్నూట పది యోజనంబుల దూరమున్నది. సూర్యుండు పొడవకముందురమ్ము. ప్రొద్దువోడిచిన నౌషధములుఁ బనిజేయఁజాలవు. క్షీరాద్రినిదాఁటి జవంబునఁజేరుమనిన హనుమంతుం డోడఁబడియె. నప్పుడు రాముండు.

క. ఈతమ్మునిబ్రతికించియు । భూతలమునసీవుకీర్తిఁ బొందు మువత్సా! నీతోఁగూడఁగ నలువురు । నాతమ్ములటంచు వాయు నందన దలతుఁ.

వ. అనిన విజృంభించి మహానందంబున నాంజనేయుం డిట్లనుచున్నాఁడు.

హను-కీర్తన, శంకరాభరణము, ఏకతాళము, అమ్మయ్యా.

నావంటిబంటుండ! నీవేలవెరగంద! వేవేగమందులు! వెతకినేఁ దెచ్చెద॥ నా॥ ఆయేకుదీవుల! కావలనుండిన! నాయుదిగ్రవేగము! నంతలోనే డత్తు॥ నా॥ ఆమిత్తినదలించి! యువనిపై బొలియించి! సౌమిత్రిప్రాణపంచకమును మరలింతు॥ నా॥ ఈలోకమునగాదు! యేలోకముననున్న! నా లక్ష్మణునిదెచ్చి । యర్పించనా! మీకు॥ నా॥ మోక్షగుండేశ్వర । మిత్రి క్కదదీవించి! యీక్షణమేపంపు! మేతెంగుఁదదయుక॥ నా॥

వ. అని మ్రొక్కి దీవనలంది సుగ్రీవాంగద జాంబవంత విభీషణుల వీడ్కొని పర్వతాగ్రంబునెక్కి లంకాపురగోపురంబుఁ గూలునట్లుఁ గుప్పించి యెగసి వియన్మార్గంబున నదీనద పర్వతారణ్య పురంబులఁ బరికింపుచుఁ బోవుచుండె నిక్కడ.

క. వేగుల వారలు తెలుపఁగ। వేగంబున రావణుండు ♦ వినివిహ్వలుడై । భోగీంద్రుపగిదిఁ గసలుచు । నేగెను నా కాలనేమి ♦ యింటికిఁ జేరన్.

వ. ఇల్లు వచ్చిన రావణుని సత్కరించి కాలనేమి యిట్లనుచున్నాఁడు.

సం-తో. ఏమిపనికినా, యింటికివచ్చితి-రీనిశీథార్ద్రనుసనఁగా । వేమగు దెలిపెద। వినుమొకపని కాల, నేమి చేయవలయునుగా॥ రామ॥

క. అదియేమియన్న నుడివెద । మదమునమచ్ఛత్రిమూర్ఛన్ ♦ మునిగినయనుజున్। వదలక బ్రతికించుకొనన్। మదిలోపల రాముఁడెంచి ♦ మారుతసుతునిన్.

క. సంజీవకరణికొఱకై । రంజిల్లఁగబంపె నతఁడు ♦ రయమున నేగెన్ । భంజింపుము నీవడ్డము । గంజనియటుచేయఁ జేత ♦ గాకుండిన-చోన్.

వ. మాయోపాయంబుచేత వానిప్రయాణంబు సాగకుండనయినఁజేయము. ద్రోణగిరిసమీపంబున నొక్కసరోవరమున్నది దానియందొక్కమకరి యున్నది.

తో. అదిదేవాదుల,నైనమ్రింగును । నగచరుఁడనఁగా నెంత। వదలకయుచటికి- పాయుజూఁడేగెడుపగిది జేయుమిదివింత॥ రా॥

వ. వేగంబునఁబొమ్మన విని కాలనేమి యిట్లనుచున్నాఁడు.

కాల-కీర్తన, శంకరాభరణము-ఆదితాళము, మేలైన.

మామామృగాకృతి। మారీచుఁడేగియు। మాయమైపోడే మును। గోయనియామ్పుచు-కుంభకర్ణాదులు-కూలరె చూడుమును । లంకసీత

మ్మఁడేలఁగఁగట్టనీతమ్మ, నింకరాముఁడకునిఁడి। శంకరుఁగూర్చిని। శ్చయముగ దపమును। సలుపుమేలుగలిగెడి॥ అదికానిపోఁబోయి । యలమోషుగుం డేశు,నెదిరించి వడిపోఁగము। కదనరంగమునందు। గడితేరివై కుంఠ,పదము నకునుజేరుము॥ మా॥

వ. అంతేకాని యీమాయలవల్లఁ బ్రయోజనంబేమనఁ గోపించి చంద్రహాసంబునఁ గాలనేమితలదెగ వ్రేయఁబోయిన నది యెఱింగి.

తో. ఇదుగోపోయెద। నేటికిగనలెదు। యింటికిజనుమనిపలికి। తుదయిదియనుకొని। తూణాంబునవా। తూలసుతునిపై నలిగి॥ రా॥

వ. కపటమునివేషంబున ననేకశిష్యగణ సహితుండయి మనోవేగంబున ద్రోణాద్రిసమీపమందున్న దివ్యవృక్షసహితంబయిన యొక్కవనంబుఁజేరి యాశ్రమంబేర్పఱచుకొని.

సా-తో. మునివరెఁగన్నులు, మూయుచుగొణుగుచు। బూనలు ద్రిప్పుచునుండ। ననిలజుఁడంబర,మునఁ బోవుచునది। గని యాశ్చర్యము నిండ॥ రా॥

స్రగ్విణి. ముందుద్రోణాద్రికిఁ బోవునాడీవనం। బిందులేదింత లోనెట్లులన్ వచ్చెనో! తందరన్ వచ్చెనో దారినేదప్పితిన్। విందుగా నీమునిన్ వేఁడియోచించెదన్.

వ. అనియెంచి తత్క్షణంబునఁ గ్రిందికిఁజనుదెంచి మునికినమస్కరించి యిట్లనుచున్నాఁడు.

తో. రామునికార్యా,ర్థంబుగజనియెద। నే మారుతతనయుఁడను। ఓమునివరనా-కొదవెనుదాహము। ఉదకముజూపుముతగను॥ రా॥

వ. అనిన నక్కపటమునీంద్రుం డిట్లనియె.

కా- కం. మానసమునఁగలఫలములు। దీవరమునఁనారగించిత్రష్ణ యడంగన్। దాప్రుకమండలజలములు। యీవత్కార్యములు దీసునటు తర్వాతన్.

వ. మాకాగతానాగతవర్తమానములు దెలియును జెప్పెదవినుము.

కా-కీర్తన, అటతాళము, శంకరాభరణం.

వేమఱుదెలిపెద। వినవోయీ। నామాటలుమదిననమ్మోయీ। రామునిభామిని। రావణాసురుడు। నేమరించుకొని । యేగెనులంకకు॥ వేమ॥
అదిగనిరాముం- డలిగికపులతో। గదలివచ్చిలం-కకుజేరి । మదమునరావణు,పుత్రమిత్రులను। జదిపినాదశ । వదనుడుగనలుచు॥ వేమ॥ మోక్షపురవరాధ్య్యాత్ముని యనుజుని। దీకమీరాడఁక- త్తినివైచి। యాశక్తిగూల్చిన నిపుడుద్రోణగిరి। కఔషధులకై వచ్చితివిటు॥ వేమ॥

క. రాముఁడు లోకహితార్థము। గామహిజన్మించినాఁడు ♦ గాన సహాయుం । బేమునుజేయుటధర్మం । బోమారుతి! మంత్రితతుల ♦ నుపదేశింతుఁ.

వ. అమ్మహామంత్రి పునశ్చరణవల్ల సమస్తకార్య సిద్ధులొదవునిదియునుం గాక.

తొ. సంజీవనిముఖ- సకలౌషధములు - రంజిలుమావనమందు । నాంజనేయనే-నక్కడువాడిచిన - నవితెచ్చిచ్చెద నిందు॥ రామ॥

వ. నామంత్రిసామర్థ్యంబునఁ గనుతెప్ప వేయునంతలో లంకకుఁజేరఁగలవు. లక్ష్మణునకు బాధలేకుండునన విన హనుమంతుండిట్లనియె.

హ-తొ. అక్కడ లక్ష్మణు,డట్టుల నుండగ। నిక్కడఁ దడయుట తగదు। అక్కర లేదుఫ,లాదులు జలములు-జిక్కినఁ ద్రావియుజనదు॥ రా॥

వ. మీాకమండలోదకమ్ములు నాదాహంబుదీరునన్ని లేవు. కొలనుగాని, నదిగాని, యుండినఁ దెలుపుఁడు నేఁబోయెద నీరుద్రావెదనవిన.

కా. తొ. ఉన్నదిచేరువ - నొకకొలనచటికి- జన్నయుదకములు గలవు। పన్నగశిష్యులఁ, బంపెదవెంబడి-బదుముచూపెదరు నెళవు॥ రా॥

వ. ఇట్లు పలికి తనశిష్యులఁగూడ నిచ్చిపంపిన హనుమంతుండుఁజని కలహంస, కారండవ, చక్రవాక, బక, పక్షితతులచేనొప్పి కమల కల్హారసహితంబయి మీన, మకర, కర్కట, జలూక, గ్రాహ, సమన్వితంబయి యలరారు సరోవరంబు మనోహరంబుగాఁ గనుపట్టిన యందు

దిగి యుదరంబులు గోల్లుచుండ నప్పుడు.

తో. ఒక్కమకరితన- యుగ్రపుకోరల-నొడిసి కాలునమలగను।
జక్కగ రౌద్రర,సంబొలుగగ గద,ద్రొక్క పంప్లురాలగను॥ రా॥

వ. ఇట్లు పండ్లూడఁ దన్నిన బోక యుది మహాకోపంబున నాం జనేయుని మ్రింగఁదలపడిన నదిగని తత్క్షణంబున.

హ-కీర్తన, ఏకతాళము, కాలికి.

అక్కటా! శ్రీరామకార్య-మట్లునిల్చెను। జిక్కినాడ దీనిచేత-జి క్కబట్టెను॥ అ॥ తా్రిణలేదుచత్తునేమొ। దైవమా! యిక। ద్రోణశైల మెట్లుఁదెత్తు- ద్రోవలేదిక॥ న॥ నన్నునమ్మి మోహకుండ-నాధుడంపెను। బన్నుగా నరిగించుమధ్య, పట్టిజంపెను॥ నక్కటా॥

వ. ఈవిధంబున డోలాయమానమానసుండయి యున్న హను మంతుని మకరిమ్రింగినఁ దిన్నఁగాఁ గడుపులోఁ బ్రవేశించి.

తో. దానికడుపు, బద్దలుజేసియు బవ,మానసుతుండు వెలిరాగ।
మానుగనడిసుర। మానినియగుచు వి,మాన మెక్కి పయికేగ॥ రా॥

వ. ఆంజనేయుఁ డాశ్చర్యకలితచిత్తుండయి వియత్తలంబుననున్న యమ్మత్తకాశినిగనుంగొని ఇంతకుమున్ద నంతబలాక్రాంత నరింబవై పంతంబుననన్ను వంతనొందించితివి. ఇంతలో దేవకాంతవయి యంత రిక్షమున కెగిరితివి. మంతనంబునకు వింతగానున్న దదియంతయు సంత సంబునఁ దెలుపవేయింతీ! గమననిర్జితదంతీ! చేమంతివిరులబంతి! యని ననాపె యిట్లనియె.

ఖా, కీర్తన, కేదార, రూపకతా, సాటి.

నేనుధాన్య-మాలియను। దానసుగం,ధర్వ శశివదనను॥ నే॥ పూ ర్విష్ఠాణుచెంత,నేబాడగ। మానించి-తానిచ్చె వి-మానంబును॥ నే॥ ఈవి మాన-మెక్కి నిత్య,మీకొలంకు।జేరి,క్రీడింపుచు।భోవనొక్క-నాడు, శాం డిల్యుడు। భావమునర్ఘ-గేవలముగఁ-దావలచెను॥ నేను॥ కోరిమోహ,గుం డవిభుని-కొడుకుకేళి,గూడు మనివేడిన। నేరజస్వలనైతి- మూడహములు,

దీరినను। గూరిమితో। గూడుమంటి॥ నేను॥

ఉ. అంతట గంధమాదనము ♦ నందు మునీంద్రుని యింటనుం డఁగా। నెంతయురావణుండు విజ ♦ యేచ్ఛను గ్రుమ్మరుచుంటినాటిసా। యంతనమందుఁ దావిడిసి ♦ యచ్చటబాడెను నన్నుఁజేరియా। కంతుని కేళిగూడుమనఁ ♦ గా ననుముట్టగరాదు పొమ్మనన్.

తో. వినకనన్నుబై,కొని రమియించిన-దనుజుం డతికాయుండు। ఘనముగగలిగిన-గైకొనిలంకకు-జనియెను దశకంఠుండు॥ రామ॥

గీ. స్నానమాడి నంతఁ ♦ జని మానితో నను। గూడుమన్న న తఁడు ♦ గోపగించి। శాపమాటనిచ్చి ♦ నాయింటిలోనుండి। యన్య గూడినావు ♦ హరిణనయన.

తో. కావుననినునే, గలయుమకరివై-నీవీకొలకున నిలుము। పోవు నుజెడినిను-బొందినయాతడు, పుత్రమిత్రులతో నిజము॥ రా॥

వ. అనిశాపంబిచ్చిన నేనుభయపడి శాండిల్యమహాముని పాదం బులకు నమస్కరించి శాపంబుబాపుమని బహుభంగులఁ బ్రార్థించి నఁ గరుణించి.

తో. కొంతకాలమున,కును రామునిపని,కొఱకువచ్చుబవనజుడు। చింతలకాతని,చే శాపనుచను-జెలి యనె యమ్మునివరుడు॥ రా॥

వ. గంగాయాత్రకుఁ జనియెద నేనీకొలనిలో మకరినయి పడి యుండి బహుకాలంబయ్యె.

ధా, కీర్తన, జంఝూటి, అటతాళము, పాలించరా.

నేటికిశాపముదీరె। బోటినై యిచ్చగ బోవజేకూరే।మాటికి జిక్కులుబారె। బాటిగదాపసి। పలికినవిధమున। నీటికివచ్చిన- నిను బట్టగానే। నేనినను॥ నేటికి॥ మోక్షగుండేశునిపనికి। దీక్షతోనీవను- దెంచితిప్పటికి। రక్షించితివి నన్నింతటికి। వృక్షచరాధీశ। వెడలుము శ్రోత్రిసాద్రి। కక్షయముగదారి। యదియేనువినుము। దాఁటియది॥ నేటికి॥

తో. నినుగొలనుకుబొ-మ్మనిపంచినయా। తనిముఁనియనినమ్మకు

ము। నినుజంప దశా।ననుఁడంపగ వచ్చిన దానవుడనికనుము॥ రా॥

వ. ఆకపటాత్ముని శీఘ్రింబున రూపుమాపి ద్రోణాద్రికిఁబొమ్మని తెలుపుఁజూపిదీవించి హనుమంతునివీడ్కొ_నిధాన్యమాలి దివికిఁజనియె. నంత హనుమంతుండు గాలనేమియున్నకడకు శీఘ్రింబునవచ్చి నిలిచిన.

క. కపటాత్ముఁడతఁడుఁ గదలక। జపతత్పరుఁ డయినవాని ♦ చందముదోఁప౯। దపమొనరింపుచుబిమ్మట। నిపుణతతోఁ గనులు దెఱచి ♦ నేర్పునఁబలికె౯.

గీ. ఎంతసేపాయెనీవేగి♦ యింతతడవ। యేమిచేయుచునుంటివి ♦ యెఱుఁగఁబలుకు। మఱియునుపదేశమొనరింతు ♦ మంత్రములను। దెలియగురుపూజకేమైనఁ ♦ గలదె తెమ్ము.

వ. అనిన నాంజనేయుండు గుపితుండయి.

తో. ఇదిగో! దక్షిణ,యిచ్చెద గురువర। ముదమునఁ గైకొమ్మనుచు। వదలకబిడికిట। వక్షముబొడిచిన। వాడుబక్కియైతరుచు॥ రా॥ కవిసిననెరకలు, గడువడివిరచిన। గంఠీరవమైతగుల। దివిరిబిట్టుతలఁ- దెగబొడిచిననా। దేహముమూరియు మురల॥ రా॥

వ. సుగ్రీవుని రూపుధరించి ఎదుట నిలిచి యిట్లనుచున్నాఁడు.

కీర్తన, పూరికళ్యాణి, చాపుతాళము.

ఇదియేమినీవు। యిచటనేయున్నావు। మది తెలియలేవు। మరలియు నచటికిరావు॥యిది॥ మనలక్ష్మణుడు। మరిలేచినాడు। మన కేలజూడు,మందులు గిందులు నేమ ॥యి॥ మందులకొండ। మహిమోతుగుండ। మందిరుడుండ। నెందుకునో వాయుజుండ ॥యిది॥

వ. అని పలికిన సుగ్రీవుండని భ్రమచెందియుఁ దిరిగి కాఁడని నిశ్చయించి కోపంబునిగుడ విజృంభించి.

తో. బెట్టిదముగుతన। పిడికిటిపోటుల। భీమంబగుపదహతుల। మట్టివాని క్షణ,మాత్రింబున నిల, మ్రిందజేసెబహుగతుల ॥రా॥

వ. ఇట్లు గాలనేమినిజంపి హనుమంతుండు వేగంబున ద్రోణగి

రి కరిగి యెంతపరిశీలించినను మందులు దొరకకున్న నిట్లనియె.

తేవారము. రామునౌషధములకునురయమునను బంపగాను నోమహీధరమ! నేను బ్రేమతోవచ్చినాను। ఆమహామహునిపనికి నర పుజేయంగవలదు। క్షేమముగ మందులిచ్చి శీఘ్రమున బంపుమెచ్చి.

వ. అనిన నతండు వినకున్నఁ గోపించి.

తో. రాలకుగడుదయ-రమ్మనవచ్చునె! చాలునునీతో జెలిమి! కే లబట్టియవ-లీలగనే బెరి, కె దనుజుండునాబలిమి ॥ రా॥

వ. అని కోపాగ్నులడర విజృంభించి వాలమంకించి దశయోజన విస్తీర్ణంబును బంచదశ యోజనోన్నతంబును నగు పర్వతంబుఁ బెల్ల గించి నెత్తినఁ బెట్టుకొనిపోవ నుద్యుక్తుఁడయిన నాయోషధులఁ గాపాడుచుండు చిత్రసేనాది గంధర్వులు బదుమూడు కోట్లమంది బయిఁబడి పోనీయక యెదిరిన.

తో. వాలపాశమున। వారినిజుట్టియు। వడిగాగిరగిరద్రిప్పి। వాలాయంబుగ। వార్ధినిబడగా। వైచెగొందరినిగుప్పి ॥ రా ॥ కొందరినేలను । గూలిచెనలుకను। గొందరినొవ్వగజేసె। గొందరు బిమ్మటఁ - గోపమునిగిగిరి। గొనిపొమ్మనగాసై చె॥

వ. గంధర్వుల నిటులజయించి ధరాధరంబు నెత్తినఁ బెట్టుకొని మారుతి వచ్చుచుండె నిక్కడ నందిగ్రామంబున నామధ్య రాత్రియందు భరతునకుఁ గొన్ని దుస్వప్నంబులుఁ దోఁచిన లేచి మోము వెలవెలఁ బాఱదిక్కులు సూచుచు.

భర-కీర్తన-హిం-తోడి-రూపకము.

ఆహా దైవమా! మ, మ్మాదరింపుమా! దేహముగంపించెనేమో! దిగులుదోచెను॥ఆహా॥ రామలక్ష్మణు, లడవి, లో మెలంగుచు। నేమియైరో! భూమిజాత। యెటులనున్నదో!॥ఆహా॥ దుర్నిమిత్తము, లిపుడు-దోచెసత్యము। కర్ణగోచరంబుఁ। జేయు, ఘనులుగలుగరు ॥ఆహా॥ దీక్షతో వారిగమువుదీరవచ్చెను। మోకుగుండవిభునిజూచు-పుణ్యమెప్పుడో!॥ఆహా

వ. అని విలపించుచు వేదపారగులగు బ్రాహ్మణులఁబిలిపించి యప్పుడు హోమాదిశాంతులు చేయించి దానంబులిచ్చియుండె నింతలో.

సం-తో. హనుమంతుడుబా । లార్కునివిధమున। నంబరవీధిని వచ్చి। ఘనముగ నంది - గ్రామమ్మునభర - తునిగని తలచెను హెచ్చి ॥రామ॥

క. రామునివలె నున్నాఁడితఁ
డేమీ! యీనిశిని సటకు ♦ నేటికివచ్చెన్
సౌమిత్రిమృతుండైనను
భూమిజనటు విడిచిరాగఁ ♦ బోలునుసుమ్మా!

వ. అయినఁ జెంతకుబోయి యడుగుదునా! వలదా! యని కొంతవడుకుఁ జింతించి యంతలోఁ దనమనంబున నిట్లనితలంచె.

హ-కీర్తన, అటతాళము, హిం, కాపీ.

రణనిపుణుండగు। రాముడువచ్చెనె। యనుబుద్ధిచేతని-ట్లనుకొంటి నక్కటా! ॥రణ॥ ప్రాణములతో। రావణువిడచి॥ క్షోణిజసుమిత్రా । సూనులవిడిచి ॥రణ॥ మోక్షగుండాధిపు। మొక్కటులుండఁగ। వీక్షించిభ్రమసితి। వెఱ్ఱితనంబున ॥రణ॥

వ. తనబుద్ధిభ్రమణమునకుఁ దానే నిందించుకొనుచు వియన్మార్గంబున వచ్చుచుండఁగని భరతుండు.

భ-తో. నేదుస్వప్నము-నేడుగాంచితిమది। ఖేదమొందుచుండగను। ఈదుర్గ్రహమిటు-లేటికివచ్చెను! యిపుడేచంపఁగఁదగును ॥రా॥

వ. అని కోపాటోపంబున శరచాపంబులం గేలధరించి లేచిన భరతునకు నాకాశవాణియిట్లనియె.

తో. మీకార్యంబులు। మేకొనిచేసెడి, మీ బంధుండితఁడగును। బ్రీకటముగగో - పముఁజేయకుడన । భరతుఁడూరకుండగను ॥రా॥

వ. హనుమంతుండంత శీఘ్రయానంబున దక్షిణాంభోనిధి సమీ

పంబునకువచ్చిన రావణుపనుపున మాల్యవంతుండుఁ బదివేలకోట్ల రాక్షసులతోఁగూడ దారికడ్డగించి.

మా-కీర్తన, అటతాళము, రామక్రి.

పోకుర పోకుర। పోకుర వానర। నీకును నాయువు, నేటితో దీరెను॥ బో॥ ఒక్కరిద్దఱిని, నొంచుటగాదిది। పెక్కురచేతను। జిక్కితివెక్కడ ॥ బో ॥ మమ్మెదురంగను। మాటలేమాకథ। రమ్మటు వేసియు। రమ్ముదురమ్మున ॥పో॥ మోక్షగుండేశుని। మోహపుతమ్ముని। కీర్తితిఁబ్రాణము। లివ్వగ బోదువా! ॥పోకుర॥

వ. అని భుజబలదర్పితులయి తాఁకి పరశుతోమర ప్రాసపరిఘాదుల చేనడంచిన నరకుఁగొనక శైలంబునెత్తిన దృఢముగానిలువుకొని.

సం, తో॥ కొందరవేసెను। గొందరద్రోసెను। గొందఱజూరచు రజూచేఁ। గొందఱిదోకను। గ్రుమ్మిచంపెమఱి, కొందరకాళ్ళనుదాచెన్॥

వ. ఇట్లు తినవారందఱు మడిసిన మాల్యవంతుండుగినిసి యాంజనేయునికిట్లనియె.

క. వననిధిమధ్యంబునను। వినతాత్మజు నెక్కివచ్చి ♦ విష్ణుడుపూర్వం। బునదాకియోడిపోయెను। నినునోర్చుటయెంత నాకు ♦ నిలువరయునిలోఁ ॥

వ. అని ఖడ్గంబుచేత మోదిన హనుమంతుని వక్షంబుదాఁకి విఱిఁగెనప్పుడు హనుమంతుండునొచ్చి.

వా, తో. మదిమివాఁడవని। వదలినమానక। గదిసితి మంచిది యనుచు। జిదుమకపాలము, చేజుట్టియుహాసి, జిరజిరదిప్పుచు నగుచు ॥ రా ॥

వ. వనధిలోఁ బడవయిచిన వాఁడుతిన్నగా నామార్గంబునఁ బాతాళపవరంబుఁ జొచ్చె. హతశేషులు దిక్కులకుం బాఱిరి. అంతహనుమంతుండు సముద్రంబుఁదాఁటి వచ్చుచున్న నాదీప్తిగని ప్రభాతంబుగావచ్చునని శంకించి యిక్కడరాముండు విలపింపఁదొడంగె.

రా-కీర్తన, ముఖారి, ఆదితాళము.

తో॥ మునీడవనుచు నుంటినయో! నేడదియెల్లదీరెను॥ సోదర! ॥తో॥ చూడగమారుతి॥ రాదుముందులుఁగాని॥ వేసివెలుఁగుపొడిచెను॥ సోదర ॥తో॥ భామసుమిత్రికు॥ భరతశత్రుఘ్నుల । కేమని తెలుపువాడను ॥సో॥ అడవులలోపల॥ నాలిగోల్పోయితి॥ యనినినుగోలుపోతిని సోదర ॥తో॥ ఈక్షితి మోహముగుం, డేశ్వరనీసేవ॥ యెపుడుఁ జేసెదనంటివు॥ సోదర ॥

తో. దేనికినే జం, తింపను మఱియొక । దానికిజంతించెదను । మానుగననుమగ-వానిగనెంచెను॥ దానవానుజుండెదను ॥ రా ॥ తనవారలనం, దరినివిడిచినా॥ దాపుజేరినాడితను । నినులంకకు రా, జును జేసెదనని॥ నేనంటిని గదయపుడు ॥రా॥

వ. సూర్యోదయుంబుగా వచ్చె నింక నాతమ్ముఁడు జీవింపఁడు పిమ్మట నాప్రాణంబులు నిలువవు. నేనితనితోఁగూడ దివంబునకరగిన విభీషణునకిచ్చిన యభయహస్తంబు దీర్చువారెవ్వరుదైవమా!

తో. శరణార్థులర-క్షణజేసెదనను - బిరుదుపోయెనేడకట! తరణివంశజులు-ధర్మచరితులను॥ దారిఁదొలఁగనేడిచట॥ రా॥

వ. కాఁబట్టి యీవిభీషణుని యయోధ్యకుఁ గొనిపోయి భరతునకు నొప్పగించి యొక్కయుపకారంబుఁ గట్టుకొమ్ముసుగ్రీవా !

రా- తో. నేజెప్పితినని-నేడుభరతునికి-నీవుచెప్పియీతనికి । నోజనుగట్టుము, యోధ్యనుదొలఁగకు॥ వేజనుమిపుడీపనికి ॥రామ॥

వ. పిమ్మట నీవును గపిసైన్యంబులతోఁగలిసి కిష్కింధఁజేరుము. నాతమ్మునితోడ నేనుఁబోయెదననుజా! సుగ్రీవా! అని దైన్యంబున వగచుచుండిన రామునిగని వగపుఁజెందుచు సుగ్రీవుండిట్లనియె.

సుగ్రీ-కీర్తన, ఆదితాళము, శుద్ధకాంభోజి.

వగనవలదు దేవరా! యజ్ఞునిరీతి ॥వగవ॥ తెగువ కార్యములందు । దిగులు జెందగనగు నా ॥వగవ॥ ధైర్యమేసర్వసాధ । నుని తెలుపుదుమందు॥

రార్యులు వైరిసూదన। సూర్యుడువొడుచు వేళ। చూడఁగా లేదీవేళ॥ వగవ వలదు దేవరా॥ మూడవజాము మీఱెఁగ। శ్రీమోక్షగుండ। ప్రోడ! మా గతి నేరఁగ। వేడుకతోడవచ్చు। విమలౌషధములుఁదెచ్చు ॥వగవ॥

వ. అనిధయిర్యవచనంబు లాడుచున్నను దేరక రాముండు గ్రమ్మ అిట్లనుచున్నాఁడు.

తేవార ము-తమ్ముఁడా! తండ్రినన్నుదండకాటవులకంపెఁ! బొమ్మ నెనె నిన్నుగూడఁబూర్వముగుభక్తితోడఁ, గ్రిమ్మరించినను వినకఁ గది లివచ్చితివిగాక। నెమ్మదిని మోసపోతి నిన్ను నేఁగోలుపోతి.

తో. నన్నన్నా! యని-యెన్నఁడుబిలుతువు। యెన్నఁడువిందును జె వుల। జెన్నగనాఁడును-సేవలు జేయుగ। నెన్నఁడుగందునుగనుల ॥రా॥

రా-కీర్తన, యదుకులకాంభోజి, అటతాళము.

సీతనుజెరగొన్న। యాతుధానులఁద్రించిఁద్రించి। వేతునందువు తమ్ముఁడా!॥ నిద్రి కన్నెఱుఁగని-నీకు నేటికి దీర్ఘ। నిద్రివచ్చెనె! తమ్ముఁడా!॥ సీత॥ కారడవులనన్నుఁ। గాపాడివిడిచితి। ఘోరరాజిలోఁదమ్ముఁడా!। మోక్షగుండేశ్వర ముందుగరిపుల॥ దు, న్మదునందువుర తమ్ముఁడా! ॥సీత॥

వ. అని యిట్లు మితిమీరిన దుఃఖంబుచే వగచిరాముండుమూర్ఛిల్లిన వనచరులు చేర్చిరి. ఇంతలో హనుమంతుండు సమీపించివచ్చిన నదిసూర్యోదయంబని కపులుఁ దహాతహాపడిరి. రాముండుఁ గన్నులుఁ దెఱచిచూచి.

తో. పగవారికిదో। ద్పడుచునుసూర్యుడు। తెగువతోడబొడిచెడి ని। తగవాయితనికి। దనకులజులపయి। దయజూపకవచ్చెడిని ॥రామ॥

వ. అయిన నేమి యీచండకిరణుని మత్కోదండ చండకాం డంబుల పాలుసేసెదఁజూడుండని కనుకొలుకులఁ గోపాగ్ని కణంబులు పొటపొట రాల.

తో: బ్రిహ్మాండంబులు। బ్రిద్దలుఁజేసెదు। ప్రళయకాలశివుభం గి। బ్రిహ్మాదిదిశాపతులు వెరచి కం, పంబునొంద నుప్పొంగి ॥రామ॥

కోదండముచే-కొనిరాదా! స్త్రము। గురుతుగసంధింపగను। నా దాశరథికి-
ననియెబుఖపతి। యతివినయము దోపగను ॥రా॥

జాం-కీర్తన, నవరోజు, ఆదితాళము.

పగగొననేటికిరాఘవా! నీకు॥ బగగొన॥ జగములునీశర, సంధా
నమునకు। గడగడవడకెనుగాదె! ॥పగ॥ హనుమంతుఁడుద్రో-ణాద్రినిదె
చ్చెడు। గనుగొనుమర్క్యుఁడుగాడు ॥పగ॥ ఓషధధీధితు। లొప్పఁగనెమ్మది,
బూషుండనుకోనేల ॥బగ॥ మోహకుండనర! యీక్షణమునగపి। ముఖ్యు
లనెదుగఁగబంపు ॥పగ॥

వ. అనియిట్లు చెప్పుచున్నంతలో.

క. హనుమంతుఁడు ద్రోణాద్రిని। గొనివచ్చియుఁగ్రింద నిలిపి ♦
కూరిమితోడఁ । జననాథుఁజేరి మ్రొక్కియు । వినయంబుననిట్లు పలి
కె ♦ విశదముఁగాఁగఁ.

తో. పోవునప్పుడును-పోయినచ్చుతరి-త్రోవను బహువిఘ్నము
లు। దానచ్చుటచేఁ-దడసితిదప్పను। గావవలయు దండములు ॥రా॥

వ. అనిపలికిన రాముండానందంబున నిట్లనియె.

క. నీకేటితప్పులున్నవి । కాకుత్స్థకులాభివృద్ధి ♦ గలిగనునీచే ।
నీకార్యమెవరొనర్తురు । నాకూర్మిభటుండవీవు ♦ నగచరవర్యా!.

వ. అనికొనియాడెనంత సుగ్రీవుండు సుషేణునిఁజూచి.

గీ. ఇంకజాగేల గపులునీ ♦ విన్నగంటు। నెక్కిదివ్యౌషధంబుల ♦
నెత్తితెచ్చి । లక్ష్మణునకిచ్చి ప్రాణము ♦ లడ్డయఁజేయు । మనఁగనా
తండు గపులతో ♦ నద్రినెక్కి.

వ. కలయందిరుగుచు నాయాస్థల విశేషంబు లగచరులకుఁ దె
లుపుచు శీఘ్రింబున సుషేణుండు.

తో. స్వచ్ఛౌషధములు-దెచ్చిలక్ష్మణున - కిచ్చఁ బ్రయోగింపగ
ను। తచ్ఛక్తిసన- త్తరనిబాణములు-దనరవచ్చెగ్రమ్మరను॥ రామ॥ అప్పు
డువానరు,లందఱుగొలువఁగ- నాలక్ష్మణుడటులేచి । తప్పకరామునిడగ్గరి

మొ్రక్కిన-దమ్ముని గరములుసాచి॥ రా॥

వ. లేవనెత్తి యాలింగనముజేసికొని కన్నుల నానందభాష్పం బులుదొరంగ చెంతనున్న హనుమంతునకు శ్రీరాముండిట్లనియె.

రా-కీర్తన, ఆదితాళము, గౌతమ.

పావనమూర్తివి। పరమబంధుడవు। పావనితమ్ముని। బ్రతికించి। కేవలసుకృతము। గ్రత్తియుగంటివి। నేవెలసితిధర-నిన్నుంచి॥పావన॥ పాయ కనీవలెఁ, బరహితకార్యము। జేయగనెరులకు। జేతగాదు, నీయుపకృతికి ని। నేబ్రత్యుపకృతి। జేయుటకేదియు। క్షితిలేదు॥పావ॥ మోక్షపురవరా, ధ్యక్షునికరుణా। వీక్షణగలుగఁగ। వెలసెదవు। ఈక్షితినాపద। లేమియులేక ను, రక్షితముగనిఁక। బ్రబలెదవు॥ పావ॥

వ. అనిశ్లాఘించి యిప్పర్వతంబెప్పటిచోటఁ బెట్టిరమ్మని చెప్పి న మంచిదని పవమాననందనుండు దక్షిణంబునఁ గొనిపోవుచుండ జల ధిమధ్యంబున రాక్షసులుచూచిపోయి చెప్పిన రావణుండుఁగోపించి శం కుకర్ణ, హస్తికర్ణ, స్థూలజంఘు, మహానాద, మహావక్త్ర, చతుర్వ క్త్రముఖ రాక్షసులఁబంపిన వారు గదా ముసలాది సాధనంబులతో నడ్డగించి యిట్లనుచున్నారు.

తొ. ఎక్కడికేగెద। వీకొండనుగొని। యీవార్ధినిబడవేసియు। చి క్కితివటువలెఁ- జేయుకున్ననిను। జీల్తుముయుద్ధముచేయు॥ రా॥

వ. అని బహువిధంబుల ముసరి నొప్పించినఁ గోపించి యుగ్రా కారుండయి.

తొ. కాలదన్నుచును। గేలగుద్దుచును। వాలముతోవిసరుచు ను। వేలసఙ్ఖ్యలగు। వీరరాక్షసుల। నేలగూల్చి నవ్వుచును ॥రా॥

వ. కొండఁగొనిపోయి యెప్పటితావున నుంచివచ్చి రామునకు నమస్కరించి తానుఁబోయివచ్చినసంగతియు రెండుసారులునుదనకుఁ గ లిగినయాటంకములు విన్నవించె. పిమ్మట వానరులందఱు లంకలోనికి జగ సింహనాదంబులు చేసిరి, అంతసూర్యోదయంబాయెనప్పుడు రా

ముందులక్ష్మణున కిట్లనియె.

తో. అనుజనాదుభా, గ్యంబున జేసియు। నిను గ్రమ్మఱఁ బడసితి ని। యనిలజుఁడనుఘున। మైననావచే। నాపదబ్ధిగడచితిని ॥రామ॥

వ. అనిన లక్ష్మణుండిట్లనియె.

౮-కీర్తన, హిం, భైరవి, అటతాళము, నమిలాం.

ఇకనేటికిజాల। మినకులతిలక! మీ। రేలయోచింపగను ॥రామ రామ! ॥ఇ॥ సకలముదెలిసిన, స్వామిమీకుదెల్పు, టకునుశక్తుడనాదునే॥ రామ ॥యి॥ మనుజావతార మెత్తి నకారణంబును। మదియోచింపదగును। మునుదండకవన - మునులకిడిన యభయ । మునుదీర్పగాఁదగును ॥ రామరా ॥యి॥ ఆక్షీరాబ్ధికడ। నమరులతోఁడమీ । రన్నమాటదీర్పుము। మోక్షగుండేశ్వర । దీక్షతోనీవేళ । రాక్షసేశ్వరు దుంపుము ॥ రామరా ॥ యి ॥

## మైరావణుని కథ.

వ. ఇట్లుపలికిన లక్ష్మణుని వాక్యంబులకు రాముఁడు సమ్మతించి యుండె నిక్కడ రావణుండుఁ జారులవల్ల నావార్తవిని నివ్వెఱగంది సభాసదుల కిట్లనియె.

క. మూలబలంబునశించె న । మూలంబుగనిందజిత్తు ♦ మొదలగు శూరుల్। కూలిరిచిక్కితినొక్కఁడ। నేలీలజయింప నగును ♦ నినకులునింకన్.

వ. మయదత్తంబగు మదీయయమోఘశక్తి చేత లక్ష్మణుని పడవైచిన సంజీవని సహాయముచేఁ బునర్జీవితుని జేసికొనిరి. నాచేయుయత్నంబులు విఫలంబులగుచున్నవి మంత్రులారా!

తో. ఐరావణుడన-మైరావణుడన-నారసాతలమునందు । ధీరులుగలరుమ, దీయబంధువులు-వారుశూరులై యుంద్రు ॥రా॥

వ. వారుసహాయపడిన రామలక్ష్మణుల నిరాటంకముగా జయింపవచ్చునని యోచించి తగినదూతనేర్పరచి.

రావ-కీర్తన- ఏకతాళము, కమాసు, గంగా.

మైరావణా! మహాత్మ-మెఱవినదగు ॥మైరావణా॥ ధారుణీని రాముడనగను। దగునొకమనుజుడు ॥మైరావణా॥ పూని, వాని । చెలిదెచ్చి తిని ॥మైరా॥ కపుల గలిసి సా, గరము దాటి లం, కకు జేరిరి ॥మైరా॥ నా కన్నసుతుల। నాకన్న హితుల। జేకొన్నభృతుల । భోకార్చియుతుల। భీకర గతులను। బీరములాడుచు। బెదరక నిలిచిరి ॥ మైరా ॥ బెదిరించి-దువులముంచి, విదళించి। యెదిరించుధీరు, లిందెవరులేరు ॥మై॥ వైరుల గెలువగ-వశముగాదు ముద। మారమోక్షపుర। శ్రీరామునితో। బోరాడగనో। శూరాగ్రేసర! చేరితోడుపడి। పోరిగెల్చికడ, తేరజేయు॥ మైరా॥

వ. అని సమాచారంబువ్రాసి యాపత్రిక నిచ్చి దూత నొకనిఁ బాతాళలంకకనిపిన వాఁడుజని మైరావణ మైరావణులఁ గని నమస్కరించి యుత్తరంబిచ్చిన జదువుకొని యాశ్చర్యంబునొంది ప్రత్యుత్తరం బిట్లని యిచ్చిరి.

క. శ్రీరామలక్ష్మణులనే । నీరాత్రికిఁబట్టి తెచ్చి • యిచ్చెద బలిదుర్గాద్వారంబుగఁ గామాక్షికి। నోరావణ! వెరపుమాని • యుండుము కడిమిన్ ॥

వ. అని వ్రాత్రవ్రాసి పంపినఁ జూచుకొని యానందించి రావణుండుండె. నిక్కడ విభీషణాదులు.

క. సౌమిత్రిమూర్ఛవోయిన । రాముని చేఁగొట్టబడియు • రావణుడరిగెన్ । ఏమో! క్రమ్మరరాలే। దేమాయకుఁ జొచ్చినాఁడో • యెఱుకపడదహో!॥

అయిన నేటిరాత్రి జాగరూకులమై యుండఁదగుననియెంచి.

తో. హనుమంతుఁడు దో, కనునాకాశము - దనుకగోటగాగట్టి। యినకులవర్యుల-వనచరులనునం, దునిచి తానుగ ... ॥రా॥

వ. జాగరూకుడై యుండ విభీషణుండును జుట్టు తిరుగుచుండె నిక్కడ నపరరాత్రియందు మైరావణుఁడు దనపాతువుపయిఁ గూర్చుం

డియోచింపుచుండిన వానిభార్యయగు మాతంగియిట్లనుచున్నది.

మా, కీర్తన, ఏకతా, సతతం.

ఏమియోచనా। యేదైనదోచెనా ॥యేమి॥ స్వామి! సురతముల, సరసముఖములను-దనిసితిరిది ॥యేమి॥ అద్దమరాత్రిరి। నిద్దురమానిమీ। రెద్దియో! యోచించు-చీరీతినున్నార ॥దేమి॥ ప్రాణపదంబైన। భార్యకు నెఱిగింప రానిరహస్యమె। ద్దేనియున్నదేయి ॥దేమి॥ మోక్షగుండేశుని। సాక్షిగసంకల్ప, మీక్షణమున దెల్పు। డేమిసందేహామి ॥దే॥

వ. అని వేడినభార్యకు మైరావణుండిట్లనియె.

సీ. రామచంద్రుండను ♦ రాజుభార్యయుందాను దండకావన ములం దుండెనొకట। దశకంఠుడేగియా ♦ తని మోసపుచ్చితదీయ భా ర్యనువేగఁ ♦ దెచ్చిలంకఁ। జేర్చెనంతటఁగపి ♦ సేనతోఁదమ్మునితో గూడిరాముండు ♦ సాగరమును। గట్టిలంకకుఁజొచ్చి ♦ ముట్టితదామాత్య పుత్రమిత్రులనెల్లఁ ♦ బొలియజేయ। నొక్కరుఁడుచిక్కి రావణుం ♦ డు క్కుదక్కి। నాకుఁబుత్తెంచెగానమా ♦ నకనుబోయి। రామలక్ష్మణులను బట్టి ♦ రమణిదెచ్చి। కాళికాంబకు బలియిత్తుఁ ♦ గంజనయన॥

వ. అనినవిని యమ్మానినీరత్నం బిట్లనియె.

మా-కీర్తన, కమాస్, ఆదితాళము, లేరై రే.

ఇది-యేమిపైనము। హ్యాద। యేశామానుము ॥ఇది॥ రాముండన నా-రాయణుండు ద। ద్భామసీతయగు। ధరబుట్టెనుయిది ॥యిదియే॥ ద నుజకలాంతకుఁ, డని తెలియకయా, తని బైకొనిచెడె, దశకంధరుఁడిది॥ యే॥ తననుగట్టుటకు దాృదుదాని చే-కొనివచ్చినరీ, తినినున్నదియిది॥యే॥ ముందుగజనినీవు। మోక్షగుండరఘు। నందనుమనఫురి। కిందేనేలని॥దేమి॥

వ. అని ప్రార్థించిన నతండువినక భార్యకిట్లనియె.

క. బోటీ! శ్రీరాములకే। నాటికినే వెఱవ నతఁడు ♦ నన్నెదిరించే। పాటిబలిష్ఠుఁడుగాఁడిం। కేటికివగచెదవు పోయి ♦ యిపుడేతెత్తుఁ.

వ. అనివీరసాహసంబున లేచి తత్క్షణమే లంకాపురమున యు

ద్ధభూమికిఁ జేరి విభీషణవేషంబున హనుమంతునితోఁ గొంత ముచ్చటిం
చి పిమ్మట హనుమద్వాల నిర్మితమగుకోటలోఁజొచ్చి.

తో. అచ్చటనొకశిల, యందు బండి యు, న్నట్టి రామలక్ష్మ
ణులు। మ్రిచ్చిలిశిలతో। మోసుకనిద్రిల-మునిగియున్నయాఘనుల ॥రా॥

వ. కైకొనిబయటవచ్చి యాంజనేయునితో మాటలాడి యతి
వేగంబున రసాతలంబుననున్న తనమందిరంబున నాశిల యుంచెఁ దద
నంతరంబ.

తో. మరల విభీషణుఁ, డరుదెంచియు హను । మంత హెచ్చరిక
యనఁగ। ద్వారలోఁగ్రమ్మర, వచ్చితివేమన। దనుజుడులోజనికనగ ॥రా॥

వ. రామలక్ష్మణులు లేకున్న సుగ్రీవాదికపులను లేపి యందఱు
గలిసి వెలుపటికి వచ్చి హనుమంతునిజూచి హాహాకారంబులు చేయుచు.

హాస-కీర్తన, వసంతరాగము, అటతాళము, మేరలేదు.

లేరు లేరకటా! మనసాములు॥ లేరు॥ లేరెవ్వరును బవ,ళించిన-చో
టికి। రారనుకొంటిమి। రామలక్ష్మణులు॥ లేరు॥ మనముజాగ్రతగానె। కని
పెట్టియుండిన। మనలమాయనుంచి । కొనిపోయెనెవ్వఁడో॥ లేరు ॥ అడు
గులజాడవెం, బడి నీపుజనిన నిప్పుడేదాపులోగను । పడగలరుదొరలు ॥
లేరు॥ రాక్షసేశ్వరుడు। రావణాసురుడు। మోక్షగుండేశుని । మోసపుచ్చి
యుండు॥ లేరు॥

వ. కాఁబట్టి త్వరగానీవుచని జయముఁబొంది మనప్రభువుల గొ
ని రావలసినదియని హెచ్చరికచేసి సుగ్రీవ జాంబవంతాదులు వేరేప
తత్క్షణంబున.

క. హనుమంతుండుత్సాహముఁ । దనరఁగనాజాడ వెంట ♦ దక్షి
ణదిశకుఁ । జనఁగ నికుంభిళకుచు జ । య్యనజేరెన నచట నిలిచి ♦ యా
రయుచుండెన్.

అంతనక్కడ గర్భవతిగానుండిన కపోతపక్షి పురుషపక్షి కిట్లనియె.

తో. నరమాంసముదిన। నాకుఁగోర్కె-యు,న్నది దెచ్చిమ్మనియ

డుగ। బురుషపక్షి య్యప్పుడు ముదమునదన। పొలతికిట్లని యెవడిగ॥ రా॥

ఉ. రావణుతోడఁ బోరు రఘు ♦ రాముని లక్ష్మణు మోసపుచ్చి। మైరావణుఁడారసాతలము ♦ రంజిలఁజేరెను రేపుగాళికా । దేవి సమీప మందుఁ దెగ ♦ దీసి సమర్పణఁజేయు వారలఁ । గావున నేను బోయి యది ♦ గైకొనివచ్చి యొసంగెద న్నుమా!

వ. అని చెప్పెడు కపోతవాక్యంబులు విని యలగారి హనుమంతుండు రసాతలమునకుఁ బోవ యత్నించి యుదకమందు దిగఁ బోయిన దత్పాలకుండగు మకరధ్వజుం డిట్లనియె.

మకరధ్వజ హనుమత్సంవాదము-కీర్తన, అట రా॥ మేలయినవలె.

మ-ఏమిరపోయెద। వెక్కడమీయునికి। యెవ్వరివాఁడవురా.

హ-రామునిదూతను। లంకాపురము నుంచి। రానా యె నిటుబోదురా!

మ-ఇక్కడనీకిపు-డెవ్వారితోఁబని- యెఱిగింపు నాతోడను.

హ-రక్కసుఁడైన మైరావణుఁగనుగొన-జక్కఁగ బోయెదను.

మ-వానితో నేపని-వచ్చెను వెనుకొన। వానర తెలుపుమన.

హ-మానుగ శ్రీరాము-మాయ చేఁగొనిపోయె। గాన వెదుకబోదును.

మ-శ్రీమోక్షగుండేశు-సేవించు మాతండ్రి-క్షేమ మెవాయుజుండు.

హ-ఆమారుతికి భార్య-యవనిలో లేదునీ-వాత్మజుఁ డెట్లయితివి.

వ. అనిన మకరధ్వజుం డిట్లనుచున్నాఁడు.

ద్విపద. శ్రీరామునాజ్ఞ చే-సీతనుజూడ। మారుతిలంకకు-మఱిపోయినపుడు। వాలంబు దానవ-వరులు గాల్పంగఁ। దాలంకఁ గాలిచి-తద్దయు దోఁకఁ। జల్లార్చుకొని వార్ధి,జలమందు నోటి। కళ్లెవిసర్జించె-గడుఁ గేకరించి। యాకళ్లె భక్షించె-నందొక్క మకరి। యేకటిదానికి-యేర్పడెఁ బిడప। మకరధ్వజుండన-మహినిబుట్టితిని। మకరంబు నాతల్లి-మారుతి తండ్రి। మైరావణునియాజ్ఞ-మకరాలయమున। నారసాతలమున-కన్యులఁబోవ। నీకనాగుచుమందు-నిచ్చట నేను। నాకన్నతండ్రియు-న్నాఁడె క్షేమముగ॥

వ. అనిన సంతోషించి యాంజనేయుం డిట్లనియె.

హ-కీర్తన, కళ్యాణి, ఆదితాళము, మనవిని.

నేనేనుకోరా! హనుమంతుండ॥ నే నే॥ మానసమునను। మాన మునలదిక। మకరధ్వజకనరా! హనుమంతుడ॥ నే॥ ఘనముగ నీ, చెప్పిన చొప్పననే। మునుపొనరించితిరా ! హనుమంతుడ॥ నే॥ నాకొమరుడవై నను మంచిది యిక। నాకు దెరువుజూపు॥ హనుమం॥ నే॥ మోటకుగుండరాముని గొనిపోయిన। రాకుసుగనబోదు॥ హనుమం॥ నే॥

వ. అని తెలిపిన సంతసించి మకరధ్వజుండు దండ్రికి నమస్కరించి యిట్లనుచున్నాఁడు.

మక-తో. జనకా! మైరా-వణుడు రామలక్ష్మణులనిటులఁగొనిపో యెఁ। దననగరంబున, కును జేర్చెనువా, రిని దేవికిబలిదీయఁ॥ రామ॥

వ. సంకల్పించియున్నాఁడు. కాఁబట్టి యీమార్గంబున సూక్ష్మ రూపంబుగ నీవేగి కామాక్షి దేవాలయంబునఁ జేరుము. సర్వంబును దెలియఁగలదని తెరువుసూపిన.

క. త్రిసరేణుమాత్రుఁడై సం । తసమున నాదారిదూరి ♦ త్వర గాఁజనివా। యుసుతుండు చేరెఁ గామా । క్షీసదన మసదృశ వివేక ♦ శే ముషిదనరఁ.

వ. ఇట్లు కామాక్ష్యంబ దేవాలయంబునఁ గవాటంబు బిగించి ధైర్యంబుననుండె నిక్కడ మైరావణుండు దనసతితో నిట్లనుచున్నాఁడు.

మై-తో. భామా! వద్దని-పలికితివిగదా! రామలక్ష్మణుల జూడు। కామాక్షికిబలి-గావించెదనా-సామర్థ్యముగను నేడు॥ రామ॥

వ. అనిపలికి చూపించిన నామెకటకటపడుచు నడ్డముగావచ్చి యిట్లనుచున్నది.

మాతం-కీర్తన, ఆదితాళము, ఆహేబాల.

ఈయన్యాయ। మిటులజేయ-నేలదోచెను। పాయకనే-జేయుమన వి-ద్రోయనేలను॥ యీయ॥ నీకేమైన। యుపకారము। నేడుచేసిరే। చేకొని శిక్షింపనీచే-జిక్కు-వారలే॥ ఈయన్యా॥ రావణునిరీ తిగను-నీవు జెడక।

లావుగ వీరిని దెచ్చి, నావునడిగ॥ యీాయు॥ జీవితేశ మోాకుగుండ । దేవుడ నుచు। భావమున నెంచివినుము। బ్రతుకునిలుచు॥ యీాయు॥

వ. అని విశేషంబుగాఁ బ్రార్థించిన నామాటనిరాకరించి యనేకరాక్షసదళంబు లాయుధధరులయి కొలువ నైరాజ్ఞనితోఁగూడి శ్రీరామలక్ష్మణులున్న శిలయెత్తుకొని కామాక్షిగుడిసన్నిధికివచ్చి నిలిచి.

మై-తో రామలక్ష్మణుల-రయమున బలియిడఁ-గామాక్షీ జగదంబ! మేము దెచ్చితిమి-మేకొని వీరిని-మ్రింగిపొమ్మ ప్రమ్మంబ ! ॥ రా॥

వ. అనువాక్యంబులు విని హనుమంతుండు దేవి పలికినట్లుగా సూక్ష్మస్వరంబున నిట్లనియె.

క. దేవాలయంబులోపల। రావలదావల నెయుండి ♦ రాక్షసులారా! యావత్పూజనివేదన। నేనగవాక్షము లగుండఁ♦జేయుఁడు భక్తిన్

దేవి-కీర్తన, ఏకతాళము, రామచంద్రిమ.

రాక్షసేంద్రులారా మనో,రంజనంబుజేయుడికను । అక్షయబలములు। నన్న మాంసములు। దీక్షవేయుడు గ। వాక్షంబులనే॥రా॥ రామలక్ష్మణులన్। సుమములు । నేమయిననుబూ-జించి ధనుర్ధరు-లై మెరయంగనయంబున దెండిటు॥ రాక్షసేం॥ ద్వార,మున్ సగమున్ - దెఱచియు। వారు మోాక్షపుర। వరులయిననునను। జేరదోసితు,ప్పిని చేయుగదగు॥ రా॥

వ. అనంతరము కవాటంబుమూసికొని మీారు దూరంబున నుండుఁడు. సమస్తకార్యంబులుఁ జక్కపడునని చెప్పిన వారు హర్షించి తత్క్షణంబున.

క. పూజాద్రివ్యంబులు గొని । పూజించి చతుర్విధాన్న ♦ ములరాసులుగా । నోజగవాక్షంబులనే । యాజగధీశ్వరికి నిడిరి ♦ యసురవరేణ్యుల్.

సఁ-తో అతులితపంచా, మృతకలశంబులు- నర్పించిరి యొకకోటి। యతిశయమధుర ఫ,లాంచిత పేటిక-లర్పించిరి యొకకోటి॥ రా॥

వ. ఇట్లువెచిన నవియన్నియు నాంజనేయుండు క్షణమాత్రిం

బున భక్షించి తిరిగి యిట్లనుచున్నాఁడు.

దేవి-తో. ఏమియొసంగుట! ఈగ్రాసంబులు । యేమిత్రృప్తియగు మాకు! మామదియలరఁగ! మరిసలుపుటధర్మముగాదే! యికమాకు॥రా॥

వ. అనిన నాశ్చర్యకలితచిత్తులై దానవపుంగవులు భటులంగాంచి.

మై-కీర్తన, పూరికళ్యాణి, ఆదితా, అమితోగ్ర.

భటులార! లెండి! బరువడిపొండి! ధృటిలోనదిండి । దేవికి వండి తెండి॥ భటు॥ ఆలశ్యమైన! నలుగుబిరాన! నేలీలనైన । నీవలెగానదాన॥ భ॥ మనయిండ్లయందు! గనియున్నదందు! కొనిరండియెందు । దినిత్రృప్తి జెందుముందు॥ భటు॥ పొలపుగ మోక్ష । పుర రామలక్ష్మణులదిని రాక్ష । సులబోగ్రము నేకదీక్ష॥ భటు॥

వ. అనివేగంబునఁ దఱిమిన రాక్షసదూతలు మహాట్టహాసంబునఁ జని రాజగృహామువొదలు ప్రతిగేహంబును బరిశోధించి.

సం-తో. మిగిలినవస్తువు! లెగబెట్టినయవి । మెతుకును బోసికుండ! దగిలివెతికి స,త్వరగాఁ గొనిచని! దనుజేశుకు గనుచుండ॥ రా॥

వ. కొండలపొడవు రాసులుగాఁ బోసిన భోజన పదార్థంబులు పోరణగండ్లగుండ దేవికి రాక్షసు లర్పించుచుండిన నవి హనుమంతుం డు మెక్కు చుండె. ఇక్కడ నగరంబునఁ బ్రతిగృహంబునఁ గలకల ధ్వనులు మెండయ్యె నందుఁ గొందఱు నారీరత్నంబులు గుమిగూడి యి ట్లనుకొనుచున్నారు.

కీర్తన- హిం, కాపి, అటతాళము, ఏలాగుతా.

ఇయ్యాగడంబున! కెంతనివగతునె! నేడి॥ య్యాగ॥ నెయ్యిపాల్ పెరుగులు! బొయ్యమని బాధించిరి॥ నేడియ్యాగ॥ తట్టెడతిరసములు! జుట్టాలవిందుకుజేసి! యుట్టిమీఁదదాచివీరి! పొట్టనబెట్టితిగదె॥ నేడియ్యాగ॥ అమ్మినమతర్జకుజేసి! చిమ్మిలియుండలునాను । జిమ్మమీఁదవేసికొన,నమ్మ కొనిపోయినారు॥ నేడియ్యాగ॥ తెల్లవారియేడిచేటి,పిల్ల కొక్క మెతుకైన! గల్లగాను లేకుండగ! గొల్లబెట్టిరిల్లుసొచ్చి॥ నేడి॥ పెండ్లికనిజేసినట్టి, పిం

ష్లుమాపిల్లవాండ్రి। కండ్లబడకుండ దాచి। పీండ్లకర్పించితిని॥ నేడి॥ ఈపగి దిమనగీములు। దోపించిన పాపాత్ముల! రూపుమాప మోక్షగుండ। శ్రీ పతినివేడరమ్మ॥ నేడియ్యాగ॥

వ. అని వేవిధంబులుగా నాక్రందింపుచుండి రంతట హనుమం తుండు రాక్షస దత్తపదార్థంబులం గడుపార భుజించి సంతుష్టుడై దను జుల కిట్లనియె.

తో. భక్ష్యభోజ్యములు గుక్షినిండనేభక్షించితి నికజాలు । భ క్షించెద రామ,లక్ష్మణులను లో, పలికి పంపుడిదిమేలు॥ రామ॥

వ. అనిన వారానందించి.

తో. శరచాపంబులు, ధరియించినరామ-చంద్రలక్ష్మణుల లేపి । సరగున సుమభూ,షణభూషితులుగ-సలిపిలోపలికిం బంపి॥ రా॥

వ. తలుపుబిగించిరంత హనుమంతుండు నమస్కరించి రామ లక్ష్మణు లాలింగనంబుం జేసికొని రామీందం దలుపుదీసికొని వెలుప టికివచ్చి గుణధ్వనిచేసిన.

తో. దిక్కులయందుం బ్రతిధ్వనులొదవెను । దిగ్దంతులుభయుప డెను। జుక్కలురాలెను। శూరులగుండెలు। బక్కనబగిలెను దగను॥ రా॥

వ. ఆధ్వనికడలి సేనలు భయభ్రాంతులయి యురుకుచుండ మై రావణుండు వారలకిట్లనియె.

ద్వై -కీర్తన, కన్నడరాగము, రూపకము, సరియేమె.

పో,నేలసేనలార। భయపడి॥ పో॥ అవ,లీలవారిముట్టి । రణ,కేళి యందుంబోకార్పక॥ పో॥ మను,జాశనులకుమానకు। మను,జేశులనంగ నెం త,రణ,కౌశలంబుజూపి। యిల,నాశమొంద పో,రాడంగ॥ పో॥ పరిపంథు లను వధించిమన, బంధువైనయట్టి। దశ,కంధరునకుబ్రీతి, శుభ-మొంద నేడుగా,వింపక॥ పో॥ ధర,మోక్షగుండవిభుల । పడి,శిక్షజేయలేని । మన, రాక్షసత్వమేల । యొక,దీక్షగాను పో,రాడక॥ పో॥

వ. అనివారిని బురికొల్పిన నమ్మనుప్వరిపయి నిశిత సాయకమ్ము

లుగ్రిమ్మిన సమ్మేటిబలులు వెనుదీయక.

క. ఒక్కొక్కశరము ధనువున
నెక్కిడి తెగనిండ దిగిచి ♦ యెడఁదగులగదా
గ్రిక్కన సందఱవైచుచు
నొక్కుమ్మడి ద్రుంచె నసుర ♦ యోధులనెల్లన్.

సం-వ. ఇట్లు క్షణంబులో వారిని మడియించినఁ గని మైరావ ణుండు మేఘవల్లభ, ఘుటక, సంచర్మిక, భైరవముఖ, సింహముఖ, సర్ప ముఖ-కర్కోటకముఖ - పంచముఖాది ప్రధానుల యుద్ధంబునకుఁ బురి కొలుపవారు సింహనాథ భుజాస్ఫాలనంబులుఁజేయుచు ననేకకోట్ల రాక్ష సదళంబులతో వచ్చితాకి.

రాక్ష-కీర్తన, రూపకతాళము, జనకనామ.

[illegible]రెవాతోడ। కలిసిపోరాడ! గలరెవాపోరిడ। గడువడిజూడ। బలువైన బాణములు। బరపమీఁవారిణములు। నిలువర। గలవే। కాయం బులలోనిలబోశూరులె ॥భళిరె॥ ఆ రావణాసురు। డవనిజనే తెచ్చె। మై రావణుండన్న। మరిమిమ్మే తెచ్చె। యీరసాతలము। జేరితిరిటనుండి, మీ శేరీత్రి మహికిన్। జేరన్ నేరుతురింకన్ ॥ భళిరె ॥ మాయలునేర్చిన। మాతోడడీకొన । మీయబ్బతరమౌన, మిమ్ముమేదుతుమా! కోయని శ్రీమోక్షగుండేశరణములో। గూయన్ జేయన్ డాయన్ దోయన్, బాయన్, దంచే ॥భళిరే॥

వ. అని ప్రసంగంబులు జేయుచున్న దానవమంత్రులను గద్దిం చి మరున్నందనుండుద్దండంబుగా నడ్డంబువచ్చి.

తో. శ్రీరామునితో। బోరుశక్తిగల, వారా! దానవులారా! మారాడక మీ, నోరులు మూసుక । మరలిరందునునుఁజేర ॥రా॥ ఒక్క తొక్కకే! యుక్కుదక్కి మీ, రుర్విని నూగజేసి । యిక్కడనే దే, విక్కిఁబలియిచ్చెద। ముక్కుమూరుద్గోసి ॥రా॥

వ. అనిన వారిలోవారు నవ్వుకొనుచు నిట్లనుచున్నారు.

రాక్ష-కీర్తన, పీలురాగము, ఆదితాళము, తల్లి.

అబ్బా! యబ్బా! కోతిగదబ్బా ! పైబడు ! నబ్బా తిను నిపుడబ్బా॥ బెబ్బులివలెబడ! బొబ్బలిడుచునా! దెబ్బజూడుమని ! గొబ్బున వచ్చెగ ॥దబ్బా॥ కోతికోడమా, రొక్కని పోరాడగ! యాతుధానులకు! జేతనౌనెపదు ॥డబ్బా॥ తీయనిఫలములు! గాయలుబెట్టుదు! పాయకనిదిమన్నపైకిరాదుపదు ॥డ॥ ఘనమోక్షపురీ, శునిదన వెనుకను! నునుచుకమన పై కురువడివచ్చెగ ॥దబ్బా॥

వ. అని యుపహాస్యంబులాడుచు లెక్కపెట్టక ముసలముద్గరప్రాసత్రిశూల భిండివాలాది సాధనంబులు పైఁబరపి సింహనాదంబుఁజేసిన యాంజనేయుండుప్పొంగి.

ఉ. కొందఱిఁ బాదఘట్టనలఁ ♦ గొందఱు వాలముఁ జుట్టివేయుటన్ గొందఱు ముష్టిఘాతముల ♦ గొందఱు జానులతోడఁ గ్రుమ్ముటన్ ♦ గొందఱు దంతఘాతమునఁ ♦ గోయనికూయుచు నుండవారలన్। మ్రిందగజేసె నొక్కక్షణ ♦ మాత్రమునన్ హనుమంతుఁ డయ్యెడన్.

వ. ఇట్లు హనుమంతునిచేతం దనమంత్రులు సేనాధిపతులు సైన్యంబులు నశించిననలిగి మైరావణుం డై రావణసహితంబుగా సహస్రతురంగవిరాజిత దివ్యకనకస్యందనంబెక్కి వచ్చి నారసారించి మారుతి కిట్లనియె.

మై-కీర్తన, కమాసు, ఏకతాళము. రామాభ్యా.

రారా! మాపయిన్ బోరగ! నేరాశూరుండవయిన ॥రారా॥ వారువీరనక! బేరుపెంపులేక! మారుతిమారితి వారీతిగారింపగను ॥రారా॥ తోకద్రిప్పుచును! గేకవెట్టుచును! డీకొనిచేకొని ! పైకొని పోకార్చితివి॥ రా॥ మోక్షగుండధవు! ముఖ్యభక్తుఁడవు! లక్షింతు-శిక్షింతు-భక్షింతు-వృక్షాటవర ॥రా॥

వ. అనిదట్టించి పలికి కొన్నిబాణంబులు వయిచిననవి రాముండు నడుమనే త్రుంచి యిట్లనియె.

క. నన్నుఁగదా ! కొనితెచ్చితి । విన్నగచరుపయినిశరము ♦ లే యఁగనేలా! నన్నేవేయుము మార్గాని। వన్నెయుబాసియును డెలి య ♦ వచ్చునుబిదపన్.

వ. అనిన వాఁడు రోషించి నిశితాస్త్రంబులు గణనాతీతంబు గాఁ బ్రయోగించిన రాముండవి తనశరంబులచే వారించి యొక్క య మోఘాస్త్రంబు వింటసంధించి విడిచిన.

సం-తో. అదిచనియాతని। రథరథ్యంబులు। నవనిబడగవడిద్రోసె। వదలక మరియొక। కదుపునువేయఁగ । వారిప్రాణములుదీసె ॥రా॥

వ. ఇట్లు ప్రాణంబులువాసి యవనింబడి యంతలోఁ బునర్జీవి తులై కదిసి.

మై-కీర్తన, ఆదితాళము, ఏదిరా.

యిమ్మగెలుతురా। సమ, రమ్ముజేతుగా॥ అమ్ములమునుంచి । రొ మ్మగలించి । మిమ్ములదుంచి । మిగులదుమెంచి ॥మమ్ము॥ తుక్కుదై త్యుల, బడ-గుర్క్కినట్టుల। ముక్కువయుంచి - మమ్మెదిరించి। తొక్క దలంచి। నిక్కెరుమించి ॥మమ్ము॥ మోక్షపురవర। యిక। శిక్షయగుధర। రాక్షసులందు లక్ష్యములేదు । యీక్షణమందు । నిలగూల్తుమిందు॥ మమ్మగె ॥

వ. అని చెప్పచుఁగొన్ని మార్గణంబులు వైచిన రాముండు లక్ష్మణునితో.

క. మృతులై వీరుపునర్జీ। వితులయి మనమీఁదికిప్పుడు ♦ వెడలె దరిదియు । వ్యుతయిపుగ నున్నది సోదర । బ్రతుకునకేదయిన మందుఁ ♦ బ డయఁగఁబోలున్.

వ. ఐనఁజూతమని యెంచి.

తో. పటుసాయకమొ, క్కటియొక్కడిత,♦ప్పకలక్షించియువ్రేయ। గుటిలరాక్షసులు-గూలిలేచియె-ప్పటివలెఁదమపయిడాయ ॥రామ॥

వ. రాముండాశ్చర్యపడి మఁగుడయుద్ధంబునఁ దగులువడియె

నిట్లునూరుపర్యాయములు వినుకలేక రాముండుహతంబు చేసినను పు నర్జీవితులై వచ్చుచుండిరిదిగని యూరహాస్యంబెఱుంగఁగోరి.

సం-తో. హనుమంతుడు బత్తనములోనికిజని - యందొకనాతిని గాంచి। వినయంబుననా। మెనులాలింపుచు। దనముచ్చట వివరించి ॥రా॥

వ. ఇట్లని యడుగుచున్నాఁడు.

హ-కీర్తన-ఆదితాళము, కమాన్, ఇటురమ్మా.

ప, మమ్మాకుటిలకుంతలీ। అమ్మైరావణ। మైరావణుల। నమ్ము లగూల్చిన-నపుడు లేతురే ॥మమ్మా॥ మృతులగువారు। బ్రతుకుటగలదే క్షితిలోమాక, ద్భుతమగునిదియే ॥ మమ్మా ॥ వారుమగుడలే - నక యుంచుటకుఁ। గారణమేటిగినఁ। జేరితెలుపుచూ॥ మోక్షుగుండరా, ముం దు నీకోరిక। యీక్షణమున నెర-వేర్పఁగలడదే ॥మ॥

వ. అనియడిగిన నామెసంతసించి యిట్లనుచున్నది.

సీ. నాగకన్యనునేను ♦ నన్నుభోగించుటకై రావణుడు దెచ్చె నయ్యయిటకు। మైరావణుండును ♦ మారుకేళిని గూడవచ్చు నిత్యంబు ను ♦ వలపుగదుర। వానితోఁగూడిన ♦ వీనికిఁగోపంబు వీనితోఁగూడి న ♦ వానికలుక। యిద్దరితోఁగూడి ♦ యేనుఁగృశించితి జవసత్వములు బోయెఁ ♦ జాలుపీంపు। జచ్చిపోవుట నాకును ♦ సమ్మతంబె। యైనశ్రీ రామచంద్రుఁడ ♦ వార్నిశంబు। నన్నుఁగూడుటకొప్పిన ♦ నగచరేంద్ర। వాండ్రిమర్మంబుజెప్ప ద ♦ వశ్యముగను

వ. అనిన నాంజనేయుండు.

హ_తో. రాముని కను, భారంబుచేతఁదగ-నీమంచము విఱుఁగ కను। భామినియుండిన-భ్రాంతిదీరనినుఁ-బరగఁగూడు దప్పకను ॥రా॥

వ. ఇందుకు సందియంబు లేకఁ దెలుపుమని యడిగిన నామె యిట్లనియె.

నాగ-కీర్తన, శహనరాగము, ఏకతాళము, ఎంతనినే.

నుమంతా। గుణవంతా। వినుపించెదనంత। మైరా। వణుమర్మం

బును ॥హ॥ మునుపుదుమ్మెదల। ముంటఁగ్రిచ్చుచుం। డినఁగని బాలకు లనువీరుడిపిరి ॥హను॥ భ్రమరంబుల్। తమచావుల్। బాపినవారిఁగని సమరంబునమీఁకు। జావోదవిసతతి ॥భ్రమ॥ అమృతంబును గా, యము లఁదెచ్చియిడి। మిముఁబ్రతికింతుము। మేమనియనెనవి ॥హనుమంతా॥ అదిమొదలుగా। మొదబోదలగా। యీమట్పదగములు। వదలకయున్నవి-వారిపడకలను। అదిమె। వెదకియువాటిని జదుపమోక్షపుర। సదనుని చేతను। జచ్చెదరసురులు॥ హనుమంతా॥

వ. అని తెలిపిన నానందించి హనుమంతుండుఁ దక్షిణంబునవారి నిద్రాస్థానంబునకుఁజని పానుపునాశ్రయించియున్న తుమ్మెదలనుగాంచి.

గీ కోటికోటానుసంఖ్యలఁ ♦ గూడియున్న। తుమ్మెదలనెల్లఁ బట్టివా ♦ తూలసుతుఁడు। పరగ మర్దింపుచుండిన ♦ భయమునొంది। యొక్క తుమ్మెదయతనికి ♦ మ్రొక్కిపలికె.

భ్రమర-కీర్తన, ఆదితాళము, కనలి.

శరణు-తరుచర-వరనన్ను బ్రోవవే। బరువడిమమ్ముఁజంపు। పనిమాని కరుణింపు। వెరచినీ। మరుగున, జొరితిని, గావవే ॥శరణు॥ అమృతము వల్ల। నసురులనెల్ల। నమృతులజేయుచుంటి। మదియిఁకఁ జేయమంటి। నమరారులడగేరు। సమకూరు। శుభము ॥శర॥ వరమోక్షగుండ। వాను మునిశిత। శరములువేయువారుఁ। జత్తురు లేవఁబోరు। మరిమీరు। ధరఁజేరు, దురుధీరు, లగుచు ॥ శరణు॥

వ. అని బహువిధంబులఁ బ్రార్థించిన నాభ్రమరంబును గటాక్షదృష్టి నవలోకించి చంపుటుడిగి హనుమంతుండిట్లనియె.

హ-తొ. భ్రమరమ! నీయు, ష్టముచొప్పుననిను-సమయింపక నే విడుతుఁ। గ్రమమునబ్రత్యుప - కారమొకటిచే, యుము లేకున్నను నడతు ॥రా॥

వ. అదియేదియనిన వినుము.

క. ఐరావణభోగాంగన। యారూఢిని బవ్వళించు నా ♦ మంచం

బుగ । జేరియది తొలిచివేయుము । వారణభక్షిత కపిద్ధ ♦ ఫలభంగిననగ.

వ. ఆతుమ్మేత తమజాతిజంతువుల ననంతంబుగాఁ దోడితెచ్చి నాగకన్యయొక్క మంచమును క్షణమాత్రములోఁ దొలిచి తొట్టిజేసి యధేచ్ఛంజనియెఁ. బిమ్మటహనుమంతుండు రామునిఁ జేరె నంతలో.

సం-తో. రాముఁడుదివ్యశ, రంబొక్కటి బీ, రంబున నెక్కిడివై వ। నామైరావణ। మైరావణులటు। హతులయి పడి రాదిగువ ॥రా॥

వ. అంత జయజయ శబ్దంబుల దేవతలు రాముని యగ్గించిరి. పిదప హనుమంతునితో స్వామియిట్లనియె.

రా. తో. ఈరాజ్యంబును-నెవరికిఁగట్టుద। మెవరయినను నున్నారా! మారుతి! యెరిగిన-మతిరప్పింపుము-వారికిత్తునింపారా ॥రా॥

వ. అనిన హనుమంతుండు.

హను-కీర్తన, హంసధ్వని, ఆదితాళము, సదావే.

భ, జేరామచంద్రప్రభో। యవ, ధారు జగద్విభో॥భజే॥ శూరుఁడుభక్తుఁడొకఁడు । సుగుణుడుఁ గలఁడిచ్చట ॥భజే॥ వాఁడెవఁడన్నను నాఁడులంకకే। నోడకజనినపుడు । నొకచిత్రముజరిగెను ॥భజే॥ లంకఁగాల్చివా। లముఁజల్లార్పఁగ। లవణాబ్ధికిఁజేరి। యందుమిళితిఁగల్లెను ॥ భ ॥ మకరముమ్రింగిన। మరిగర్భంబై । మకరధ్వజుఁడనఁగ । నొకఁడుద్భవమయ్యెను ॥భ॥ మైరావణుకడఁ। జేరియున్నవాఁ । డీరాజ్యంబిమ్ము । వరమోక్షపురీశ్వర ॥భ॥

వ. అని వేడిన నందుకు సమ్మతించి మకరధ్వజుని బిలిపించి యతనికి రసాతల లంకారాజ్యంబిచ్చి యభిషేకంబుఁజేయించె। తర్వాత హనుమంతుండను చున్నాఁడు.

హ-తో. ఐరావణుభో-గాంగనగలదా। యమతో నేనపుడనుగ। వారికిఁగలయా। వన్మర్మంబులు। వాకుచ్చెనుదావడిగా ॥రా॥ చెప్పెనునప్పుడు। మెప్పుగఁదనతోఁ। జెలఁగి నీవుకూడఁగను। దప్పకఁగోరినఁ, దగ

నందుకునే! నొప్పితినొకపరతుగను ॥రా॥

వ. అదియేది! యనిన దేవరవారి భారంబుచే నామె మంచంబు విఱుఁగక భరించిన యెడలఁగూడ నట్లొప్పించినాఁడఁగాన, నావడంబడిక ప్రకారమామె యింటికిఁబోయి రావలె మహాప్రభో! అని ప్రార్థించిన నమ్మతించి.

గీ. నాగకన్య గృహంబున ♦ కేఁగియామె । చేత సత్కృతుఁడై తన ♦ చేతఁదత్క । రంబుస్పృశియించి యెక్కె మం ♦ చంబుపైకి । నది పటుక్కనవిఱిగె మో ♦ యంగలేక.

వ. అప్పుడురాముండు మద్భారంబునకు నీమంచం బోర్వలేద య్యె. నింకనిన్నుఁ గలయుటలేదు. అని లేచిన రామునకు నమస్కరించి చేతులుజోడించి యిట్లనియె.

నాగ-కీర్తన, జోగి, ఏకతాళము, పరమేశ్వరా.

రఘు,నాయకా! శుభదాయకా! నినుఁబాయలేనిఁక । నన్నుఁ, ద్రోయధర్మమా! నేఁ,జేయుకర్మమా! వ్య,ధాయెగామదీప్సితంబ-హాతలం బుమా॥ రఘు॥ రతి,కేళిగోరితీ । బ్రతిమాలిదీరితి । మొ,రాలకింపవై తివీ వి,రాళిద్రోచితి॥ రఘు॥ నీ,చాత్ములంటిన। పా,పాత్మగావున । మ,హాత్మ యంటఁగూడదంచు-నాత్మద్రోచెనా! ॥రఘు॥ పరి,శుద్ధచేయుమా। న,నుద్ధ రింపుమా! జ,గద్ధితా! శ్రీమోహనగుండకాంతఁ! బ్రోవుమా! ॥ రఘు॥

వ. అనియనేకవిధంబులఁ బ్రార్థించినఁ గరుణాకలితహృదయుం డయి రాముండు.

సీ. భామిని నేనేక ♦ పత్నీవ్రతుండను గావున నిన్ను నేఁ ♦ గల యనిపుడు। దేహంబువాసి వృ ♦ ద్ధిని విప్రకన్యవై కన్యాకుమారినా ♦ గనుదపంబుఁ। జేయుచంబుధిదరిఁ♦ జిరకాలముందుముకృష్ణావతార మం♦ గీకరింతు । ద్వాపరాంతంబున ♦ ద్వారకయుందేను జాంబవంతునకుద ♦ యంబునొంది। జాంబవతి యనమూఁడవ ♦ జన్మమందుఁ। బరఁగుదువునీ వుఁ గైకొందుఁ ♦ బత్నిగాగ। నపుడు బహుకాలమఖిల సౌ ♦ ఖ్యంబు

లందఁ గలవు పొమ్మనిపలికి రా ♦ ఘవుఁడు లేచి.

వ. ఆమెచేవీడ్కొని లంకా పరిమాణోన్ముఖుండయి హనుమం తునకిట్లనియె.

తో. రావణాసురుని- లంకాపురమా - ర్గముదుర్గమమటుగాన । నేవిధమునమన-మేఁగగవలెనో! యెఱుఁగుదువే నీవనిన॥ రా॥

వ. ఆంజనేయుం డిట్లనియె.

హ-కీర్తన, కేదారరాగము, రూపకతాళము, ఆకుదమూ.

శ్రీరఘుకులతిలకా! మీరిపుడుఁ దీరనిసు- ప్తినియుండినఁ। గార ణమునఁ-బారెఱుఁగరు॥ శ్రీరఘు॥ నేనెఱుఁగుదుఁగానఁ । యానమునై । యానిమిషము- లోనచటికి । మానుగమిముఁ-జూఁటిసేర్తును ॥ శ్రీరఘు॥ మ నమకరధ్వజునిఁ। ఘనముగమీ। యనుజుఁడెక్కనునీవెక్కనిపుడే।కొ నిపోదుము॥ శ్రీ॥ ఈక్షణముననరిగి। రాక్షసులఁ । వీక్షింతువు శిక్షింతు వు మోక్షపురాధ్యక్ష! లెమ్ము॥ శ్రీరఘు॥

వ. అని పలికిన నానందించిరి. హనుమంతుండు రాముని, మకర ధ్వజుండు లక్ష్మణుని, మూఁపుల నెక్కించుకొని వచ్చిన మార్గంబుననే క్షణకాలంబులో లంకానగరంబుఁ జేర్చిరి. మకరధ్వజుండు స్వరాజ్యభా రనిర్వహణంబు కొఱకుఁ జనియె నంత.

క. శ్రీరామలక్ష్మణులఁగని । యారవినందనవిభీష ♦ ణాదుల మం దా । పారమహానందంబునఁ । దేరివిశేషముగ సన్ను ♦ తించిరి భక్తిన్.

వ. రాముండును వారిని మిగుల సన్మానించి యిట్లనియె.

రాము-కీర్తన, ఆదితాళము, కమాస్, కరుణాల.

విని,నారేమీరు। వినినారేమీరు । ఘను-లైనవారు । ననుఁ-జేరి నారుకొనిపోయినారు॥ వినినారే॥ మైరావణుండు । మటుమాయకాఁడు। నై రావణుండు। నతివిక్రముండు॥ విని॥ మాతోడఁబోరి। మనుజంపఁగోరి। యేతెంచిస్వపురి। నెత్తుకొనిచనిరి॥ విని॥ ఘనమోక్షగుండ-మున నిల్చియుం డ-నొకగూడెనండ- హనుమంతుడుండ॥ విని॥

వ. లేకున్న దుర్గమమైన పాతాళలంకనుండి యీదుర్మార్గుల నిగ్రహించి క్రిమ్మర రాఁగలుగుదుమా! అని నాగకన్యా వృత్తాంతము మొదలు యీవద్ధ వృత్తాంతములు వివరించినవారందఱు రాముని గొని యాడి హనుమంతుని శ్లాఘించి రప్పుడు హనుమంతుండు.

తో. అమరులఁబ్రోవగ, నసురులద్రుంపఁగ । నవతరించితిరిస్వామీ! తమకెవరడ్డము-దాకినవిడుతురే। దాసుఁడు సేసినదేమి॥ రా॥

వ. ఆరావణద్వయమును సంహరించినరీతిగానే యిఁక నీరావణాసురుని రూపుమాపి లోకంబులుద్ధరింపుము, మహాప్రభో!

క. మైరావణు నైరావణు। శ్రీరాముడు చంపిమరలఁ ♦ జేరెననిసమా। చారముజారులుదెలిపిన । నారావణుఁడరిగెశుక్రు ♦ నారాధింపన్.

వ. దీనాననుండగుచు రావణుండు, కులాచార్యుఁడగు శుక్రుని చెంతఁజేరి నమస్కరించి యనుచున్నాఁడు.

తో. ఒకదుఃఖమునా-కొదవెనుమునివర । ప్రకటంబుగ రఘువరుచే। సకలబాంధవులు-సచివులుఁబుత్రులు-సమసిరిబలహీనతచే॥ రా॥

క. కావుననాకుజయంబిం । కేవిధమునఁ గలుగుఁజెప్ప ♦ వే! గురువర్యా! నావుడు శుక్రాచార్యుఁడు। రావణువీక్షించి కనిక ♦ రంబున బలికెన్.

శు-కీర్తన, జంఝూటి, ఆదితాళము.

హోమము। జేయఁగనీవిపు। డ్డోమనుజాశన-యురువడిఁ బూనుము॥ నీమముతో। క్షేమముతో। నేమంత్రములుపదేశింతు। సామగ్రిలన్నియుఁగూర్చి॥ హో॥ దివ్యమా। రథరథ్యంబులు। దివ్యచాపమును। దృఢసాయకములు। సవ్యముగా। సాఁగినను। హవ్యవాహనుఁడుమెచ్చి-భవ్యముగనిచ్చునీకు॥ హోమము॥ అంతట। నిన్నెదిరిచెడు । నంతవారుజగమందెవరుండరు। పంతమున। బవరమునఁ। ద్రుంతువు శ్రీమోక్షగుండ । కాంతునిలక్ష్మణుగపుల॥ హో॥

వ. అని తెలిపి హోమమంత్రంబు లుపదేశించి చేయవలసిన విధులు దెలిపి శుక్రుండు వోవ్వున రావణుండుఁ ద్వరగావచ్చి లంకా ద్వారంబులు దట్టంబుగా మూయించి.

తో. పాతాళంబును। బరువడిఁబోలిన। లోఁతుగల్గు మందరము॥ యాతుధానపతి। యటునిర్మించి। నందుజేరెఁ। దాఁగరము॥ రా॥

వ. ఇట్లు చేరి గుహాద్వారంబున కొక్కరాయి యడ్డంబువేయించిలోపల నిష్ఠాగరిష్ఠుండై వేదోక్తవిధిగా ననలుఁ బ్రతిష్ఠించి మధుమాంసాజ్యాది ద్రవ్యములుచేకొని వేల్చుచుండె. నాధూమంబుదివినిండినఁగని విభీషణుండు రామునిజూచి.

తో. స్వామిరావణుఁడు। హోమముఁజేసెడు వ్యోమవీధినాలీల। ధూమములేచెను। దురమునసాతని। దొరరారెవ్వరుఁజాల॥ రా॥

వ. కాఁబట్టి యది సాంగంబుగాకముందే వానరులచేత హోమంబుఁ జెఱిపింపుమన రాముండు మంచిదని యాజ్ఞవెట్టిన.

క. పదికోట్లవానరులున। మ్మదమున నటులంకచేరి ♦ మూసినతలుపుల్ । బదములను బగులఁదన్నియు । వదలక లోపలికినేఁగి ♦ వారని యలుకన్.

తో. తురగశాలలకు। దూరికూల్చిరా । తులనుగుజ్జములఁ బొడిచి। కరిశాలలకును। నరిగిమావటులఁ। గరులనుక్షణముననడఁచి॥ రా॥

వ. ఇట్లు కపులు లంకాపురంబునఁ దిరిగి బహుభంగుల భంగపఱచుచు వెదకుచున్న రావణుని పోఁబడి దొరకకున్న విభీషణునిభార్య సరమ హస్తసంజ్ఞ చేఁజూపినఁ దత్ప్రదేశంబెఱిఁగి యంగదుండు.

తో. గుహకడ్డముగాఁ। గూడియున్నశిలఁ। గూలఁదన్నెజూర్ణముగ। బహువేగంబున। వానరాళిలో। పలఁజొచ్చిరి మొత్తముగ॥ రా॥

వ. ఇట్లు గుహాలోఁబ్రవేశించి కన్నులుమూసికొని హోమంబు వేల్చుచున్న రావణుంగని యంగదుని యుత్తర్వుప్రకారము వానరులుఁ జెలరేఁగి.

సం-కీర్తన, ఏకతాళము, బేగడరాగము.

చెఱచివేసిరి । చెలఁగి హోమమును॥ జెఱచి ॥ తరుచగులందరు దానవేంద్రుముట్టి ॥ చెఱచి ॥ రావణాసురుడు । రయమున వేల్వఁగ । నావేళఁ జేకొన్న - యాహుతులనులాగి ॥ చెఱచి ॥ హోమగుండమున । నున్న యజ్ఞేశుని - దామసమునవేరే - తలగించి చల్లార్చి॥ చెఱచి॥ ధరమోక్షగుండేశు । దానులురావణు । గరములు గుద్దుచు । గాళ్ళతో దన్నుచు॥ జెఱచి॥

వ. బహుప్రయత్నంబులు జేసినను వాఁడుజెలింపక నిష్ఠాగరిష్ఠుఁడై యున్న సంగదుండప్పుడు.

తో. మందోదరివర - మందిరమునకు బు- రందరుమనమునఁడు నేఁగి। తందరనొందుచు - సుందరివగవగ - ముందలబట్టుకలాగి॥ రా॥

వ. రాక్షసస్త్రీలందఱుఁ బెల్లుగానేడ్చుచు మొఱపెట్టుకొనినను బోనీక మహాట్టహాసంబున గుహాలోపలి కీడిచికొనిపోయి రావణుని ముందరఁ జేర్చి యిట్లనుచున్నారు.

ఉ. రావణనీవుపోయి మును ♦ రాముని మోసము జేసి జానకీ। దేవినిబట్టిచెచ్చుటను ♦ దెచ్చితి లంకకునీదిఃంబు నే। నావిధినీదుభార్యను ర ♦ యంబున నీడ్చుక వచ్చినాడ నీ। లావునుజూపుముమమ్మును జె♦లంగుచుఁ దాకుముఁ దాఁగనేటికిఁ.

వ. అని తూలనాడిపలుకుచు మందోదరిని విడువక వేధింపు చున్న నామెభర్తను నాలింగనంబుఁ జేసికొని.

మందో-కీర్తన-తోడిరాగము-ఆదితాళము.

దనుజేంద్రదిక్కులేని । దానవైనె తిని । వనచరు డీమవఁగ । వారిసె నానుదుటబ్రహ్మ॥ దను॥ నాకూర్మి సుతుమండిన । నాకింత వెత గల్గునా । నా కేశనై రిమునల । లోకులునవ్వినాయె॥ దనుజేంద్ర॥

చిచ్చొడిగట్టుకొన్న । చెలువునసితనిటు । దెచ్చినపాపమురక । దీరునె కాల్పకను॥ దను॥ శ్రీమోక్షగుండదేవు । చేతను నోడినీవు। హా

మము జేసి గెల్వ | గామించి వచ్చినావా॥ దనుజేంద్ర॥

తో. మాయలు మంత్రము | లాయగ్రజుతో | బోయెను పాగ
వుచాలు| నీయుపాయములు-నిలిపి రణంబును-జేయబోకుమ్మి కడు మేలు॥ రా॥

క. ఈహోమ మేలయి(శఁజని | యాహవమున రామసాయకా ♦
గ్నులకును బూ| ర్ణాహుతివగుకావనవై | దేహినొసఁగి శరణుజొరుము♦
దినకరకులునిన్.

వ. అనికఠోరంబుగాఁ బలికినవిని దశాననుండు రోషదందహ్యా
మానదేహుండయి దీర్ఘనిశ్వాసంబులు వెడలఁగన్నులు దెఱచి భార్యపడి
న పరిభవంబుజూచి చేతి యాహుతులుఁ గ్రిందవైచి ఖడ్గంబుబూని.

తో. అట్టహాసమున-నంగదు హస్తము-నదరంటఁగ వ్రేయఁగను|
దట్టునమందో-దరిని విడిచియా-తఁడు మూర్ఛిలియిలఁబడెను॥ రా॥

వ. అంత హనుమంతుఁడుఁ గోపాగ్నులొలుక లేచి.

తో. కులిశవిభంబగు-బలుముష్టి పదితలలు నొవ్వబొడువఁగను |
అలిగివాఁడుఁబయి-కడరునంతలో, నంగదుండు దెలి,పియును॥ రావణుతల
లద-రఁగబొడువఁగబీ-రమునవాఁడు ఖడ్గమున | నావాయుజుమత్రి యంగ
దుగదతో | నపుడు మోఁదె రోషమున॥ రా॥

వ. నల, నీల, గజ, శతబలి, మైంద, ద్వివిద, గవాక్ష, గంధ
మాదనాదుల బరిఘ, ముసలాంకుశ, శక్తి, ముద్గర, తోమర, గదా,
కుంతాదిసాధనంబులఁ బొడువ వారును రోషతామ్రాక్షులయి కాళ్ళ
దన్ని బిడికిళ్ళఁబొడిచి పండ్లతోఁ గఱచి గోళ్ళతోఁ వాలంబుతో విసరి
వేసి వానిని నొప్పించి వేగంబున రాముని జేరి యావార్త దెలిపిరంత.

క. భార్యకునని దశకంఠుఁడు | శౌర్యంబుననేను బోయి ♦ సమరము
లోనన్ | సూర్యకులులఁబ్లవగేంద్రుల | గార్యంబునజంపి వత్తుఁ ♦ గ
మలదళాక్షీ !

వ. అట్లుకాదని.

తో. రాముని చేతను| రణమున హతమై | రాజిత కైవల్యమును |

వేములుఁగాంచెద। వెలఁదిరో నీమది। వెరవకు మాపిమ్మటను॥ రామ॥

వ. సీతను బోరిగొని నీవగ్నిప్రవేశంబుఁజేయు మనిన మందోదరి యిట్లనియె.

మం-కీర్తన, త్రిశ్రజాతి-జంఝూ.

బలవద్విరోధమేలఁ। బయిబడిపోవమేల। బొలిసిరిపుత్రులెల్లఁ। బొలిసిరి హితులెల్లఁ। గల్ల। గెలుపొందుటెఁకఁజెల్ల॥ బలవద్వి॥ శ్రీ మోక్షగుండవిభుఁడు। శ్రీపతియగునుజూడు। మామేటితోడ నూడు। వేములుఁగడుఁగీడు। మూడు। నామాటవినునేఁడు॥ బల॥

తో. ఆరాముఁడువిూ, నాకారంబున! నవతరించి సోమకుని! ధారుణిఁగూల్చియుఁ, దగబ్రహ్మకువే, దములిచ్చెను మునుధృతిని॥ రా॥ కమఠంబయిమరి, కవ్వపుగొండను । క్రమముగ మూపునమోచి । అమరుల కెల్లను । నమృతమొసంగెను । నమితకృపామతిఁజూచి॥ రా॥ వరహరూపమై । వసుధనుజుట్టిన । వరహిరణ్యాలోచనుని । బోరిగొనిలోకం, బులను శుభంబుగ । బ్రోచెడుగడుసమ్మతిని॥ రా॥ అలరుచునరసిం, హాకారముతో । నాహిరణ్యకశ్యపుని । బలిమినిగూలిచి ప్రహ్లాదువిగా । పాడినాఁడునెమ్మదిని॥ రా॥ వటురూపంబున వంచనచేతను । బలిగర్వంబడగించి । పటుతరముగదిద్రి । వము సురపతికె । ప్పటివలెనిచ్చెను మించి॥ రా॥ పరశురాముఁడై । పరశువుగొనిభూ । పతులనందఱినిదునిమి । సరగునఁ దద్రాజ్యంబులుగొని క । శ్యపునకిచ్చెనిఁక వినుమిూ॥ రా॥

వ. నిన్నువధించునిమిత్తమె యిప్పుడు దశరథ సుతుఁడయి యయోధ్యయందు శ్రీరాముండన నవతరించె నిది నిశ్చయంబు-కాదేని-త్రిలోకవాసుల నొక్కపెట్టున మార్కొనఁజాలిన యింద్రజిత్తు లోనగు శూరులజయింపఁగలుగునా! నీకును జయింపరాదువినుము.

మం-కీర్తన, తోడిరాగము, ఆదితాళము, ఫరజు.

శ్రీరామునితో సరి, వారెవ్వరు ధర॥ శ్రీ॥ సారెకుఁ దాటకి । చచ్చెవిరాధుఁడు । మారీచుండును । మగ్గిరిగాధర॥ శ్రీ॥ ఖరదూషణు

లే । గతిఁబట్టిరో సో । దరిపరిభవమును । బరికింపు ధర॥ శ్రీ॥ అతికా యుఁడు మొదలై నకుమారుల । గతియేమైనది, కనుపడదా! ధర॥ శ్రీ॥ ఎవరినిబెట్టుక । యేగెదవనిక్కఁక।నవనిమోక్షగుం। డాధిపుపై ధర॥ శ్రీ॥రా॥

వ. ఈసారిపోయిననీకు మరణంబుదప్పదు. జరామరణంబులు లేకుండ మాతండ్రినాకు వరంబిచ్చెనుగాన నేను సహగమనంబుఁ జేయుటకు వల్లలేదు. వ్యర్థముగాఁ బగఁబూనిచచ్చుటకంటె.

తో. మనవిభీషణుని । మర్యాదగ ర। మ్మనినీరాజ్యముగట్టు । చనువునసీతను । సంగిరాఘవుని । శరణుజొరుము చేపట్టు॥ రా॥

వ. ఆనుమానీయుని కొలువుచేయుటకంటె పరంబేమియులేదు. నిరుపాధికశాశ్వతవైకుంఠపదసామ్రాజ్యం బేల వచ్చునని బోధించిన భామినికి రావణుండిట్లనియె.

క. నాకొడుకులెల్లఁగూలిరి । నాకీరాజ్యంబికేల ♦ నగరంబేలా। రాకొమరు శరణుజొచ్చిన । నాకాదులునన్నుజూచి ♦ నవ్వరెచెలియా!

వ కాఁబట్టి నేనుసీతనిచ్చి శరణుఁజొచ్చుటలేదు. యుద్ధంబుఁ జేసి గెలిచెదఁగెలుపులేకున్న రాముని చేఁజచ్చి ముక్తినిబడసెద! నీవుఁజింతింపకు తలఁగుమని చెప్పి రావణుండు యుద్ధసన్నద్ధుఁడయి.

## రావణుని మూఁడవయుద్ధము.

తో. ఇరువదికన్నుల । నురుకోపాగ్నుల । నేకకణములై రాల । చరణ ఘట్టనను - ధరణియదర ది - క్కరులుబెదరి కడుసోల॥ రా॥

వ. ప్రస్థానభేరివేయించి సకలాభరణభూషితుండయి కోటి ద్వాయ ఘంటికాసంభరిత దివ్యస్యందనారూఢుండయి పరశుముద్గరప్రాస భిండివాలగదాపరిఘాది సాధనంబులుధరియించి యసంఖ్యాతరాక్షసదళంబులు నేలయీనిన ట్లుభయ పార్శ్వంబుల నడువఁగదిలి రణభూమిఁ బ్రవేశించె నయ్యవసరంబున.

తో. భూమీధ్రంబులు-భూమీరుహములు- బూనివానరులుదెచ్చి। తామసమున నా-దానవసేనల-తలలువగులఁగావైచి॥ రా॥

వ. గద్దించి మిన్నుబ్రిద్దలగునట్లు కేకలువేయుచున్న వానరులపయిఁగదిసి ఖడ్గరోమ, సర్పరోమ, వృశ్చికరోమా, గ్ని వర్ణులను రాక్షసులు నలుగురు భీకరంబుగా మార్కొని.

రాక్ష-కీర్తన, కమాసురాగము, రూపకతాళము.

ఎందుఁబోక నిందునిల్వుఁడీ । సుందరరిపు- సందోహము-లం దో లిన,చందముగా॥ ఎందు॥ పొందుగమాముందరమీ । పందెంబులు పనికిరావు । చిందరవందరఁజేసిపు । రందరముఖు-లందఱుఁగన । మ్రిందింతుము నిందింతుము॥ ఎందు॥ మోటుగుండపతితోడను। రాక్షసులు గెల్చుటకై । యీరణమునవచ్చినార! రూక్షాత్ముల-వీక్షింతుము - శిక్షింతుము-భక్షింతుము ॥యెందు॥

వ. అనిపలికి గదాముసలముద్గర ప్రాసాదులచేఁ గసిమసఁగిబాధింపుచుండిన నాంజనేయుండు ఖడ్గరోముని-నంగదుండు సర్పరోముని-నీలుండు వృశ్చికరోమునిందాఁకి

తో. కడుభయంకరము-గాయుద్ధంబును- గావించియనంతరము । వడిఁజెడఁజేసి ధృ, వంబుగ దనుజుల, మడియించిరి తీవరము ॥రా॥

వ. తదనంతరము పండ్రెండుమూర్తులై లేకిభవించిన మార్తాండుభంగి మండిపడుచు నగ్నివర్ణుండు నిజశరీర జనితాగ్ని కణంబులచే వానరాటవుల దహించిమట్టాడుచుండినఁ గోపించి రాముండు.

తో. వరుణబాణమును-వడిగావైచిన-వాడియారి దానవుఁడు। ధరణినిగూలెను-దానిఁగనుంగొని-తామసమున రావణుఁడు ॥ రా ॥ దశవదనస్థిత-దంతఘట్టనముఁ-దగసలిపినమాత్రమున। దశదిశలు బ్రితి, ధ్వనులిచ్చె వసుం, ధర గంపించెభయమున ॥రామ॥

వ. ఇట్లుతన ప్రతాపంబుజూపి సింహనాదంబుఁజేయుచు రామునకభిముఖంబుగాఁ దనరథంబును బఱపించి రావణుండిట్లనుచున్నాఁడు.

రావ-కీర్తన, రూపకతాళము, వేటాడు.

నాసరియెవరు। పోర। నాసరి॥ నాసరివారెవ్వరువినుము-నాకమర్త్య

పాతాళమును లీనుననే విహరించితి । వేసరకనువీక్షించితి ॥నాసరి॥ గరుడో రగ విద్యాధర! గంధర్వాప్సరచారణ । సురగుహ్యక యక్షనిశా । చర కిన్నరవరులందును ॥నాసరి॥ కైలాసాచలమెత్తితి- శూలిని నేమెప్పించితి । బాలించితి లంకనుబహు! కాలంబజు వరబలమున ॥ నాసరి ॥ మానవ మాతుఁడవీవస! మానబలుని నన్నెదురఁగ! బూనుదువే! మోక్షగుండ పురవల్లభ వివరించిన ॥నాసరి॥

వ. అనిన వానియువలక్షణ ప్రసంగంబునకు రాముం డసహ్యాం బునొంది నవ్వుచు నిట్లనియె.

క. నేవినియే! యుంటినిమును! నావాలిని గాత్రవీర్య ♦ నాహ వమందుర్ । నీవెదిరినట్టివిధమును । రావణచెప్పంగ వలెనె ♦ రమ్మిఁక ననికిన్.

వ. అనిన మాటలకు రావణుం డత్యంత రోష సంభరిత స్వాం తుండయి.

తో॥ భానుపయికిజను-స్వర్భానునిగతి-భానుకులుని పయికడరి । దానవనాథుఁ డు - దగ్రబాణములుఁ - దలఁగక వైచెను దొడరి॥ రా॥ అందుకుఁ బ్రతిసా, యకములు శ్రీరఘు! నందనుడటువేయఁగను! జిం దరవందరఁ జేయుచుదనుజుఁడుఁ జెలగుచు బైకొనఁదగను ॥రా॥

వ. అప్పుడు దేవసారధియగు మాతలినిజూచి దేవేంద్రుండిట్ల నుచున్నాఁడు.

దేవేం-కీర్తన, రూపకము. హిం, కాపి, శివశివవి.

మాతలి! గనుమా! సీతాపతి! యాతుధాన పతిపోరుట ॥మాత లి॥ భూతలమున రాముఁడుండ॥ నాతఁడురథమందుండుట । నీతిగాదు ని శ్చయముగ ॥మాతలి॥ కనుకనువినుమా! మనవిలరగ-మనరథమును గొ నిచనుమా! మనుకులుఁడగు మోక్షగుండ । ఘనుఁడల్లదెమనకొఱకై । దనుజేంద్రుని-దాఁకిపోరె ॥మాతలి॥

అని తెలిపిన మంచిదని యతండు దివ్యరథం బాయత్తంబుచేసి

కొని వాయువేగంబులు గల తురంగంబులఁ గట్టుకొని శీఘ్రింబున భూస్థలికి వచ్చి రాముఁజేరి రథంబుదిగినమస్కరించియిట్లను చున్నాఁడు.

తో॥ దేవరథంబిది-దేవరమీకై। దేవేంద్రుఁడుబంపగను। దేవర మునసేఁ-దెచ్చితినిప్పుడె। దీనినెక్కుడింపుగను ॥రా॥

వ. దానవాధముండు రథస్థుడైయుండ దేవరవారు దిగువనుం డధర్మంబుగాదు. నేసారథినయ్యెద దయచేసి యీరథంబెక్కి యాదు ర్మార్గునిదెగటార్చి లోకంబులుద్ధరింపుము దేవా! మహానుభావా! అని వేడిన శ్రీరాముండు.

తో॥ అలవిభీషణుని- యనుమతిచేతను-వలగొని యారథమెక్కె న్। జెలగుచు నుదయూ, చలమెక్కిన రవి, వలెనే కడు బెంపెక్కెన్॥

వ. ఇట్లు దేవేంద్రవేరితరథంబుపై శ్రీరాముండెక్కి యుద్ధారం భకుతూహలచేతస్కుండయి విల్లుగుణధ్వనిచేసిన నారవంబునకు జగం బులు గంపంబునొందె నంతరామరావణ సంగ్రామరంగంబుఁ దిలకించు తలంపునదేవగంధర్వ కిన్నరాప్సరపన్నగచారణ విద్యాధర కింపురుష యక్షగణంబులు విమానారూఢులయి విలోకింపుచుండిరయ్యవసరంబున.

క. కరియును గిరియును వరకే। సరియును గేసరియు జలధి ♦ జలధియు మత్రియున్। గిరియును గిరియును దాఁకిన। కరణినసమగాక పోరఁ ♦ గడఁగిరిబలిమిన్.

సం-కీర్తన, రూపకతాళము, వినుడిభూవ.

రామరావణులు। రణమునభీమమై। వేమఱుజూపట్టె। వీక్షింపనట్టె। తామసములను ని-ద్దురుసముబలముల। నేమరిజయ కాం,క్షులతో-జెలఁ గఁగ నిలువకఁ బెంగఁగన్॥ రామ॥

రాక్షసాస్త్రము- రావణుఁడువేయు। రాముని నది.- రయమునఁ గదియు। నక్షయముగువైష్ణ- వాస్త్రముచేదాని। దక్షణమంచున్ ద్రుం చెన్ - దశరథతనయుఁడు మించెన్॥రామరా॥ అంతవాఁ డుర - గాస్త్ర ముఁదొడిగి-పంతమున నేడు। బరువడిఁగదియ। వింతగశ్రీరఘు-వీరుఁడు

గరుడాస్త్ర| మెంతయు నెక్కిడివేసి సధించెనే బీరముడంచెనే|| రామరా||
కరిముఖాస్త్రమా| సురుచునసంధించి| కరముప్పవేయఁ| గానదిగదియఁ
వరమోఘుగుండని- వాసుఁడు రాముఁడు | సరసింహశరంబునుఁదాఁ | బర
పెనే దానినిజిదిపెనే|| రామరావణుల||

వ. కల్పాంత సమయ మహాగ్ని చందంబున మంటలు మండు
చు భయంకరా కారంబుగాదనరు శూలంబుఁ గేల ధరించి గిరగిరఁ
ద్రిప్పి రాముని జూచుచుజూచుచు.

తో. శూలముపై చితిఁ-జూడుమువచ్చెను| గాలాగ్నులు గ్రక్కు-
చును| యాలములోని- యనుజునినిన్నను-నేలనుగూల్చుదు నికను|| రా||

వ. అని పలికి శూలంబువేసి, సింహనాదంబుసేసె. నంత నా
శూలంబగ్ని కీలలు జిల్కరింపుచుఁ బైకి వచ్చుటగాంచి రాఘవుం డ
ఖండరణపాండిత్యంబు మెఱయ.

తో. పాకశాసనుఁడుఁ- బంపినశక్తిని- భీకరముగ వేయఁగను |
బాకటముగఁజని-పటుశూలంబును-బద్దలుసేసెను దగను|| రా||

వ. అప్పుడు రావణుండు గనులయందు విస్ఫులింగంబులు రాల
వింశతిభుజంబులుఁ జఱచుచు మహాగ్రిసాయకంబులు బెక్కులువైచి
సారథినిహయంబుల నొప్పించి కేతనంబుఖండించి మఱికొన్ని బాణంబు
లు రామునిపయివైచిన వానివిలువిద్యా సామర్థ్యంబునకు రాముండ
చ్చెరువందుచుండ నింతలో నగస్త్య మహాముని వచ్చె నెటులనిన.

సం-కీర్తన, సురటరాగము, ఆదితాళము.

భజామిశ్రీరామం| మనసా| భజామిరామం| భండనభీమం| భజా||
నిజదాసమనోం| బుజవరధామం| సుజనజపితభా| సురనామం| అజరుద్రా
ర్చిత-మసురవిరామం ||భజా|| అక్షయమమలమ-నాద్యం నారా, యణా
కవిరక్షమ్| యతిపక్షం| మోక్షుగుండన, త్సురవరదక్షం ||భజామి||

వ. ఇట్లురుదెంచి యగస్త్యుండు శ్రీరాముని గాంచి యిట్లను
చున్నాఁడు.

క. విజయార్థి యైనమనుజుఁడు। నిజముగ నాదిత్యహృదయ ♦ నిర్మలమంత్రం । బు జపించి యనియొసర్చిన। సుజనావనజయముగల్గు ♦ నూనిక్కముగన్.

తో॥ కావుననీవటుఁ-గావించినయెడ, రావణుఁ డనిలోఁ దెగు ను। ఆవలకార్యము। లన్నిదీరుభువ। నావళికినిమేలగును ॥రామ॥

వ. అనిపలికి శ్రీరామమూర్తికి నౌరమంత్రంబుపదేశించి తద నుష్ఠానవిధానంబులన్ని బోధించికుంభజుండు యథేచ్ఛంజనియెనంత.

తో॥ ఆయగస్త్యముని। యనుమతిచేతను । నర్కమంత్రరాజము ను। బాయకమదినిజ। పంబుఁజేసిరామ। భద్రుఁడొండె దేజమును ॥రా॥

వ. అంతరాముం డత్యంత ప్రీతాంబుగలిగి ప్రళయకాలాభీల జాజ్వల్యమాన మహానలంబు చందంబున వేఁడి చూపుచుఁ బ్రచండ మార్తాండమండల మయూఖ కాండోపమ కాండమ్ము లఖండమ్ము గా బఱపిన( బ్రీతివేయనోపక నిర్వణ్ణుండయియున్న రావణుంగాంచి రాముండిట్లనియె.

రాము-కీర్తన, బేహాగ్, ఆది తాళము, పోనివ్వ.

చూపుమ చూపుము నీవడి। యింకఁ। జూపుము॥ ఓపికతోఁ ఘోర రణ। నైపుణిగలవాఁడ వయినఁ ॥జూపుము॥ బాపురె నీపురాకృత-పాప మునాదృష్టిపథము। దాపున జేరిచెనిన్నుఁ । బాపముచేవేగ నత్ప్రి। తాప ము గోపము నీదు। రూపమువూపెదఁగాక ॥చూపుము॥ బెండువడి చేష్ట లుడిగియుండనేల। గుండెగలమ। గండవయినరమ్ముతీవ్ర । కాండములుఁ వరపితెల పండుమల్చకున్న మోటు। గుండవాసుడనుగాను ॥జూపుము॥

తో. వారినివీరిని-వడిగెల్చితినని। వాగుచునుంటివి గదరా! యూ రకనిటు ని, ట్టూర్పులుబుచ్చుచు-నుండనేలబైకొనరా ॥రా॥

క. మునుడాగురించి సీతను। బ్రిమదంబునఁదెచ్చినట్టి ♦ పందెం బులని। త్యాము బచరించిన ఫలమే! సమయంబిది చూపు నీదు ♦ శౌ ర్యమునాపై.

రాము-కీర్తన, శంకరాభరణము, చాపుతాళము, మేలైన.

ఉండుసీఖండలుఁ-జెండిభూతములకు.-బండుగ జేసెదను। వండఁగఁ దిరిమూర్తు-లడ్డమైనిలిచిన - నైనవిడువనురిరు ॥ ఉం ॥ ఆయుజు మెప్పించి। యధికమౌబలమును। నాయువుఁబడసినావు। మాయామాలిధంబులు। మహినేర్చిదిక్కులు-మరివేగ గెలిచినావు ॥ ఉం ॥ రమ్ము మోసగుండ। రఘునుఁడనగు నేను। రణమునసనుమరింతును। సమ్మతిగాకున్న। జనకజఁదెచ్చిచ్చి శరణుజొరుము కాతును ॥ఉం॥

వ. యుద్ధంబుజేసి జయించుటయొండె- లేకఁజచ్చుటయొండె- కాక యిట్లలతింబోలెనిర్విణ్ణుఁడవయియుండుట రణధర్మంబా ! ప్రాణంబులప యియాసయున్న త్వరగా సీతనుదెచ్చినాకిచ్చి శరణుజొచ్చుము. రక్షించెద. ననిపలికినవాక్యంబు లగ్నిసమంబులై తననుగాల్చిన మహోగ్రహంబునొంది పదఘట్టనంబుఁజేసి యుప్పుదుఁగరచుచు రావణుఁడిట్లనియె.

రావ-కీర్తన, ఆదితాళము, ఘతాముహు.

బలహీనుల రాక్షసులఁ-బట్టికొందరినిదుమించి - గెలిచితిననుకోబోకుము। వోరామచంద్ర। తెలిసివచ్చినన్నుఁదాకుము ॥బల॥ లావునగంధర్వయక్ష। దేవతదిక్పాలకుల। జేవజెడఁగొట్టినాఁడను। ఓరామచంద్ర। నీవనఁగనెంతనాకును ॥బల॥ మోకుగుండవాసవిత। మ్మునినిన్నుఁ జంపిగాని। దీక్షతోలంకకుఁజేరను। వోరామచంద్ర। యీాటితిఁగూల్చకమానను॥ బల॥

వ. అనిపలికి దిగంతంబు లల్లాడునట్లు పెల్లునార్చి పెక్కుసాయకమ్ముల రఘురామునిబొదివిన రాముండుఁ గోపించి.

పంచచా. సురాదులన్ జయించినట్టి ♦ చొప్పు గాదునిన్నునీ। ధరిత్రిఁగూల్పఁబుట్టినాఁడ ♦ ధాతయిచ్చియున్నయా। వరంబులెల్లనీరొనర్తు ♦ వచ్చెనాదుబాణముల్ । భరించినిల్వుపారిపోకఁ ♦ బంక్తికంఠమెచ్చెదన్.

వ. అనిపలికి తాటకమథనకాలమందు విశ్వామిత్రుండిచ్చిన సాయకంబులు దలంచి పుంఖానుపుంఖంబులుగాఁ బ్రయోగించిన

నిలువరించలేక రావణుండు మూర్ఛిల్లినంగని.

తో॥ వారకసురలం - బరమునవ్వుచు - సారెకుహేళన జేయఁగ।
సారథిరథమును-సమరభూమికిని-దూరముగాఁగొనిపోయెఁగ ॥ రామ ॥

వ. అంత గొంతవడికి రావణుండు మూర్ఛదేరి సారథింగని యిట్లనియె.

తో. ఓరీ! రాముం-డురువడినవ్వఁగ - సారయశము చెడఁగాను।
తేరుదూరముగఁ। దెత్తురె! యనవుఁడుఁ-తెలిపెనతఁడుఁగ్రమ్మరను ॥రా॥

క. రథిసంకటంబుఁగనిసా। రథిరథము మరల్చుటొల్ల ♦ రణధర్మం
బా। విధము న జేసితిఁగానిఁక। నథిపారెపుపక్షపాతి ♦ నైరామునుమా

వ. అనిన హాని వివేకంబునకు సంతసించి మెచ్చి తిరిగి రథంబును రామునిపై కిఁబఱపించి త్రిలోకకంటకుండు విశేషభయంకరంబుగ.

సంధి-కీర్తన, ఆరభిరాగము, ఆదితాళము, కొలువైయు

విడిచేబాణములు। శ్రీరామునిపయి ॥విడిచే॥ కమంగోపాగ్నులు। వెడలిజగంబులు। కుములుబుట్టింపఁగ। జడిముడిపాటులో ॥విడిచే॥ ప్రథనరంగమున బలమునుగణించి। వివిధంబులయిన। పృథుశరములు ధనువునసంధించి। మూర్ఖాగ్రాతం। బధికబలంబుననపుడువిగించి। పేరుగ్గడించి। రథహయసారథులనుగురిగాంచి। రౌద్రముమించి ॥విడిచే॥ దివినిదిశలుఁబ్రతిధ్వనులివ్వ। నంతకుఁడో! యనఁ। దావెలసియుఁ గోదండముద్రివ్వ। శ్రీమోక్షగుండ। దేవుని దేహముగడువడినొవ్వఁ। దనసారథియు। రావణసైయని రయముననవ్వఁ। బగబారుగవ్వ ॥విడిచే॥

వ. ఇట్లు విజృంభించి రావణుండు బాణవృష్టిని ముంచిన రాముండతిరోష తామ్రాక్షుండయి.

తో॥ ఇంద్రుఁడుపంపిన-వింటసాయకము-లెక్కువెట్టి వేగ్రయుచుని।
నింద్రవైరియే-పెల్లనడఁచెనా। యినకులుండుఁ బిమ్మటను ॥రా॥

వ. వీరరసావేశంబు వెల్లివిరియ రావణుండిట్లనియె.

పంచచా. పరాక్రమంబుఁజూపునంత ♦ బంటు వా! నిలింపులగ।

దురంబులందుఁద్రోలినట్టి ♦ దోర్బలుండరావణా ! సుకుండనన్నెరుంగవే
ము ! చూపిచెప్పినాఁడనీ । తరంబుగాదు యుద్ధమందుఁ ♦ దాఁకలేవు
మానుమా !

వ. అని పలికి.

తో॥ కరవాలంబులు-గదలుఁజక్రములుఁ - బరిఘంబుఁ బ్రాసంబు
లును। వరశక్తులురా। వణుఁడువైవఁగా। వమ్ముచుండరాముఁడురు॥ రా॥
అర్ధచంద్రసా-యకమునవానిప-నతివేగమొఖండించి। పార్థివోత్తముఁడు-బ
లుకోపాగ్నులు-బ్రజ్వలింపఁగామించి ॥రా॥

రామరావణసంవాదము.

కీర్తన-జంఝూటి, రూపకతాళము.

రాము. అర్ధచంద్రబాణమిదో - వ్యర్థముగాదు । సార్థకంబు
గాను నిన్నుఁ-జంపకపోను॥ అర్థ॥

వ. అనిప్రయోగించిన యర్థచంద్రబాణంబుజని రావణురథ
కేతు విలఁగూలిచెనంత రావణుండు గనలి.

రావ-కీర్తన, పైమెట్టువలె.

పార్థివేశనామబాణ-పంజ్తికోర్చుచూ। స్పర్థమాని యెచటి
కయిన-సరగబారుమా! ॥పార్థి॥

వ. అనిపలికి కొన్ని ఘోరనారాచంబుల రథరథ్యసారథులవైచి
న నవి ప్రయోజనంబుగాకపోయె నప్పుడు రాముండిట్లనియె.

రాము-కీర్తన, పైతరహా.

రాక్షసేంద్ర! ప్రజ్ఞలాడ। రాదుముందుగా। కక్షమాని శరణుజొ
రుము। కాతుఁబొందుగ ॥రాక్ష॥

రావ-కీర్తన, పైవలె.

మోక్షగుండనగరవాన। ముదముతోడను । యీక్షితిపైనిన్నుఁ
గూల్చ। కేనుపీడను ॥మోక్షగుండ॥

వ. అనిబలికి రావణుండుద్దండ కాండంబు లఖండంబుగాఁ బఱి

పిసఁ జూచువారికి నద్భుతంబుగాఁ దోఁచెనంత రాముండు దుఃఖకరెట్టింప బ్రళయకాలాగ్ని నిభంగి పొంగియాసీచుని దెగటార్ప నెంచెను.

**తో॥** నిశితసాయకము-నేర్పునపటుసం - ధించివేడ్క గురిగాంచి। దశకంఠంబులుఁ-దగవింశతిహ-స్తములుద్రుంచెమోదించి ॥రా॥

క. శరచాపముసలముద్గర। కరవాలచయంబు లమరఁ ♦ గా న టువింశ। త్కరములు గిరీటయుతముగ। శిరములుపది మొలిచె మగుడఁ ♦ జిత్రముగాఁగన్.

వ. అప్పుడు రాముండద్భుత వీరరసంబులు బెల్లుబ్బి పార శరసంధానంబుఁజేసి మరలఁగరశిరంబులు ద్రుంచిననవిక్రమ్మర మొలిచె నంతట రాముండు గోపించి నిలుపోపనీక.

తో. కరములు శిరములు-గముదీవ్రభయం- కరముగనగణితముగ ను। నరికురిదుంచిన, నవిమొప్పటివలె। మరల మొలుచుచుండఁగను॥రా॥

వ. రావణుని కరశిరంబులు మొందుగా భూనభోమధ్యభాగంబు నిండె నప్పుడు.

తో. రామబాణహతి-రాలుతలలుబీ-రము విడవలయవు చెడవు। వేమరువాడవు-విన్నవోవుకడు-విలసింపవు వెతపడవు॥ రా॥

వ. ఇట్లు శరపరంపరలువరపి రాముండు గరశిరంబులు దెగవ్రే యుటయు నవిక్రమ్మర మొలచుటయు, నేర్పఱింపరాకఁ జూపరులచూపులు మిరుమిట్లుగొలుపుచుండె. రామరావణయుద్ధంబునకు రామరావణయుద్ధంబే! సమంబుకాని యన్యంబునరిపోలదని దేవతలు ఆనందించిరంత రాముండు రణంబునిలిపి తనమనంబున.

గీ. ఏడహోరాత్రములుపీని ♦ తోడఁగదిసి। యుద్ధమొనరించినాడఁబ్ర♦ సిద్ధముగను। జావఁడేయుక్తి చేతను ♦ జేవజెడను। తలలుద్రుంచినఁ గ్రమ్మర ♦ మొలచునకట!.

రామునికీర్తన-రూపకము, కాలికి.

ఈతనిఖండించు మార్గ-మేదితోఁచదు। యీతఁ డెంత-శూరుడో

యి। కేమిచేయుదు॥ నీతని॥ చేతులుఖండంబులుగఁ-జేసిరోసితిఁ। గోతగా శిరంబులెల్లఁ। గోసిరోసితి॥ నీతని ॥ ఈనుతోమర్మంబులెల్ల-నేసి రోసితి । గాసినొందబాణపజ్క్తి-లేసిరోసితి॥ నీతని॥ మోక్షుగుండ నేతనయ్యె । రాక్షసేంద్రుని। కత్తిగట్టితుంపఁజేతఁ-గాకయుంటిని॥ యీతని॥

అని తలపోయుచుండిన రాఘవేంద్రునిగని విభీషణుం డిట్లనియె.

తో. నలినగర్భువర-బలమున నీతని-నాభియందు నమృతంబు । గలదుకుండలా। కారంబుగనది-పొలియకున్న నిక్కంబు॥ రా॥

విభీ-క. రావణుఁడుబొలియకుండును। గావునఁ దన్నాభియందు ♦ గలయమృతంబుఁ। బావకశరమునఁగొట్టుము। తీవరమున నతఁడుజిక్కి ♦ తెగుఁదర్వాతన్.

విభీషణ-కీర్తన, శహాన-ఆదితాళము, తలప్పెని.

మనుకులాంబుధిసోమ! రణరంగభీమ! పావన సుర వినుతనామ! రామరామ! దనుజగర్వవిరామ! అనలాస్త్రమున నాభి । యమృతంబుఖండించి। వెనుకనాతనికరములు। రామరామ! దునుముమవానిశిరములు॥ మను॥ పదపడి నూటతొమ్మిది మారులారీతిఁ। జదిమి వేసిన మీఁదను । రామ రామ! యుదయించకనుమానును॥ మను॥ పిదప మోక్షుగుండ, సదన! నీ చేదశ । వదనుఁడు ధరగూలను । రామరామ! ఇదివాని మర్మమగును॥ మనుకులాంబుధి॥

వ. అని తెలిపిన రాముండుదేరి విభీషణుని వినయవిజ్ఞాన విశ్వాస భక్తిభావంబులకు నాత్మమెచ్చి విల్లుసారించి.

తో. అడరుచునాగ్నే-యాస్త్రము వింటను । దొడిగిలాగివిడువగను। గడువడినాభిని। గలయమృతంబును। గ్రాగించెను మేలుగను॥ రా ॥ పిదప నూటతొమ్మిది సారులుగా । జదిమెనుగరశిరములను । తదనంతర మొక, తలయురెండువా, స్తములుఁ దక్కనన్నియును॥ రా॥

వ. మరల మొలవకుండ నిలచిపోయెఁ దెగిన తలలనుంచి కాలు రక్తంబుచేఁదడిసి రక్తశరీరుండయి రావణుండలరారె. అరుణిని యరుణ

చ్ఛాయచే నావరింపఁబడిన యస్త్రాద్రిపయిఁదోఁచు భాను బింబంబురీతి రావణ దేహంబుమీఁద యొంటితలయొప్పె. నిట్లుండి రావణుండు రోషవిభీషణుండయి విభీషణునిజూచి యిట్లనియె.

రావ-కీర్తన, నాటకురంజి-రూపకము, సీతజాడ.

ఓరిద్రోహీ! యోరిపాపి! యోరినీచాత్మక! యేరా! ॥యో॥ క్రూరకర్మ జేయుటకు। ధారుణిబుట్టితివిర॥ యో॥ కోరవగ। నారిమరుగుఁ। జేరికొల్చుచుండి వధము! యేరికెరుక-లేనిమర్మ। మెఱుఁగఁజేయ। నిదిఘనము॥యో॥ మంచిదిశ్రీమోటుగుండ। మాధవునితో నూనిను। దుంచివేతు। రణములోన। దోర్బలంబునెల్లనుగను॥ యోరీ॥

వ. అని నిష్ఠూరంబులాడి భయంకరాకారంబగు శక్తిని విభీషణునిపయి వయిచినదదియుఁ గాలాగ్ని చందంబున మంటలు గ్రక్కుచు వచ్చుచున్నఁగని రాఘవుండు.

తో. నడుమనెబహుబాణముల నేసితా-నరికెనురఘు రాముం డ[illegible]। గడువడినదిగని। కనలుచునాటుచ్చు। గదిసెను దశకంఠుండు॥ రా॥

వ. అన్ని కరశిరంబులుగల లావెల్ల రెండుకరంబులు నొక్కశిరంబునందు నిండి తనరారఁబ్రళయకాల విజృంభిత విలయకాలుండును బోలె మండిపడుచు రాముని పైకిగవిసి.

క. శరములఁ బ్రాసంబులము। ద్గరముల ముసలములఁగదల ఖడ్గంబులఁదో। మరముల శక్తులఁ బరిఘుల। నుగ్గముచు వేయుచునుబాముచు చొప్పగనడరెన్.

వ. ఇట్లుదరి రామలక్ష్మణ విభీషణులను దోఁకమూఁకలనుబహువిధంబులగారింపుచు నసాధ్యుండయియున్న రావణునియాటోపంబునకు భయపడి మాతలి రామున కిట్లనియె.

మాత-కీర్తన, కాపి-ఏకతాళము, [illegible] రాసనంబనా.

ఇంతసేపు వీవినిల్వ-నేల రాఘవా! పంతమున జంపివేయు-పరగ రాఘవా! ॥ఇంత॥ మొలచునేమొ మగుడవీని, తలలురాఘవా! చలమున

నీవంత గానె-చంపు రాఘవా! ॥ఇంత॥ ఈకిరాతకుండును దెగిన-పంక రాఘవా! లోకములకు మేలుగలుగు గాక-రాఘవా! ॥ ఇంత ॥ చెందుము బ్రహ్మాస్త్రమేసి-చెలగి రాఘవా! యుండదగదు వీడు మోక-గూడ రాఘవా!॥ ఇంత సేపు॥

వ. అనిమాతలిపలికిన జగదభిరాముండగు రాముండు శస్త్రాస్త్రవిద్యా విశారదుండు కావున బ్రహ్మాస్త్రంబు సంధించుట కిది యు సమయంబని తలంచి గాధేయు సవన సంరక్షణ కాలంబున నతండిచ్చిన యక్షయ బ్రహ్మాస్త్రంబును దలంచి స్వాగతంబు జేసికొని సమంత్రపూర్వకంబుగా వింటనుసంధించి ప్రత్యాలీఢ పాదుండయి నిలిచి నిండారదిగిచి విడిచిన నదిచని.

సంకీర్తన, ఆదితాళము- సురటరాగము.

స్ఫుటంబుగను-బెట-పెటార్భటులది । క్తటంబు లార్వగను। దశ యు। త్కటంబుజూపుచును॥ స్ఫు॥ కులాచలంబులు-జలింపజలధులు । గలంగికమసోలన్। దహన,స్ఫులింగములు రాలన్॥ స్ఫు॥ మహోల్కలొదవంగ। గ్రహంబులురులంగ। విహాయసమువగులన్। బెల్లుగ । మహీతలంబగలన్॥స్ఫు॥ జగద్కంటకుని। దెగించుమనిసుర। లగణ్యముగ వేడన్ శ్రీమో, క్షగుండపతిసూడన్॥ స్ఫు॥

తే. రావణాసురుని। ప్రాణంబులుగొని । రయమున భూమికిజొచ్చి। శ్రీవెలయంగరం జిల్లి రాముపాదిం। జేరెనుగ్రమ్మరవచ్చి॥ రా॥

వ. ఈ ప్రకారంబున శ్రీరామకర నిర్ముక్తామోఘ బ్రహ్మాస్త్రంబు శచీపతి యమవరుణ కుబేరాదులకైన భేదింపరాని రావణుని మర్మంబులు భేదించి ప్రాణంబు లాహుతివేసికొని నీకూతుం జెఱగొన్నవానిం జంపినానని భూదేవికి చెప్పబోవుచున్నదేమో! యనునట్లు భూమిందూరితిరిగివచ్చి రామునితూణీరంబుం జొచ్చె నిట్లుకులిశ ధారాహతింగూలు కులశైలంబుంబోలె రావణుని దేహంబు భూమిపయిం బడిన మాత్రంబున.

తో. గ్రుంగెదిక్కరులు। గ్రుంగెఁగూర్మపతి। గ్రుంగెభుజంగవిభుండు। గ్రుంగెఁజరాచర। కోట్లతోడనీ। కుంభినియెల్లనుమెండు॥ రా॥

వ. అంతట-

సం-కీర్తన, ఏకతాళము-ముసురు.

రావణుండు రణములోన రహింనిగూలిన। దేవతూర్యరవములల రె। దెసలభోరున॥ రావ ॥ పసనుగాక రామునిపైఁద - నతిప్రియంబున గుసుమవర్షములు సురలు-గురిసిరింపున॥ రావ॥ తెలివినొంది దిక్కులెల్లఁ జెలఁగుచుండెను । మలయమారుతంబు వీచెను బరి-మళము చిందను॥ రావ ॥ దీక్షతోఁ దివిలోకవాసు-లక్షయముగను। మోక్షగుండవాసునకును-మొక్కి రవుడును॥ రావ॥

వ. అంత శ్రీరాముఁడు విల్లెక్కడించి సౌమిత్రి చేతికిచ్చి దేహ పరిశ్రాంతికొఱకు నొక్కచో విశ్రమించెనప్పుడు రణభూమినిబడియున్న రావణుని కళేబరంబుఁగని విభీషణుండు డగ్గరి చింతాక్రాంతుండగుచు.

తో. ఆహవములదే-వారులకునుభయ । మావహింపుచునుండు। బాహులు వాయస-పటుఘూకంబుల-పాలాయెనుగా నేఁడు॥ రా॥ కుసుమతల్పమున-గూర్కెడిబండెడు। కోమలమగు దేహంబు। యిసుకరాళ్ళగల-యీరణభూమిని-యిటులఁ బడెనె నిక్కంబు॥ రా॥

క. నవరత్నస్థాపితమై। రవికోటిసమప్రభావి ♦ రాజితమగుచుఁ। దవణించు దశకిరీటము, లవనీతలమందుబడఁగ ♦ నాయనయారే.

విభీ-కీర్తన, ముఖారి, అటతా, అయ్యామీ.

అన్నా! వినవైతివన్నా! నాహితములు॥ అన్నా ! వినవైతివి॥ యెన్నోవిధములనే। విన్నవింపుచుండిన । నాహితములు, అన్నా॥ సీతనుదెచ్చుట,చేఁజెరుపగునని। నీతోనువివరించిన। నాహితములు॥ అన్నా॥ వలదురామునితోడ। వైరమనుచుమును। పలుమారుబోధించిన । నాహితములు॥ అన్నా॥ నీమనోగర్వంబు । నిన్నింతజేసెను । యేమనిశోకింతును। నాహితములు॥ అ॥ మోక్షగుండేశుఁడు। సాక్షాద్విష్ణుండగు । వీక్షిం

పుమని తెల్పిన । నాహితములు॥ అన్నా॥

వ. ఇట్లు విభీషణుండు శోకింపుచుండ హతశేష రాక్షసులవలన నీవార్తదెలిసి మందోదరి మొదలగు దనుజకాంతలు శోకావేశంబులు వెల్లివిరియ వేగంబునఁ బానుపుపయినుండి దుమికి.

తో. అడుగులుఁదడబడ । హారములూడఁగ । నసుములువడినసియాడ। జడలూడిశిరోజములుమూపుపయిఁబడియటునిటువేలాడ॥రా॥

వ. కరమ్ముల రొమ్ముమోదుకొనుచు నేడ్పుల రవంబులునింగిముట్ట లంకాపురంబు వెడలి శకలంబులయిన రథంబులును, భిన్నంబులయిపడిన మదదంతావళంబులును, దెగిపడిన తురంగంబులును, జూర్ణంబులయిన గధాముసల ముద్గరప్రాసాది యాయుధచయంబులును, తెగినచేతులును, నొగిలిన మూతులును, ఖండంబులయిన శిరంబులును, దునకలయిన పదంబులును, దుండెంబులయిన మాంసపిండంబులును, గలిగి తొలఁగఁ దోయరాకుండ భూత, భేతాళ, ప్రేత, పిశాచ, శాకినీ, ఢాకినీ, కాక, ఘూక, శ్వాన, జంబుకాదులు, రక్త, మాంస, మేదో, మజ్జాదులు, నిండారయారగించి తృప్తిబొంది రాముసగ్గింపుచు నృత్యంబొనర్చుచుండ, నొప్పి, భయావహంబై యున్న రణరంగంబుఁ జొచ్చి; క్రమంబున రావణుండున్న దెసకుఁ జేరి; నిశ్చేష్టితుండై యిలగూలి యున్న జీవితేశ్వరుని పయిఁబడి.

మం-కీర్తన, పీల్, అటతాళము.

హా! రాక్షసేశ్వర! హాజీవితేశా! హా! రణాలంకార! హా! వీరవర్యా!॥ హా॥ గడగడ నినుఁజూచి। వడకుదిశాపతు । లునువీధినుబ్బుచు। నున్నారునేఁడు॥ హా॥ కట్టా! యుద్ధములకు । గాలుద్రవ్వెడునీ । కిట్టిదుర్దశవచ్చె। నేమందువిధిని॥ హా॥ అతులితభోగముఁలందించియిపుడు। వెతలపాలుజేసి-విడిచిపోయితివా॥ హా॥ మోక్షగుండేశుని- ముట్టడింపకుము। కష్టవద్దని తెల్పఁ, గాలేదా! నేను॥ హా॥

తో. నరుఁడుగాఁడు శ్రీ-ధరుఁడు రాముఁడని। నయముగఁ దెలిపిన

వినక। దురమునవాతని । తోఁబోరియు నీ। ధరణిదుల్లితివిగాక॥ రా॥

ప. సురలకయినఁ జేరిచూడరానిలంకకు హనుమంతుండొక్కఁడు ప్రవేశించి జనకజనుగాంచి వనంబువెఱికి; లంకఁగాలిచి, చనుచున్న నేమీచేయనేరకపోతివే! యంతటనైనఁ దెలియవయితిగదా! ప్రాణేశ్వరా!

క. ఖరదూషణాది రాక్షస। వరులనుఖండించినట్టి ♦ వార్తఁదెలిసినే। వెఱతునదిమొదలుగాఁగను। వెఱవకనిలఁ గూలితీవు ♦ విక్రమధుర్యా!

ప. పతివ్రతాశిరోమణియగు సీతను జెఱదెచ్చినపాపంబు నిన్నింతచేసెఁ. జేసినకర్మమనుభవింపక నెంతవారికయినఁదప్పునా! మనోహరా!

మం-కీర్తన, ముఖారి, ఆదితాళము, నేమము.

దిక్కులేవిదానవైతివిహా! యెక్కడఁబోదు నింకను। రావణ!॥దిక్కు॥ అక్కట! పుత్రికు। లందఱుదెళ్ళిరి। గ్రిక్కునసీవుఁబడితివీ। రావణా! ॥దిక్కు॥ మయుఁడునాజనకుఁడు। మగడవునీవని। మదిగర్వమొందుచుంటిని। రావణ!॥దిక్కులేని॥ మృత్యుప్రునకునీవు। మృత్యువైయుండియిపుడు। మృత్యువువాతఁబడితివి! రావణ!॥ దిక్కు॥ ధారుణిమోక్షగుండ। ధాముసిపైనఁగొన్న। వైరమింతకుఁదెచ్చెను। రావణ! ॥ దిక్కు॥

తో. అతినీతిపరుం-డగువిభీషణుని। కతుల సౌఖ్యములు గలిగె। సతిపాపాత్ముఁడ। వైననీకు ని-ట్లపని దెళ్ళఁగాఁ గలిగె॥ రా॥

ప. నీ కామాంధకారంబు నీ కన్నులకుఁ గప్పి నిన్ను గట్టుటకుఁ ద్రాళ్ళు నీవే తెచ్చుకొన్నట్టు సీతను దెచ్చితివే! కాని కులదాక్షిణ్యరూపగుణగణాతిశయంబులచేత సీతనాతో సరిబోలునా! ప్రాణనాయకా! అని బహుభంగుల విలపించుపదిన పదంబులపయివ్రాలి కన్నీరుమున్నీరుగాఁ గారనేడ్చుచు విభీషణుండు.

విభీ-కీర్తన, హిం, తోడి, రూపకము.

కామినీమణి! కాల। కర్మకేమని। వేమరుదుఃఖింతునింక-వెలసెఁ బైకొని॥ కా॥ ఎన్నిగతులను। జెప్పి నెఱిఁగఁజాయను। నన్నుగారులాడి

సభలోఁ-దన్నిపంపెను॥ గామినీ॥ దండివీరుఁడై। రణో.ద్దండ। శూరుఁడై యుండువాఁడుగూలె మోక్ష,గుండ దేవుచే॥ గామినీ॥

వ. అని బహువిధంబుల దుఃఖింపుచున్న విభీషణునకు రాముం డిట్లనియె.

తో. వలదువిభీషణ। నిలుపుముదుఃఖము, వనితలశోకముమా న్పు। పలవించుటచే। ఫలమేమున్నది। తలఁపుస ధైర్యముజూనఃవు॥ రా॥

వ. రావణుండు సామాన్యుండుగాఁడు. సురాసురుల కజేయుం డై సమస్తసుఖంబులు బహుకాలంబనుభవించె. గొదవయేమి! కర్మశ రీరంబు స్థిరంబుగానుండునా! యతండు కృతార్థుండుగాన ధైర్యంబవ లంబించి యతనికొమారులందరు నశించిరిగాన నీవే! యగ్నిసంస్కారా దివిధు లాచరింపుమున, విభీషణుండదరిపడి యిట్లనుచున్నాఁడు.

తో. ఈకష్టాత్ముం-డెక్కడియగ్రజుఁ। డెక్కడితమ్ముఁడనేను। ఈ కలుషాత్ముని- కేటివిధులువీనిఁ। దాఁకినదోషంబగును॥ రా॥

వ. మీభార్యను జెఱదెచ్చిన దుర్మార్గునకు సంస్కారంబుగా వలెనా! కంకగృధ్రాదులు బీఁకిభక్షింపుటయే! సంస్కారమనిన, రాముం డు నవ్వి యిట్లనియె.

తో. పూర్వవైరమును, బొలిసిసపిమ్మటఁ। బూనదగదు రణమం దు। సర్వసగూలుట। నెప్పెననఘుఁడై। యొనరఁ జేయువిధులింను॥ రా॥

వ. అనియాజ్ఞాపించినఁ జిత్తమని లేచి విభీషణుండు వనితల నూ రడించి యగ్రజాదుల కగ్నిసంస్కారంబులుసేసి, స్నానంబాడి; తిలోద కంబులు విడిచి; శుద్ధుండై వచ్చిన నలరిరాముండు లక్ష్మణున కిట్లనియె.

రా-కీర్తన, ఏకతాళము, రామమంత్రి.

వినుముసోదరా! నీవుఁ। జనుముసోదరా! ఘనవిభీషణునకుల కఁ, గట్టుసోదరా! ॥విను॥ అన్నతరిమిన। సితఁడు। నన్నుఁజేరినఁ। బన్నుగ సభ యుస్తమిచ్చి-యున్న విధమున॥ విను॥ సరసుఁడగుటను, మన। శరణుజొ రుటను। ధరను మోక్షగుండ దేవు। కరుణగలిగెను॥ వినుము॥

అని రాముఁ డనుజ్ఞ యిచ్చిన మంచిదని లక్ష్మణుండు విభీష ణునిఁదోడ్కొని లంకలోకిఁజని వనచరులచేత సముద్రోదకంబుఁ దెప్పించి శుభ కాలంబున.

వి భీ ష ణ ప ట్టా భి షే క ము.

తో. వారిమంత్రులును। వారిబంధులును। వారి పురోహితవరుఁ లు। జేరిచూడ నభిషేకము జేయించెను విభీషణునకపుడు॥ రా॥

వ. ఇట్లభిషేకము జేయించి సింహాసనాసీనుంజేసి లక్ష్మణుండు.

క. ఎందాక రవిసుధాకరు
లుందురో! యందాఁక రాము ♦ నురుచారిత్రం
బెందాక నుండునో ! ధర
నందాకను రాజ్యమేలు ♦ మనిదీవించెన్.

వ. అనంతరంబు విభీషణుం డమందానంద కందళిత హృదయా రవిందుండై లక్ష్మణునకు సభవారికి నమస్కరించి దివ్యాంబరాభరణ కుసుమ తాంబూలాది బహుమానంబులుగొని లక్ష్మణుని వెంటవచ్చి రామునింజేరి సమర్పించి నమస్కరించిన.

తో. అవిమాతలికిడి-యటువీడ్కొలిపిన, నారాముని యనుమతి చే। దివమునకునునా-తేరునుఁగొని యే-తెంచెనతఁడు సమ్మతిచే॥ రా॥

వ. పిమ్మట రాముండు హనుమంతునిఁగాంచి యిట్లనియె.

రా-కీర్తన, బేహాగ్ రాగము, అటతాళము, రాజరంగేల.

లంకకు నేతెంచుమా। కేసరీపుత్రి ! ॥లంకకు॥ శంకలుదీరె। జానకి నెమ్మది। సంకటములు దీర్చఁగ। గేసరిపుత్రి! ॥లంకకు॥ మనవిజయంబు। జనకతనూజకు। వినిపించిముదముజేయ। గేసరి! ॥లం॥ ఇప్పటిరాజగు, విభీ షణునకు। జెప్పివానియనుమతిఁ। గేసరిపుత్రి! ॥లం॥ శ్రీ మోటకుగుండ। స్వామికార్యంబు। చేయుభక్తుఁడవీవగు। గేసరిపు...! ॥ లం॥

వ. అనిపలికిన రామునివీడ్కొని హనుమంతుండు వేగంబున న శోకవనంబున కరిగి జానకీదేవినిగని నమస్కరించి.

తో. తల్లి! నీమనో,ధవుఁడు రాఘవుఁడు। దశకంఠుని దునుమాడె నెల్లకష్టములు, దల్లెనే టింకో। నీప్సితములు జేకూరె॥ రా॥

వ. రామునివిజయపరిభావంబు నీకుఁజెప్పవచ్చితి నేమియాజ్ఞ యను నవుఁడు నామె యానందభాష్పంబులు రాల నిట్లనియె.

క. జగదీశ్వరుఁడగు రాముఁడు। మగఁడై యుండగను సుగుణ♦ మాన్యులుమీరల్ । దగినట్టిభక్తులై యుం । డఁగ లోపముగలదె పవన♦ నందననాకుఁ.

వ. ఆపన్నివారకమగు నిట్టిమేలువార్తఁ నాకెఱిఁగించి నందుకు నేనేమిచ్చి నీఋణంబుఁదీర్చుకొందు నాంజనేయా! రామకార్యసహాయా!

వ. అనిన నతం డిట్లనియె.

గీ. అమ్మ! మీకృపయుండిన ♦ నంతె! చాలుఁ
గడమవస్తువులిచ్చినఁ ♦ గార్యమేమి!
యనినదీవించిపలికెనా ♦ యన్న ! రాముఁ
జూతునట్లుగఁ జేయుము ♦ శుభములొదవ.

వ. అనినమంచిదని మహానందభరితుఁడయి పునఃపున రభివంద నంబు లాచరించి కదలివచ్చి రామునకుసర్వంబు నెఱిఁగించిన రాముం డు విభీషణు నవలోకించి.

రా-కీర్తన, బేహాగ్, ఆదితాళము-

దనుజాధినాయక। తడవుసేయక। జనకజఁబాయక। చని కొనిరా యిఁక॥ దను॥ వడిజలకమార్చి। వలువలుదాల్చి। తొడవులుదీర్చి। తోడ్తె మ్ముమెచ్చి॥ దను॥ తగమోకుగుఁడ। నగరేశ్వరుండ, నగునాదునండ। క తిభక్తినిండ॥ దను॥

వ. అని యనుజ్ఞయిచ్చిన సంతసించి హనుమంత యుతంబుగా విభీషణుండుసని జనకజాతకు.

తో. సరమమొదలు రా,కసకాంతలచే-స్నానము-చేయింపించి । సురుచిరదివ్యాం, బరభూషణముఁలు-సరగునఁ గై సేయించి॥ రా॥

క. బంగరుపల్లకిలోసీ। తాంగన నెక్కించుకొని మ ♦ హోత్సవ్య ముగా॥ గంగంచుకంబుగప్పి కు। రంగాక్షులుఁ గొల్వఁజేర్చె♦ రామునికడకున్.

వ. ఇట్లురామునకుఁ గొంతదూరము బల్లకి యుండఁగానే వానరులత్యంత కుతూహలంబున సీతాన్వేషణంబు చేయఁగోరి చుట్టుకొని నబెత్తనుచేమోఁది యందఱిని తరుముచుండిన నదిగని రాముండు విభీషణునకిట్లనియె.

రా-కీర్తన, శంకరాభరణము, ఆదితాళము, తాపసేం.

వలదునిలువు విభీషణ। వానరులఁదఱుమఁగ। ఫలమేమి మనవారి మీఁద। బంటుతనముఁజూపఁగ॥ వలదు॥ ధారుణిసుతనుఁజూడఁ। గోరి చేరినారుగ। వారిలోపమేమున్నది। నేరములుగొనఁగ॥ వలదు॥ అల్ల మోక్షగుండవిభుఁడ। నైననాయిల్లాలిని। దల్లిగాభావించినూడ- దాపుఁజేరి గోలిని॥ వలదు॥

వ. వివాహ, రణరంగ, మహోత్సవ, దుఃఖకాలంబులయందురాణివాసంబుతో నవశ్యంబులేదు. ఇదిరణరంగమైయుండి పతినైన నేను సమీపమందున్నప్పుడు లోపంబులేదు. కానసీతను శిబికనుంచి దించియందఱుఁజూచుచుండఁ గాలినడకతో నాసన్నిధికి వచ్చునట్లుఁ జేయుమన నతండు జని యామెకుఁదెలిపిన సిబికలోనుండి దిగి.

తో॥ నలిననయనకా-ల్నడకతోడఁ ది, న్నగఁ రాముని జేరఁగను। చెలియగ్నినిదాఁ-చిననిజరూపము। చేకొనుమని తెలుపఁగను ॥రామ॥

వ. లక్ష్మణునిఁగని రామునకపవాదము లేకుండునట్లు వహ్నియందుఁ జొచ్చివచ్చెద, జితిఁబేర్చియగ్నిరవులు కొలుపుమనిన లక్ష్మణుండట్లుఁ జేసినంత.

ఉ. రాముని నెమ్మదిన్ నిలిపి ♦ రాక్షసకాంతలు వానరుల్ సురల। స్తోమములెల్లఁ జోద్యముగఁ ♦ జూడఘరామర దేవపాళికిన్। వేమరుమ్రొక్కిపావకుని ♦ వేఁడిహుతాశన! రామునిన్ సదా। నామదిఁ గొ

ల్చు దాననయి ♦ నఖిలజగంబులవారుఁజూడవ। న్నిమహింబోవితుగా
క! యని ♦ యేర్పడఁజొచ్చెను నగ్నిలోపలన్.

వ. ఇట్లగ్నిం బ్రవేశించిన నందఱు నద్భుతంబందిరంతఁ గమలా
సన గౌరీశ్వర దిక్పాలకాదులు విమానారూఢులయి వచ్చి జయజయశ
బ్దంబుల రాముని గొనియాడి రింతలో రక్తమాల్యాంబరాభరణ భూషిత
యగు సీత స్వాంకతలంబున వెలయ నగ్నిహోత్రుండుఁ బ్రసన్నుఁడయి
రామున కిట్లనియె.

అగ్ని-కీర్తన, ఆదితాళము, నీవను.

జయజయరఘురామ! జయజయరామ! జయజయశాంకరీ। జప
వరనామ! ॥జయ॥ నియతుగాలుచూ। నింపఁగఁదగుసీ। ప్రియురాలినిగొ
నుః। రయమున రామ॥ జయ॥ మునునాలోదా। చిననిజరూపమున్ । గొని
వచ్చితిఁగై। కొనుమిదె రామ॥జయ॥ డంబంబగుప్రతి, బింబమడఁగెనిజ-
బింబంబిదిగొ నీ। జంబుగరామ॥జయ॥తవిలిచతుర్దశ-భువనము లేలితి, వవ
ని మోక్షగుండాధిప! రామ॥జయ॥

వ. అనియొప్పగించి సీతను రామునియంకతలంబున వసింపఁజేసె
నప్పుడు శంకరుండు రామునకిట్లనియె.

తో. శ్రీరామా! శ్రీ, మీరన యోధ్యకుఁ । జేరి రాజ్యమును
జేయు। కోరినకార్యము। కొనసాగెనునీక । గొదవ లేమదయ చేయు ॥రా॥

వ. అనునంతలో విమానారూఢుండయి స్వర్గంబునుండి దశ
రథుండువచ్చినఁ గాంచి సీతారామలక్ష్మణులు ప్రొక్కినదీవించి యాలిం
గనంబు జేసికొని యిట్లనియె.

తో. నినునమ్మినవా-రినిసంసారా । బ్ధినిదరింపఁ జేయుదువు । త
నయయయోధ్యకుఁ। జనిరాజ్యముగొని। తగఁ బాలింపుము నీవు ॥రా॥

వ. వంశాభివృద్ధియగునని దీవించిపోవ నిమోనంత రాముండిం
ద్రునిజూచి.

తో. నాకృతముగఁపడి-నారగణితముగ। నగచరులొసురవీరా! చే

కొనియమృతము। చేతవారిని స। జీవులఁజేయుముధీరా! ॥రా॥

వ. అనిన నతండమృతంబుఁ దెప్పించిపోసి మృతు లయిన వానరులజీవింపఁజేసె. నప్పుడు విభీషణుండు రామునకు నమస్కరించి యిట్లనియె.

గీ. అంగనయు లక్ష్మణుండుమీరు • నతిముదమున
మంగళస్నానమొనరించి • మాల్యగంధ
భూషణాంబరములుఁదాల్చి • పోవుటొప్ప
భక్తుఁడ ద్రోయవలదు నా • ప్రార్థనంబు.

వ. అనిన రాముండు,

రామ-కీర్తన, అటతాళము, వినుఁడిది.

వరసుకుమారులు-సరసులుదమ్ములుఁ-బోరిజటావల్కల- ములుధరియించి। సరగుననందుఁడ। మరియు నేనిచ్చుట। సరియగునా! యలం। కరణముఁజేయఁగ॥ వర॥ గనమోక్షగుండేశు । కరుణవిభీషణా! వనచరులకు నిదె। సలుపుసత్కృతులు। మనమున సంతోష-మగ్నుఁడనౌదును । నను మానముంచకు। మటుఁజేయఁగాఁదగు॥ వరసు॥

వ. అనిన రాముండు నియమించిన మంచిదని విభీషణుండు.

తో. నవరత్నాభర, ణములువస్త్రములు। బ్రవిమలముగఁదెప్పించి। రవిజాదులకును, రాక్షసవర్యుఁడు, రమ్యంబుగనర్పించి॥ రాము॥

శ్రీ

వ. అనంతరంబు విమానంబుఁ దెప్పించినిలిపిన రాముండుసీతా। లక్ష్మణయుతంబుగా నారోహించి యందఱినిగాంచి యిట్లనియె.

రామ-కీర్తన, జంఝూటి, అటతాళము, ఒకదివ్య.

పోయివచ్చెదమేము। పుణ్యాత్ములారా! మాయయోధ్యకుఁ జేర। మర్యాదమీరఁ! ॥కపులనుదోడ్కొని। కదలి సుగ్రీవా! యిపుడేకిష్కింధకు। నేగుమితోడ్రివా ॥బో॥ దేవతలనుగూడి। దేవతావర్య! యీవేళ బవమున! కేఁగుగుణధుర్య! ॥పో॥ రాక్షసేశ్వర! లంకా। రాజ్యంబునేలు మోక్షగుండేశునకు-మొక్కుచుజాలు ॥పోయు॥

వ. అనిపలికిన రాముని గనుంగొని దనుజవర వనచరు లిట్లను చున్నారు.

తో. మేమయోధ్యకును-మీతోఁగూడా। మిత్రకులజ! వచ్చెదము! క్షేమంబుగమీకుఁ-జేసెడిపట్టాభి। షేకోత్సవ ముసెదము ॥రా॥

వ. భరతశత్రుఘ్నులను, గౌసల్యాది మాతలను, మాచివత్తుము. దయానిధీ! నిరాకరింపవలదు. వచ్చుట కంగీకరింపవలయు, ననివేఁడిన సమ్మతించె. నందుమీఁద.

తో. వానరులందఱు- దానవులందఱు - మానితపుష్పకమెక్కి-మానవనాథుని, యానతిచేతను। మరికదలిరిపెంపెక్కి ॥రా॥

వ. ఇట్లుకదలి వియన్మార్గంబున పుష్పకంబుఁ బఱపి దృష్టిగోచరంబులగు విషయంబులు రాముండు సీతకెఱింగింపుచుఁ బోవుచు సేతువుజేరవచ్చి.

రా-కీర్తన, మధ్యమావతి, రూపక.

సేతుబంధనంబుఁజూడు। ప్రీతితోడ, సీతనేఁడు। ఖ్యాతిగఁ గపినిర్మితమిది। పాతకంబులెల్లవీడు॥ సేతుబ॥ రామేశ్వరుడనులింగము - నేమునుస్థాపించితిందు। భూమసేతుదర్శనంబు। గామించినయామనుజుం-డీమహిజనియించఁబోడు ॥సేతు॥ ఇందుఁబితృతర్పణంబు-విడచువారుఁ బితృయుతము। గందగ శ్రీమోక్షుగుండ। మందిను కరుణను ముక్తిని। బొందుదు రానందంబుగ ॥సేతు॥

వ, ఇట్లు సేతుమహాత్మ్యంబు సీతకుఁ జెప్పి యనంతరము విమానంబు నడిపించుచు శీఘ్రింబునఁ గిష్కింధా సమీపంబునకు వచ్చిరంత రామునియాజ్ఞానుసారంబుగా.

తో. తారాముఖుగాం। తలువేగంబునఁ। దరలివచ్చిజానకిని। సారెకుఁగనుగొని। సలిపిరిసకలోప। చారమ్ములునెమ్మదిని ॥రా॥

వ. పిమ్మట వారితోఁగూడ విమానంబెక్కించుకొని క్రిమంబు నబంచపటె, దండకావనంబులు, గడిచి శరభంగా, గస్త్య, సుతీక్ష్ణా, త్రి,

వాల్మీకాద్యాశ్రమంబులు గనుచుఁబదునాలుగు సంవత్సరములు పూర్తియయిన పంచమీదివసంబున భరద్వాజాశ్రమంబుఁజేరి యాతనిచే సత్కరింపఁబడి రాముండిట్లనుచున్నాఁడు.

తో. భరతుఁడనుజుఁడు। పట్టితమ్ములకును। భద్రంబే! మునివర్యా! స్థిరముగ రాజ్యముఁ-జేయుచుఁదల్లుల। సేవింతురె! యోయార్యా! ॥రా॥

వ. అనిన మునివర్యుండిట్లనియె.

తో. మీరాకనుమది-గోరుచుజడలును-నారచీరలుధరించి। ధారుణిభారము। దమపాదుకలం-దారోపించిసహించి ॥రా॥

వ. నందిగ్రామంబున సుఖంబుగనున్నారు తాఁగూరాననాది రాక్షసకాననంబులు గాల్చి సుఖంబుగవచ్చినవార్త తమకటాక్షంబునఁ గలిగిన దివ్యజ్ఞానంబుననెఱుఁగుదు రామా! త్రిలోకాభిరామా!

భరద్వా-కీర్తన, ఆదితాళము, ఓరామ॥

ఓదేవదేవ! నిన్ను-యోగులందఱు। నాదిమధ్యాంత రహితుఁ, డనుచుఁ గందురు। ఆదివిష్ణుఁడవునీవె। శ్రీదేవిజానకీదేవి। యాది శేషుఁడా లక్ష్మణుఁ, డగుచుసత్యము ॥ఓదేవ॥ నీమాయచేఁదిగుణములు-నెగడి సృష్టిసితిలయో। ధ్రామక్రియలుఁ జేయుచుండు। దమకు నంటవు ॥ఓదేవ॥ అజ్ఞులకువేరై యుండు। వరయమోక్షగుండమందు। విజ్ఞులకుఁదోఁచి చాల-వెలుగుచుందువు॥ ఓదేవ॥ నారాయణశర్మవినుత! నాయింట నీనామముని లిచి। నన్ను ధన్యుఁజేయఁగదవే! నతజనావన! ॥ఓదేవ॥

వ. అనివేఁడినసమ్మతించి యందువసించి హనుమంతుం జూచి రాముండిట్లనియె.

తో. గంగాతటమునఁ। గలదొకనగరము। శృంగిబేరమనసందు। రంగుగఁజెంచుల। రాజుగుహుండను। రామభక్తుఁడింపొందు ॥రామ॥

వ. అతనితో మదాగమనవార్త యెఱింగించి సిమ్మట నయోధ్యకుఁ గ్రోశమాత్రదూరంబున నందిగ్రామ మను నగరము గల దందు.

క. భరతుండున్నాఁడాతని। సరసకుఁజని జనకజాత • సౌమిత్రిల

తో॥ నరు దెంచెగా నుండని సు। స్థిరముగ మత్కుశలవార్తఁ ♦ దెలుపు
ము వేగఁ.

వ. అతండు మునింబోలె జటావల్కలధారుండయి నావలెనే।
యున్నాఁడు. రయంబునఁ బోయిరమ్మన నుప్పొంగి మనుష్యాకారంబు
నబయలుదేరి వాయునందనుండు వాయువేగంబునఁజని.

తో. గుహునిగనుంగొని। కుశలంబుగ నిన। కులుకు వచ్చుచు
న్నాఁడు। సహాసీతాల, క్ష్మణుఁడై యెదురుగఁ। జనికాంచుమనీవునేఁడు॥

వ. అనిపలికిన నతండానంద భరితుండై కాచుకొని యుండె
నంతహనుమంతుండు నందిగ్రామంబుఁజేరి.

గీ. పాదుకలయందుఁ దనరాజ్య ♦ భారముని చి జడలు ధరి
యించి శత్రుఘ్న ♦సహితముగను। రాముఁడేమాయెనో! యింక ♦ రాడ
టంచు। నెంచుచున్నట్టిభరతుని ♦ గాంచిపలికె.

హను-కీర్తన, ఆదితాళము, శంకరసం.

రామునిదూతను రాజవరా! స్వామికార్య రత, సత్యధరా! క్షే
మంబున(శ్రీ), రాముఁడు లక్ష్మణ, భూమిజయుతముగఁ। బొలుపుగ వ
చ్చెను ॥రా॥ రావణుఁడుదన, దేవిని జెరగొనఁ। గావానిని దగ, ఖండిం
చి। వేవైదేహని, విడిపించుకను। గిరివాదులతోఁ దావచ్చెనువిను ॥రా॥
రాముండిపుడుభ-రద్వాజాశ్రమ। భూమినిల్చెననుఁ బుత్తెంచె। భూమిావ
రసాం। పుగనుమోకపుర। ధాముని కెదురుగ। ద్వరగానేగుము ॥రా॥

వ. అనుపలుకులువిని భరతుండు హర్షసముద్రంబున నోలలా
డిమైమఱచి కొంతసేపుండి పిమ్మటలేచి హనుమంతుని గాఁగలించుకొని
యానందాశ్రుకణంబులచే నభిషిక్తుని జేసి యిట్లనియె.

తో. ననుఁ దేర్చితివిటు, నాప్రియాగ్రజుని, ఘనశుభవార్తను
దెలిపి। మనుజుడవో! సురమాన్యుఁడవో! నా-మదినెఱుఁగను గురి
నిల్పి ॥రా॥

క. వరలక్ష ధేనువులుశత। పురములు సకలాభరణ ను ♦ భూషిత

లగు నుం। దరకన్యలఁ బదిమూర్వర । గురుభక్తిని నిచ్చినాఁడఁ ♦ గొను నీకొఱకుఁ.

వ. అని ప్రశంసించి శత్రుఘ్నునితో నిట్లనియె.

భ-కీర్తన, ఆదితాళము, హిం, కాఫిరాగము.

పోదామురమ్మనుజా! మనము॥ పో॥ మోదమున నమోక్షగుండ । కోదండపాణికి నెదురుగ॥ పో॥ పురిసింగారింపుము । రాజ । తనుజుల రావింపుము। కరిరథహయములురాగ । వరతూర్యరవములు మ్రోగ॥ పో॥ వారకామినులాడఁగ। జనులు। వందిబృందముఁగూడఁగ । నారాయణాశర్మ వ్రాసె । హరికిన కెదురుగమనము॥ పో॥

వ. అనిచెప్పిన శత్రుఘ్నుండాక్షణంబున నన్ని యేర్పాటులుఁ జేసెనంత సామంత పౌరజన వందిమాగధ వారకాంతాదులుఁ బరివేష్టించికొలువ బ్రాహ్మణులాశీర్వదింప భేరీమృదంగ కాహళాది మంగళారావంబులలర రాజకామినులు బల్లకులయందు వచ్చుచుండ రాము పాదుకాద్వయంబు శిరసావహించి తమ్మునితోఁ గూడఁ బాదచారియై కొంతదూరంబుఁజని యప్పుడు.

తో. కాంచెనుభరతుడుఁ। గనులనురవిసం । కాశము విధికల్పితము। సంచితశశివిభ। మతిసుందరమును। నయిన దివ్యపుష్పకము॥ రా॥

వ. ఇట్లుగాంచి యానందభరితుండై యుండనాంజనేయుండిట్లనియె.

హ-కీర్తన, హిం, కాపి, అటతాళము, మ్రొక్కన.

కనుఁగొనుభూవర! కనులలరార। యొనర విమానము । జనుదెంచుచున్నది॥ కను॥ అందుఁశ్రీరాముడు। నవనిజసుమిత్రా। నందన సుగ్రీవ। నగచరులున్నారు॥ కను॥ వరమోక్షగుండని। వాసునిగొలుచుచు । సరగవిభీషణుఁ। డరుదెంచుచున్నాఁడు॥ కను॥

వ. అనిపలుకునంతలో విమానంబు సమీపించిన రాజకాంతలు మొదలయినవారు శిబికాదులనుండి క్రిందదిగి నిలువంబడి చేతు లెత్తి చూపుచు.

తో. అదుగో! శ్రీరాముండు దదుగో! లక్ష్మణు। డదిగో! సీతాదేవి। కడువడిగన్నుల, కరువుదీరఁగా- గాంచుచువారలతివి॥ రా॥

వ. అనిబహువిధంబుల యెలుగెత్తి పెద్దగాఁ జెప్పుకొనుచుండిరి. భరతుండును రాముని జూచి క్రిందినుండి చేతులుముకుళించి మ్రొక్కినఁ గాంచి రాముండు మహానందంబున విమానంబుఁ గ్రిందికిఁ బఱపించి.

తో. తమ్ములఁ బౌరులఁ। దల్లులఁదాదులఁ, దక్కిన పరిజనముల ను। సమ్మదమునఁ బుష్పకమెక్కెడునటు। సలిపి పరపెగ్రిమ్మరను॥ రా॥

వ. బహుకాలంబునకుఁజూచిన మక్కువచే రాముండు భరతుని దనయంకతలంబునఁ గూర్చుండఁబెట్టుకొని కుశలంబడిగె. భరతుండును సీతాలక్ష్మణులనాదరించి సుగ్రీవాంగద నల నీలజాంబవంత సుషేణప్రముఖవానరులఁ జిత్రంబుగా నవలోకించి కుశలంబడిగి సుగ్రీవునిఁ గౌగిలించుకొని యిట్లనియె.

గీ. నీ సహాయంబుచే రావ ♦ ణాసురాది। శత్రులనుగెల్చె మాయన్న ♦ మిత్రతనయ। నలువురము సుమ్మి యన్నద ♦ మ్ములము మేము। ప్రీతినీతోడ నేవుర ♦ మైతిమిపుడు.

వ. అని శ్లాఘించెనప్పుడు శత్రుఘ్నుండు రామలక్ష్మణసీతాదేవులకు నమస్కరించిన దీవించిరంత రాముండు.

తో. తల్లులకును బ్రీణ, మిల్లినవారలు, దనయుని లేవఁగనెత్తి। యుల్లంబునవగ। నొందిపిమ్మటను। నుబ్బిరియక్కునఁనొత్తి॥ రా॥

వ. అప్పుడు భరతుండు.

తో. శ్రీరామయోధ్యకిఁ-త్వరిఁ జేరఁగనే! తిరిములగనఁగఁ జేకూతే। స్వామి! నాభవము। సఫలతజెందెను। నామనోరథముదీరె॥ రా॥

భర-కీర్తన, జంఝూటి, అటతాళము, ఆదిమూరుని.

ఇఁక రాజ్యము నీవే-యేలుము రామా! యొకటినాచేతఁగా-దోవ రంధామ! ॥ఇఁక॥ పదినుఁగులు మును-పటికంటె ధనము। కోదవాయెఖ జానా। కొట్టులోవినుము। పాదుకలను రాజ్య। భారముంచితి నీ। పాదుకల

ను నీ కర్పణజేసితిని॥ఇంక॥ నీపంపుఁజేయుచు - నినుగొల్చెదను॥ నేపట్ల మోకుగుం-డేశ్వరనేను॥ ఇంక॥

వ. అనియిట్లుపలికిన వనచరులుమోదించి రంతలో విమానంబు నందిగ్రామంబు సమీపించెనప్పుడు రామానుమతంబున నందఱు దిగి భరతునియాశ్రమంబుఁ జేరి రప్పుడు.

తో. ధనదునిజేరఁగఁ- బనివినియెదనే। ననిపిడ్కొనిపై కెగిరి। చనియెవిమానము। వినువీధికైవె-శ్రీవణువినగరముదారి॥ రా॥

వ. రాముండు కులగురువగు వసిష్ఠమహామునికి నమస్కరించి దీవనలంది యాయన యనుమతిచే నర్హాసనంబున- గూర్చుండె ననంతరంబు భరతుండు.

తో. తల్లినాకు ద-త్తంబుసేసెనే। దత్తముచేసితి నీకు। వల్లభుడ పురయా-వద్రాజ్యమునకుఁ। బాలింపుముదయవిడకు॥ రా॥

అని పాదంబులకు సాగిలిపడి వేఁడుకొనియె నింతలోఁగైకవచ్చి.

తో. నాతప్పిదముమ-నంబుననుంచక-నాయన్నా ! దయయుంచి। నీతితోడనవ-సీతలమెల్లను। నీవేలుముస్సెరించి॥ రా॥

వ. అని యనేకవిధంబులఁ బ్రార్థించెనప్పుడు వసిష్ఠుండులేచి వీరి యభిమతప్రకారము సమ్మతింపుమని చెప్పిన రాముఁడు నియ్యకొనియె నంత రామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు క్షురకర్మంబులుజేయించి సుగ్రీవ విభీషణాదులు గూడి తైలంబుఁబూసి.

క. జడలూడదీసిస్నానము। గడువడిఁజేయించి వస్త్ర ♦ గంధంబులుమేల్। వొడవులునలంకరించిరి। పుడమీసుతకపుడుదార ♦ ముఖ చెలులెల్లన్.

వ. అభ్యంగస్నానంబుఁ జేయించి సర్వమాల్యాభరణాదులచే నలంకరించిరి. అప్పుడు గౌసల్య కొమరునిజూచి యానందించె. శత్రుఘ్నునియనుమతిచే సుమంతుండు రథంబాయతంబుజేసి తెచ్చిన రాముం డారోహించి.

రగడ-సాకేతముఁజేరెఁ। రాముఁడు। సకుటుంబముగాఁగ.

సౌమిత్రియుమఱి, శత్రుఘ్నుండును । జామరములువీ, వగభరతుండును, శ్వేతచ్ఛత్రము-జెలగుచుబట్టగఁ- గోతులమూకలు, గూడనుముట్టగ, భానుజయువరా-గ్ర్యముఖవానరులు, దానవపతియుర, ధద్విపాశ్వములు, రామునియానతి-రథముననెక్కియు, వేమరుగాగను, వెంబడిజొక్కియు, సాకేతముజేరెఁ.

ఇంద్రుఁడు తనరథ, మెక్కియురాగను, జంద్రముఖులు ధర,జాతనువేగను, గైకసుమిత్రా, కౌసల్యాదులఁ, బ్రకటతారా- ప్రముఖభామినుల, శిబికారూఢులఁ- జేసుకననువఁగఁ। బ్రబలివాద్యములు-బహువడిమ్రోగఁగ॥ సాకేతముచేరెఁ। రాముఁడు సకుటుంబముగాఁగ.

వందిబృందకై-వారములలరగఁ। ముందుభటులును, సమ్మదమునఁగొలువఁగ, వారకామినులు, వరుసగనాడగ, గారకగాయక, వస్త్యలుబాడఁగ, పౌరులుగుములై-బరువడిఁజూడఁగఁ, గూరిమినధ్వనులు-గొబ్బునవేఁడగ, బురిశృంగారముఁ-బొసఁగఁగఁగాంచుచు। నరుదగునాశ్చ, ర్యంబునఁ దేలుచు॥ సాకేతముఁజేరెఁ। రాముఁడు। సకుటుంబముగాఁగ.

వ. ఇట్లయోధ్యజేరిన నవ్వార్తవిని రామసందర్శన కుతూహలమానసలై పౌరకాంతలు భర్మహర్మ్యాగ్రంబులపయి కెక్కి సేసలుచల్లుచు శరీరంబులు పులకాంకురములు సెంద నిట్లనుకొనుచున్నారు.

సౌరు-కీర్తన, ఏకతాళము, సైరంధ్రి.

పట్టాభిరాముఁజూడరే। పట్టాభిరామునకు। నిఁకను । బట్టాభిషేకమగును । బట్టపుదేవి జనక । పట్టియేయగునౌర॥ పట్టా॥ నీలాబ్దగాత్రుఁడగు। నితఁడు। నీరజనేత్రుఁడగు । లీలావతారుఁడగు । బాలించి చూడనగుఁ॥ బట్టాభి॥ శ్రీమోకగుండేశుని। నేఁడు। సీతాసమన్వితుని। శ్రీమీఱగాంచితిమి । యేమిసుదినమగు॥ పట్టాభి॥

వ. ఇంతసురూప వంతుండగు ననంతతేజోభిరాముని రామునిఁగాంతాయుతంబుగఁ, గాంతారమునకుబంపి దురంత చింతాక్రాంతుల

జేసెగదా! కైక. యీవంతయైన దయ లేక, యత్యంత కఠినాత్ము రాలుగాక.

తొ. కైకనసంగ న- క్కరలేదెంతటి। ఘనులైననులోకమున। బాహ్కృతకర్మము, పగిదిననడుతురు। గాకయన్య మొకటగునా!॥ రా॥

వ. కైకపేరిణలేకున్న లోకకంటకులగు కైకేసీ సుతప్రముఖా నేక రాకాశిముఖాక లేకరణిని జెడుదురు. పాకారి ముఖ్యాదివాకసులకే కరణిని మేలుచేకూరు నిదియువశ్యంబుగా దగినకార్యమే! సరి, యను కొనుచుండు నంతలో.

తొ. నిజభవనమున,న్నిధికిఁజేరిమా। నితరథమువరోహించి। నిజమాతలకు న,నేక దండములు। నేర్పుతోడ నర్పించి॥ రా॥ కొలువు కూటమున। కునుజనిరతోన్న। జ్వలసింహాసనమునను। గొలువు దీరతను। గొలుచుచుముందర। నిలిచిన భరతునకనెను॥ రా॥

రా-కీర్తన. ఆదితాళము, హంసధ్వని, సరోజాస.

మ,దాజ్ఞానుసారుండవై। పాజ్ఞతతోనడువుము॥ మదా॥ సంజ్ఞనునెల్లపనులు। సరగునెరవేర్పుము॥ మదా॥ దానవభర్తకు। వానరభర్తకు। దగవేర్వేరుగను। విడుదులుజతపఱుపుము॥ మదా॥ రాజకాంతలను। రయమునసంతిపు। రంబులకుబంపు! ఘనముగసురవరుగను॥ మదా॥ అభిషేకార్థము। యత్నముసలుపుము। శుభముగమోక్షపుర। విభుమదీద లంపుచువడి॥ మదా॥

వ. తదాజ్ఞను శిరసావహించి భరతుండు సర్వము నెరవేర్చి యన్నకునిట్లనియె.

క. రవితనయువిభీషణసుర। ధవయువరాజాదులకును। దగవేర్వేఱుగ। నివసింపఁగఁదావులు మ। ద్భవనంబున నేర్పఱచితిఁ। బరమ దయాళో.

వ. అనివిన్నవించి పిమ్మట సుగ్రీవుని చేరంబోయి యిట్లనియె.

తొ. శ్రీరామునకభి,షేకము చేయగ। సింధుజలముకావలెను।

మాగుతమునకు సమానంబుగజను। వారినిబంపగవలెను॥ రా॥

వ. అని తెలిపిన సుగ్రీవుండు మంచిదని గవాక్షలీల నలాంజనేయుల చేరంబిలిచి క్రమంబున నిట్లనియె.

సంకీర్తన, త్రిశ్రజాతి, సంతతంబున.

పోయిరాదగు । వాయుజవముతో॥ బోయిరా॥ తోయధులజలముఁ। దూర్ణంబునఁగొని। తెచ్చుటకును॥ బోయి॥ ఓగవాక్షనీవుఁ। ప్రాగబ్ధిజలమును। వేగమెకై కొని। వేగెదులోపల॥ బోయి॥ నీలదక్షిణాబ్ధి। నీరముముహూర్త। కాలమునకుఁజేర్చ। గావలెఁగావునఁ॥ బో॥ ఓనలుఁడా! పశ్చి। మోదధిజలము। లానందముగఁదెచ్చి। యర్పించఁగానీవు॥ బోయి॥ పావనియుత్తర। పాదోధియందున్న। పావనతీర్థము। వేవేగఁదేఁగను॥ బో॥ శ్రీమోక్షగుండ శ్రీ। రామాభిషేకార్థ। మైమీఱుమోదాబ్ధి। యందోలలాడుచుఁ॥ బోయిరాదగు॥

వ. మఱియు సమస్త పుణ్యనదీతీర్థంబులు తెచ్చుటకు సుషేణ జాంబవంతుల నియమించిన వారందఱును కనక కలశంబులు ధరించి వారివారి నియామక స్థలములనుగూర్చి యరిగిరి. అనంతరంబ.

తో. భరతుఁడు నగరము। బరువడినినలం। కరణముజేసెడు నటులఁ। బురమునఁజాటింపుండనిభటులకునఁ, బురికొలిపెను తనభటుల॥ రా॥

వ. భరతాజ్ఞప్రకారము భటులు సాటించినమాత్రంబున.

సంకీర్తన, ఏకతాళము, శహానరాగము, ఎంతనివే.

పురమునలం। కరణముజే। సిరిపురుషులు జెలులుల్। శోభా। కరముగసాగసుగ॥ బురము॥ పరిమళఘనసారమ్మృగమద। భరిత చందనంబుఁ బరగఁగూర్చి యలికిరి॥ పురము॥ గోడలపై। మేడలపైఁ। జూడఁగ జిత్తరువుల్। వేడుకలర వ్రాసిరినాడెముగను। గో। యీడులేని మాడువుల ధ్వజములను। బైడికలశములు। బాగుగనెత్తిరి॥ పురము॥ ముంగిళులన్, ముత్యములు। రంగవల్లులలరన్। మంగళముగభ। ర్మస్తంభమ్ముల॥ ముం॥ రంగుమీఱఁ బ। చ్చలుగూర్చినతో। రణములుశుభమా। రఁగనటుగట్టి

రి॥ పురము॥ చల్లనివం,దిళ్ళుదగన్। యెల్లెడలన్ జెలంగన్। సల్లలితాగర సద్ధూపము లును। జల్లని। వెల్లివిరియ మోహకుండ శ్రీరఘు। వల్లభుండు రంజిల్లి మెచ్చగను॥ బురము॥

వ. ఇటువలెనా రాత్రి నాలుగుయామంబులు నిద్రాహారంబులు వర్జించి సమస్తజనంబులు పురము శృంగారించుట లోనగు కార్యములయందు బ్రవర్తించి రంతం దెల్లవారిన వసిష్ఠుండు సనుదెంచి.

క. పట్టాభిరామమూర్తికిఁ। బట్టముగట్టంగ నేఁడు ♦ బహుశుభలగ్నం। బట్టయినను గై సేయుఁడు। పట్టుగ రామునకు జనక ♦ పట్టికి సనినన్.

తో. అంతవసిష్ఠుని-యానతిఁదలగొని। కాంతలు బురుషులుగలిసి। వంతులువేసి వ-సంతములాడిరి। హావివరసలను దెలిసి॥ రా॥

వ. ఇట్లు శ్రీసీతారామసహితంబుగా సకల పురుషులు స్త్రీలు నుజేరి మంగళవాద్యంబులు మ్రోయుచుండఁ జెలరేగి.

సం-కీర్తన, ఏకతాళము, దారిజూ.

ఎంతోవైభవఁమొదవఁజెలగుచు। వ। సంతోత్సవమువేడ్క। సలుపఁదొడగిరి॥యెంతో॥ తరుణులున్। బురుషులున్। స్థిరముగన్। వరుసలున్। సరగ దెలిసి। చల్లుకొనుచును॥ జన। మెంతో॥ ఇత.రేతరంబు దరుముచున్। జేతో,ప్రీతిన్। ఖ్యాతినెన్నుచున్। జన। బీ,రమ్ములు జేయుచున్। బేరము,ల్మదీయుచున్। వదనమ్ములలర। సర, సమ్ముల-నిమ్ముల-నమ్మించి-చిమ్మించిచ,ల్లుచు॥ నెంతో॥ రారాదా। చల్లగారాదా।యని। చీరు చుదూరము-బారుచును॥జనమెం॥ మంచి-పసపు నిరుసున్నము। నిం। పెసఁగగన్, గుసుమస। ద్రసముతో। బిసికిచల్లులాడుచున్॥ జన। మెం॥ వరంమోహకుండరాఘవుని క। టాక్షముండుటన్। బ,రిక్షబట్టుచును। దీక్షతో వంతులాడుచును॥ జన। మెంతో॥

వ. ఇట్లుకొంతదడవు పంతంబులు మెఱయ వసంతంబు శ్రీరామచంద్ర మహాప్రభువుగారిని, జాయాయుతంబుగఁ బీఠంబులపయిఁ గూ

ప్పండఁజేసి సువాసినులు నివాళులిచ్చి రెట్లనిన.

హారతిపాట-ఉశేనిరాగము, ఆదితాళము, ఈరాజా.

సీతారామునకు। బ్రీతిగనుహారతులొసగరె॥సీతా॥ యాతుధాను లఁ, గోతగోయగ। భూతలంబునం। దుదయించిన॥సీతా॥ మేలుగనుభూ। పాలులరయఁగ। నోలిశూలి। చాపము విరచిన॥ సీతా॥ దండిగనుమోక్ష, గుండపురమున। నిండువేడ్కతో నివసించిన॥ సీతా॥ శ్రీయముగనా। రాయణార్చితు। డై యనంతముగ। విలసిల్లెడు॥ సీతా॥

వ. ఇట్లుహారతులిచ్చి యామీఁదశోభనంబులు నాడిరెటులనిన.

శోభనపా-కల్యాణిరాగము, ఆదితాళము, మనవిని.

శోభనమనియనరే। సుదతులార! ॥శోభన॥ పాభవమునసీ, తా భగవతితో। శోభిలురామునకు। సుదతులార!॥శో॥ భూతావళులను। బ్రోచుచునుండే। సీతారామునకు। సుదతు!॥శో॥ భానువంశ సం, భవుఁడయి వెలసిన। జానకీరామునకు। సుదతు॥శో॥ దశకంఠునిశప-థంబుగఁగూల్చిన। దశరథరామునకు। సుదతు॥శో॥ మోక్షగుండమున। ముదమున వెలసిన। మోహనరామునకు।సుదతు॥శో॥సరగనారాయణ శర్మనుబ్రోచిన। ధరణిజ రామునకు। సుదతు॥ శోభన॥

వ. ఇట్లు శోభనంబులుపాడుచు సంపెంగతైలంబునఁ దలలంటి యనంతరంబున నలుగుబెట్టు విధంబెట్లన్నను.

నలుగుపాట- రూపకతాళము, దాసిర్.

రామల్ నలుగులొసగిరి। వి,రాజితకరులై యా॥రామల్॥ రాము నకరిభీమునకు । భూమీతనయకుఁదగ । గామితములుజెలు। వారా। నా॥ రామల్॥ మోముల దరహాసములు। బ్రేమం। జిగురంపఁగఁ । గోమలతను పులజిగి। గలుగా,నా॥ రా॥ ఈదంపతులనుగొలువ। యీనాటికిగలిగెను । మోదంబనుచును విశదముగానా॥ రా॥ మోక్షగుండమున వెలసి । మోహాంగనను గలసి। సాక్షిగఁ జెలువొందినరామునకూ॥ రామల్ నలుగు లొసఁగిరి॥

వ. అటుపిమ్మట.

గీ. మంగళస్నానమాడించి ♦ మధుపతులిత। చికురమునుగూర్చి దడియార్చి ♦ చిక్కుదీసి। కీలుగంటులువైచియుఁ ♦ బూలుముడిచి। పరగ సాంబ్రాణి నవ్వధూ ♦ పంబువేసి.

తో. శ్రీరామునకును। సీతాదేవికిఁ। జీనాంబరములుగట్టి । హారమకుటకే, యూరకంకణా। త్యాభరణంబులువెట్టి॥ రా॥

నగలదేలునగు। మొగముల సొగసుగ। మృగమద తిలకముదిద్ది। పగబరిమళయుత। మగుచందనమిం పుగనెమ్మేనులనద్ది॥ రామ॥

వ. ఇట్లు శృంగారించి సకలజనులు స్నానంబులొనరించి శుచిర్భూతులయి నవీనాంబరాభరణములు ధరించిరంత.

సం-కీర్తన, బేహాగ్-ఆదితాళము, నిదురలేక.

స,భా మంటపముఁజేరెను। శ్రీ,రాముండు బట్టాభి-రాముఁడు వేడ్క॥ సభా॥ వాసవనీలప్ర-భాసమలంకృత। భాసురనవ్యసో । పానరంజిత॥ సభా॥ ఘర్మమయ స్తంభ।భరితమై శశికాంత।నిర్మలవేదికా। నిర్మాణమగు॥ సభా॥ ఖ్యాతిగదనయుతు। జాతులు వెనువెంట। చేతేరసీతాస, మేతుఁడై దివ్య॥సభా॥ కరుణాకటాక్షవీ, క్షణమునప్రజలను। నరయుచుమోక్షగుం। డాధిపుఁడవుడు॥ సభామంటపము॥

వ. ఇటువలె సభామంటము జేరి శ్రీరామచంద్రుండు.

క. రవివంశ జనితభూమీ। ధవవసితార్హంబు విమల ♦ తటిదుజ్వలము ౯ । నవరత్న వినిర్మితమును । నవుసింహాసనముమీద ♦ నారోహించె ౯.

వ. ఇట్లు సింహాసనాసీనుండయి.

సీ. ఒకవంక బిరుదాంక ♦ మకలంక గతిఁబొంక మగనుభట్టారకు ♦ లొప్పగదచుండ। నొకయోరగద్వార ♦ ఈ తెహారతులుమీాఱ వరసువాసినులు ని ♦ వాళులొసఁగ। నొకమూలస్వరతాళ ♦ మొగిఁగాలగతిఁగాల గణికాలతాంగులు ♦ గడునటింప। నొకచెంగటఁగనంగ♦ నురు

ంగతులెసంగ నతులగీతములుగా ♦ యకులుపాడ । జనకనందనవా
మాంక ♦ మునను జెలఁగ। భరత శత్రుఘ్న లక్ష్మణుల్ ♦ భక్తిగొలువ।
భానుజాదులు సేవింప ♦ భానువంశ । తిలకుఁడగు రామచంద్రుండు ♦
గొలువుదీరె.

వ. ఇట్లు కొలువుదీరియున్న కాలంబున.

రగడ. రాముని దర్శింప। వచ్చిరి। రయమున సేవింప। పరమపవిత్రు
డు భారద్వాజుఁడు। గురుతపోధనుఁడు। గుంభసంభవుఁడు। మాండవ్యుండు
ను। మార్కండేయుఁడు। శాండిల్యుఁడును-సంయమివర్యుఁడు। వామదేవు
డును-వాల్మీకుండును। జామదగ్ని ముని-శక్తిమౌనియును । కలహప్రియుఁ
డును-గర్గమునీంద్రుడు। సలలితగౌతమ-సంయమిచంద్రుఁడు। నత్రిమౌని
మొద-లగు మునివర్యులు । భాగ్రతులఁ గూడియు-సాధ్యాత్ంబులు। రాము॥
నరులును వరకి-న్నరులుఁ జారణులు । సురలు గరుడయ-క్షులు గంధర్వులు ।
సాధ్యులు ఘనఖే-చరులు గుహ్యకులు। విద్యాధరులును-విశ్వేదేవత। లష్ట
దిక్పతులు-నాకింపురుషులు। నష్టవసువులు ను-నాయప్సరసలు । మొదలుగ
ముజ్జగ-ములవారెల్లను। సదమల్లసంతో-షంబులుఁ జెలఁగను ॥ రాముని ద
ర్శింప, వచ్చిరి। రయమున సేవింప.

వ. ఇట్లువచ్చిన ఋష్యాదుల కెదురుగానేఁగి తోడితెచ్చి సిద్ధా
సనంబుల గూర్చుండఁబెట్టి పూజించి వారిసమ్మతంబున సింహాసనాసీను
డైన రామునకు వారిట్లనిరి.

ఋ-కీర్తన, సురటరాగము-ఆదితాళము, మాకులమునకే.

శ్రీరామపట్టాభి। షేకలగ్నము నను। కూరెను బ్రొద్దుమీరెను।
యీరాజ్యభారము। నీరోజునీవుభ, రింపుము। పరిపాలింపుము॥ శ్రీ॥ నీయ
వతారము,చే సాధువులకు మే, లాయెను। వేతలువోయెను। శ్రీయుత మో
క్షపు, రీశ్వరయందరుఁ-జేరరి। చూడఁగోరిరి.

వ. అని ప్రశంసచేయుచున్న సమయంబున.

తో. హనుమంతుఁడులో, నగుప్లవగులు జత్తు,రబ్ధుల జలములు

గొనుచు। జనుదెంచియు రా, ముని ముందరనుంచిన హారినిదయ...నుచు।
రామా రామా రామా రామా శ్రీరామా॥

వ. వారినెల్ల సన్మానించెనంత వారు రామునకునమస...
వ్వలనిలిచి చూచుచుండి రప్పుడు వసిష్ఠ వామదేవాది ఋషులు పట్టాభి
షేకంబొనర్చుటకు సంకల్పించిరి.

## శ్రీరామ పట్టాభిషేకము.



కీర్తన, కళ్యాణిరాగము, అటతాళము.

శ్రీరామపట్టాభి। షేకమహోత్సవ। మారూఢిఁగనఁగనే। తాళింద కరము, చారుతులసీ కుశవిరాజితమై । వరకుసుమ సద్ఘనసారమిళిత సుగంధపూరితమై । ప్రియమై। జయమై, తన। రారుసింధు జలంబుతో మన। సార నభిషేకంబొనర్చిరి ॥శ్రీరామ॥

భరతశత్రుఘ్ను లు-భయపార్శ్వంబులసీత। సరిమెడమదిక్కు ల, క్ష్మణుఁడు పడమటను। వరుసఁగరువలిపట్టి తూర్పునను । యువరాజ జాంబ, వంత రవిజ విభీషణులుఁ దగను గీలి। మూల। మొద। లొరసి కోణములందు నిలిచిద్ర-గుత్సవంబుగఁ గొలువలరెడు ॥శ్రీరామ॥

రత్నమయభూషణములు-హారంబులు-దివిజవల్లభుడు - దెచ్చి
ను। వివిధవాద్యములు మొరయఁగను । ఖేచరులుగూడి।
గ। కుసుమ వర్షము! గురియ। మెరయఁ। గోటి, రవుల
గలకిరీటము । రమ్యముగ ధరియింప వలరెడు॥ శ్రీరామ॥

వారకవసిష్ఠ, వాల్మీకజాబాలి। వామదేవాదులు । వైభోగముగ
ను। సారెకునాశీర్వదింపగను। వారాంగనలు వొ। య్యారముగ మోదించి
యాడగను। గరము, ధరను, దా। భ్వారినారాయణ మనోజ్ఞ వి, హారుఁ
డగు శ్రీమోక్షగుండ ॥శ్రీరామ॥

తో. వామభాగమున। వైభోగంబుగ । భూమిపుత్రిక జెలఁగ।
క్షేమంబుగ మణి, సింహాసమున। శ్రీరాముండటు వెలుఁగ ॥ రా॥

క. కనుఁగొని శంకర ఫణిపతు । లనిమిషపతి నిర్జరాఘ• మునీంద్రాదు
లు శో । భనముగఁగరములు మోడిచిఁ। కొనియాడిరి రాము నసుర •
కోటివిరామున్.

శివు-కీర్తన, రూపకతాళము, కేదార రాగము, సాటి.

రామ! సీతా। రామ! పరం, ధామ! భక్త। కామ! జయసుందర॥
రామ॥ సోమసూర్య। వహ్ని మండలగత! నీమాయన్ । బోవిరాటుట, సా
మాస్యమె ॥రామ॥ భూతలాదిభూతకోశా । తీత! మోక్ష, గుండ సువి
రాజిత! వీతరాగ! నా రా, యణకవివర। చేతోకం, జాతస్థిత! ధాతసుత!॥
రామసీతా॥

తేవారము.

నీమహామహిమఁ దెలియ • నేరలోకాభిరామా! భూమి భారంబు
వాపి•బోచితివి రిపులజంపి। క్షేమముగ దేవతాళి • చిక్కులను బాసి బాళి।
వేమరుఁజరింపఁగలరు • విశ్రమింపంగఁగలరు.

శేషుని-కీర్తన, ఆదితాళము, శంకరాభరణము, కరివరదాకా.

నినుఁ దెలిసి పొగడతరమా! శ్రీరామా! నిను, దెలిసి॥ సులభ
ముగాను సు, షుమ్న నాడియం। దలరుచు వెలిఁగెడు। నాత్మమునిని। ని

నుండె॥ అణువులోనణువువై । ఘనములో ఘనమై । యణిమాదులకు
నందరాని ॥నినుదెలి॥ అక్షయముగ నా, రాయణకవి, మోక్షగుండ
న। వీక్షించెదు ॥నినుదెలి॥

తో. నిరతము నమ్ములు। సిలువనీకగదు । వెరపించెను రాక్షస
బారికొంటివినీ, పుణ్యాంబున సుఖ, ముగనుండెదమికభువిని ॥రా॥

క. తనసుందరసంగీతము । మనమలరంగ బాడుమనుచు ♦ మ
మ్మేచెకునా। దనుజేంద్రుని గ్రూరాత్ముని । మునిమిత్రివిక నిన్ను బాడు ♦
దుము శ్రీరామా!

తో. వెనుకొనియాగమా, విన్నలుదానే! గొనుచుండుదానపు
డు। దునిసెనుకచే। దూరమునగిమ్మరి। దొరికెనుమాకవి యిపుడు ॥రా॥

క. కమవడి నరులగవారులు । నిమపిండంబులను జెంద ♦ గిన్న
డుమారులా। వెడంక్లనుం జిల్లిన ని। ప్పుడు మాకవిదొంకె నీదు ♦ భూరి
కరుణచేత.

వ. అనియిట్లు యక్షకిన్నర కింపురుష విద్యాధరాదులు వేర్వే
ఱఁబొగడి రామునిచే ననుజ్ఞాతులై స్వస్థానంబులకుంజనిరంత రాముండు
వేదపారగులగు బ్రాహ్మణులకు లక్షగోదానంబులు లక్షతురంగదానం
బులుజేసి పిమ్మట వస్త్రాభరణ సువర్ణదానంబు లమితంబుగా నొనర్చె.

తో. పొంగుచు ను, గ్రీవునకుదానవ । పుంగవునకుహారములు ।
నంగదు నకు మణి। యంగదములుగపు । లందజేసిరి బహుమతులు॥ రా॥
సమ్మదమున నిడి। సత్కరించితని। సన్నిధిం గొల్చుచున్న । యమ్మారు
తింగని। యడుగు వరములో। యన్నా! యిచ్చెదనన్న ॥రా॥ నామదిలో
నీ-నామస్మరణము। నారతముసుజేయుచును। నేమారకనే నెసగుభక్తినా।
కిమ్ము పూర్ణమగుదయను ॥రా॥

గీ. ఎంతదాకనునీనామ ♦ మెంతదాక । నీమస్మరణము భూమి
పై ♦ నిలువఁగలదో! యంతదాఁకను నాదేహ ♦ మవనియందు। నిలిచి
యుండఁగ వరమిమ్ము ♦ కలుషహరణ

వ. అనిన రాముండానందించి.

తో. చక్కఁగనీయు, ష్టంబు లొసంగితి। జయ్యనినిను మెచ్చితి తక్కఁగల్గొం। తమునిన్నుధా, త్రనుజేసెదనమ్మతిని ॥రా॥

వ. అటుమీఁద మత్ప్రదంబు నొందఁగలప్రభావసంపన్నా! ధీమంతా! గుణవంతా! యని రాముండు వరంబులిచ్చినవిని సీతాదేవి తా నిట్లనియె-

తో. ఇలమీఁదనునీ-వెచటనున్న నం-దిష్టమయినభోగములు। గలిగిసుఖింతువు-గాకనీకునిం-గలుగవ్రుమకలోపములు ॥రా॥

వ. అని యాపురాణదంపతులు తత్త్వంబువదేశించి మహాశీర్వాదపూర్వకంబుగా ననుగ్రహించిన వరంబులకు హనుమంతుండు బ్రహ్మానందంబునొంది పునఃపునఃప్రణామంబు లాచరించి.

హ-కీర్తన, కళ్యాణి, ఆదితా, సీతాధిప.

జయరమారమణ! గోవిందో! హరీ! జయ। సమా స్త్రశోభిత। సముజ్వలాంగా! కుమారకుమారిమనోహరా! ॥జయ॥ అరుణసితాసిత। వరకృష్ణస్వతి। కాంచితవర్ణావి లసనా! విల ॥జయ॥ అనలమోక్షగుం। డాధిపహారా। యణకవిహృదయుని। రాజితా ॥జయ॥

వ. అని పొగడుచు యథేచ్ఛఁగాఁజని హిమవత్పర్వతంబున కరిగి హనుమంతుండు దపంబు జేయుచుండె సుగ్రీవుండుకపికోటులు గొల్వఁ గిష్కింధకరిగె. విభీషణుండు లంకకుఁబ్రవేశించి రాజ్యంబేలుచుండె. రాముండు దత్సాశ్రయించి కరుణాపాత్రుండై యుండుటఁగని.

తో. మంటినమనుననను। జింతింపుచుని। మహింభోగముఁబ్రబలి। యంతమందునా। యండై క్యంబై। యలరెనుహొమ్మికగదలి ॥రా॥

వ. అని సెలవిచ్చి యనేకరత్నాభరణాదులచే సత్కరించిన గుహుండానందించి రామధ్యానంబుజేయుచు శృంగిబేరంబునకుఁ జనిచను నటుపిమ్మట సాయంకాలంబున.

ఏకాంతసేవ ప్రారంభము.

తో. అంతరామసీ। తాంగనలకునే। కాంతసేవసలుపంగను। వే

తరంగమున। నలరిసువాసిను। లాలోచనఁ జేయుచును ॥రా॥

వ. అన్యోన్యాభిప్రాయమానలై రెట్లనిన.

చెలులకీర్తన-అటతాళము, ఒకదివ్య.

శ్రీరామునికొలువుఁ-జేయరారమ్మ! కోరికలెల్లఁ। జే, కూరు గద

మ్మ! ॥శ్రీ॥ భవబంధభయములు-బాయగదమ్మ! యవిరళముక్తిగ। రామ

లక మమ్మ ॥శ్రీ॥ నారాయణశర్మ, ధారుఁడో! యమ్మ! ధారుణి మో

క్షుప్రి, దాతగదమ్మ! ॥శ్రీ॥ మనపురాకృతములు-మంచివో యమ్మ! ఘన

మోక్షగుండేశుఁ। గనగలిగెనమ్మ! ॥

వ. అని పిలుచుకొనుచు నాక్షణంబున.

క. బంగారుసరిగచీరలు। రంగుగఁబట్టంచుమేలు • రవికలురతోన్। తుంగాభరణంబులు మెఱ। యంగను ధరియించివచ్చి • రంగనలెల్లన్.

వ. ఇట్లువచ్చి యత్యద్భుత జగన్మోహనదివ్యమంగళ విగ్రహుం

డగు శ్రీరామచంద్రమహాప్రభువును వీక్షించి.

చె-కీర్తన, ఆదితాళము, నీతితో.

అందమా। రామునిసుందరము జూడరే ॥యంద॥ కందర్పసహస్ర

దివ్యా। కారుడని తెలియరే ॥యంద॥ వామభాగమున వేడ్క-భూమిజాతన

యు నిల్వఁగ। సామీప్యమం దాశ్రితులు-సంతసమునఁగొల్వఁగ। సోమ

త్రిలోనై నయనుఁజన్ములతోఁజెల్వగ ॥నందమా॥ హారకేయూరాది భూ

ష-ణావళిధరించెనే। భారుణి శ్రీమోక్షగుండ। ధాముఁడనమించెనే । నా

రాయణ శర్మహృదయ। సారసమున నిలిచెనే! ॥యంద॥

గీ. అనుచునభివర్ణనము జేసి • యంత మీఁద
రామచంద్రుని యంతఃపు • రంబునందు
స్ఫటికమయహంసతూలికా • శయ్యపైకి
వేడ్కతోఁజేర్చియిట్లని • వేడిరపుడు.

చె-కీర్తన, ఆదితాళము, రామమంత్రి.

పవ్వళింపుము। రామ! పవ్వ॥ జవ్వనులమరించినట్టి, పువ్వు॥ పా

ప॥ చ॥ వివిధ కాంతులు। నలరు। విపుల మేడల। కవల శుద్ధస్ఫటిక

గే, హాంబులోపల ॥పవ్వ॥ ప్రీతితోడను। భూ। జాత తోడను।

అగ నారాయణహృ-త్పద్మశయ్యను ॥పవ్వ॥ బల్పసాదగు। స్వయం।

ల్పితంబగు। తల్పమందుమోహకగుండ। ధామశుభమగు ॥పవ్వ

తో. ఆవిధమునవా। త్మారాముసుఘ। మ్మాంతఃపుర వరమున

ను। బావనమగు హృత్పద్మతల్పమునం। బవ్వళింపఁ జేసియును ॥రా॥

వ. తిన్నగా సీతాదేవి తావునకువెళ్ళి యిట్లనుచున్నారు.

చె-కీర్తన, అటతాళము, నమిలాం.

పతితోడనుగూడి। పవళింపుదువుగాని। పదవమ్మపడకింటికి। పతి

యేదైవంబని। భక్తితోనెమ్మది। భావింపుమెప్పటికి। సీతాదేవి! ॥పతి॥

ధారుణితాళ్వారి। నారాయణార్చితుఁ। డౌరఘునాయకుని ॥ సీతాదేవి॥

పతితోడను॥

గీ. భక్త చేతనుభరియింప ♦ బడునుగాన। భార్యయనఁబడునట్టి

దాం ♦ పత్యమునకు। నైకమత్యంబుతోనుండ ♦ నగునుదాని। వలన

నిహాపరసౌఖ్యంబు ♦ గలుగునబల.

వ. కావునసీపతికి హితంబుగ జరింపుచు సాధ్వి వనిపించుకొని

యుభయకులంబులవారికిఁ గీర్తిసంపాదింపుము. బాలా! సద్గుణశీలా!

భర్తానుకూలా!

వ. అనిబోధించి సీతాదేవిని బానుపుపయిఁజేర్చి యనంతరంబ.

చె-కీర్తన, అటతాళము, కాంతుడు.

చల్లగనుశ్రీరామునిపైఁ, జల్లరేవిరజాజులు। మల్లెమొల్లలు సం

పెగలుచే। మంతివిరులులాజలు ॥జల్లగను॥ అందముగజెలు - వొందుల

సదర-విందములు జెంగలువలు। బొందుగనుదా సానసుమములు। బొగడ

లును గురువకములు ॥జల్ల॥ పారిజాతప్రసూనములుమం-దారములు సుర

హొన్నలు౹ గోరినారాయణమనో౯బ్జపి - హారునిపయుఁగన్నెలు
శ్రీరామునిపై ॥జల్లరేవిరజాజులు॥

తొ. కమ్మనితావులు౹ ఘుమ్మని దెసలను౹ గ్రమ్మసుగం...
క్రొమ్మలుగనకపు౹ గురుర్షుమకంబులఁ౹ గొని తెచ్చియు వారిఁడ...

చె-కీర్తః, ఆదితాళము-హంసధ్వని, రవికుల.

పరిమళ౹ కలిత గంధముబూయరే॥పరిమళ॥ కలిత-లలితాతులిత౹ భరిత౹ పరిమళ॥కలిత॥ సార-తరమగు మృగమద-సారవిరచిత ఘనక-చోర. సురజోయుతఘన-సారపూరిత౹ పరిమళ॥కలిత॥ ఖ్యాతి గా౹ నీతిగా౹ ప్రీతిగా౹ భాతిగా౹ సీతాసమేతుఁడై౹ చెలఁగిన రాముని౹ జేతమురంజిల! జేరియుఁ౹ బరిమళ॥కలిత॥ భూమి మోకుగుండంబున వేడ్కవసించు౹ వేమరు నారాయణశర్మను మన్నించి౹ కామితములొ-గమనొసగిఁ-ప్రేమనెగడు రాముని కును౹ బరిమళ॥ కలితగంధము॥

వ. ఈవిధంబున సుగంధంబు లలంకారంబుగా నలఁది.

క. మధురంబులైన ఫలములు౹ మధురాపూపములుగొన్ని ♦ మజ్జిపళ్లెములఁ౹ మధుకరవేణులు దెచ్చియుఁ౹ బృథివీసుత భర్తకొసఁగి ♦ ప్రియముదలిర్పన్.

చె-కీర్తన, కల్యాణి-రూపకతాళము, పరను.

ఆరగింపుము౹ ముద, మారజనక-జాత, సహితంబుగ॥ నా॥ నారికేళ కదళికాఖ, జూఁ రదాడిమంబులున్-జం, బీరచూతద్రాక్షలున్-సు, సార పుష్పసార మిళితంబుగ॥ నార॥ మేలుగన్, జిలేబిమణుగు౹ బూలు ఖజ్జకాయలున్౹ బూరీలునామవడలునతిర౹ సాలుబూదిలాడు-లతిసుద మున॥నార॥ చారపప్పు నెయ్యివంచు౹ దారగూర్చి యుంచిరి తా౹ ఖ్యారి శ్రీనారాయణాఖ్య౹ చారు హృద్విహార! మధురంబుగ॥ నార॥

వ. ఇట్లు సమస్తమయిన ఫలహారంబులు సమర్పించి యనంతరంబు.

గీ. పరగనవరత్నమయమైన ♦ పళ్లెరమున౹ బగులవత్తినపోకలు

♦ దుటాకు। లోనరము త్రెంపుసున్నము ♦ నుంచుకొనిశు। భాంగులటు వెచ్చిరామున ♦ కప్పగించి.

చె-కీర్తన, బ్యాంమస్వరము-ఆదితాళము.

విడెము జేయురఘువరా! కదు! వేడుకలనఘహారా! పుడమికుమా శే। ర్పునఁజుట్టియిచ్చిన। మనుపులుము చిపంట। మాఱియందుకొనివేగ॥వి॥

మెచ్చుగలుగు పోకలు। రుచి। హెచ్చు పండుటాకులు। బచ్చక ర్పారసం-భరితమా మాత్రిక। సచ్చూర్ణ యుతముగ। దెచ్చియుంచి రాము॥ విడెము॥

రాజవంశభూషణా! నా, రాయణకవిపోషణా! జాజికాయలును, జాపత్రియేలకు; లోజలవంగాలు; నొనరయుంచినాము॥ విడెము॥

వ. అనంతరము పూలచెండ్లు గట్టితెచ్చి యిచ్చినఁ గొంతసేపు నేర్పులు మెఱయ సీతారాములాడి రెటులనిన.

కీర్తన, ఏకతాళము-ఈశరాసనంబు బారి-వలె.

బంతులాడిరీ పూల। బంతులాడిరీ। వింతగ-జెంతగ-స్వాంతముం డెంతయుగ। సంతసములరగ। గాంతలుగనఁగగ। బంతము జెలగగ॥బం॥

రా॥ నాతిగ-బ్రీతిగ-పీతనేనితరిగ। వేతును దలపుగ। జూతురు వీరల్। ఖ్యాతిగననుచు॥ బంతు॥

సీత॥ ఏమిా-స్వామిా-వేమరుగ-వేృయుచుగ। భామల నలపగ। నీమదిఁదలఁపగ। నిలుపుము సైపగ॥ బంతు॥

రా॥ మాటిమాటి-కేటికే। సాటిగగ। యాటలాడగగ। ప్రేటుకు నిలువు। చాటుకుదొలఁగు॥ బంతు॥

సీత॥ వద్దు-వద్దు-దద్దయుగ। బెద్దయుగ।సుద్దులాడగగ। ముద్దుల గుమ్మగ। మోహపురవరా॥ బంతులాడిరీ॥

వ. ఇట్లన్యోన్య సరసాలాపంబుల చేఁ బూబంతులాడుచున్న వారి యనురాగ భావంబులుగాంచి కాంతలు.

తో. పదరే! కొంచెము। పనియున్నదినా।కిదిగో! వచ్చెదననుచు।

నదిగో వచ్చెద। నిదిగో వచ్చెద' ననియొక్కొక్కరు నగుచు॥ రా॥

వ. వెలపటికేఁజనితలుపుబిగించికొని రంతరాముండే కాంతమై

సం- కీర్తన, ఆదితాళము, వగ పేటిక.

క్షితికన్యనులాలించెన్। సిగ్గేలనివివరించెన్। అతివను గౌఁగి

లించెన్। యతనుని కదనదలించెన్। మించెన్-వాయించెన్। రతికేళియ

గఁ దేలించెన్ । కాంతామణినలరించెన్ । గళలెల్లనుశోధించెన్

క్షితమెుఁనరించెన్। దగబంధములనుముంచెన్ । బొంచెన్-గాంచెన్

రి। మోక్షగుండ దేవుడలయించెన్.

వ. ఇట్లు పలువిధసురతంబుల సీతారాములు దేలిసొక్కి

చిన నాసవ్వడిఁగని యువ్వలనున్న జవ్వనులు నవ్వుకొనుచు వారిని

పజేయువారై.

లాలిపాట త్రిశ్రజాతి, జంఝూటి ఈబాలు.

శ్రీరామచంద్ర! లాలీ। సీతాసమేత ! లాలీ। కారుణ్యసాంద్ర

లాలీ। కళ్యాణమయ! లాలీ। లాలీ। కలుషాపహార! లాలి॥ శ్రీరామ॥

సృష్టికిఁ బూర్వమున। వ్యష్టి సమష్టియెన। దృష్ట ప్రపంచమునకు

ద్రష్టవు నీవగుచు,నుండి। తుష్టిగనుండెదవు॥ శ్రీరామ॥

సుగుణులబ్రోచుటకును । విగుణులఁ జెరచుటకును । తగురీతిధర్మ

మును। స్థాపింప ధరలోను। బుట్టెదవు ప్రతియుగమునను॥ శ్రీరామ॥

కాకుత్ స్థవంశమునను। గౌసల్యగర్భమునను। సాకేతనగరమునను

జన్మించితివి యిలను, దనుజా। నీకములదరఁగను॥ శ్రీరామ॥

ఆ తాటకినిద్రుంచి। యధ్వరమునుగాచి। గౌతమసతినిబ్రోచి । కర

కంఠువిలువిఱిచి। తలచి। సీతనువరియించి॥ శ్రీరామ॥

దశరథు నాజ్ఞ చేత। దండకావనులదిరిగి । దిశలార్వఖరదూషణ ।

త్రిశిరుల వధియించి। శబరి। దెసఁబూర్ణదయయుంచి॥ శ్రీరామ॥

వాలినిసంహరించి। వారధిఁదగ బంధించి । యాలంకముట్టడించి ।

యసురులనెదిరించి। మించి। యాలముగావించి॥ శ్రీరామ॥

రావణఘటకర్ణాది । రాక్షసులనుమోది । యావేళధరణీతనయు।
మనుజులతోఁగూడి। వెడలి। యయోధ్యఁజేరితిరి॥ శ్రీరామ॥

పట్టాభిషిక్తుఁడవై। బలువేడ్కతోఁడజనక। పట్టినిగూడుకొని। పర
గించితివి రామ! రామ! పార్వతీసుతనామ! ॥ శ్రీరామ॥

నీయందుమాయగలిగె। మాయవలనగుణము। లాయెనువానివల
। నాయెనుభూతములు। నందుఁ। యీయఖిలంబాయెఁ। శ్రీరామ॥

శక్తిత్రియమునివే । శ్రీద్ధాత్రియమునీవే । ముక్తిత్రియమునీవే।
మూర్తిత్రియమునీవే। నీవే। భక్తిత్రియమునీవే। శ్రీరామ॥

కాలత్రియమునీవే। కర్తృత్రియమునీవే। కర్మత్రియమునీవే। కా
యత్రియమునీవే । నీవే । కళత్రియమునీవే॥ శ్రీరామ॥

దీక్షత్రియమునివే । దేవత్రియమునీవే । చక్షుత్రియమునీవే ।
జగత్రియమునీవే । నీవే । లక్షత్రియమునీవే॥ శ్రీరామ॥

జ్ఞానత్రియమునీవే। నాడీత్రయమునీవే। స్థానత్రయమునీవే । తాప
త్రయమునీవే। నీవే। త్రైవర్ణములునీవే। శ్రీరామ॥

కనుగొనసణువునీవే । ఘనములో ఘనమునీవే । సనకాదియోగి
హృదయ। సంచారుడవునీవే। సచరా। చరరూపములునీవే॥ శ్రీరామ॥

ప్రళయావసానమందు। ప్రపంచమునీయందు । ప్రభవించి వృద్ధి
నొందు। బ్రళయావసరమందు । ముందు బవళించునీయందు॥ శ్రీరామ॥

లోకులు నిద్రబోవు। నాకాలమున జాగ । రూకుఁడవగుచునీవు।
జోకొట్టుచుందువు। నీకు। జోకొట్టువారెవరు॥ శ్రీరామ॥

బంగారమొక్కటయ్యు । బహుభూషణంబులయిన । భంగినీవొ
కడవయ్యు । బహునామ రూపములఁ । బరగి । ప్రబలితి విటువలెను ॥
శ్రీరామ ॥

బహుచిద్రభాండస్థిత! పటుదీపవతు దేహముల । బహిరంతరింద్రి
యముల। భాసిల్లఁజేయుచును। మిగుల। విహరింపుచుందుదువు॥ శ్రీరామ॥

శ్రీరామచిద్విలాస ! శ్రీమోక్షగుండవాస ! నారాయణాఖ్య

దానా! ధారామితోల్లాస! చంద్రి! కారమ్యదరహాస! ॥ శ్రీరావ లాలీ, సీతాసమేతలాలీ । కారుణ్యసాంద్ర లాలీ । కల్యాణమం కలుషాపహారలాలీ.

వ. ఇట్లు లాలిపాటబాడి వారు నిద్రాముద్రితులైన పిమ్మ

మేలు-కీర్తన, ఏకతాళం, శహానరాగం - ఎంతనినేసం.

సందడిజే,యందగదిం, పొందఁగఁజనరమ్మా! మీమీమం లకును॥సందడి॥ పొందుగనిద్రా, నందంబులరఘు, నందనసీతా, స లుండిరి॥సందడి॥ కానలన, న్మానులసాం, గత్యముసలుపుచును । లను వెను-దవిలిచంపుచును॥ కానల॥ మానుగనిద్రల -మానియుండిరటు ననుపులై ! మేనులుమఱచిరి॥ సందడి॥ మీరెల్లర-యీరేయిఁ। గూ వేగినను! గూరిమితోసిం, గారములలరఁగ॥ మీరె॥ కోరిమోక్షపుర। శ్రీ రఘువీరుని। జేరియాకొలువు। జేతురుగాకిఁక॥ సందడి॥

వ. అని చెప్పకొనుచుఁ దమయిరవులకుఁజని నిద్రించి వేకువజా మున లేచి.

క. అమ్మా! శ్రీరాముఁడు సీ। తమ్మయు మేల్కొనగలేదు ♦ త్వ రగాజనిమా । దమ్మున మేల్కొల్పఁగరా । రమ్మా! యని లేచివచ్చి ♦ రామామణులుఁ.

చనుదెంచి ద్వారంబున నిలిచి యారాము ననంతరామునిగా భావించి.

మేలుకొలుపు-అటతాళము.

శ్రీరామ!రామ! సీతారామ! యిదెతెల్ల, వారవచ్చెనిద్రమేలుకో॥ పౌరులుసకలోప, చారములొనరింపఁ। గోరివచ్చినారు। మేలుకో॥రామా! మేలుకొనుమా॥

దశవిధప్రణవనా। దములనేకుఱ్ఱుట। ధ్వనులుమెండమ్యెను। మే లుకో। దశలెల్లవెలుఁగదే, దీప్యమానజ్ఞాన। దినకరుఁడుదయించె। మేలు కో॥ రామ॥

సీత
మ రమణవిశ్లేషావ - రణశత్రులనునట్టి । కుముదముల్ ముకుళించె
ములుకో॥ విమలమైనజ్ఞాన,విజ్ఞానములను । కమలముల్ వికసించె మేలు
వికో॥ రామ॥

వ్య పలువిధరంగుల । గాసిల్లుచున్నది । కొలువుకూటము జేర మేలు
దకో॥ అలరు నాపోజ్యోతి । యనుసింహాసనమున । నాసీనుడగుదువు మే
లుకో॥ రామ॥

అనుపమావస్థాత్రితుంబనునట్టిసీ। యనుజులుజేరిరి మేలుకో।ఘన
మగుదదవస్థా।కార్యములోరింప। గనునియమింతువు । మేలుకో॥రామ॥

అంచితసద్బోధ । యనుపారోహితుండరు । దెంచియున్నాడదె
మేలుకో॥ పంచాంగమందలి। భావమెల్లవిమ । ర్శించిబోధించును । మే
రామ॥

కనజతుర్వాక్యమా గధవందిగాయక । కవులువచ్చినారు మే
లుకో॥ అనయమునీకన్న । నన్యమొక్కటియులే । దని పల్కుచున్నారు
మేలుకో॥ రామ॥

అంతరాంతరత్రిపుటి। యను సంతఃపురములో । నా సీతతోఁ
గూడమేలుకో॥ కాంతనందుంచియొ । క్కడవేగి కడురాచ । కార్యముల
నుదీర్ప మేలుకో॥ రామ॥

అష్టవిధప్రకృతు । లనసచివులుబరి । వేష్టింపవచ్చిరి। మేలుకో॥
స్పష్టముగానన్ని । పనులను నియమించి। దృష్టవై యుందువు । మేలు
కో॥ రామ॥

అతులితకోటిసూ । ర్యప్రభాభాసిత । మగుకిరీటముదాల్చు । మే
లుకో॥ పరితిలేని బ్రహ్మాండ భాండసామ్రాజ్యముఁ । బాలనసేతువు।
మేలుకో॥ రామ॥

కామాదిచోరవ । ర్గము జ్ఞానధనమును । గైకొనఁబూనిరి మే
లుకో॥ యేమరకనువారిఁ । జోమీటి తద్ధన । మిఁకనుద్ధరింతువు మేలు
కో॥ రామ॥

సాక్షాన్నారాయణ । సన్మనోబ్జమునందు । లక్షించియు మేలుకో॥ అక్షయమైన స్వ । యంప్రభజూపగ। మోక్షగుండేలుకో॥ రామా మేలుకొనుమా॥

వ. ఇట్లుమేలుకొలిపి నిద్రలేచి రాముండు కాలోచితక్రియలుదీర్చుకొని మజ్జనంబాడి సీతాసహితంబుగా సమస్తాలంకారములు చేసికొని భోజనంబొనర్చి మహావిభవంబుగా గొలువుప్రకూటంబున లక్ష్మణునకు యువరాజ్యంబిచ్చి తాను లోకాతీత పరమాత్ముండయ్యును లోకవిడంబనార్థ మవతరించెగాక దుష్టనిగ్రహశిష్టానుగ్రహంబులు సేయుచుం బదకొండువేల సంవత్సరములు ధర్మంబుగా రాజ్యపాలనంబుంజేయుచు సుఖంబుండె, నట్టికాలంబున.

తే॥ జనులకుదుర్భి-క్షభయంబులు నెప-సర్పచోర భయంబులుండునాతుండు ననువగురోగభ-యంబులు లేక మ-హాభోగములొందుచును॥ ర

వ. సంతోషంబున నలరారుచుండిరి. పృథివి సర్వసస్యపూర్ణంబయియొప్పె. వృక్షంబులుం గుసుమఫలభరితంబులై రంజిల్లె. పార్వతీ! యిట్టి మహనీయచరిత్రం బాద్యంతంబుం గర్ణరసాయనంబుగా నీకొఱకు వివరించితిం గదా! యట్టిరామమూర్తి కృపాప్రసాదమువలన విని వించి ముక్తురాలవుగమ్మా!

క. నాచేతనీకుబోధిత। మై చెలువపు మోక్షగుండ ♦ త్రిం। బాచంద్రార్కస్థాయిగ। భూచక్రమునందు నలరుఁ ♦ దుముఖి!

వ. అనిబోధించినం బార్వతీదేవి బ్రహ్మానందవారాశిం దేలాడి శంకరగురు పదారవిందంబులకు వందనంబులాచరించి బయ్యాదిమదంపతులనుఁగూర్చి మంగళంబు బాడె నెటులనిన

మంగళహారతి-బేగడరాగము, అటతాళము, కమలాం

నిత్యమంగళం । నిత్యానందునకు ॥నిత్య॥ అత్యంతజ్ఞా -ంకి॥ నిత్యమంగ॥ సత్యజ్ఞానానంత । సాక్షిరూపునకు । నిత్యా

ంగుసీతకు॥ నిత్యమంగ। సాక్షాన్నా రాయణ । సరస హృద్గోచర ।
ంక్షగుండరామ । మూర్తికి సీతకు॥ నిత్యమంగ॥

వ. ఇట్లు మంగళముఁబాడి శ్రీసీతారామ బ్రిహ్మప్రతిఫలితది
వ్యతేజోజ్యోతి స్వరూపంబుఁ దనహృత్కమలకర్ణికాంతరంబున సూక్ష్మా
కారంగనుచు నిజానందంబునఁ దేలుచుఁ గైలాసంబున నుండె.

ఆశ్వాసాంతము.

తో. అనితాళ్ళూరిని। నారాయణకవిరా। మాయణమును హరి
ను। ఘనగఁజెప్పెనుగథయందిది యుద్ధ। కాండముచిలుకనుసుధను॥రా॥

ఇదివినువారల। కిహసౌఖ్యంబులుఁ। గొదువలేకఁ జేకురును। ముద
మునఁ దుదకును। ముక్తిలభించును। మోక్షగుండ హరికృపను॥ రా॥

రామాగామా యనవే-శ్రీరామాయణ కథవినవే॥ పార్వతీ॥

సీ. శ్రీకరంబుగను వా ♦ ల్మీకి విశ్వామిత్రి
ముఖమునిప్రోక్తమై ♦ పుడమినాది
కావ్యమై షట్కాండ ♦ కలితమై తనరారు
రామాయణాఖ్య పు ♦ రాణచరిత
మవని తాళ్ళూరి నా ♦ రాయణకవి హరి
కథగా రచించెను ♦ గడుముదమున
నంత శ్రీవేమూరి ♦ యజ్ఞనారాయణ
నరసింహశర్మ లా ♦ నందమునను

తే. బరనగావించి ధరణిలోఁ ♦ బ్రచురపఱిచి
రట్టి కవిపాఠకులకు న ♦ హర్నిశంబు
మోక్షగుండవిభుండు గా ♦ ముండుఁ గృపను
భుక్తిముక్తిలొసంగు సం ♦ పూర్ణముగను.

మోక్షగుండ రామాయణము.

సంపూర్ణము.



